# అరగడియ

రచన :

పొరప్పురత్తు

అనువాదం :

మల్లాది మంగతాయారు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, కొత్తఢిల్లీ.

1980 (1901)



*Original Title* : Aranazhikaneram (*Malayalam*)
*Telugu title* : Ara Ghadiya

రూ : 16–50

డిస్ట్రిబ్యూటర్స్ :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడు. సికింద్రాబాదు.

Published by the Director, National Book Trust, India,
A-5 Green Park, New Delhi-16.
Printed at : Karunasri Printers, Mahakali Street, Secunderabad,

# తొలిపలుకు

కేరళ రాజ్యంలో క్రైస్తవ మతప్రచారకులవల్లనే, అచ్చుపరిశ్రమకు అంకురార్పణ జరిగింది.

మలయాళ వచన వికసానికి దోహదం చేసిన ఘనతకూడా వారికే లభించింది.

ఈ వాఙ్మయంలో నవలాసాహిత్యానికి నాంది— పాశ్చాత్య విద్యాభ్యాసంయొక్క పరిణామమనే చెప్పాలి. నవలా రచనా ప్రక్రియలో. మలయాళ సాహిత్యంలో వెలసిన తొలి రచనలన్నీ ఇంగ్లీషు కృతులకు — అనువాదాలు — అనుసరణలే.

చిదంబర వాధ్యారు ''ఆజ్ యు లైకిట్'' — ని 'కామాక్షీ చరితం' — అనే పేరుతో అనువదించారు. ఆర్చ్ డీకను ఉమ్మన్ కోశీ 'పుల్లేలికుంచు' — విరచించారు. పి. వేలాయుధన్ షేక్స్పియరు రచించిన 'పెరిక్లిసు' నాటకాన్ని 'పరిక్లేశరాజు కథ'గా రూపొందించారు, అయినప్పటికి వీరిలో తొలిమలయాళ నవలా రచయిత ప్రాథమ్యాన్ని గురించి నేటికి వివాదం ఉండనే ఉంది కారణమేమంటే — అప్పటివారి రచనల్లో నవలకు ఉండవలసిన హంగులు మృగ్యం కావడమే.

పైన పేర్కొన్న కారణాలవల్లనే కాబోలు — మలయాళ సాహిత్య చరిత్రలో 'కుందలత' — ని రచించిన అధు నెట్టుంజాటీ నే తొలి నవలా రచయితగా పేర్కొంటారు.

ఈ నవల ప్రథమ ముద్రణ క్రీ॥శ॥ 1887 వ సంవత్సరంలో జరిగింది.

"కథావస్తువులోని బిగువులోగానీ, పాత్ర చిత్రణలోగానీ, రచయిత కృతార్థుడు కాలేక పోయినప్పటికీ, — అది మలయాళ సాహిత్యంలో ప్రప్రథమ నవలగా పేర్కొనడానికి కారణం — అందులో నవలకుండవలసిన లక్షణాలన్నీ యిమిడి ఉండటమే.

ఆ తరువాత ఓ. చన్తుమీనను మరియు సి. వి. రామన్ పిళ్ళె మలయాళ నవలా సాహిత్యానికి శాశ్వత కీర్తి ప్రతిష్ఠలు సంతరించి పెట్టారు.

చన్తుమీనను 'సాముదాయికమైన (అంటే — సంఘంలో ఉండే వివిధ తెగలకి

సంబంధించిన) సంఘటనల్ని ఆధారంగా తీసుకుని సంఘ సంక్షేమానికి తోడ్పడే నవలల్ని రచించారు.

సి. వి. రామన్ పిళ్ళైమాత్రం చరిత్రాత్మకమైన నవలలే రాశారు.

దేశంలోని చారిత్రాత్మకమైన — రాజకీయమైన సన్నివేశాలను ఇతివృత్తంగా ఎన్నుకుని రచనలు చేసి, ఆయన వాటిద్వారా పూర్వీకులు శౌర్యాన్ని ... పౌరుషాన్ని ... రాజభక్తిని వేనోళ్ళ పొగిడారు.

నేటికీ వారిద్దరు మలయాళ నవలా సాహిత్యజగత్తులో మహారథులై విరాజిల్లుతూ ఉన్నారు

చన్దుమీనను రచించిన 'ఇందులేఖ' — మరియు 'శారద' బహుళ జనాదరణని విశేషప్రచారాన్ని పొందినందువల్లే ప్రతిభావంతులు కాకపోయినా, — అనుసరణ ప్రియులైన రచయితలెందరో్ని ఈ నూతన పంథా తనవైపుకి ఆకట్టుకుంది.

అందుకు ఫలితంగా మలయాళంలో ఎన్నో సాంఘిక నవలలు వెలువడినాయి. అయితే వాటిలో ఎక్కువభాగం ... సరకులేనివి — అతిపేలవమైనవీను.

''మార్తాండవర్మ'' — ''రామ రాజా బహద్దూరు'' మరియు 'ధర్మరాజా' — సి. వి. రామన్ పిళ్ళై రచించిన ప్రఖ్యాత చారిత్రాత్మక నవలలు.

సి. వి. రామన్ పిళ్ళైని అనుకరించిన వారు లెక్కకి చాలా తక్కువనే చెప్పాలి. అయితే ఆ అనుకరించడానికి ప్రయత్నించినవారు గూడా కృతార్థులు కాలేక పోయారు.

మలయాళ నవలా సాహిత్యాకాశంలో చెప్పదగిన ఇతర ప్రముఖ రచయితల్లో రామవర్మ 'అప్పన్ తంపురాన్' – ఒకరు. ప్రాచీన కేరళీయ చరిత్రకు సంబంధించిన కట్టుకథల్ని ఆధారంగా చేసుకుని ఆయనచేసిన సుప్రసిద్ధ రచనలు — 'భూతరాయరు' — 'భాస్కర మీనను'.

'భాస్కర మీనను' — మలయాళ భాషలో ప్రథమంగా వెలువడిన అపరాధ పరిశోధక నవల.

పంథొమ్మిదోశతాబ్ది చివరలో, — స్వతంత్రభావాలుగల కొద్దిమందిరచయితలు రాజకీయ విషయాలకు సంబంధించిన నవలా రచనకు పూనుకున్నారు.

ఆ నవలల్లోని కథావస్తువు రాజ్యంలోని పాలకుల లోటుపాట్లని ఎత్తిచూపడమే, అంటే ఆ శాసకులని గట్టిగా విమర్శించడమే.

కె. నారాయణ కురుక్కలు రాసిన ''పారప్పురమ్'', ''ఉదయభాను'' – గూడ

ఈ కోవకి చెందినవే. వాటి ముద్రణలో దేశాభిమానియైన రామకృష్ణపిళ్ళై చేదోడై నిలిచి, — సహకరించడం ఒక ప్రత్యేకత.

తిరువిదాంకూర్ సంస్థానాధి పతులకి — స్వేచ్ఛాప్రియులైన సామంతులతో ఘర్షణ వచ్చినందుకు ఫలితంగానే రామకృష్ణ పిళ్ళైకి దేశబహిష్కారదండన విధించ బడింది.

పంథొమ్మిదో శతాబ్ది చివరి భాగంలో — అనగా ఇరవైయో శతాబ్ది ఆరంభంలో మలయాళంలో నవలలు కొల్లలుగా వెలువడినాయి. అయితే వాటిలో ఎక్కువభాగం నకిలీ రచనలే కావడంవల్ల అవి స్థిరమైన ఖ్యాతిని పొందలేకపోయాయి.

ఆ రోజుల్లో రచయితలు విశేషంగా, — చదివేందుకు యోగ్యంగా ఉండి, మనసుకి ఉల్లాసాన్ని కలిగించే కథలు చెప్పడమే తమ ముఖ్యధ్యేయంగా పెట్టుకున్నారే గానీ, ... అంతకు మించి చూడలేదు.

అయితే సమాజాభ్యుదయాన్ని కాంక్షించి రచనలుచేసే రచయతలు లేకపోలేదు ... కానీ వారిని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. ఎందుకంటే — వారి రచనల్లో ఉండ వలసినంత పట్టు లేక పోవడంతో, — సంఘ పురోభివృద్ధి కోసం చేసిన ఆ నవలలు అతి చవుకబారువాటికిందే జమ అయినాయి.

స్వాతంత్ర్య పోరాటము, — విదేశీయుల పరిపాలన పట్లద్వేషము, — సాంఘిక విప్లవము చెయ్యాలనే అభిలాష, మార్క్సువాదం యొక్క ప్రభావము కేరళ రచయి తల చైతన్యవంతమైన సృజనాత్మక శక్తిమీద ఏనాడైతే ప్రతిఫలించాయో, ఆ నాటి నుంచీ మలయాళ కథా సాహిత్యం నూతన పంథాని అలవరుచుకుంది.

గత యాభై సంవత్సరాల కాలంలోను మలయాళంలో ఎందరో సృజన శీలురైన రచయితలు వెలిశారు. వారు మొదట కథాసాహిత్యం నుంచి బయలుదేరి నవలాసాహి త్యంలో అడుగుపెట్టిన వారు.

వారు తమ రచనల్లో నిగూఢ తత్వంతోబాటు — మిగతా బాహ్య శిల్ప నిర్మాణ ప్రక్రియా విషయంలో గూడా నూతన రూపాన్ని సంతరించి పెట్టారు.

రచయితలందరూ యీ సిద్ధాంతాన్ని అంగీకరిస్తూ, రచనా వ్యాసంగానికి పూను కుని, సాహిత్యం కేవలం మనోవినోదం కలిగించే సాధనం కాదని, సంఘం పట్ల రచ యితకు ఎంతో బాధ్యత ఉందని భావించారు.

తరవాతనే సంఘంలోని నిమ్నజాతుల వారి దైనందిన జీవితాల్ని, — ఇంకా

కొత్త కొత్త విప్లవాత్మక భావాలున్న పాత్రలను నవలల్లో ప్రవేశ పెట్టడం ప్రారంభించారు.

ఆధునిక యుగంలోని నవలా రచయితల్లో — శ్రీ తకళి శివశంకరం పిళ్ళై, — పి. కేశవదేవ్ ... ఇంకా వైక్కమ్ మహమ్మదు బషీరు ఎన్నదగిన వారు. శివశంకరం పిళ్ళై రచించిన 'రంటిటంఙళి' (రెండుశేర్ల ధాన్యం) 'తోట్టియుటే మగన్' (పాకీవాడి కొడుకు) 'చెమ్మీను' (రొయ్యలు), తర్వాత కేశవదేవ్ రచనల్లో — 'ఓటియల్ నిన్ను' (ఏటినుంచి) 'భ్రాంతాలయం' (పిచ్చాసుపత్రి) 'అయలక్కార్' (ఇరుగు పొరుగు), ఆ తర్వాత బషీరు రాసిన 'బాల్య కాలసఖీ' — 'న్టుప్పుప్పాక్కోరానేణ్ణార్న్ను' (నీ ముత్తాత గారికో ఏనుగుండేదె) మొదలైనవి మలయాళ నవలా సాహితీ ప్రగతి పథంలో మైలు రాళ్లుగా పాతుకు పోయాయి.

ఆ తరువాతి రచయితల్లో ఎస్. కె. పొట్టెక్కాటు, ఉరూబు మొదలైనవారు పేర్కొదగినవారు.

ఈ రెండో తరంలో అభ్యుదయ భావాలుగల యువరచయిత లెందరో నవలా రచనకి ఉపక్రమించారు. వీరి సహకారంతో నవలా రచనా ప్రక్రియలోనే జిగిబిగి ప్రాచుర్యము ఇనుమడించాయి.

వీరు అంతర్జాతీయ సాహితీపరమైన విధానాలను సొంతం చేసుకు ప్రయోగించి తమ రచనల్ని ఉపయోగ జనకంగా తయారు చేస్తున్నారు.

అటువంటి వారిలో శ్రీ పారప్పురత్తు —, ఎం టి. వాసుదేవన్నాయరు, కె. సురేంద్రన్, జి వివేకానందన్, కోవిలన్, నందనారు, మలయాట్టూరు రామకృష్ణన్, ఇంకా విలాసిని తదితరులు ముఖ్యులు.

ముట్టత్తువర్కి, — క్రైస్తవ కుటుంబ వాతావరణాన్ని ఉన్నదున్నట్టుగా చిత్రించి చెప్పడంలో సిద్ధహస్తులుగా పేర్కొన బడ్డారు.

వీరు అనేక నవలలు రచించారు.

ఆత్మీయత, భావుకత కలిగి అత్యంత శ్రద్ధతో నవలా రచన కొనసాగించే సుప్రసిద్ధ రచయితల కోవకి చెందిన మరికొందరు ఎన్నదగిన రచయితలు మలయాళ సాహిత్య జగత్తులో ఉద్భవిస్తూనే ఉన్నారు.

విశ్వసాహిత్యరచనా ప్రక్రియల్లో ప్రయోగించిన సాహితీ రీతులన్నీగూడ ఈ మలయాళ నవలా సాహితీక్షేత్రంలో గోచరమవుతూనే ఉన్నాయి. ఈ తీరుతెన్నుల్లోనే

అభ్యుదయ రచయితలు భావి భాగ్యోదయాన్ని ఆశిస్తూ — సూచిస్తూ తమ రచనల్ని కొనసాగిస్తూ ఉన్నారు.

శ్రీ కె. ఈ. మత్తాయి మలయాళ సాహిత్యంలో 'పారప్పురత్తు' అనే కలం పేరుతో ప్రసిద్ధులు. హైస్కూలు చదువు కాగానే మిలిటరీలో ప్రవేశించారు. దాదాపు పదిహేను సంవత్సరాలపాటు మిలిటరీ జీవితాన్ని గడిపారు ఆయన, — సాహిత్య ప్రాంగణంలో సిపాయి కథకులుగా అడుగుపెట్టారు.

ఆ కథల్లో సైనికుల దేరాల్లో జరిగే ... ఎవరికీ తెలియని, ఎన్నడూ ఎరగని జీవిత చిత్రాలని వివరించారు. సరళంగా, హృదయాన్ని హత్తుకునేటట్టు జీవితపు పోక డల్ని చిత్రించడం ద్వారా 'పారప్పురత్తు' అనతికాలంలోనే మంచి నవలా రచయితగా పేరు పొందగలిగారు.

దేశరక్షణకోసమని ... తమ అమూల్యమైన జీవిత కాలాన్ని అర్పించే సైనికుల బలిదానాలు, బాధలు, — ఆశలు అభిలాషలు — మానసిక దౌర్బల్యాన్ని మలయాళ సాహిత్యంలో శక్తివంతంగా రూపొందించిన కీర్తి దక్కించుకున్న ప్రప్రథముడు పారప్పురత్తు. అంటే ఆయన దృష్టి కేవలం సైనిక శిబిరాల వరకే పరిమితమై ఉందని కాదుసుమా ?

ఆయన పుట్టి పెరిగి పెద్దవాడైన ఊరిని...ఆ ఊళ్లో ఉండే స్త్రీ — పురుషుల్ని దేశవ్యాప్తమైన ప్రజల హృదయాలకి హత్తుకునేట్టుగా 'పారప్పురత్తు' — తమ రచ నల్లో సుస్నితంగా చెప్పగలిగారు.

జీవిత తత్వంలోని వాస్తవికతను నిష్పక్షపాతబుద్ధితో గుర్తింపలేనినాడు, రచ యిత సృజనాత్మకమైన సాహిత్యాన్ని సృష్టించలేడు.

'పారప్పురత్తు' రచనలన్నిటిలోను ఆయన జీవితాదర్శాలకు సంబంధించిన ఉజ్జ్వలమైన విషయాలెన్నో వెల్లడి అవుతాయి. ఆధ్యాత్మిక తత్త్వమూ, క్రైస్తవజీవన దృక్పథమూ, అనుభవాలతో పొంగి పొరలే నిండు జీవితము — ఆయనది.

''ఒక సైనికుడి జీవిత బలిదానం కళ్ళారా చూసిన తరువాతనే తనొక రచయిత నయ్యానంటారు పారప్పురత్తు''.

ఆ నిస్వార్థ త్యాగము, ఆ బలిదానమూ, ఆయనలో ఒక సృజనాత్మకమైన చైతన్యాన్ని కలిగించాయన్నారు.

ఆయన రచనల్లో ... వ్యక్తికోసం ..., సంఘం కోసం ... తన రాష్ట్రం

కోసం ... తమ ప్రాణాల్ని అర్పించే పాత్రలెన్నో మనకు గోచరమవుతాయి.

తమ సంతోషాన్ని కాలదన్ని, పరులకోసం పాటుపడటం, — సేవచేయడమే జీవిత పరమార్థంగా భావించడం రచయిత యొక్క ధ్యేయమని తోస్తుంది.

'పారప్పురత్తు' రచనలు ముఖ్యంగా మనసులో ఆర్ద్రభావాల్ని — కోమలమైన అనుభూతుల్ని రేకెత్తిస్తాయి.

ఆయన రచనల్లోని పాత్రలన్నీ సామాన్య తరగతికి చెందిన గ్రామీణ ప్రజలే.

వారిలో డంబాచార్యులు — వంచకులు ... ధూర్తులు మొదలైనవారు ఎదురవుతుంటారు. అయితే వారందరిలోను సహజమైన మానవ ప్రవృత్తి కనబడుతుంది.

అటువంటి పాత్రల్ని చిత్రించడానికి ఏమంత భావుకతే అవసరంలేదు కానీ ... అత్యంత భావుకతతో కూడిన సంఘటనల్ని సన్నివేశాల్ని చమత్కారమనే రంగుపులిమి పాఠకుల్ని ఆశ్చర్య చకితుల్ని చేయాలనే తాపత్రయం శ్రీపారప్పురత్తుకి ఎన్నడూ లేదు.

ఆయన రచనల్లోని పాత్రలన్నీ మధ్యతరగతికి చెందినవే. తరువాత, — ఆ పాత్రలన్నీ మన కళ్ళముందు సహజ ప్రవృత్తితో ఎదురవుతాయి.

ఆ పాత్రలు మనతో మనసువిప్పి మాట్లాడుతాయి. సహజంగా, — సరళంగా — సూటిగా కనబడి మాట్లాడుతాయి కాబట్టి మన మనసుల్లో ఆ పాత్రలన్నీ చిరపరిచితులైన మిత్రుల్లాగా స్థిరంగా నిలబడిపోతాయి.

'పారప్పురత్తు' రచనల్లో — రచనా వస్తువుగానీ, — కథా కథనంగానీ, శిల్ప నిర్మాణంగానీ, — పాత్రలకి అన్నివిధాల అనుకూలంగా ఉంటాయి.

శబ్దాడంబరంతో — పదాలగారడి చేసి పాఠకుల్ని పరవశుల్ని చెయ్యాలనుకోరు పారప్పురత్తు. మరొక్క విషయం ... రచయిత పాఠకుడికి — పాత్రకిమధ్య అడ్డు తగలడు.

కథ మధ్యలోదూరి ఎక్కడా మాట్లాడుతున్నట్టే కనబడడు. సంఘశ్రేయోభిలాషిగా ధీమంతుడుగా పారప్పురత్తు సంఘంలో వచ్చే అనుకూలమైన ప్రతిమార్పుని, దూరాలోచన చేసి, చూసి, ఆహ్వానిస్తారు,

పరివర్తన కావాలనే ఆయన అభిలాష ఆయన చిత్రించిన పాత్రలద్వారా, — ఆ పాత్రల ఆచరణలోనే ప్రతిబింబింప జేస్తారు.

దాని ప్రభావం పాఠకుల మనోఫలకంమీద చెరగనిముద్ర వేస్తుంది.

రచయిత ఎక్కడా పాత్రల నోట పెద్ద పెద్ద సంభాషణలు చెప్పించాలనిగానీ,

ఉపదేశాలు దాటిచెప్పడానికిగానీ ఆరాటం కనబరచడు.

ఔచిత్యమూ కళాత్మకమూ అయిన దృష్టిగల రచయితకే అది సాధ్యపడుతుంది.

ఎన్నో అనుభవాలు ఎంతో దీర్ఘదృష్టిగల నవలారచయిత అయితేనే — అటువంటి వైవిధ్యంతో నిండిన —, జీవిత సన్నివేశాలుగానీ, — పాత్ర చిత్రణగానీ ... కరతలామలకం కాగలవు. పారప్పురత్తు ఈ కోవకి చెందిన నవలాకారుడే. ''నిణమణియం కాల్పాటుగళ్'' (నెత్తుటితో తడిసిన అడుగుల జాడలు)లో ఆయన ఒక సైనికుడి హృదయ విదారకమైన గాథ చెపుతారు.

మహాకఠోరమైన అనుభవాల సంచునబడి నలిగిపోతూ, ఎదురు దెబ్బలు తింటూ ... పడుతూ లేస్తూన్న జీవితాన్ని వర్ణిస్తారు. దృష్టాంతంగా — త్యాగానికి ప్రతిరూపంగా చిత్రించిన మాథ్యూ పాత్రని మనకి పరిచయం చేస్తారు.

పారప్పురత్తుగారి మరొక నవల — ''అన్వేషిచ్చు కండేత్తి ఇల్ల'' (వెతికాను కానీ దొరకలేదు).

అది ఒక నర్సు జీవిత గాథ. బాధకరమూ త్యాగభరితమూ అయిన ఒక మధుర జీవితం దుఃఖాంతం కావడం చిత్రించ బడింది.

సూసీ పుట్టగానే తండ్రి ఆ బిడ్డని గొంతుపిసికి చంపాలని ప్రయత్నిస్తాడు.

తల్లిని కోల్పోయిన సూసీ దయాదాక్షిణ్యాలులేని ఆ తండ్రి — సవతి తల్లి చేతుల్లోపడి పడే అష్టకష్టాలు, మేనమామల యింట పెరిగి పెద్దదయిన తర్వాత — మిలిటరీలో నర్సుగా చేరడం, — ఉత్తరదేశంలో ఉన్న ఆస్పత్రుల్లో నౌకరీ చేస్తూండటమూ, ఆ సందర్భంలోనే ఎన్నో భయంకరమైన అగ్నిపరీక్షలకి గురికావడమూ, తన పవిత్రతని కాపాడుకుంటూ తన మనసుకు నచ్చినవాడు దొరికినప్పుడు వివాహం చేసుకోవాలనే అభిలాషని లోలోపలే దాచుకుని, — ఆనందంకోసం ఆ సూసీ వెతుక్కోవడం ... గాలించడం ... చివరికి ఫలించక పోవడమూ .. అన్నది .... ఆ వర్ణించి చెప్పిన తీరు పాఠకుల హృదయాల్ని ఎంతగానో కదిలించివేస్తాయి. పారప్పురత్తు రచించిన మరో ప్రముఖ నవల — 'ఆద్యకిరణంగళ్' (ప్రథమ కిరణాలు). నవలాకారుడు యిందులో కేరళలో ఏదోమూలనున్న కుగ్రామంయొక్క స్థితిగతుల్ని, ఉన్నదున్నట్లు చైతన్యవంతంగా కళ్ళకి కట్టినట్టు చిత్రించారు.

వెనకబడి — ఎదుగూబొదుగూ లేని ప్రదేశానికి గ్రామసేవికగా వెళ్ళిన మేరికుట్టి ఆ ఊరి వైఖరిలోనె తెచ్చిన మార్పును గమనించ తగింది.

అది చాలా శక్తివంతమైన నవల.

మొదటినుంచి చివరివరకూ గూడా ఎంతో భావ భరితంగా ఉండే 'ఆద్యకిరణం గళ్' — మన సమాజ వికాసయోజన కార్యక్రమాన్ని సమర్థిస్తుంది.

''పణి తీరాత్త వీటు'' (పూర్తికాని యిల్లు) ''మగనే నినక్కు-వేండి'' (బాబూ నీకోసమే) మొదలైనవి పారప్పురత్తుగారి ఉత్తమోత్తమమైన రచనలు.

అయినప్పటికి ఆయన రచనలన్నింటిలోకి — బహుళజనాదరణ పొందింది... స్తోమత కలది ''అర నాళిక నేరమ్'' (అరగడియ) అనడంలో సందేహం లేదు.

''ఆకాశం కింద జరిగే అన్నిటినీ జ్ఞానంచేతి వివేచించి తెలుసుకోవాలని ప్రయత్నించాను. భగవంతుడు మనిషికి అంతులేని దుఃఖాన్ని ప్రసాదించాడు. సూర్యుని కింద — భూమ్మీద జరుగుతున్న కార్యకలాపాల్ని గూడా తిలకించాను ... అంతా మాయ ... ప్రయత్నించడం ... వృధా ...'' అనే బైబిలు గ్రంథంలోని ఈ ఉదాహరణను 'అరనాళిక నేరమ్' అనే నవలకి నొసటి తిలకం .... సహృదయులైన పాఠకలోకాన్ని ఇట్టే ఆకట్టుకోగలిగిందీను.

ఈ వొక్క వాక్యంలోనే నవలయొక్క సారాంశమంతా ఇమిడి ఉంది.

తిరువిదాంకూర్ సంస్థానపు నడిబొడ్డుమీద నివసిస్తున్న క్రైస్తవ సమాజ జీవితమే ఈ నవలలోని ఇతివృత్తము.

నవలకు ఆయువు పట్టు కుయెన్నాచ్చను.

అతడు తొంభై సంవత్సరాల జీవిత కాలంలో కొద్దో గొప్పో తనసొంతంచేసుకున్నాడు ... పోగొట్టుకున్నాడు గూడా.

అతని జీవితం సంఘటనలమయం. కథావస్తువుకి ఉపోద్ఘాతంగా రచయిత చెప్పిందేమంటే — ''నాకు గ్రాహ్యం వచ్చినప్పటినుంచీ — ఈ పాత్రకి నా జీవితంతో వేరు వేరు పేర్లతో ... వివిధరూపాల్లో సన్నిహిత సంబంధం ఏర్పడింది. కుయెన్నాచ్చను ఒక తరం అనే తావళంలో మిగిలిన చివరిపూస ...''

రచయిత ... ఎంతో చిన్నతనంనుంచే అంటే తనకి ఊహ తెలిసింది మొదలు తన మనస్సులో తిష్ఠవేసుకుని కూర్చున్న ఈ పాత్రయొక్క నానా విధాలైన జీవితానుభవాలను తన కళానైపుణ్యంచేత మలచి రూపందిద్ది తీర్చాడు...అతడే కుయెన్నాచ్చను.

ఆ పరమవృద్ధుడు గడచిపోయిన సంఘటనల తరంగాల సవ్వడితో మార్మోగు

తున్న తీరాన చతికిలబడి — ''ఆఁ ... ఇక మహాఉంటే 'అరగడియ' — అంటూ జీవిత కాలాన్ని లెక్కబెట్టుకుంటూంటాడు.

మధ్య మధ్య నల్లమందు వేసుకుంటూంటాడు ... కునికిపాట్లు పడుతూంటాడు.

ఈ పాత్రలోని అసంబద్ధమైన ... అవకతవకల్ని ఆధారం చేసుకుని నవలాకారుడు,—కాలప్రవాహం యొక్క తాకిడిచే దెబ్బతిన్న మూడుతరాల గాథను, ఆటుపోటులను భావగర్భితంగా వెల్లడించాడు.

ఆ వృద్ధుడు అనుక్షణము మసగేసిపోయే తనస్మృతి దర్పణాన్ని మాటిమాటికి తుడిచి సుభ్రం చేసుకుంటూంటాడు అంతేకాదు ... రాబోయే మృత్యువు కోసం వేచియుంటాడు.

మలయాళ వాఙ్మయంలోనే అత్యంత పరిపుష్టిగల పాత్రయిది. అహర్నిశలు — మానవుని భయవిహ్వలుని చేస్తూ జీవితంలో ఎదురయ్యేప్రతికూల పరిస్థితులకి సరితూగే బైబిలులోని సంఘటనల్ని అడపా తడపా దృష్టాంతంగా ఆ పాత్ర ద్వారా పలికిస్తూంటాడు,

మానవుని మనస్సు సుఖం కోసం బాకులాడి పరుగెత్తి పరుగెత్తి ''అది —వట్టిది ..., అశాశ్వతమైందన్న సంగతి తెలుసుకోగానే, ... మలుపు తిరుగుతుంది...వైఖరిని మార్చుకుంటుంది.'' మాయాజాలానికి లోబడని – మనస్సుస్థాయి పెరుగుతుంది. భావవ్యక్తీకరణకోసం రచయిత ఈ 'ఒరనేశిక నేరమ్'లో వాడిన శైలి ఆ రచనకెంతో ఔన్నత్యాన్ని చేకూర్చింది.

ఇందులో కుయెన్నాచ్చను — జీవిత చరిత్ర వరుసక్రమంలో ఉండదు.

వర్తమానంలో జరుగుతున్న సంఘటనలని వింటూ కనుగొంటూ కుయెన్నాచ్చను మనస్సు అనుకోకుండానే గతంలోని అగాధాల్లోకి చొచ్చుకు పోతుంది ... నాటి సంఘటనలని నెమరుకు తెచ్చుకుంటుంది,

మనస్సు ఎంతసేపూ భూతకాలంలోకే పయనించిందనడం — ఆ వృద్ధుని పాత్రలోని బలహీనతని స్ఫురింపజేస్తుంది. అది కృత్రిమమని ఏ మాత్రం అనిపించదు ... సరిగదా — అప్పటి ఆ సన్నివేశాలన్నీగూడా ఎంతో సహజంగాను, ఆసక్తి జనకంగాను ఉంటాయి.

శ్రీ పారప్పురత్తు ఈ నవలలో సజీవమైన కథా కథనాన్ని కళాత్మకంగా సమన్వయం చేస్తూ చెప్పడంలో ఒక నూతన పంథాని అవలంబించి కృతార్థులైనారు.

ఈ నవలలో ఒకచోట రసపట్టుగల వర్ణనచేస్తూ రచయిత —

జీవితంలో ఆఖరిమెట్టుజేరిన కుయెన్నాచ్చను తన వివిధమైన అనుభవాలని పుర స్కరించుకుని, మనమరాలైన చిన్నారి సిసిలికుట్టి భావి జీవితంమీద ఆరోపించి ఊహిస్తూ విస్తృతంగా వర్ణించి చెబుతాడు.

"ఆ చిన్నది ఎగురుతూ, — గంతులేస్తూ చలాకీగా పరుగు తీస్తుంది ... పరు గెడుతున్న శబ్దం వినబడుతూనే ఉంటుంది. మొహం మీద పడే ముంగురుల్ని ఒక చేతితో సవరించుకుంటూ ఉంటుంది. ఇంకో చేతితో రబ్బరుబాండు వేసిన పుస్తకాలకట్ట, — పలక పుచ్చుకుంటుంది.

పరమగీతంలో చెప్పినట్టు — ''నువ్వు ఫరోయొక్క రథాశ్వముతో సమానము — ఏన్గదీ ద్రాక్షతోటలోని కర్పూరపు పూగుత్తులతో సమానము ... షారోను పొలంలో పూసే అందమైన గులాబి పుష్పముతో సమానము. నీ కన్నులు గువ్వకన్నులు .... నీ తలవెంట్రుకలు గిలాదు పర్వతము మీది మేకల మందను పోలియున్నాయి. నీ పెదవులు ఎరుపునూలువలె ఉన్నాయి. నీ చెవులు దానిమ్మగింజలలా ఉన్నాయి. నువ్వు లేడికూ నల్లే చెంగు చెంగున గంతులేస్తూంటావు ...

నాలుగైదేళ్లు గడిచాక నువ్వు పెద్దదానివవుతావు ... నీకు యుక్త వయస్సొ స్తుంది. నీ బుగ్గలు ఎరుపెక్కుతాయి. కళ్ళల్లో మిల మిల వస్తుంది. పాదాలవరకు పరి కిణీ కడతావు ... నీకో పది పన్నెండేళ్లు వస్తాయి ... కానీ మీ అమ్మ ఏమంటుందో తెలుసా, — ''దీనికి పెళ్ళి యీడైతే వచ్చింది గానీ ... పచ్చడి నూరడమన్నా రాదు గదా'' — అని గూటిస్తుంది.

మరో మూడు నాలుగేళ్ళు దొర్లుతాయి, ... కిలకిలా నవ్వవు .... అటూయిటూ చూడవు, ... ఎన్నెన్నో కొత్త విషయాలు ఆకళింపు చేసుకుంటావు, ... అయినా ... ఏమీ ఎరగనట్టే ఉంటావు, ... మనసులో ఏం ఉండదుగానీ ... ఎప్పుడూ ఏదో పర ధ్యానంగానే ఉంటావు ... నీలో నువ్వే నవ్వుకుంటూ ఉంటావు.

జీవితంలో మరోమలుపు వస్తుంది. అప్పుడిక నీకోతోడు కావాలి చైత్రంరాగానే కల్యాణ మండపంలో కాలుపెడతావు ... మరుసటి యేడాదికి చంటిబిడ్డ తల్లి వవుతావు, గృహిణివై ... గృహకృత్యాలు నిర్వర్తించడంలో ఆరిందావై పోతావు — అంటూ కుయెన్నాచ్చను తన మనో దర్పణంలో చిన్నారి సిసిలీ భావి జీవితాన్ని తిలకిస్తాడు. ఊహాగానం చేస్తాడు. ఈ వర్ణనలో భావగీతంలో ఉండే మాధుర్యం ఉంది ....

నేనీ భాగం ఉదహరించడానికి కారణం — ఈ 'అరనెశిక నేరమ్'లో భావగీతానికుండే లయ — సొగసు అంతులేని లాలిత్యం, — రమణీయమైన కథాకథన శైలి ఉండటమే ...

ఈ రచన చరమస్థాయినందుకున్న — సృజనాత్మకమైన ప్రతిభావ్యుత్పత్తులకు... ఇతివృత్త కథనానికి చక్కని తార్కాణము.

ఒక సుప్రసిద్ధుడైన విమర్శకుడన్న పలుకులివి : ''నైతిక విలువలు తెలిసి, ఉన్నత స్థాయికి చెందిన కళాకారుడు దుఃఖపూరితమైన జీవిత సత్యాన్ని చూడగలగబట్టే ఉత్తమమైన ఈ కళాఖండం ఉద్భవించింది. ఈ కథలో జీవితపు లోతుపాతులన్నీ విశదీకరింప బడినాయి''.

— డి. సి. కిషక్కేమురి.

# ఒకటి

ఎముకలు ముళ్లల్లే గుచ్చుకు పోతున్నాయి ... అబ్బ.... అనుకుంటూ కుయె న్నాచ్చను ఒత్తిగిలి పడుకున్నాడు, లేచి వసారాలో కాస్సేపు అటూఇటూ తిరిగితే బాగానే ఉంటుంది, - కానీ తిరిగేటప్పుడు కాస్సేపు నడుం వాలిస్తే బావుణ్ణు, అని పిస్తుంది. పడుకుంటేనేమో లేచి తిరగాలని బుద్ధిపుడుతుంది: ... నడవాలంటే చేతికర్ర కావాలి. ఆ పిల్ల నన్నాసులు కాస్త దాన్ని లాక్కుపోయారు. మామిడి చెట్టు చిటారు కొమ్మ నెక్కడో దాన్ని ఇరికించి మరీ పోయారు...... తుంటరి వెధవలు.

ఇప్పుడు గంటెంతయిందో ...... - .......!

'చిన్న' వచ్చిందంటే కాస్సేపు ఆమాటా ఈమాటా చెప్పుకోవచ్చు. లేకపోతే 'కురుప్' - వచ్చినా కూడా హాయిగా పిచ్చా పాటీ మాట్లాడుకోవచ్చు. ఆఁ ...... నా వెర్రిగానీ ...... ఎక్కడో ఎవరి పచారు దుకాణంలోనో గుమాస్తాగిరీ చేసుకొనే కురుప్‌కి,- వచ్చి కూర్చుని నాతో బాతాఖానీ కొట్టడానికి తీరిక ఉండొద్దూ ?

మనిషి మంచివాడు ... కాబట్టే వాళ్ళని వాళ్ళని పట్టుకుని రవంత నల్లమందు సంపాయించి,- పనిగట్టుకుని నా కోసరం వారానికోసారో రెండుసార్లో వచ్చి, చూసి, ఇచ్చి చక్కా బోతుంటాడు.

'అమ్మా ...... అమ్మాయీ!'

''వినబడినట్టులేదు ...... అందుకే పలకలేదు,''

'దీనామ్మా ...... !'

'ఓయ్ ......'

ఆఁ... విన, బడిందిప్పుడు.

'ఒక్కసారి యిలా రామ్మా.'

'వస్తున్నా మావయ్యా ... ధూఢకి కుడితి నీళ్లు పెడుతున్నా.'

పాపం ... అన్ని పనులకి ఒక్కర్తే తంటాలు పడాలి. ఆ ప్రబుద్ధుడున్నాడంటే ఎప్పుడూ క్షణం తీరికలేని పనేనాయె. ఈ వాడకట్టుకంతా వాడే పెద్ద దిక్కు. పరగడుపున చక్కాపోతాడు. మళ్లీ ఎప్పుడొచ్చేది తెలీదు. చెప్పలేం ... అటువంటప్పుడు ఇంట బియ్యం పప్పూ ఉప్పూ కూరా నారా ఉన్నాయో,- నిండుకున్నాయో వాడికెలా తెలుస్తుంది? అహఁ... ఇంటిపట్టున ఉండి పనీ పాటా చేసుకుందుకు అసలీ మూక వాణ్ణి నిలవ నిస్తేగా?

చర్చిలో ఉత్సవం జరగాలంటే మాత్తుకుట్టి హాజరు కావాల్సిందే. బిషప్‌తో ఏదైనా విన్నవించుకోవాలంటే మాత్తుకుట్టి ఉండాల్సిందే. నిజం చెప్పాలంటే ఈ ఊళ్లో వాడు లేకుండా ఏపనీ జరగదనుకోండి. ఆ మాటకొస్తే వాడేం శ్రీమంతుడు కాడు కానీ- పేరు ప్రతిష్ఠలు మాత్రం పుష్కలంగా ఉన్నాయి సుమండీ.

నేను దారే వెడుతూంటే ఊళ్లో ఉండే కుర్రకారంతా నన్ను మాత్తుకుట్టిసార్ నాన్న గారనే పిలుస్తారు. పోనీ కంట్రాక్టరు కుయున్నైనా అంటారేమో అనుకుంటా- ఉహుఁ. అదీగాకపోతే ఫిలిప్రోసు నాన్నగారన్నా బావుండు... అనరుగా. ఏమిటో... మనిషి మానమర్యాదలిలానే అంచనా వేస్తూంటారు.

''మావయ్యా ... ఎందుకో పిలిచారు?''

''ఏం చేస్తున్నావమ్మా?

''దూడకి కుడితి పెడుతున్నానని మీ కప్పుడే కేకేసి మరీ చెప్పాగా?''

''చెప్పావూ?''

"అదేవిటి మావయ్యా మీకు రానురాను మరుపెక్కువై పోతూండి? ఇట్టే వింటూనే అట్టే మరచి పోతున్నా రేమిటి?"

''పోయేటప్పుడు తీరు ఈ తీరునే ఉంటుంది లేమ్మా!''

''ఎక్కడకి పోవడం?''

''ఇక్కడికి వచ్చిన పనులన్నీ అయిపోయినట్టేగా ... ప్రొద్దుగూకే వేళయింది. మహా ఉంటే - వో — 'అరగడియ' ...... అంతే."

''ఆఁ ... మరీను మీరు. అన్నీ మనచేతుల్లోనే ఉన్నట్టు.''

''నాకు తెలుసు తల్లీ! మోషేలాగా యెరికో ఎదుటఉన్న నెబో కొండమీదికి ఎక్కుతూ ఎక్కుతూ ఉన్నా. ఆ కొండ కొననున్నదే చివరి మజిలీ. యెహోవా మోషేతో- నీ సోదరుడైన అహరోను హోరేబు పర్వతం మీద చనిపోయిన తర్వాత తన

వారిని చేరుకున్నట్టే. నువ్వూ నువ్వొక్కే కొండ మీదా చనిపోయిన నీ వారిని చేరు కుంటావన్నాడు.''

''చాలు చాలు ఊరుకోండి మావయ్యా! మీరు ఊరికే, లేనిపోనివన్నీ ఆలోచిస్తూ కూర్చుంటారు.''

"పోనీలే- ఎందుకొచ్చింది గానీ,— మీ ఆయన నిన్ననగా వెళ్లాడే...... తిరిగి వచ్చాడా?''

''లేదు''

''అవరాను కొడుక్కి డీకను పదవి ఇవ్వడం విషయంలో చేరావల్లి గ్రామస్థులంతా వ్యతిరేకిస్తున్నారట. అందుకోసం మనవాడు అవరాను వ్యవహారంలో కలగ జేసుకుని బిషప్‌తో మాటాడటానికి వెళ్ళి ఉంటాడనుకుంటా.''

''మంచిదే.''

''ఆఁ ... ? (ఏమన్నావ్?)''

''ఏం లేదు ... పనికావడం మంచిదే అంటున్నా.''

కుయెన్నాచ్చను ఫక్కున నవ్వాడు.

''నిజమే మరి ... నలుగురు మధ్యలోకి వెళ్ళాలన్నా.... మాట్లాడాలన్నా ... ఈ కుటుంబంలో చెప్పుకోతగ్గవాడు వాడొక్కడేగా ...... ''

దీనామ్మ ఏం మాట్లాడలేదు. మావయ్య అంటున్నది అక్షరాలా నిజమని మాత్రం మనసులో అనుకుంది.

ఆ వాడకట్టునున్న పెద్ద పెద్ద వాళ్ళంతా ఎందుకో - అందుకు అతని కోసరం వస్తూ పోతూ ఉంటారు. ఏవేవో గొప్ప గొప్ప విషయాల్ని గురించి ముచ్చటించుకోవడం- చర్చించుకోవడం కూడ కద్దు. సలహాకిగానీ సంప్రదింపుకీ గానీ అతడంతటి నేర్పరి... తీర్పరీను.

లోపలికి వెడుతున్న దీనామ్మను పిలిచి కుయెన్నాచ్చను-

''అమ్మా ఈ పరిసరాలలో పేలయరు (ఉత్తరాది సివార్లల్లో నివసించే 'పేలయర్' - 'పులయన్' - హరిజనుల్లోని ఒక తెగ. చిన్న చిన్న వృత్తు చేసుకు జీవించేవారు) ఎవడైనా ఉంటే చూడు ... అన్నాడు.

''ఎందుకు మావయ్యా?''

''ఏం లేదమ్మా, కుర్ర వెధవలు నా చేతికర్ర పట్టుకుపోయి ఆ మామిడి చెట్లో

ఎక్కడో ఇరికించేశారు. దాన్ని తీయిద్దామని. నువ్వూ చూశావనుకుంటా."

''లేదే ...... ఎవరా కుర్ర వెధవలు?''

"ఇంకెవరు? ఎల్లుపరంపలో ఉండే కేవరీతు చిన్న కొడుకూను, నా మూడో సుపుత్రుడి నాలుగో కొడుకూను. అసలు నాయకుడే వాడు. వాడి పేరేదో ఉండాలె......... ''

''సణ్ణియేగా?''

''ఔనౌను ... వాడే ... ఇంకా మరో అయిదారుగురు కుర్రమేళాం పరుగు పరుగున నా దగ్గరికి వచ్చి – ఇదిగో యిప్పుడే తెచ్చి యిచ్చేస్తామని చెప్పి. కర్ర తీసుకుని అదేపోతపోయారు. వాసానికి దాన్ని జతచేసి కట్టి మావిడి కాయలు కోసినట్టున్నారు. కట్టు ఊడిపోయి అది కాస్త ఆ మావిడి గుబుర్లో ఎక్కడో చిక్కుకుపోయింది. వాసం దారిన వాసం జారి పడిపోయింది. ఆ పళాన గుంట వెధవలు పత్తా లేకుండా పోయారు. అన్నట్టు 'చిన్న' గూడా వాళ్ళవెంటే ఉందమ్మోయ్.''

''అందరూ అందరే ... దాగుల్బాజీ మేళాం ... ''

''ఊఁ.... అక్కడ పేలయరు వాడెవడైనా ఉన్నాడేమో చూడమ్మా:

చేతికర్ర లేకపోతే వారానికెల్లా పోయేది!''

''ఇవాళెక్కడేఁ?''

''కేవరీతు యింట. వేళ మించకుండాపోవాలి. పోతేనే అంతోయింతో దొరుకుతుంది.

ఆ పట్టెడు మెతుకులకోసం అంతదూరం పొడుచుకొంటూ పోవాలి. ప్చ్ ... నవ్వేవారికి నవ్వసందు ... దెప్పేవారికి దెప్పసందూను. ఎక్కడో అక్కడ హాయిగా కూర్చుని గుక్కెడు నీళ్లు తాగడానికి నేనేం కూడబెట్టానా? ఆదాచేసానా? ...... అనుకునేం లాభం?''

''ఎవరంటారు మిమ్మల్ని మీ చాదస్తంగానీ అసలీ ఊళ్లో మిమ్మల్ని ఎరగని వాళ్లెవరు చెప్పండి మావయ్యా! కావాలని కొంత చేసుకుంటూంటే - తప్పుతుందా మరి?

ఎండో పండో యిక్కడే ఉండి తింటే పోదూ? ఆ మాటంటే ససేమిరా ఒప్పుకోరాయె ...... ''

"బొత్తిగా లేవలేనిస్థితి వస్తే అదేలాగూ తప్పదులే ... అంతే అవుతుంది.''

''సరే,- చుట్టుపట్లెక్కడైనా చాత్తప్పులయన్ ఉన్నాడేమో చూసి చెబుతా మావయ్యా!'' ..... అంటూ దీనామ్మ లోపలికి వెళ్లింది.

కుయెన్నాచ్చను అటునుంచీ యిటుమళ్ళీ వొత్తిగిలి - 'అబ్బా వీపు పట్టేసిందే' - అనుకున్నాడు.

కుర్రాళ్ల రాళ్లు విసిరి విసిరి కర్ర పడెయ్యాలని విశ్వ ప్రయత్నంచేశారు కానీ ... లాభం లేకపోయే సరికి కాలికి బుద్ధి చెప్పేశారు.

మూడోవాడి కొడుకున్నాడే - నాడుఅచ్చంగా తండ్రిని, పోలినవాడే, రణపెంకె. ఏకోశానా భయం భక్తి అనరాదు వినరాదు. మహాకంత్రీలెండి.

పీడి తండ్రి చిన్నప్పుడు వాడి అన్నలిద్దర్నీ పల్టీకొట్టించేసేవాడు. అందుకు కారణమేం ఉండక్కర్లేదు ... అడిగింది యివ్వకపోయినా, వాడికిష్టంలేని దేమైనా చెప్పినా - వాడదే వరస.

మిగిలిన నలుగురన్నదమ్ములకంటె వాడికి తోడబుట్టిన దానిమీద వల్లమాలిన ఆపేక్ష. దానిక్కూడ కుయుచ్చెరుకక్కన్ అన్నంటే పంచప్రాణాలూనూ. అన్నదమ్ము లయిదుగురిలోను వాడే ప్రయోజకుడవుతాడనుకునే వాణ్ణి ... కానీ ... దౌర్భాగ్యుడై కూర్చున్నాడు.

ఎందులో చేయిపెడితే - అందులోనే కలసిరాకపోవడం, గొడ్ల వ్యాపారమంటూ మొదలు పెట్టాడు. ఉన్న పొలం కాస్త అమ్ముకున్నాడు, దాని తరవాత కట్టెల దుకాణమొకటి పెట్టాడు. ఉన్న ఆ రవంతస్థలము అమ్ముకున్నాడు ... పట్టి నష్ట జాతకుడు.

వాణ్ణి కట్టుకున్నదుందంటే- అది అతనికంటె అధ్వాన్నం. దానికి ఎక్కడలేని వాపిరి. మోపెడు, సరుకు తెచ్చినా ఆపూటకాపూట ఝూడాచేసి పారేసేరకం. అదే మన్నామో- ఉలకదు పలకదు. దుబారా మనిషి. ఉండుండి పెద్దపులిలా విరుచుకు పడుతూంటుంది. గంపగయ్యాళి.

వాళ్ళ పెద్ద కొడుకెక్కడో తొమ్మిది పదేళ్లుగా పనిచేస్తున్నాడు గానీ- అవి ఏం పనో-ఎక్కడో ఎవ్వరికీ అంతుతెలీదు. వాడు ఇంటికి ఏం యివ్వడని ఆ తండ్రి మొత్తుకుంటాడు.

కాదు ... అర్ధరాత్రో - అపరాత్రో వచ్చి డబ్బిచ్చి పోతుంటాడని వాళ్ళూ వీళ్ళు చెప్పేమాట.

ఏదేమైనా వాళ్ల కాపరముంటూంది మాత్రం పూరి గుడిసెలలోనే. అదో నటన ... ఆ( ... అంతా దాచుకుని పైకి పేదరికం వెళ్ళబోసుకుంటున్నారని

మాత్తుకుట్టి ఉద్దేశం,

అలా చేసేవాళ్లు – ఉంటారా అని నా అనుమానం ... ఏమోమరి. వాళ్ల రెండోవాణ్ణి పెద్దవాడే తీసుకు పోయాడంటారు. వాడికింకా నౌకరీ అదీ యేం కుదర్లేదు ... ఏమిటో ... ...

"పెద్దయ్యగారూ పిలిచారా ?"

తలెత్తిచూశాడు ...... ఆనవాలు పట్టలేకపోయాడు.

"ఎవర్రా ?"

"చాత్తన్ని."

"చాత్తనంటే ?"

"చాత్తనంటేట — పెద్దయ్యగారికి చెప్పండమ్మా - పొరుగునుండే తేవను కొడుకు చాత్తన్నని."

"అందుకే అడిగారా ... "

"సరైతే — చెప్పండి ఎందుకు పిలిచారో "

"ఏరా ?"

"చెప్పండి బోనెక్కిన మనిషిని ప్లీడరు అడిగినట్లు అడుగుతున్నారేమిటి మరీను?"

మాట చెప్పడం కొంచెం ఆలస్యమైతే కొంపేం మునిగిందిరా? విశ్వాసఘాతకుల్రా మీరు...! లేనిపోని గోల ... అయినా వీణ్ణి అన్నందువల్ల నాకు వొరిగేదేముందిట... ?

వోసారి పొలంలో వీడి తండ్రిని నేను అడవి అనాస దుబ్బు పెట్టి బాదేశాను? ఎందుకంటే - ధాన్యం - కోతలు జరుగుతున్నాయి ... చివరి రోజది. నాట్లేసింది మొదలు కోతలు పూర్తయ్యే వరకు తేవన్‌కి కునుకుపట్టేది కాదు. అటువంటివాడు మనసులో ఏదో ఊహించుకుని వో తప్పుడు పని చేశాడు. అంతే......ఆ తరుణంలో నా చేతిలో పెద్ద అనాస దుబ్బుఉంది ... దాంతో ...... అయితే వాడు కిక్కురు మనకుండా సహించి ఊరుకున్నాకు.

అందుకుకారణం లేకపోలేదు ...... ఎణ్ణక్కాట్టు గ్రామం నుంచి వాణ్ణి తెచ్చి నప్పుడు - అప్పటికి వాడో పన్నెండేళ్లవాడు. వాడు తలదాచుకోవడానికి గుడిసెవేయించి యిచ్చా, వాడి తిండీ తిప్పలూ అతీ గతీ అన్నీ కనుక్కునే వాణ్ణి ... అంతేకాదు వాడి కోసం పులయన్ కులంలో ఈడైన పిల్లదాన్ని చూసి,—ఎదురు శుల్కమిచ్చి తెచ్చి పెళ్ళి చేశాను.

"పెద్ద బాబు గారు !"

"ఆఁ,.....ఆ......మరే ?"

"తమరు నన్నెందుకు పిలిచినట్టూ అంట ?"

"ఒరే,—నా చేతికఱ్ఱ మామిడి చెట్టు పంగల్లో ఇరుక్కున్నట్టుందిరా, నువ్వు కాస్త చెట్టెక్కి తీసిపెడతావని......"

"చేతికఱ్ఱపోయి మామిడి గుబుర్లో ఏలా యిరుక్కుందబ్బా?"

"కుఱ్ఱాళ్లంతా వెదురుగడకి దాన్నికట్టి మామిడి కాయలు కోసుకున్నార్లే."

"ఇప్పుడు చెట్టెక్కాలంటే మా చెడ్డ చిక్కేనే.......ఎఱ్ఱ చీమలు పీక్కు తింటాయి:— నా వల్లకాదు బాబో!

కలాలీ వచ్చినప్పుడు చెప్పండి... నిచ్చేనేసుకుని ఎక్కి తీసి యిస్తాడు."

అంతలో దీనామ్మ వచ్చి —"మా తండ్రిగా ఒరే, చాత్తప్పలయన్ ! ఆ కఱ్ఱ ఎలాగైనా తీసి పెడుదూ నీకు పుణ్యముంటుంది. చేతికఱ్ఱ లేకపోతే మావయ్య బయటకు పోవడానికే కుదరదురా: " అని బ్రతిమాలి చెప్పింది.

"ఏమంటున్నావమ్మా — నిజమే, ఎఱ్ఱచీమలు పీకితే ఆబాధ పడేవాడికేగా తెలుస్తుంది—" అని ప్రశ్నించాడు కుయెన్నాచ్చను.

"వోణమో సంక్రాంతో వచ్చిందంటే — పండగ మామూళ్ల పుచ్చుకోవడానికి పిలవ కుండానే తయారవుతారే, — కాస్తంత పనిచెబితే అంతసీలుగైతే ఎలా"— అంది దీనామ్మ.

పని చేస్తే కూలిడబ్బులన్నా గిట్టుతాయి......

చాత్తను ఎక్కనన్నవాడు కాస్త ఏమనుకున్నాడో ఏమో—చెట్టెక్కడానికి సిద్ధపడ్డాడు.

"ఆ మాటకొస్తే—ఈ రోజుల్లో పెట్టడాలు — పుచ్చుకోవడాలూ ఏమున్నాయి ? దోసెళ్లతో పొయ్యడం లేనేలేదు సరిగదా — గుప్పెడు పెట్టడానికే మొహమొహాలూ చూసుకుంటున్నారు. ఆపేక్షలు చూద్దామంటే — అవీ అంతంత మాత్రంగానే ఉన్నాయి......" అన్నాడు కుయెన్నాచ్చను.

కోడలు మాటంటే అంతా వింటారు ...... ఎవరూ కాదనరు. ఇతరులతో మెలగడంలో దీనామ్మ నెరజాణ. యింటికొచ్చిన కోడళ్ళందర్లోకి తన సాటి తనే.

అరే చాత్తప్పలయన్..........!

''అదుగో 'చిన్న' వచ్చేసింది.''

''చిన్న దొరసానమ్మగారొచ్చేశారు.''

''నేనేం చిన్నదొరసానమ్మగార్ని కాను... చిన్నమ్మగార్ని...''

''ఏదో వోకట్లే గానీ ... అసలిప్పుడు రాజులు లేరు — సామంతులు లేరు. దొరలు లేరు ...... దొరసానులులేరులే ..అమ్మడూ! మరైతే,— తాతయ్యా! నిన్ను పెద్దదొరగారని ఎందుకంటారు ?''

''చూడండమ్మగారు! తాతయ్యాగారి చేతికర్ర మామిడి చెట్టెక్కి కూర్చుంది''.

''నాకు తెలుసులే చాత్తప్పలయన్ : సణ్ణి అచ్చాయన్ వాళ్ల మావిడి కాయలు కోసుకున్నారుగా ... అప్పుడే......''

''ఆ సన్నిగాడు — పొన్నిగాడు ఈ సారి యిక్కడికి రాసేంది చెపుతా ...''

కుయెన్నాచ్చని వాళ్ళ 'చిన్న' — అదే సిసిలీ చాత్తప్పలయను మావిడి చెట్టెక్కుతూంటే వింతగా చూసింది.

చాత్తప్పలయను భలే గట్టివాడు. సణ్ణిగాడు పెద్దవాడే అయినా చెట్టుసగం వరకు ఎక్కేసరికి — ఎర్ర చీమలుపట్టి పీకడంతో తట్టుకోలేక కిందికి దిగేశాడు.

''చాత్తప్పలయను ... చాత్తప్పలయనూ ... నాకోపండుకోసిపెట్టవా'' — అనడిగింది సిసిలీ.

''అబ్బ ..... ఎంతాశ...నువ్వూ పూరి,—పుట్టుతినేటప్పుడు చాత్తప్పలయనుకి పెట్టవాయేం ?,'

''ఇకమీదట పెడతాగా ...''

''నేనూ ఇకమీదటే యిస్తాగా...'' అన్నాడు గానీ చాత్తప్పలయను మావిడి పండు కోసి మరీ యిచ్చాడు.

'చిన్న' గుడిసె వైపుగా బడికి పోతున్నప్పుడు చాత్తప్పలయను తల్లి అరుకీ పులయి ''చిన్న దొరసానమ్మగారు బడికి వెడుతున్నారే... '' అంటుంది. ఆ పిలుపే చాత్తప్పలయనకి అలవాటైపోయింది.

చాత్తప్పలయను వో కొమ్మ పుచ్చుకుని బాగా ఊపేశాడు. నాలుగైదు మావిడి పళ్లు రాలాయి. సిసిలీ అ పళ్లు ఏరుకుందామని పరుగెత్తింది. ''మీద పడేను... తప్పుకో ...తర్వాత ఏరుకుందుగానిలే పో'' అంటూ చాత్తప్పలయను సిసిలీని అదిలించాడు.

కొమ్మలన్నీ పట్టి వొక్కుమ్మడిగా ఊపేశాడు. మావిడి కాయలన్నీ జలజలా రాలి పడ్డాయి. చేతికర్ర తీసుకుని కిందికి దిగి వచ్చాడు... కానీ, పాపం చాత్తప్పుల యను వొంటినిండా చీమలే... ఎర్రచీమలే...

దీనామ్మ వచ్చి మావిడి కాయలన్నీ గంపలోకి ఎత్తుకుంది. కర్రతీసుకుని సిసిలీ తాత దగ్గరకు పరుగుతీసింది......''తాతయ్య! కర్రదొరికింది... నీచేతి కర్రదొరికింది తాతయ్యా" అంటూ.

ఆ మాట వినపడగానే కుయెన్నాచ్చను అమాంతం లేచి కూర్చున్నాడు కర్ర తీసుకుచూశాడు. నేలకు ఆనించి మరీ చూశాడు:

''ఇకపోయి ఆ కుర్రమూకను పిలుచుకురావే అమ్మడూ! పిలుచుకొస్తే... వాళ్ళందరి తాట వొలుస్తా '' అన్నాడు.

''ఈ కర్ర పెట్టా ?''

''ఔను,''

"నన్ను గూడా కొడతావా?''

''కొట్టక—?''

''ఉహుఁ నొప్పిపుతుతుంది.''

''నొప్పి పుట్టాలనే......''

''అహఁ ..వద్దు...కొట్టొద్దు తాతయ్యా!''

''సరే,...అయితే కొట్టనులే. చిన్నా! చూడు ఇవాళ నువ్వూ. నీ స్నేహితురాళ్లు అంతా బడికి వెళ్లారు టే?''

''వెళ్లాం.''

''వాళ్ల పేరేమిటిన్నావే?''

''లత..., అమ్ముకుట్టి...నిన్నా మొన్నా నీకెన్నిసార్లు చెప్పా! తాతయ్యా! మాటిమాటికీ అడుగుతావేఁ?''

''అమ్మడూ! నిన్ను బళ్ళో ఏ పేరుతో పిలుస్తారే?''

"ఏ పేరుతోనా?...అయ్యో నీకది గూడా తెలీదూ?''

''మరియమ్మా మాథ్యూ అని పిలుస్తారు తాతయ్యా!...''అంటూ సిసిలీ లోప లికి పరుగుతీసింది.

కుయెన్నాచ్చను లేచాడు. పాదాలు తిన్నగా ఆనకపోవడంవల్ల అక్కడే కూల

బడి—మళ్లీ క్రఊతం చేసుకుని, జాగ్రత్తగా లేచి,... మెల్లిగా అడుగులు వేసుకుంటూ వసారాలోకి వచ్చాడు.

''అమ్మా నే వెడుతున్నా...వినబడిందా?'' బయలుదేరాడు...కొద్దిదూరం నడిచే సరికి నడక వేగం అందుకుంది. ఇహ రెండు మూడు మైళ్లవరకు ఢోకాలేదు.

"ఎందాకా తాతా?''

క్రఊతంతో నిలబడి—''ఎవరది?—...నేనూ మల్లుపరంపదాకా పోతున్నా... నువ్వెవరో తెలీలా..., చూపానడం లేదుగా మరి?''

''చక్కాలే...''

''హరినీ...తోమా కొడుకువు్రటా?''

''ఆc......మరే.''

''పెద్ద కొడుకువేనా?''

''ఔను......''

''నువ్వు...ఇక్కడ ఉండటం లేదుటగా?''

''మద్రాసులో ఉంటున్నా..., మొన్ననే వచ్చా.''

''మంచిది...పోయిరా...బాబూ.''

కుయెన్నాచ్చను చౌరాస్తా చేరుకున్నాడు. అక్కడ ప్లీడరు గుమాస్తా పాక్కరన్ పిళ్లే—,''ఎక్కడికి బయల్దేరావయ్యోవ్—కుయెన్నా మాప్పిళ్ళా'' అంటూ పలకరించి కుశల ప్రశ్నలడిగాడు.

కుయెన్నాచ్చను ఆగకుండా.... నడుస్తూ నడుస్తూనే జవాబు చెప్పాడు.

ఇంకా యిలా దారిపొడుగూనా పలకరిస్తూనేఉన్నారు. ఎక్కడికన్నా—అనేవాళ్లు. ఎక్కడికి బాబయ్యా—అనడిగేవాళ్ళును.

జవాబు చెప్పడానికి ఆగడమంటూ ఏంలేదు...తనపాటికి తాను పోతూనే,—అడిగే వాళ్లకి సమాధానం చెవుతున్నాడు కుయెన్నాచ్చను.

తిన్నగా పోయి పూత్తచ్చిరా వాళ్ల దుకాణానికి చేరుకున్నాడు. అక్కడ ఒక పిల్లది యికిలిస్తూ 'తాతా!'—అంటూ పలకరించింది. ఎరుగున్న గొంతే అది... ఆగాడు...పరకాయించి చూశాడు.

''నేను తాతా ..'కుట్టి అమ్మను'...యింత ఆలస్యం చేశావేc?''

ఆc...నువ్వాటే...అంటూ ఆనవాలు పట్టాడు. 'కుట్టి అమ్మంటే కీవరీతు

కూతురు—గురు ఆయెను.

"బడికి పోతున్నావా అమ్మడూ?"

"నువ్వొస్తే—నీకు—అన్నంబెట్టి పోదామని చూస్తున్నా...తాతాయ్యా!"

"అయితే యివాళ మీ యింటికి వారానికి వస్తానని తెలుసన్నమాట?"

"వారమా?......" కుట్టి అమ్మ నవ్వింది.

"వచ్చి మాతోబాటు మాయింటనే ఉండిపొమ్మని నీకెంతకాలంగా చెప్తున్నాం తాతయ్యా!"

"సర్లే గానీ, -మీ నాయనెక్కడే ?"

"ఇంట్లోనే ఉన్నాడు."

"నీ కేదో సంబంధం వచ్చిందని విన్నా... ఏమైందేవిటి ?"

కుట్టి అమ్మ మౌనంగా చేతిలో ఉన్న నోటుబుక్కుమీద గోటితో గీస్తూ నిలబడింది. మళ్ళీ రెట్టించి అడిగేసరికి -అందిగదా—

"నాకేం తెలీదు తాతయ్యా-అపతల అమ్మా నాన్నకి గూడా ఆ ఉద్దేశం ఉండాలిగా ?"

"ఏం డబ్బుయిబ్బందా ?"

కుట్టి అమ్మ ఏం మాట్లాడలేదు.

"ఏం అమ్మడూ..." అంటూ పయెన్నాచ్చను ఆ పిల్ల దాని మొహంలోకి చూశాడు కుట్టి అమ్మ కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరిగాయి.

"అమ్మడూ ! ఊరుకో...ఏవిటిది... చెప్పు...నడి వీధిలో నిలబడి కంట తడి పెట్టరాదు తల్లీ... పద...చెప్పినమాటవిను."

కుట్టి అమ్మ కదల్లేదు.

"నా సంగతి చూసుకోకుండా .. యింటికోసం తిప్పలుబడి సాయం చేసినందుకు ... నాకు దక్కిన ఫలితం ... చూశావా ఇదే ... నాకు ప్రతినెలా వచ్చే జీతంలో ముందు నాన్నకి కొంత ముడుపు చెల్లించాలిసిందే గదా !"

"అఁ ... ? ఏవిటి ? ఎందుకు ?

"ఆ మధ్య చున్నకరానుంచి ఎవరో వో సంబంధం తెచ్చారు. నాన్న వాళ్లని నానా చివాట్లు పెట్టి, —నానా మాటలు అని,అసంబంధాన్ని కాస్త తిరట్టేగ్గొశాడు!"

'అరె ... ?' ', ఔను. ......యిప్పుడంటే అందరూ ఉన్నారు గానీ, ... రేపు

నాకు కాలో చెయ్యో నొచ్చితే ఎవ్వరూ కనబడరు.''

''వద్దు ...... అంతమాటనకు ... ఏడవకు ... ఏడవకమ్మా ... పద ... ఏదోమార్గం కనబడక పోదులే ...''

కుట్టి అమ్మ పమిట చెంగుతో కళ్లు తుడుచుకుని —,

''నేను బడినుంచి వచ్చేదాకా నువ్వుండు''— అంది.

''అలాగేలే నువ్వెళ్లిరా ...'' అని చెప్పి.— తిన్నగా బయలుదేరాడు కుయెన్నాచ్చను.

ఈ పిల్లది ఎన్నడూ యింతగా మనసు విప్పి మాటాడి ఎరుగదు సుమా! పాపం ..., ఇప్పుడిహ ఉండబట్టలేక అంతా చెప్పేసింది.

అది చెప్పిందంతా సబబుగానే ఉంది.

ఇప్పుడీ విధంగా చేస్తే రేపు ముసలి తనంలో నోట్లో నీళ్లోసే దిక్కుండదు గదా!

అయినా ఆ తల్లికీ — తండ్రికీ ఏం మాయరోగమో!

మిగతా అన్నదమ్ములకీ— అక్క చెల్లెళ్లకీ అందరికీ పెళ్ళిళ్లయ్యాయి.

ఎవరి యిళ్లూ వాకిళ్లూ వాళ్లకు అమిరాయి. ఎటొచ్చి ఏమీ లేకుండా ఉంది ఈ పిల్లదే . చాకిరీ చేసుకుంటుంది సరే,—

పైసా చేతిలో ఉంటే పది మందీ పలకరిస్తారు గానీ,—లేకపోతే—,

లేనివాళ్లల్లోనే జమకడతారు గదా !

దానికీ దాదాపు ముప్ఫయి యేళ్ళకి తక్కువ లేవు.

ఇద్దరక్కయ్యలకు పెళ్లి పేరంటాలయ్యాయి. పెద్దదేమో రోగిష్టిది.

ఆ పరమాత్ముడు దానికోసం భూమ్మీదే నరకం సృష్టించాడు.

ఏం పాపం చేసుకుందోగానీ..............,

వెనకటికి ''యెహోవా యథార్థవర్తనుడును, న్యాయపంతుడును, దేవుని యందు భయభక్తులు కలిగి, చెడును విసర్జించిన యోబును పరీక్షించినట్టు...

రెండోదానికి నలుగురైదుగురు పిల్లలు. కుట్టి అమ్మ తర్వాత దానికి గూడా యిద్దరో ముగ్గురో సంతతి—, కడసారపుది యిప్పుడు కడుపుతో ఉందిట.

ఈ కుట్టి అమ్మ చదువు సందెల్లో మంచి చురుకైందే. అంతేకాకుండా పని పాటల్లో గూడా మంచి నేర్పరి.

మెట్రిక్యులేషను ప్యాసుకాగానే బళ్లో ఉద్యోగం దొరికింది. నాటి నుంచి దాని

కొచ్చే జీతం యింటి కిందే ఖర్చవుతూంది. తండ్రికదో ఆసరాగా ఉంది. దానిక్కనుక పెళ్లిచేసి పంపితే తమ గతేంకాను ? అదేతంటా. అందుకనే ఆ తండ్రి వచ్చిన సంబంధా లన్నీ పడగొడుతున్నాడు కాబోలు ... ... ...

చిలక్కి చెప్పినట్టు చెప్పా వాడికి ... ఒరే ... నాయనా, దాన్నిగూడా వో అయ్యచేతిలో పెట్టరా. దాని ఈడువాళ్లందరూ ముగ్గురు నలుగురు బిడ్డల తల్లు లయ్యారురా .... అని.

ఆ మాటన్నామంటే చాలు ... కోపంతో ఆ యెత్తున మండిపడతాడు. మనిషేమో మంచివాడే: కానీ మహాకోపిష్ఠి ... ఏవిటో ... బ్రతకడానికి ఎన్నో మార్గాలున్నాయి.

భగవంతుడు వాడికి నలుగురైదుగురు ఆడసంతతిని యిచ్చాడామరి ? ఏదో... యుక్తిగా ...గుంభనగా కుటుంబం గడపాలిగా ... !...... 'అతగాడు' ...'ఎవడీ ముసలాడన్నట్టు చూసి,—

"ఎక్కడికెడుతున్నావ్"— అంటూ మూగవాణ్ణడిగినట్టు చేత్తో సంజ్ఞలు చేసి అడిగాడు.

"ఊఁ ?"

"ఇంత బలహీనంగా ఉండి—, కర్రపొడుచుకుంటూ ఎక్కడికా పోవడం"— అనడిగాడు.

గుర్తుపట్టాను వాణ్ణి ...,వాడు కసాయి మాత్తను కొడుకు అవరాను. ప్రస్తుతం వాడో చిన్న మోతుబరి. సరికొత్త శ్రీమంతుడని చెప్పాలి. కంట్రాక్టరు ఫిలిప్పోసు దగ్గర ఏదో ఉద్యోగం అఘోరించేవాడు. ఆ తరుణంలో ఎలాగో డబ్బు కొంత స్వాహాచేసేసి ఇపతలకొచ్చి,— సొంత వ్యాపారం మొదలు పెట్టినట్టు వినికిడి.

"మీ అబ్బాయి ఫిలిప్పోసు గూడా వచ్చి తమదగ్గర ఉండమనె గదా! ఉంటే పోలా ?దీనికంటే ... ... ?"

"ఓరి కసాయి వెధవా ... నువ్వట్రా ... నువ్వానాకు సలహా చెపుతావ్ ... ఏవిట్రా నీ తాహతు ... ? పోరా ఫో ... పోయి నీ పనేదో నువ్వేడవ్వోయ్ ... పేద్ద చెప్పొచ్చావ్... "అంటూ కుయెన్నాచ్చను నోరు చేసుకునేసరికి అవరానుకి తారెత్తి పోయింది. అలా విరుచుకు పడతాడనుకోలా...

ఏముందీ ... అప్పటికప్పుడే నలుగురూ మూగారు. అందరూ అవరానుదే తప్పని తేల్చారు.

"పోనీండి ... ఎవడో తెలిసీతెలీక ఏదో అంటే,- అంతగా పట్టించుకోదని" నర్దిచెప్పారు.

అయినా కుయెన్నాచ్చను సమాధాన పడితేనా ?

"ఒరే ... మీ అయ్య నా యెదట నిలబడి మాటాడి ఎరగడురా ! ఏమను కున్నావో ?"

నువ్వేదో పెద్ద మొనగాణ్ణనుకుంటున్నావ్! జాగ్రత్త. అని హెచ్చరిస్తూ,—

సమయం కనిపెట్టి దండించకపోతే యింకా యింకా పెచ్చురేగిపోడు ? నెత్తి కెక్కడూ ? అక్కడికక్కడే అణిచి పారెయ్యాలి గానీ ... అనుకున్నాడు తనలో.

"ఊఁ ... పోరా ... నీ దారిన నువ్వుపో ..." అంటూ కుయెన్నాచ్చను వో ఇరుకు సందు మలుపు దగ్గర కొంతసేపు రొప్పుతూ నిలబడ్డాడు.

అ తరువాత మళ్లీ వోపిక తెచ్చుకుని ముందుకు నడక సాగించాడు. మెట్లెక్కి లోపలికి వెళ్లాడు.:

కేవరీతు వసారాలో పడక్కుర్చీలో పడుకుని ఉన్నాడు. తండ్రిని చుడగానే లేచాడు. వసారాలోనే అటూ యిటూ పచార్లు మొదలుపెట్టాడు.

కుయెన్నాచ్చను మంచం మీద కూలబడ్డాడు.

"అరె ..., నువ్వు బజారుకు పోలేదురా ..." అంటూ కొడుకుని పలక రించాడు ... ఏదో వొహటి పలకరించాలిగా ...,

"టోకు వ్యాపారం చేసుకునేవాడు కాస్త,—చిల్లర బేరంలోకి దిగాడు. ఏవిటో..., పువ్వులమ్మేచోటే ... పుడకలమ్మాల్సి వచ్చింది.

కేవరీతు కొంచెంసేపు ఏమీ మాట్లాడలేదు అటూయిటూ తిరుగుతూ ఊరుకున్నాడు.

"బజారు పోవాలంటే డబ్బులుండాలిగా"—

ఇంత సేపటికి ఆ ముక్క బయటపడ్డది ... అంతవరకు ఆలోచిస్తున్నాదన్న మాట:

కుట్టి అమ్మ విషయం ఎలా అడగాలా- అని కుయెన్నాచ్చను ఆలోచిస్తూనే ఉన్నాడు:

"ఒరే,..."

"ఏవిటి ?"

"మూడో దానికి యింకా పెళ్లిచెయ్యకుండా అట్టే ఉంచడం బావుందిట్రా",

''నేనేం చెయ్యను ?''

''దాని మెళ్లో మూడు ముళ్లూ వేయించొద్దురా ?''

''వేయించాల్సిందే''.

''ఆ వేయించడమెలా జరుగుతుందిరా ?''

''ఏమో మరి ... ఏవరికి తెల్సు ? ... నీదగ్గరేమన్నా డబ్బుంటే యివ్వు".

''అలాగా : నా చేతిలో ఉన్నప్పుడు యిచ్చాగదరా ?''

''అప్పుడిస్తే ... ఏమైనట్లు ... ? నువ్వూ ... పోచుకోలు మాటలెన్నయినా చెప్పగలవయ్యా ... ఏమీ ఎరగనట్టు ...''

''చెపుతున్నా విను ... నాదగ్గర విషం పుచ్చుకుందామన్నా నాలుగు పైస ల్లేవు. దానికి జీతం రాగానే యింటికింద వో నలభయ్యో యాభయ్యో యివ్వడం వాస్తవమే. అంతమాత్రం చేత ఏమవుతుందీ అంట ? దాని పెళ్లిమాటెలా ఉన్నా ..., చిన్నదేమో కడుపుతో ఉందిట ... దాన్ని పురిటికి తీసుకు రావడమా — మానడమా అన్న సమస్య తయారైంది.

డబ్బేదైనా చిక్కితే తేవాలని, ... లేకపోతే అక్కడే కానిచ్చుకోవాలి ... అంతే, — '' అంటూ జవాబుగూడా కీవరీతే చెప్పాడు.

ఆ మాట అందుకుని కీవరీతు భార్య కుయుమ్మరియా ఇవతలకువచ్చి — ''హవ్వ ... అదేం మర్యాద ... ? మనం తినక పస్తులున్నా ఫర్వాలేదుగానీ ... పురుడు వాళ్లింట పోసుకోవడమా ?''

మాట పూర్తి కానీకుండానే కీవరీతు మధ్యలో అడ్డుతగిలి — ''అంతయిదైతే, —మీ పుట్టింటినుంచి డబ్బు తెచ్చిపిల్లదాన్ని పిలిపించు,—ఎవరు కాదన్నారు'', అన్నాడు.

''మా పుట్టింట పడి తినే సిబ్బందికేఁ లోటులేదు లెండి, నేను కాపరానికొచ్చే టప్పుడు ఎంత సామాను కట్టు కొచ్చానాని, మావయ్య నడగండి చెపుతారు ... యిక్కడే ఉన్నారుగా, మీరంటే మర్చిపోయి ఉండొచ్చు''.

''మూడు పురుళ్లు మా వాళ్లింటనే పోసుకున్నా ... ... ''

''అయితే — అందుకు యిప్పుడేం చెయ్యమంటావే ? అప్పుడు తెచ్చావు కనుక యిప్పుడు పోయి ముట్టచెప్పదల్చుకుంటే — ముట్ట జెప్పిరా పో ... ''

''అలా మాటాడితేనే నాకు వొళ్లు మండేది. నే తెచ్చిన వస్తువులన్నీ అమ్ముకు తిని ... పైగా ... ''

"చాలుగాని ... ఫో ముందు ... లోపలికి ... దిక్కుమాలిన నస ... ఊరుకున్న కొద్దీ మరీ రెచ్చిపోవడంగా ఉంది ... "

"అమ్మా కుయుమ్మరియా! పోయి పనిచూసుకో పోమ్మా .... గొంతు చించుకుని ఘర్షణపడితే, -- ఇరుగు పొరుగు పోగవడం, తలో మాటా అనడం తప్ప ..., వేరే యేముంది చెప్పు ..." అన్నాడు సర్ది చెబుతూ కుయెన్నాచ్చన్.

"ఒరే, ... ... !"

"నన్నేం చెయ్యమంటావ్? యింత విషం తినో, లేకపోతే నూతిలో దూకో చావనా చెప్పు. అప్పుడంటే కష్టపడి చాకిరీ చేశాను. బరువు బాధ్యతలు మోశాను. నీతో పాటే నేనూ గొడ్డు చాకిరీ చేశాను నా తమ్ముళ్లందర్నీ పెంచి పెద్ద చేసివాళ్ల బ్రతుకు వాళ్ల బ్రతికేటట్టు చేశా ... అంతగా చెయ్యబట్టే ఎవరికి వారు హాయిగా ఉన్నారు ... ఒకడైతే లక్షాధికారి గూడా అయినాడు గదా! అన్ని చేసి నేను మాత్రం పూటకి గతిలేని వాణ్ణయి కొట్టుకుంటున్నాను.

పొలం తగాదాల్లో ... ఆ పొలం పోకుండా కాపాడాలని పోయి ఆ నాయర్లతో వచ్చిన కొట్లాటలో ఇరుక్కుని నా కుడిచేతి బొటన వేలు కాస్త పోగొట్టుకున్నా. ఇప్పుడా చేత్తో వో బెడ్డ విసిరి కనీసం మావిడి పిందెన్నారాల్చలేని అథమస్థుణ్ణయ్యాను...

"గతం తవ్వుకుని ఏం ప్రయోజనం చెప్పు?"

"జరిగిన యధార్థమే చెప్పా ... మరి తీగ కదిలిస్తే డొంకంతా కదలదూ"?

"ఆవేశ పడకు నాయనా!"

అమ్మా కొంచెం వేడి వేడిగా ఏదైనా యిద్దూ మా తల్లీ! యిక నే లేస్తా... పోయి ఎక్కడైనా నడుం వాలుస్తా."

అప్పటికి కీవరీతు రవంత శాంతించాడు.

ఇది మామూలే వాళ్లకి.

"ఏం యిక్కడ పడుకోవడానికి మంచం- చాప లేవనుకున్నావా?

"లేవని కాదురా ... అయినా వద్దులెద్దూ...."

"ఇప్పుడే తెస్తున్నా మావయ్యా" అంటూ లోపల్నుంచి కుయుమ్మరియా కేకేసింది.

కొంత సేపు నిశ్శబ్దం. కీవరీతు వసారాలో మళ్లీ పచార్లు మొదలెట్టాడు కుయుమ్మరియా కంచంలో అన్నం పెట్టితెచ్చింది...,

మావగారికి కాళ్లు కడుక్కోవడానికి నీళ్లిచ్చింది ...

''వాడికి పెట్టావా ?''

''మీరు తినండి మావయ్యా ! ఆయన తర్వాత తింటారు.''

''నీ కొడుకింకా బళ్లోంచి రాలేదా ?''

''వచ్చి ఎటో వెళ్ళాడు.''

''ఉహూఁ..., స్నేహితుల్ని వెంటేసుకొచ్చి నా చేతికర్ర పట్టుకుపోయి మావిడి చెట్టు మీదెక్కడో పారేసి చక్కాబోయాడు. చేసిన ఘనకార్యం చెప్పలేదు కాబోలు.''

కుర్రసన్నాసులు: చెప్పి కొట్టించడమెందుకు లెమ్మని ఊరుకున్నాఁ: అని మనస్సులో అనుకుని,—

కుయెన్నాచ్చను రెండు ముద్దలు తిని లేచాడు.

''అదేవిటి మావయ్యా ఇదేం తిండీ... యిదేం లోకం ?...తిననే లేదే ?''

''చాలు ... చాలు ..., కావలసింది తిన్నాలేమ్మా.''

''ఏం కూర నచ్చలేదా ''

''నచ్చక పోవడమేవిటి నీ యిల్లు బంగారంగానూ, నువ్వు చేస్తే బాగుండక పోవడమేమిటి తల్లీ ..., ఇంతకుమించి తినలేనంతే.''అంటూ లేచిబయల్దేరాడు కుయెన్నాచ్చను.

అప్పుడు కీవరీతు పెద్దకూతురు రాహేలమ్మ వసారాలోకి తొంగి చూసింది.

అయిదు రోజులకోసారి తాతగారు వస్తూంటాడు.

వచ్చినప్పుడు అలా తొంగిచూసి చక్కాబోతుందంతే. ఆ పిల్లదానికి అదో తరహా జైలుశిక్ష ... కిక్కురుమనకుండా అనుభవిస్తూంది. ఎవరైనా యింటికి వస్తే ఎదుట పడొద్దని ఆంక్షపెట్టారు దానికి.

''అమ్మా !''

''ఁ.''

''నువ్వేమన్నా ఎంగిలి పడ్డావా ?

జవాబు లేదు. మొహం వంక పరికించి చూశాడు. సరిగ్గా రూపాయంతది ... గుండ్రంగా ఎర్రటి పెద్ద పొడ. జుట్టంతా ఊడిపోయింది. చెవులేమో వాచిపోయి ఉన్నాయి. చూస్తే భయంకరంగా—ఏదో వికృతంగా ఉందారూపం.

''పగటి పూట నిద్ర పోరాదమ్మా ! పరిశుద్ధగ్రంథం చదువుకో, ప్రార్థన చేసుకో.

దేవసేనాని యెహోవా వారికి అసాధ్యమయిందేదీ లేదు. అతడు తలుచుకుంటే సముద్రపు పొంగును అణిచి వేయగలడు. అలలు రాకుండా అరికట్టగలడు. అతడు రహబును నలిపి వేశాడు. తన బాహు బలంతో శత్రువుల్ని చెదరగొట్టాడు తల్లీ! అతడికెన్నో అద్భుతశక్తులున్నాయి. బైబిల్లో 89— కీర్తన చదువు తెలుస్తుంది.''

రాహేలమ్మకి కళ్లనీళ్లొచ్చాయి.

"అమ్మడూ! పోయిరానా?''

''ఊఁ ... ...''

కుయెన్నాచ్చను చేతికర్ర తీసుకుని బయలుదేరాడు ... పోయి మంచం మీద నడుం వాల్చాలి.

అప్పుడప్పుడు 'కురుప్'—నల్లమందు తెచ్చిపెడుతుంటాడు. పాపం తిమ్మిని బ్రహ్మిని చేసి ఏలాగో తెస్తాడు. రెండు జాముల వేళ వో మాత్ర వేసుకున్నానంటే,— రెండింతలు సత్తువ వచ్చినట్టుంటుంది. ఆ పిసరంతా పడక పోయిందో—చెప్పలేనంత అలసటగా ఉంటుంది.

పనచ్చి మూట చౌరాస్తా దగ్గరికి వచ్చేసరికి కుయెన్నాచ్చను కాళ్లు తేలిపోవడం మొదలెట్టాయి. చేతికర్రని ఎంత ఊతంగా చేసుకున్నా గూడా కాళ్ళానకుండా ఉన్నాయి. నిలబడలేక పోతున్నాడు. పడిపోరాదనే మనోబలంతోనే ఉన్నాడు. పడితే యింట్లో మంచం మీదనే పడాలి ... కానీ ... కాళ్ళకింద నేల కదిలిపోయినట్టనిపించింది... కళ్లు బైర్లు కమ్మాయి... అంతే...ఇంకేం గుర్తులేదు.

మొహాన నీళ్లు చల్లేసరికి కళ్లు తెరిపిస పడ్డాయి. చుట్టూ కలయజూశాడు ... గుమిగూడిన జనం ...

''మంచం తెద్దాం... మంచం మీదపడుకోబెట్టి తీసుకువెడితే సరి..." అంటూ ఎవరెవరి గొంతులో వినిపించాయి.

''వద్దు... నాకు మంచమూ వద్దు.... మంచమూ వద్దు...నా చేతికర్ర యిలా తేండి చాలు.''

అప్పటికీ యిద్దరి మనుషుల ఆసరాతోనే నడవగలిగాడు. ''తొంభయి యేళ్ళవాడివి —ఏదో పడిపోయినట్టు పోకపోతేయేం? ఈ తిరుగుడెందుకు—? --అన్నాననే నన్ను కొట్ట బోయాడు ఈ మహానుభావుడు,'' అని అదే సమయంలో ఆ గుంపులోంచి కసాయి మాత్తను కొడుకు అవరాను అనడం వినబడింది.

# రెండు

అందరూ వచ్చిన తర్వాతనే పిలిప్పోచ్చసు (ఫిలిప్పోసు) వచ్చాడు. వస్తూనే సైకిల్ స్టాండు వేసి నిలబెట్టాడు. టర్కీటవల్‌తో మొహంమీది చెమట తుడుచు కున్నాడు. సొంతకారున్నవాడే అయినా ఎక్కువగా సైకిల్ మీదే తిరుగుతుంటాడు.

కీవరీచ్చసు, (గీవర్గీసు) మాత్తుకుట్టీనేమో పంచలో నిలుచున్నారు. కుయుచ్చెరు క్కాసు తండ్రి మంచందగ్గిరే కూర్చున్నాడు. కుయెన్నాచ్చసు పెద్దకొడుకు 'కుయోమా' (కీర్తిశేషుడు) కొడుకు కుయప్పీ గూడా వచ్చాడు.

''ఏరా అబ్బాయి ! యిప్పుడేనా రావడం'' అంటూమాత్తుకుట్టి పెద్దరికంగా పలకరించాడు.

''ఆఁ మరే, ఉదయాన వంతులంవెళ్ళాను. అక్కడ వంతెన పనొకటి జరుగు తూందిగా అన్నాడు.''

మళ్ళీ నిశ్శబ్దం......

అక్కడికి వచ్చిన పనేవిటో అందరూ ఎరుగున్నదే. అందుకనే ఎవరికి వారు మెదలకుండా ఊరుకున్నారు. ఫిలిప్పోసు తండ్రి మొహంలోకి చూస్తూ చాలా సేపటి వరకు అక్కడే నిలుచుండి పోయాడు.

''ఇంత బలహీనంగా ఉండి, నాన్నా ! పెత్తనాలు చెయ్యడానికి ఎందుకు వెళ్ళినట్టు—''అని ప్రశ్నించాడు.

ఈ విషయం సంప్రదించాలనేగా కీవగీతు నలుగురిని రప్పించాడు? ''ఆ.... నా మొహం ...ఆయనకు యిప్పుడుకావాల్సిందేముంది కనుక ? నిక్షేపంలా వచ్చి నాదగ్గర ఉండమని ఎన్నిసార్లు చెప్పానో ? వింటేనా ?''

"అబ్బే.... పెద్దతనం వస్తున్నకొద్దీ ఆయనకు మరీ పసిపిల్లవాడికి మల్లే పట్టుదల ఎక్కువవుతూంది......"

''తాంఛయ్యోపడిలో ఉన్నాడు......నాన్న......నువ్వు చెప్పింది వినమంటే వింటాడా,..?'' అన్నాడు కుయుచ్చెరుక్కాసు.

''ఆఁ ...... ఆయన ఎవరు చెప్పినా వినడని అందరికి తెలిసిందేగదరా'' అన్నాడు మాత్తుకుటి.

కాలు చెయ్యి ఆడుతున్నప్పటి మాట వేరు...ఇప్పుడు లేవ సత్తువ లేదుకదా ... కాదు కూడదంటే కుదురుతుందా,—మెదలకుండా పడి ఉండాలి గానీ......

''ఆ మాటలన్నీ ఎందుకులెద్దూ....ఏది యేమైనా యికమీదట మనం నాన్న తినే నాలుగు మెతుకుల కోసం వంతులు వచ్చందాలకి పోరాదు. ఆయన ఖర్చుకి కావాల్సింది ఆయన ఎక్కడుంటానంటే,—అక్కడికే అందే సదుపాయం చెయ్యాలి.''

మళ్ళీ నిశ్శబ్దం.........

కీవరీచ్చను వాకిట్లో గొంతికూర్చుని పరాగ్గా వేళ్ళతో నేలమీది గరికె పీకుతున్నాడు:

కుయుచ్చెరుక్కను, కుయుప్పీ, మాత్తుకుట్టి ఆలోచనలో మునిగిపోయారు. ఎటూ తోచకుండా ఉన్నాడు ఫిలిప్పోస్.

''అయితే యింతకూ ఏం చేద్దామంటారో తేల్చండి....నాకు అవతల పనుంది...'' అన్నాడు.

''చెప్పేందుకేముంది ...నాన్నకయ్యే ఖర్చుకి డబ్బు యిక్కడికే పంపితే సరి.''

''అదంతా ఎందుగ్గానీ,... ....నాన్నని నాతో తీసుకువెడతా......,సరై తే,...''

ఫిలిప్పోస్—'నాన్నా'— అంటూబిగ్గరగా పిల్చాడు.

అప్పుడిక కుయెన్నాచ్చనుకి అనాలని నోటి దాకా వచ్చింది;

''నాకింకా చెవుడు రాలేదురా. మీ అందరి సంభాషణ వింటూనే ఉన్నా. కొంచెం అలసటగా, నిస్త్రాణగా ఉంది. అంతమాత్రానికే నా కాళ్ళకి బంధాలెయ్యాలని చూస్తున్నార్రా ?

నాకు లోకానుభవం ఎంత ఉందో మీకు తెలీదుట్రా? నీ మేడలో పందిరి మంచం మీద పడుకోవాలని నాకేం వాంఛ లేదురోయ్. నువ్వు వెండి గిన్నెలో పాయసం పోసి పట్టాలని నేనేం కోరడం లేదుసుమా ? పన్నీట జలకాలాడించమని అంతకంటె కాంక్షించడం లేదు .... ... కొలంబ కొచ్చాప్పి దగ్గర ఈ యిల్లు కొన్న తర్వాత అ గూని వాడు లేడూ .... ... వాడే వేలుపణిక్కన్, — వాడిచేత ఈ మంచం చేయించుకున్నా. ఈ ఘటం ఈ మంచం మీద కన్నుమూయాల్సిందే ..., ;.. అదీ ;.. ,.., తెల్సిందా ? నీ

ప్రయత్నం చూస్తూంటే ఆ యాకోబు గుర్తొస్తున్నాడు:

ఆ ఇస్సాకు బొత్తిగా కంటి చూపు లేనప్పుడు యాకోబు మోసం చేసి అతని దగ్గర దీవెన పొంది వెళ్లాడు:

ఎలాగంటే చెబుతా—,

ఇస్సాకు వార్ధక్యం వల్ల దృష్టిమాంద్యం ఏర్పడినప్పుడు ఏం చేశాడంటే—, తన పెద్దకొడుకైన ఏశావుని పిలిచి ... నాయనా! నువ్వు నా అమ్ములపొదిని, విండిని తీసుకుని అడవికి పోయి వేటాడి, నే చనిపోకముందు నిన్ను దీవించేట్టట్టుగా, నాకిష్టమైన, రుచిగల ఆహార పదార్థాల్ని తృప్తిగా తెచ్చిపెట్టవలసిందిగా కోరాడు.

సరే, ఏశావు తండ్రి చెప్పిన ప్రకారం వేటాడేందుకు అడవికి వెళ్లాడు.

ఇస్సాకు ఏశావుతో చెబుతూనప్పుడు ఇస్సాకు భార్య రిబ్కా విన్నది. విన్న విషయమంతా కాన కొడుకైన యాకోబుతో ఏకరువు పెట్టింది...ఏం చేయాలో గూడా నూరిపోసింది.

తల్లి చెప్పినట్టుగా విని యాకోబు మందకు పోయి రెండు మంచి మంచి మేక పిల్లల్ని పట్టుకు వచ్చాడు......

ఆ తర్వాత యాకోబు ఏశావు వేషంలో తండ్రి దగ్గరకు వెళ్లడం ...కళ్ళు కనబడని ఆ ముదుసలి ఇస్సాకు యాకోబుని—

యెహోవా ఆకాశపు మంచును<br>
భూసారాన్ని, విస్తారమైన ధాన్యాన్ని,<br>
నరిక్రొత్త ద్రాక్షరసాన్ని, నీ కనుగ్రహించుగాక!<br>
పరగణాలో ప్రజలంతా నీ అధీనమగుదురుగాక!<br>
నీ బంధు జనులకు నీవు ఏలికవగుదువుగాక!<br>
నీ తల్లిగన్న సంతతి నీకు సాగిలబడుగాక!...

అంటూ దీవించడం జరిగింది.

నాన్నా!

అదీ సంగతి:

అందుకని నా కళ్లల్లో కారం కొట్టాలనుకోకురా... నాకింకా కంటికి చూపుంది.

మీ అన్నలని... తమ్ముళ్ళి... అందర్ని,— మీలో ప్రతి ఒక్కరి నైజాన్ని ఆకళింపు చేసుకో గలనురా తండ్రి!

ఇప్పుడు నువ్వు నన్ను కార్లో కూర్చోబెట్టి ఎంతోయిదిగా వెంట తీసుకు వెడతావ్ నిజమే—,

ఆహా ఫిలిప్పోసు ఎంత బుద్ధిమంతుడు... తండ్రికి ఉపచారం చెయ్యడానికి తీసుకువెళ్లాడని చూసిన నలుగురూ అనుకుంటారనుకో

ఒరేయ్ బాబూ ! మనలో మాట. పదిరోజులు పోయాక పస బయట పడుతుంది.

ఆస్తి అనుభవించేందుకు మిగతా కొడుకులూను, మంచాన పడితే ఉపచారానికి మాత్రం ఈ కొడుకు కావాల్సి వచ్చాడంటూ నీ భార్యే సాధింపులు గూటింపులు మొదలు పెట్టకపోతేచూడు.

నేను ఒకరికి ఎక్కువ ఒకరికి తక్కువ యిచ్చిందేం లేదు. కానీ..., ఆడవాళ్ల మాటలు అంతలోనే ఉంటాయి. అది వాళ్ల వాళ్ల నైజం ......

అలా మాటలు పడుతూ... అటువంటి ఛండాలపు బ్రతుకు నాకెందుకురా ? నువ్వు పోరా పో ... అందామనుకున్నాడు.

నాన్నకి నా పిలుపు వినిపించినట్టు లేదు.

''ఆఁ... ఆఁ .. ఏవిట్రా ?''

''నాన్నా ! యింటికెడదాం .. వస్తావా ? బండి తెప్పించనా ?''

''ఇక్కడే పడుంటా రేరా,

''ఇక్కడే పడుంటా లేరా - చెప్పినా తలుసుకోడాయె...

తెలీకేఁ... తెలిసిందిరా .. నువ్వెళ్లు నాయనా ! ఈ నాన్నను గురించి ఆలోచించకు... వెళ్లిరా...

నేనిక మహా ఉంటే - వో అరగడియ— అంతేరా... బాబూ ! ''

''ఈయన యింకా యిదే ధోరణితో ఉంటే,.ఎవరు మాత్రం ఏం చేయగలం ?'' అని ఫిలిప్పోసు మిగతా వాళ్లతో సంప్రదిస్తున్నట్టు పలికాడు.

''ఆయన్ని ఇక్కడే ఉండనిమ్మంది అ దుకనే. అందరం కలసి ఆయన డబ్బు కోసం అవస్థ పడకుండా చూసుకుందాం'' అన్నాడు మాత్తుపట్టి ... తననూటే నెగ్గి నంత ధీమాగా .

అంతవరకు మెదలకుండా ఉన్నా కీవరీచ్చను—అయితే ఎంతెంత ఇవాల్సి ఉంటుందో చెప్పెయ్యండి... అన్నాడు.

''నేనేం చెప్పను ? అందరికంటె పెద్దవాళ్లెవరో వాళ్లు చెప్పాలి గానీ.''

''ఆఁ... ఇందులో పెద్దా చిన్నా ఏముందిలే. పెద్దవాణ్ణని నాన్న ప్రత్యేకంగా నాకు కట్టబెట్టిందేమైనా ఉంటే అనుకోవచ్చు, గుడ్డ కట్టుకోవడం వచ్చినప్పటి నుంచి యింటికోసం తాపత్రయమూ చాకిరీయే సరిపోయింది, పోనీ, చాటు మాటు చేసి సంపాయించుకున్నదేమైనా ఉందా అంటే అదీలేదు.

ఏ చేలో పంటయితే ఈనాడు మీరంతా తింటున్నారో ఆ చేను చెయి జారిపోకుండా కాపాడటం కోసం, ఆ నాయరు వాళ్లచేతుల్లో చావు దెబ్బలు తిన్నా...బొమికలన్నీ నుగ్గునుగ్గయినాయి... అంతకంటె నాకు ఒరిగిందేమీ లేదు

నా పిల్లలున్నారంటే,- దొరికినప్పుడింత గంజో- అంబలో తాగి బతుకుతున్నారంతే... ...

ఆ మాటకొస్తే నాన్న ఆస్తిలో వాటాలు పంచేటప్పుడు చిన్న వాళ్ల సంగతే ఎక్కువగా పట్టించుకున్నాడురా...''

అలా అనేసరికి కుయుచ్చెరుక్కుకు జవాబు చెప్పకుండా ఉండలేక పోయాడు.

''అబ్బా... అలాగా... అంతేనా యింకా చెప్పవలసిందేమన్నా ఉందా? ఆ చావు దెబ్బలు వాళ్ళ చేతుల్లో నేనూ తిన్నాగా .. బాబూ ?

అసలు మన అన్నదమ్ముల్లో అందరికంటె పెద్ద వాడు ఆ దెబ్బలాటలో ప్రాణాలే కోల్పోయాడుగా... ఆ మాటే మర్చిపోయావే ? అందు వల్ల నాన్న అంత చాటుమాటు చేసి ఎవరికేం ఎక్కువిచ్చాడో చెప్పూ కాస్త... వింటాం.

ఏదో ఆయన చేతికి ఆసరాగా వెంట ఉండటం వరకే మాకు దక్కిందీను ... ఆయన ఉన్నది మన్నది అంతా పెట్టి నీకే వో యిల్లు కట్టించి యిచ్చాడు, నీ పిల్లదానికి పెళ్లి చేశాడు... చాలదూ ?''

'' ఆఁ... ఆఁ... చేశాడు... పెళ్లి. ఆ పెళ్లి చేసిన పిల్లది నా యింటనే పడుందిగా ?''

''దాని గీతకు ఎవరు కర్తలు ? అసలు దానికి అటువంటి జబ్బు ఎందుకు రావాలి ?

మిగతా వాళ్ళు యిప్పటికీ గుడిసెల్లోనే పడున్నారుగా ఫిలిప్పోసు తోడబుట్టినవాడని చెప్పుకోవడానికి నాకెంతో బిడియంగా ఉంది ...'' అంటూ ఈ విధంగా మాటా మాటా పెరిగింది.

ఫిలిప్పోసు ఊరుకుంటాడా ... మాటకి లంకించు కున్నాడు. ''నాకు నా తండ్రి గానీ, తల్లి తోడుగానీ పూచిగ పుల్ల యివ్వ లేదు. నాకు... ఇచ్చిన

వాడు అ సర్వేశ్వరుడే ... నాకు మీలాగే అయిదు 'పరా' ల (పరాకేరళలోని ఒకకొలమానం) మాగాణీను, అరవై మూడు సెంట్లమెట్టపొలమేగా దక్కింది.

కష్టపడ్డాను ... నాలుగు డబ్బులు సంపాయించుకున్నాను. అది చూసి మీకు కన్నెట్టయితే –మీకు దూరంగానే ఉంటా ఎక్కడో ... అక్కడ ... ఎందుకొచ్చిన గోలగానీ...''

కీవరీచ్చను అప్పటికి కాస్త చల్లబడ్డాడు

ఇలా మాటా మాటా వచ్చినప్పుడు ఒకప్పుడు కొంచెం నోరు జారినా తక్షణమే సంబాళించుకుని, అన్నమాటని గురించి పర్యాలోచించడమూ అదీ ఉందిగానీ, ... ... కుయుచ్చేరుక్కనున్నాడంటే అలా కాదు... ...

''ఊరు విడచి పొమ్మంటే నేనే పోతాలే ... నువ్వెందుకురా పోవడం ? కాన రాయో... కాసరు గోడో పోవాలనే అనుకుంటున్నాలే...

నువ్వూ నీ తమ్ముడూ పెత్తందార్లయి పరువుగా ఉంటున్న చోట, కూటికి లేని ఈ పేద అన్నయ్య ఎందుకు లెద్దు ? అప్రతిష్ఠ....'' అన్నాడు.

ఆ మాట మాత్తుకట్టికి శూలంలా పొడుచుకుంది.

'' నా సంగతి వొదిలెయ్...చెయి జాపి ముష్టో నష్టో యెత్తుకుని కాలం గడుపుతా కానీ,– వో పూట తిండి పెట్టమని మీ ఎవ్వరి గుమ్మంలోకి రాను సరా ?''

''ఈ లేనిపోని మాటలెందుకు - అసలు వచ్చిన పనేదో పూర్తి చేసుకుంటే ఎవరి దారిన వాళ్లు పోవచ్చుగదా '' అన్నాడు కుయోమా కొడుకు కుయప్పి.

''నేననేదీ అదే ... అందరం కలిసి నాన్న కింద అయ్యేఖర్చు యిచ్చుకుందాం.''

''నాన్నకి నల్లమందు వేసుకునే అలవాటుంది. ఆయన నల్లమందుకి, తిండికి, బట్టకి కావలసిన పైకం అందేటట్టు ఏర్పరచాలి.

ఇంతవరకూ పగటి పూట భోజనం తప్ప మిగతావన్నీ నేనే భరిస్తూ వచ్చాగదా! నాకే కనుక స్తోమత ఉంటేనా ... అయినా దస్తావేజులో రాసిన షరతులో ఆ విషయమూ ఉంది.''

''అంటే నీ అంచనా ప్రకారం అందరూ ఎంతెంత ఇవ్వాలని ?... ''అని కీవరీతు ప్రశ్నించాడు.

''ఆఁ ... ఎంత ... ఎక్కువేంకాదు. తలో పాతికరూపాయల వంతున వేసుకుంటే చాలు.''

కుయుచ్చెరుక్కాను వేళ్ళమీద లెక్కపెట్టి,- ''అయిదు -పాతికలు—నూటపాతిక, భేష్, ఇంకేం, ఈ దెబ్బతో నీ ఖర్చు గూడా గడిచి పోతుందిలే... అన్నాడు.

ఆ మాటనే సరికి మాత్తుకుట్టి అమాంతం లేచాడు. కుయుచ్చెరుక్కాన్ని వేలితో హెచ్చరిస్తూ ''మాటలు జాగ్రత్తగా గానీ..., ఒకరి దయా ధర్మ బిచ్చంతో బతకాల్సిన ఖర్మ నాకేం లేదు. నా కొడుకు ప్రతినెలా,- నెల తిరిగే సరికి యాభై రూపాయలు పంపుతాడు. నాకదే ఎక్కిడక్కిను. నా తండ్రిని కూలో నాలో చేసి మరీ పోషించు కుంటాగానీ, ఊరుకుంటానా ... హొదులుకుంటానా?''

పెద్దవాడు మధ్యలో కల్పించుకుని - ''ఒరే మాత్తుకుట్టీ ! మరీ అంత తల బిరుసుగా మాట్లాడకు.

కుయుచ్చెరుక్కాను అన్నదీ నిజమే—,

ముసలాయన కేవిటి ... మనవలూ వాళ్లు ఊళ్లనుంచి సెలవలకని వచ్చినప్పు డల్లా దుప్పటో—, ధోవతో తెచ్చి ఇవ్వడం, అయిదోపదో చేతిలో పెడుతూ ఉండటం జరుగుతూంటుంది గదా... మనవరాళ్లు అత్తవారింటి నుంచి వచ్చినప్పుడు -వాళ్లు ... అదీ యిదీ... ఏదో యివ్వడమూ కద్దు. ఇహపోతే ఆయన తినే పట్టెడు మెతుకుల కోసం తలో పాతిక రూపాయలు వేసుకోవాలా యేం ?"

అనడంతో కుయుచ్చెరుక్కాను పక్షం మరింత బలపడింది.

''ఉన్నమాటంటే ఎలా విరుచుకు పడుతున్నాడో చూశార్రా?'' అన్నాడు.

''పోనీ మీలో ఎవరైనా నాన్నని తీసుకువెళ్ళి ఉపచారం చెయ్యండిరా...''

''ఉన్న పళాన చెప్తే ఏం చెయ్యగలం? అయినా ఇంతకాలం ఆయనకు ... నువ్వూ ... ఉన్నవీ లేనివీ అన్ని నూరిపోసి పైగా ... అసలెవర్నీ లెక్క చెయ్యక ఎక్కడలేని దిలాసాతో ఉండి ...''

ఆ మాటనేసరికి మాత్తుకుట్టికి అంతులేని రోషం పుట్టుకొచ్చి—,

''ఇదుగో మీకే చెప్పేది... అశక్తుడై పడున్న నా తండ్రిని ఇకమీదట ఏమన్నా అన్నారో... జాగ్రత్త. మీరేం యివ్వనూ వద్దు ... పెట్టనూ వద్దు... పోండిరా పీడ ...కన్న తండ్రిని ఉసురు పెడితే ఆ పాపం ఏడేడు తరాల వరకు శాపంగా పట్టి పీడించకపోతే చూడండి....''

కుయుచ్చెరుక్కాను యికిలిస్తూ వెటకారంగా—," ఆయన వాడొక్కడికే తండ్రిరా ...మనకి కాదు కాబోలు ...'' అన్నాడు ఇంత రగడ జరిగిన తర్వాత ఫిలిప్పోసు

అప్పుడిక పర్సుతెరిచి పదిరూపాయల నోట్లు ...వో పది తీసి,-అందరికి చూపిస్తూ తండ్రి తలకింద పెట్టాడు. "ప్రస్తుతం వాడుతూండు. నాన్నకే అవసరం వచ్చినా కాకిచేత కబురు పంపినా చాలు... కావాలిసినవన్నీ యిచ్చి పంపుతా'' నన్నాడు.

వాకిట్లోకి వెళ్లాడు. సైకిలు స్టాండు తీసి ముందుకు దాన్ని నడిపించుకుంటూ-'' ఉచ్చ నీచాలు తెలీని మూర్ఖుడు.-అంటూ గొణిగాడు

కుయుచ్చెరుక్కను ఏదో అనబోయాడు కానీ,- ఫిలిప్పోసు సైకిలెక్కి తుర్రుమన్నాడు.

మరికొంతసేపైన తర్వాత కీపరీచ్చను_ కుయుచ్చెరుక్కను తండ్రితో- వెడుతున్నామని చెప్పి ఇళ్లకి బయల్దేరారు.

కిళ్కి కొట్టు అవరాసు ఏదో వ్యవహారం కోసం మాత్తుకుట్టిని తీసుకువెళ్లడానికి వచ్చాడు. మాత్తుకుట్టి అతడివెంట వెళ్ళాడు.

కుయప్పి దీనామ్మ దగ్గరకు వెళ్ళి -"వెడుతున్నా పిన్నీ! శనివారం వస్తారే ... ఇప్పుడిక వంతులు వచ్చిందాలకి పోతే ఎలా ... తాతయ్య ఖర్చుకి కావలసిందేదో సర్దుబాటు చేసుకోవాలి గానీ ..." అన్నాడు.

''నాయనా కుయప్పీ ఏం చెప్పమంటావ్ ? మీ బాబయ్యల సంగతి నీకు తెలుసుగదా ? అసలీ పెటకం యిప్పుడు పెట్టొద్దని ఈ మనసతో మరీ మరీ చెప్పా.

ఇంతకంటె ముమ్మరమైన పరిస్థితి వచ్చినప్పుడే,— ఆఖరికి మీ నాన్నకు గూడా ఖబురు పంపలేదు...''

" నా కంతా తెలుసు పిన్నీ !''

కుయప్పి తాతగారి మంచం దగ్గరికి పోయి నిలబడ్డాడు.

'తాతయ్యా' అంటూ పెద్దగా పిలిచాడు.

''ఎవరు ?''

''నేను ... కుయుప్పిని... ''

''ఊ... వెళ్ళిరా... బాబూ.''

''తాతయ్యా ! నాతో మాయింటికి రారాదూ ? పోదాం...''

''ఇప్పుడు కాదులేరా అబ్బీ !''

''ఇప్పుడు కాకపోతే ఎప్పుడేనిటి ?"

''నా బట్టలు చాకలికి వేసుకున్నారా: ఇంకా తేలేదు.''

కుయప్ప ఏవిటన్నట్టు దీనామ్మ వంక చూశాడు.

"అప్పుడప్పుడు ధోరణంతేలే... ఏమీ గుర్తుండదు..." అంది మెల్లిగా దీనామ్మ.

"మీ చెల్లెలి మామగారి వొంట్లో ఎలా ఉందిరా ?"

"అలాగే ఉంది."

"ఆయన నాకంటే పదినెలలు చిన్నవాడు... "

"తాతయ్యా నేవెళ్ళొస్తా... ఆఫీసుకు వెళ్ళాలి."

"ఆఁ... వెళ్లు..."

"శనివారం వస్తా .... "

"మంచిది."

ఆయన కళ్లు కుయప్పినే చూస్తున్నాయి. ఆ నెమ్మది, పనిపాటల్లో ఆ చాకచక్యం అచ్చం తండ్రే...

కుయోమా జీవించి ఉన్నట్టయితేనా – వీళ్లందరి నోళ్లు కట్టుబడి ఉండేవి కావూ ? వాడు లేకపోబట్టే వీళ్ళంతా బరితెగించి పోయారు. వాడు యెహోవా వరప్రసాదమేనని పొంగిపోయా . కేవలం ఇరవై యేళ్లవాడు.... రొమ్ము విరుచుకుని వీధివెంట నడిచి వెడుతూంటే... ఎంత మూడముచ్చటగా ఉండేదో...

"కుయెన్నా ! నీ శరీరపుష్టి అదీ... నీ పెద్ద కొడుకొక్కడికే దక్కిందిసుమా అంటూండేవాడు చాకో.

కానీ ప్చ్.... ఏం ప్రయోజనం? అకాలంలోనే ఆ యెహోవా వాణ్ణి యెత్తుకుపోయాడు గదా! ఇచ్చిన వాడూ వాడే ... పుచ్చుకున్న వాడూ వాడే ... వాడూ పుణ్యాత్ముడే ...

'కీచ్చేరి'–చేరో వులయకారివాళ్లు సాగుచేస్తున్నారట ... వీడేమో చేనిగట్టున నిలబడి చూస్తున్నాడట. అంతలో గుండెలో నొప్పిగా ఉన్నట్టనిపించి నేలమీద చతికిలబడ్డాడట ... అని కొందరంటారు, యింటికి తెచ్చారు ... తెచ్చేసరికే ప్రాణంపోయింది.

ఆ నాయరు వాళ్లతో జరిగిన పోట్లాటలో దెబ్బలు తగిలాయి. అందువల్లనే అలా అయిందని .... అంటారు మరి ?

తన తమ్ముళ్లని వాళ్లు పైన బడి చావగొడుతూంటే,– తప్పించడానికి పోయి మధ్య చిక్కుకున్నాడని,– వాసుకురుప్పేమో ఇనప గూటంతో మోదాడని,- అంతే .... అప్పటికప్పుడే ముఖకవళిక మారిపోయిందని.... చెపుతారు....

వాడు సౌలు ... అతని పరివారంతో పోరాడిన దావీదు లాటివాడు సుమా ?

సౌలు వెయ్యిమందిని కొడితే దావీదు పదివేల మందిని చితగ్గొడిచేవాడు .... ఆనాడు పరువు నిలిపిన వాడు అతగాడే.

కుయోమా పోయేనాటికి కుయప్పి పది పన్నెండేళ్లవాడు .... వాడికో యిద్దరు చెల్లెళ్లు. వాడి తల్లి ఆ పిల్లల్ని పెంచి పెద్దచేసేందుకు నానా తిప్పలు పడ్డది. చేతిలో మరీ యేమీ లేనప్పుడు ఈ గుంటడిని యిక్కడికి పంపించేది.

వేలెడంత ఉండేవాడు కాడు... గానీ ... ఎంత అభిమానమో... పాపం... వాడి తల్లీ అదే తీరు.

వారానికి వారం వస్తులున్నా.... మాట పెదవి దాటేది కాదు. వీడు గుమ్మం లోకి వచ్చినిలబడే వాడు ... అమ్మ పంపించిందనే వాడు.

నేను... కవ్వించడానికన్నట్టు.... మీ నాన్న నాకేం యిచ్చిపోలేదురా అనేవాణ్ణి.

మెదలకుండా చక్కాబోతూండేవాడు.

పోతున్నవాణ్ణి ... మళ్ళీ ....'ఇలా రారా'-అని పిలిచేవాణ్ణి.

అడిగిందేదో యిచ్చి పంపుతూండే వాణ్ణి.

వాడి నడక గూడా-ఆ తండ్రి నడకే... తండ్రి నోట్లోంచి ఊడి బడ్డాడు.

వాడికి నేనంటే ప్రాణం.

ఇప్పుడు వీడూ ... వారానికోరోజు చేపలు మాంసం వండించి సుష్టుగా భోజనం పెడుతూంటాడు. బట్టా పాతా కొనియిస్తూంటాడు. వాడసలు 'తాతయ్యా' అని పిలవడంలోనే ఒక మాధుర్యం ఉంది.

"ఒరే,— నీ అత్తవారు నీకు అయిదువందలు బకాయిపడ్డారు గదా .... ఇచ్చార్రా ?"

"మాట్లాడవేరా ?

బెల్లం కొట్టిన రాయల్లే ఊరుకున్నావేరా ?"

అంతలో దీనామ్మ వంటింట్లోంచి వస్తూ... "మావయ్యా ! ఎవరితో మాట్లాడుతున్నారు ?"

"ఇంకెవరితో... వాడితోనే... కుయప్పితో.. "

"కుయప్పి యిక్కడ్నించీ వెళ్లి రెండు గంటలసేపయింది. మీతో చెప్పే వెళ్ళాడుగా ?"

''ఔనౌను .. ''

''అంబలి తెచ్చిపెట్టనా ? ''

''కొంచెంసేపు పోనీ ...''

''నిద్ర పోకండి .. కునుకుపడితే చాలు ... నోరు మూతపడకుండా ఒకటే ధోరణి ''

''అమ్మా ! ''

''ఏవిటి ? ''

''చూడు : —'వివేకవంతుడైన పుత్రుడు తండ్రిని సంతోష పరుస్తాడు. బుద్ధిలేని కుమారుడు తల్లి దుఃఖకారకుడౌతాడని' నీతిసుధలో 90 అధ్యాయంలో మొదటివాక్యం .. నువ్వు చదివావా తల్లీ ?''

''ఏమో గుర్తులేదు. ఇప్పుడయినా ఆ ప్రసక్తి ఎందుకు ?''

"అహఁ .... ఏం లేదులే .... కుయోమా విషయం జ్ఞాపకమొచ్చింది, వాడు నామాట కాదని కుయప్పి తల్లిని పెళ్ళాడాడు. నీకా సంగతి తెలుసా ?

ఎందుకు తెలీదు .... ? ఇప్పటికి మీరావిషయం ఎన్నిసార్లు చెప్పారో... వింటూ కూర్చోవడానికి నాకు తీరిక లేదు. 'చిన్న' బడినుంచి వచ్చే వేళయింది.''

పెద్దయిదేం కాదనుకో ... నాకేమిటంటే- నేను ఏన్నిక చేసిన పిల్లనే నాకొడుకు పెళ్ళిచేసుకోవాలని నా పట్టుదల. ఒకనాడైతే- 'ఒరేయ్ నువ్వు నా కొడుకువే కావు .... ఎలా పోయినా సరే పో'—అనేశాను.

అర్థం పర్థం లేని మాటలు .. లేకపోతేయేవిటి...

దావీదు కుమారుడు సొలొమోను ఏవంటాడో తెలుసా—''నాకు అంతుచిక్కని విషయాలు — నాలుగు: అవి—, ఏవంటే,—'' అంతరిక్షంలో పక్షిరాజు జాడ,— బండ మీద సర్పము పాకిన జాడ,— నడిసముద్రంలో ఓడ నడిచిన జాడ,— కన్యకతో పురుషుని జాడ,—ట

వాడు వాళ్ళ పెద్దమావయ్య యింట ఉండగా ఆ పిల్లదాన్ని చూడటం తటస్థించింది. ఆ పిల్లది వాడికి నచ్చింది. పిల్లకేం ఏ వంకా లేదు ... నిక్షేపంలాటి పిల్ల. మంచి కుటుంబంలో పుట్టింది: నా పంతమల్లా ... వాళ్ళ మావయ్య కుదిర్చిన సంబంధమనే గానీ...

ఎందుకంటే ఆ రోజుల్లో వాళ్ళకీ నాకూ .... అంతగా సరిపడేది కాదు.

ఏమైతేనేం... పెళ్ళయిపోయింది. దైవభక్తి — పాపభీతి ఉన్న పిల్ల. వాడికెంతో చేదోడు వాదోడుగా ఉండేది. ఆ యింటికి దీపమల్లే ఉండేది.

వాడేమంత సంపాదన పరుడు కాకపోయినా పరువు మర్యాదలకి లోపం రానీయలేదు ... యింట సుఖ శాంతులకు లోటు రానీయ లేదు.

వాడి భార్య గూడా.... దాని కడుపు చల్లగా,- తనగన్న వాళ్ళన్నా,—.... తన తల్లీతోడూ అన్నా ప్రాణంగా ఉండేది. తల్లిదండ్రుల్ని గౌరవించేవాళ్ళకి,- తోడబుట్టిన వాళ్ళంటే ఆపేక్ష పడే వాళ్ళకి, దైవభక్తిగల వాళ్ళకి, ఎన్నటికీ హాని జరగదు. యెహోవా వాళ్ళ తప్పుల్ని మన్నిస్తాడు.

యెహోవా ఒకప్పుడు దావీదును క్షమించాడు: దావీదు చెయ్యరాని నేరం చేశాడు.

ఒకనాడు ప్రొద్దుగూకే వేళ దావీదు మేడమీద పచార్లు చేస్తూ- చేస్తూ, స్నానం చేస్తూన ఒక స్త్రీని చూశాడు

ఆవిడ సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు,

దావీదు సేవకుల ద్వారా.... ఆవిడ ఊరియా అనే ఒక సైనికుడి ఇల్లాలని, పేరు బత్షెబా అని ,... తెలుసుకున్నాడు. ఆవిణ్ణి మహల్లోకి రప్పించాడు. కొంతకాలం ఆవిడతో గడిపాడు. మళ్ళీ ... ఆవిడ యింటికి ఆవిణ్ణి పంపించేశాడు.

తర్వాత ఆవిడ గర్భవతి అయింది. గర్భవతినయ్యానని బత్షెబా దావీదుకు కబురు పంపింది, అప్పుడు దావీదు తక్షణమే ఊరియాను రణభూమినుంచి పిలిపించి, యింటికి పోయి బడలిక తీర్చుకోమని సహా చెప్పి సెలవిచ్చి పంపాడు. ఎందుకంటే— తన మీద నెపం లేకుండా చేసుకోవాలని, —ఆవిడ గర్భానికి కారకుడు ఊరియాయే అని పించాలని .... ఎత్తువేశాడు.

కానీ ... ఊరియా మాత్రం తన యింటికి పోలేదు. పోకుండా రాజసేవకులతో పాటు రాజభవన ద్వారం దగ్గరే పడుకున్నాడు అప్పుడు ఈ సంగతి తెలిసి దావీదు వాడికి బాగా సారాయి పోయించి, మత్తెక్కించినప్పటికి —, వాడు యింటికి పోలేదు .. భార్యను చూడటానికి యిష్టపడనూ లేదు.

చిట్టచివరికి — దావీదు యుద్ధం మోపుగా జరుగుతున్న చోటికి ఊరియాను పంపి చంపించేశాడు.

ఆ తరువాత దావీదు బత్షెబాను భార్యగా స్వీకరించాడు. యెహోవా దావీదుకు దండన విధించాడు. కఠిన శిక్షవేశాడు. తనవల్ల బత్షెబాకు పుట్టిన కొడుకుని దావీదు

చంపించాడు. తనకొడుకైన అబ్షాలోముకి భయపడి ఎడారిలోకి పారిపోయాడు, అయితే యెహోవా దావీదుని సర్వనాశనం మాత్రం చెయ్యలేదు. అతడి పశ్చాత్తాపాన్ని ఆలకించాడు, ఇశ్రాయేలుకి రాజై ఖ్యాతి పొందాడు తర్వాత దావీదు బత్షెబాలకే సొలొమోను అనే కుమారుడు కలిగాడు. సొలొమోను మహాజ్ఞాని ..

''నిద్రపోతున్నావా కుయెన్నామా ప్పిళ్ళా ?''

''ఎవరు ?''

''నేను .... శివరాం కురుప్‌ని.''

''నువ్వు యిక్కడుండటం లేదాయే ? వచ్చి అయిదారురోజులైనట్టుందే? ఇంటి కెళ్ళాను. నువ్వు దార్లో తల తిరిగి పడిపోయావని తెలిసింది... సరే,''

''ఏమిటి ?''

''అదే, నువ్వెక్కడో పడిపోయినట్టు తెలిసి .. ''

''విన్నావన్నమాట ? మంచిమాటయితే యింత త్వరగా పాకదు ''

శివరాం కురుప్ నవ్వుతో యిల్లంతా దద్దరిల్లిపోయింది.

''మంచి మాటలు విన్నప్పటికీ దుర్మార్గులైతే వాటికి పెడర్థాలే తీసుకుంటారు ... ప్రపంచం తీరెలా ఉందో చూశావా ? పాలతో నిండిన ఆవు పొదుగులోంచి,— దోమ రక్తాన్నే తాగుతుంది గానీ....''

కుయెన్నాచ్చను మొహం కొంచెం తేటబడింది. అతికష్టం మీద లేచి కూర్చు న్నాడు.

శివరాం కురుప్ పెదవుల మీద మందహాసం చిందులేసింది. ఆ దరహాసం లోంచి ఏదో రహస్యం గూడా తొంగిచూసింది.

అతగాడు ఆకు వక్క వేసుకోవడానికని నల్లుపెట్టెలాటి వో పెట్టెను రొండి నుంచి తీసి,—తెరిచాడు ఆ పెన్దానులో ఘాంభీఘుమ ఘుమలాడుతున్న పొగాకు, వక్క పొడి, —రంగు సున్నం, తాజా ఆకులు. సమస్తమూ ఉన్నాయి.

''కుయెన్నామాప్పిళ్లా..., నీకు సంస్కృతం వచ్చుటయ్యా ?''అనడిగాడు కురుప్.

కుయెన్నాచ్చను— 'అన్నీ వచ్చు అన్నట్టు తల ఆడిస్తూ,— కురుప్‌తో ''కాస్తో కూస్తో వేదజ్ఞానం ఉనవాణ్ణేనయ్యా''.... అన్నాడు.

''అయితే చూడు కుయెన్నామాప్పిళ్ళా ! వేదాలన్నీ ఒకటి కావూ ?. ఈ బైబిలు. ఖురాను,- గీతా,- ఉపనిషత్తులు.... అన్నీ ఒకటేనయ్యా.... దేవుడొక్కడే పేర్లువేరు

గానీ... అధర్మం పెరిగిపోయినపుడు- ధర్మసంరక్షణకోసమని భగవంతుడు అవతారం ఎత్తుత్తూంటాడు. దశావతారాల కథ అదేగా మరి ?

శ్లో: యదా యదాహి ధర్మస్య।
గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య।
తదాత్మానం సృజామ్యహమ్॥

పరిత్రాణాయ సాధూనాం ।
వినాశాయచ దుష్కృతాం ।
ధర్మ సంస్థాప నార్థాయ ।
సంభవామి యుగే యుగే ॥

అంటూ శివరాం కురుప్ శ్లోకాల్ని వ్యాఖ్యానించేసరికి కుయెన్నాచ్చనుకి ఎక్కడ లేని హుషారు పుట్టుకొచ్చింది.

"ఔను, ... మరే .. సొదొమ గొమొఱ్ఱాల్లో అధర్మం ప్రబలినప్పుడు యెహోవా ఆకాశంనుంచి గంధకాన్ని – నిప్పుల్ని కురిపించాడట. ప్రజల్లో పాపం మరీ పెరిగి పోయినప్పుడు యెహోవా యిద్దరు దేవదూతల్ని అక్కడికి పంపాడు. ఆ దూతలు యెహోవా దాసుడైనటువంటి లోతు యింట ఆ రాత్రి వెళ్ళబుచ్చాలనుకున్నారు. ఆ సంగతి తెలిసి కొందరు దుర్మార్గులు అ యింటిని చుట్టుముట్టి లోతుని పిలిచి— ఈరాత్రి నీయింటికి వచ్చిన మనషులేరి... ఎక్కడ ? వాళ్ళని బయటికి తీసుకురమ్మని దౌర్జ న్యంగా అడిగారు. అప్పుడు లోతు వాళ్ళతో —నాయన్లారా ! యింత పాతకానికి వొడి గట్టకండి. ఇదుగో... పురుషుని కూడని యిద్దరాడపిల్లలు నాకున్నారు. వాళ్ళని బయ టికి పిలుస్తాను. వాళ్ళని మీ మనసొచ్చినట్టుచేయండి. అంతేగానీ,— ఆ మనుషుల జోలికి పోకండి.

ఎందుకంటే,— వాళ్లు నా యింట తలదాచుకుందుకు వచ్చిన వాళ్లు.

.... ...పాపానికి వొడిగట్టిన ఆ ఘటాలు అంత తేలిగ్గా వింటారా ! ఆ పళాన దేవదూతలు వాళ్ళని గుడ్డివాళ్లగా చేసేశారు.

లోతుని అతని బలగాన్ని యెహోవా- మీరు పారిపోయి మీ ప్రాణాలు దక్కించు కోండి.... వెనక్కి తిరిగి చూడకండి... అని హెచ్చరించాడు,

వాళ్లు అలాగే పారిపోయారు. కానీ లోతు భార్య మాత్రం వెనక్కి తిరిగి చూసింది. ఉప్పుస్తంభంగా మారిపోయింది. యెహోవా... ఆకాశాన్నుంచి గంధకము... నిప్పులు కురిపించి యావత్తు పట్టణం నాశనం చేశాడు.

లోతుసోయరు నగరానికి చేరాడు. అక్కడి నుంచి వో కొండ మీదికి పోయి, ఆ కొండ గుహలో తల దాచుకున్నాడు. అప్పుడే అతడికి తన కూతుళ్ళ ద్వారా సంతానం కలిగింది.: ''

''ఆదెలా ? అదెలా ? సంభవం ? ''

కుయెన్నాచ్చను తన పాటికి తను కథచెప్పుకు పోవడం మొదలెట్టాడు.

శివరాం కురుప్‌కి ఉన్నట్టుండి ఏదో గుర్తొచ్చి అడిగాడు:

''ఏవిటి.... యింట్లో యెవరూ లేరాయేం ?''

''లేకేం.... అంతా ఉన్నారే....''

కురుప్ ఊరుకోక మరింత గట్టిగా అన్నాడు—

''అదేవిటంటాతే .. యింటికెవరైనా వచ్చినప్పుడు కమ్మగా నాలుగు ముక్కలు మాట్లడరేం... '' అంటూండగా — దీనామ్మ గుమ్మంలోకి వచ్చి,—

''ఏం మావయ్యా మాటలు చేదుగా ఉన్నాయా ?'' అనడిగింది.

''ఆది కాదు...''

''ఆది కాదేవిటి ? మగవాళ్లు ... మగవాళ్ళతో మాట్లాడిపోతారు గానీ,—''

''ఒప్పుకున్నాను... ''

''ఒప్పుకోవడం - ఒప్పుకోక పోవడం కోసం కాదు . మేమూ శ్రీ మంతులం కాకపోయినా, యింటికి వచ్చిన అతిథులికి ఆతిథ్యం యివ్వాలని తెలుసు.... మర్యాద నిలుపుకోవడమూ తెలుసు, ఇంతకూ కురుప్‌గారూ యిప్పుడు మాయింటి అతిథులన్న మాట .. '' అంటూదీనామ్మ లోపలికి చక్కాబోయింది.

సాంప్రదాయికమైన కుటుంబంలోంచి వచ్చిన పిల్ల లక్షణమదే ! మాట మర్యాద అణకువ అన్నీ దీనామ్మలో తగు పాళంలో ఉన్నాయి సుమా అనుకున్నాడు మనసులో కుయెన్నాచ్చను.

కురుప్ మాటపరసకన్నా,- దీనామ్మ మాత్రం కాఫీ చేసి రెండు గ్లాసుల్లో పోసి తెచ్చింది.... పాలు పొయ్యకుండా....,

''పాలు పొయ్యకుండా తెచ్చా .... మావయ్యకు పాలు లేకుండా తాగడమే

యిష్టం ... కురుప్‌గారూ ! మీరు యిక్కడ ఈ డికాక్షను తాగి, యింటికి వెళ్ళి కాసిని పాలు తాగండే.... సరిపోతుంది'' అంది.

కురుప్ పెద్దపెట్టున నవ్వాడు.

''ఆ(.... చాలు, దొరికిందే మహద్భాగ్యము.... కాఫీ తాగుతూ కురుప్ మళ్ళీ ఆ వెనకటి కథ గుర్తు చేశాడు— కుయెన్నాచ్చనుకి.

''కుయెన్నామాప్పిళ్ళా ! కథయింకా పూర్తిగా చెప్పలా....'' అన్నాడు.

''ఏవిటి ?''

''కథ—''

''ఔనౌను ... లోతు ఆయన కూతుళ్ళు గుహలో ఉంటున్నారని చెప్పాగా ?

అప్పుడు పెద్దదేమో చిన్నదానితో అన్నదిగదా - మన తండ్రి ముసలివాడు.

లోకాచారం ప్రకారం మననే మొగవాడు కోరలేదు కాబట్టి మనం మన తండ్రి వల్లనే సంతానవతులం అవుదాం పదమంది. ఆయన చేత బాగా ద్రాక్షరసం తాగించి,— పెద్దకూతురు పోయి ఆయనతో శయనించింది.

ఎప్పుడు శయనించిందో - ఎప్పుడు లేచిపోయిందో అతగాడికి తెలీలా.

అదే విధంగా చిన్నది చేసింది. ఆతర్వాత వాళ్ళిద్దరు తండ్రి వల్ల గర్భవతు లయ్యారు. కొడుకుల్ని కన్నారు. వాళ్లే మోయాబీయులు— అమ్మోనీయుల మూల పురుషలు. ఆ వంశాలు ఆ విధంగా ఏర్పడ్డాయి.

ఈ కథంతా పరిశుద్ధగ్రంథం—ఆదికాండంలో ఉంది.''

కురుప్ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వాడు.

కుయెన్నాచ్చనుకి హుషారు మరింత హెచ్చింది— కథలు చెప్పి కడుపుబ్బ నవ్వించడంలో తనంత వాడు లేదని ఆయనకో గర్వం.

కురుప్ మొహం ఎంత లక్షణంగా ఉంటుందని నొసట గంధం బొట్టు. చెవిలో తులసిదళం ... పుష్టిగల ఆకారం ఆరమ్ముల్లా గ్రామ వాస్తవ్యులైన నాణు నాయరు కూతుర్ని వివాహం చేసుకున్నాడు. అప్పుడెంత దార్ఢ్యమో... ఇప్పుడూ అంతే. నాణు నాయరు అపకతవక వల్ల ఆ సంబంధం తెగిపోయింది. తర్వాత సంతోషం కేశవన్నాయరుకి అల్లుడయ్యాడు. ఆవిడ నడత అంతమంచిది కాకపోవడంతో—, కొద్ది రోజులేమన్నా కాపరం చేశాడేమో... ఆవిణ్ణి వొదిలేసి,... హాయిగా వొంటరిగా ఉన్నాడు, షణ్ముఖం పిళ్లై కిరాణా కొట్లో గుమాస్తాగా ఉన్నాడు. ఇల్లు అద్దెకు తీసుకుని — అందులోనే వండు

కుని తింటూ ఉంటాడు.

''భలే కథ ... అయితే నిజంగా ఆమునలాడికి తెలీనే తెలీదా ?''

''ఏమో మరి ... జరిగిన కథ ఆది ... కనుక నమ్మాల్సిందే. ఆ సంగతలా ఉంచు ... చెపుతా ... మా కుయుప్పోత్తా కొడుకు మిలిటరీలో ఉన్నాడా ? వాడికి విమానాలు నడిపే పని. ఎయిర్ ఫోర్స్ !''

''అవును ... అదే వాడు ఈ ప్రదేశాలన్నీ చూశాడుట.''

'' ఆఁ ... ఆఁ ... చూసి ఉండొచ్చు. నమ్మకాలనేవి చిత్రంగా ఉంటాయి.''

''హిందూపురాణాల్లో విన యకుడు,— శాస్తా మొదలైన వాళ్ల జన్మ కథలన్నీ గూడా విచిత్రంగానే ఉంటాయి సుమా ! తెలుసా ... ఆ కథలు ?'' అంటూ కురుప్ ఆ కథలు మొదలు పెట్టి చెబుతూ ఉండగా,—

మాత్తుకుట్టి వచ్చాడు.

''ఓ .... ... నువ్వా ?''

''ఎప్పుడింటికి వచ్చినా నువ్వుకనబడవే కనబడవ్,... అందుకే, .... ఎలాగూ వచ్చాగదా అని ... ఈ కుయెన్నామాప్పిళ్లతో కూర్చుని కబుర్లు చెపుతున్నా,''

''ఊఁ .... నాన్నకి వొంట్లోయేం బాగుండ లేదు ..''

''... అనే విన్నాను.''

వొళ్లు బావుండదని తండ్రి చెతికింద జేరి మాట్లాడుతూ విసిగించ వద్దన్నట్టు మాత్తుకుట్టి మాట తీరునిబట్టి కురుప్ గ్రహించాడు

పాన్దాను తెరిచి .... కాస్త ఆకు వక్క వేసుకుని లేచాడు.

''కుయెన్నామాప్పిళ్ళా !''

''ఊఁ.''

''సరుకు రేపు తెస్తా.''

''ఏవిటి ?''

''అదే నల్లమందు .... రేపు పట్టుకొస్తా. దొరకడం కష్టంగా ఉంది. ఒకరిద్దరు వైద్యులకి గూడా చెప్పి ఉంచా .... వాళ్లేమో .... తీరా పోయి కనుక్కుంటే,— మందుల్లోకి వాడేశామన్నారు. మరోచోటెక్కడైనా ప్రయత్నం చేసి చూడాలి ఏది యేమైనా రేపు తెస్తా. వస్తానయ్యా మాత్తుకుట్టి !''

''మంచిది,''

కురుప్‌వెళ్ళిపోయిన తర్వాత మాత్తుకుట్టి యింట్లోకివెళ్ళి దీనామ్మతో— నేను సాయంత్రం తిరువనంతపురం వెడుతున్నా. బహుశా రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాలే— అన్నాడు.

''తిరువనంతపురంలో అంత ముఖ్యమైన పనేవిటి ? ఊరికే,— ఊరుచూసేందుకే అయితే నేనూ వెంట వస్తా. ఇప్పుడు మావయ్యని చూస్తామంటున్నవాళ్లు చాలా మందే బయలుదేరారు కనుక ఆయన్ని వాళ్లకప్పగిద్దాం ..." అంది.

''ఊరు చూడటానికి వెడుతున్నానా ? మంచిమాటే. వారుమీ వాళ్ల దేనియలు కొడుక్కి— ఉద్యోగం కోసమని పోతున్నా.''

''ఎప్పుడూ పొరుగింటి వాళ్ల అబ్బాయికి ఉద్యోగమో,— ఇరుగింటి వాళ్ల పిల్లకు పెళ్లి సంబంధమో కుదర్చడమేగా మనపని ? అదీ యిదీ కాకపోతే,— పాదరీల తగాదాలు. వ్యాజ్యాలూ ఈ తిరుగుళ్ళవల్ల మనకేమైనా కించిత్తు లాభముందా చెప్పండి?''

''చేసే ప్రతి పనిలోనూ లాభనష్టాలు ఎంచుకుంటూ కూర్చుంటాము టే?''

''అన్నిటిమాట అలా ఉంచండి. నో యిల్లూ, వాకిలీ, బరువు బాధ్యతలంటూ మన నెత్తిమీద ఉన్నప్పుడు—ఎంత సేపు ఊళ్ళోవాళ్ళ బాగుబోగులకోసం పాకులాడటం సబబా చెప్పండి?''

''భేష్...ఇంటి వాళ్లకే చెయ్యాలి..., ఇంటినే అంటి పెట్టుకుని ఉండాలంటావ్?''

''చెప్పడం నాపంతు కనుక చెప్పా.''

మాత్తుకుట్టికి గూడా అదే సబబనిపించింది. తను చేస్తూంది పొరబాటే అనిపించింది. తను ఊళ్లో ప్రముఖుడు...కార్యశూరుడు కావచ్చు.

ఇంటిజోలి పట్టించుకోవడానికే తనకు తీరికలేకుండా ఉందే! వయసులో ఉన్న తన యిల్లాలితో నవ్వుతూ తుళ్లుతూ కాసేపు కులాసాగా ముచ్చట్లు చెప్పుకోవడానికే తనకి తీరుబడి లేకపోయే. దీనామ్మకి ఇరవై ఎనిమిదేళ్లు. మాత్తుకుట్టికి నలభై యేడేళ్లు.

చటుక్కున గుర్తొచ్చింది. వాళ్లకో ఆడపిల్ల...అదీ కాస్త ఎదిగింది. ఇప్పటికే దీనామ్మ రవ్వంత ముస్తాబు చేసుకుందంటేనా ఎంత బావుంటుందో! ఆ ఊళ్లో ఉన్న ఆడవాళ్లంతా దీనామ్మ ముందు బలాదూరనే చెప్పాలి. ఇవన్నీ వొకటొకటిగా అతనికి జ్ఞాపకానికి వచ్చాయి. అయినా ఊళ్లో వ్యవహారాలు బోలెడన్ని చక్కబెట్టాల్సి ఉండె.

మొదటి భార్య కొడుకు సైన్యంలో ఉన్నాడు. నెల నెలా నలభయ్యో—యాభయ్యో పంపుతుంటాడు. అందువల్ల కష్టం తెలీకుండా రోజులు గడిచిపోతున్నాయి.

మాత్తుకుట్టి వెళ్ళబోతూండగా దీనామ్మ—రాజన్ స్నేహితుడికి వచ్చే వారంతో సెల వలై పోతాయి...వెళ్ళిపోతాడు గదా—ఆ పిల్లాడిచేత రాజన్‌కి పంపించాల్సిన వేమైనా ఉన్నాయా అనడిగింది

"ఆఁ...ఉన్నాయి."

"అయితే ఏమేం పంపాలో ఏవిటో చూసి పెడితే సరిపోతుందిగా?"

"నేను రెండు మూడు రోజుల్లో వచ్చేస్తానని చెప్పానా? అక్కడే ఉండిపోను గదా?..." అంటూ మాత్తుకుట్టి గడపదాటి వెళ్ళిపోయాడు...

దీనామ్మ అతడు వెళ్లినవేపే చూస్తూ ఉండిపోయింది.

# మూడు

కాలిబాట :

ఆ బాటకి రెండు వైపులా అడవి అనాస పొదలు.

ఎవరైనా ఆ పొదలచాటున నక్కిదారినపోయే బాటసారుల్ని చావా చితకాకొట్టినా అక్కడ దిక్కూ మొక్కూ ఉండదు.

శేఖరం నాయరు అతగాడి అనుచరులు కుయోమా మీద పగబట్టారు. వాడు కనబడితే చాలు ఖూనీ చేసేస్తామని బెదిరించారు.

అసలు వాడే తాలింఖానా సరుకు. ఎవడైనా వాణ్ణి ఎదిరించాడో దెబ్బకి ఎగర గొట్టాడే.

ఎవడొస్తే రానీ...అనే రకం...

విచ్చుకత్తి పుచ్చుకుని సిద్ధమే...

ఎవరైనా చూస్తే ఏమీ ఎరగని నంగనాచిలా—గోళ్లు తీసుకుంటున్నట్లో...వక్క నలక్కొడుతున్నట్లో నటించేవాడు.

ఊరు ఊరంతా మూకఉమ్మడిగా వచ్చిపడ్డది. ఆ మూకకి నాయకుడు

శేఖరం నాయరు.

వెనకటికి— ఆరాము రాజు బెన్హదదు తన గుర్రాల్ని, రథాల్ని—ముప్ఫయి యిద్దరు సామంతుల్ని—తీసుకుని ససైన్యంగా ఇశ్రాయేలు పాలకుడైన ఆ హాలు మీదికి దండెత్తి పోయాడు.

అప్పుడు యెహోవా ఆహాబుతో—ఈ గొప్ప దండునంతా నీ కప్పజెపుతా నన్నాడుట. అన్నట్టే ఇశ్రాయేలు ప్రజలు ఆరాము రాజు గుర్రాల్ని, రథాల్ని చేజిక్కించేసుకున్నారు.

తాతయ్యా!

''ఊఁ...ఊఁ''

''నిద్రపోతున్నావా?''

''లేదు...లేదే...''

''మరి ఎంత పిలిచినా పలకవేఁ?''

''నువ్వెప్పుడొచ్చావే అమ్మా?''

''చాలా సేపయిందిగా.''

''మీ ఆయనెక్కడే?''

... ... ... ...

''పిల్లల్ని విడిచిపెట్టి వచ్చావాయేఁ?''

సిసిలీ తాత మొహం వంక రెప్ప వాల్చకుండా చూసింది. ఎక్కడలేని భయం వేసింది...'అమ్మా!' అంటూ కెవ్వున కేక పెట్టింది. ఏవిటే తల్లీ!—అని దీనామ్మ ఒక్క పరుగున వచ్చింది.

''అమ్మా మరే...ఈ తాతయ్య చూడమ్మా...ఊరికే నన్ను ఝడిపిస్తున్నాడు''—అంది.

''అఁ...ఝడుసుకున్నావా అమ్మా!''

''ఔనమ్మా. కళ్లు మూసుకుపడుకుని—'మీ ఆయనెక్కడే'—అనడుగుతున్నాడమ్మా.''

దీనామ్మ ఫక్కున నవ్వింది.

''తాతయ్య నల్లమందు వేసుకున్నారు కాదూ...అందుకని...ఆ మగత...''

''ఆఁ...ఆఁ...?''

''చిన్నని మీరేవిటో అన్నారుటగా మావయ్యా?''

''చిన్న వొచ్చిందామ్మా?''

''వచ్చిందిగా...దాన్ని మీరు—'మీ ఆయనెక్కడే'—అని అడిగారట...''

''అబ్బే..., అహఁ...నాకూ...కుయ్యమ్మ కనిపించిందిలే''

''కుయ్యమ్మా! తాంబూలాలైతే పుచ్చుకున్నారుగానీ ఆవిడ పెళ్ళి కాకుండానే పోయిందిటగా మరి?''

"ఏవిటి..., అది అత్తవారింటి నుంచి వచ్చినట్టు కల .. కలొచ్చింది..., అమ్మా! నువ్వు దాన్ని చూశావా తల్లీ!''

''భలేవారే.. ఎలా చూస్తాను! ఆవిడ మీ అఖరబ్బాయి కంటె నాలుగేళ్లు చిన్న దని మీరే చెప్పారుగా!

పెళ్ళికి తాంబూలాలు పుచ్చుకోగానే పోనేపోయే. అటువంటప్పుడు నువ్వు చూశావా—అంటే ఏవిటర్థం....''

''నిజమే...అమ్మడూ! అది చిన్నప్పుడు అచ్చంగా మనచిన్నల్లేనే ఉండేదనుకో.

అది పదేళ్ళపిల్లగా ఉన్నప్పుడు మీ అత్తగారు పోయింది. తల్లిలేని లోటు తెలీకుండా దాన్ని కంటికిరెప్పలా కాపాడామనుకో. అయిదుగురన్నలకు ఒక్కగా నొక్క చెల్లాయది.

అల్లారుముద్దుగా పెరిగింది.

చిన్నపిల్లని ఊరుకోకుండా ప్రతీదీ దాంతో చెప్పి సంప్రదించి మరీ చేసే వాళ్ళం... నేనూ అంతే... దాని అన్నలూ అంతే.

పదమూడు పధ్నాలుగేళ్ళు వచ్చాక- మంచిబట్టలు కట్టుకుని రవంత ముస్తాబు చేసుకుని చర్చికి వెడితే-- అక్కడ అందరికళ్ళు నా చిట్టితల్లిమీదే ఉండేవి.

మనలో ఆచారమేమిటి - ? పిల్లదానికి ఈడైన పిల్లవాడు ఉన్నాడంటే, ఆడపిల్ల గలవాళ్ళే వెళ్ళి పిల్లవాడి తరఫువాళ్ళతో మాట్లాడటం రివాజు... ఔనా !

అటువంటిది... మన పిల్లని తమ పిల్లవాడికి చేసుకోవాలని తహతహతో మనింటికి ఎందరెందరు వచ్చేవారో... ఆ! ఒకేసారి రెండుమూడు సంబంధా లొచ్చాయి.

వెయ్యిన్నొక్కటి కట్నం యిద్దామనుకున్నాం. అప్పట్లో వెయ్యిన్నొక్కటి అంటే— యిప్పుడు పన్నెండువేలకు సమానం... ఇహ ఆలోచించుకో.

ఆ రోజుల్లో మన కుయ్యమ్మ నిద్దామనుకున్న కుర్రవాడు ఏదో ఆఫీసులో చిన్న ఆఫీసరుగా పనిచేస్తూండేవాడు.

ఇప్పుడతగాడు రిజిస్ట్రారు.

నా బంగారుతల్లే కనుక బ్రతికుంటే వచ్చి నా తలాపుదిక్కున కూర్చునేది కదూ ?

భగవంతుడు దానికి అంతవరకే ఆయుర్దాయమిచ్చాడు, ఆ భగవంతుడున్నాడే... వాడు అందరికీ అన్నీ ఇవ్వడమ్మా. ఏదో వొకటి తక్కువచేస్తాడు.... తప్పదు. అట్టే చూపించినట్టే చూపించి ... మాయం చేస్తాడు.

అంతా ... మాయ ... అంతా ... భ్రమ.

మహాజ్ఞాని అయిన ప్రసంగికుడు ఏమన్నాడంటే— ఆకాశం కింద జరిగే అన్నిటిని జ్ఞానంచేత వివేచించి తెలుసుకోవాలని నా మనస్సు నిలిపాను. అంతా మాయ వ్యర్థమే ... అయినా మానవుడు కఠిన పరిశ్రమ చేయకతప్పదే ?

మానవుడు శ్రమ చేసుకుని జీవించాలని యెహోవా శాపం. అది మరి తప్పించుకోవడం సాధ్యమా ?

ప్రసంగికుడు చెప్పిందేమంటే— నేను సూర్యుని కింద వ్యర్థమైంది మరొకటి చూశాను. ఒంటరిగా ఉన్న వొకడు; అతడికి జతగాడులేడు. కొడుకులేడు. సోదరుడు లేడు, ఎవ్వరూ లేకపోయినా అతగాడు నిరంతరం శ్రమిస్తూనే ఉంటాడు. అతడి కన్ను ఐశ్వర్యం చేత తృప్తిపడదు ... అన్నాడు.''

''మావయ్యా !''

''ఊఁ.''

''ఎక్కువగా మాట్లాడకండి ... ఊరికే అలిసి పోతారు. కాసేపు మెదలకుండా పడుకోండి ... ''

''ఊఁ ''

''నే పోయి చిన్నకు అన్నం పెట్టాలి. మీకు గూడా వడ్డించమంటారా ?''

''వడ్డించు.''

''చిన్నా ! తాతయ్యతో కలిసి అన్నం తింటావా అమ్మా ?''

''ఉహుఁ''

''అదేఁ ?''

"మరైతే నన్నెందుకు భయపెట్టాలేఁ ?"

"అదా నీ కోపం ... విన్నారా మావయ్యా !"

"ఏవిటి ?"

"చిన్నకి మీ మీద కోపం వచ్చిందిట."

"అలాగా చిన్నకు గూడా కోపం వచ్చిందన్నమాట."

"నేను తాతయ్య సావాసం ఉండను పో...మా రాజనన్నయ్య మిలిటరీలోంచి వచ్చేటప్పుడు నాకు బోలెడన్ని తమాషాలు తెస్తాడుగా... నేను తాతయ్యకు ఒక్కటి కూడా ఇవ్వనుగా..."

"ఆఁ"

"అహఁ... వాళ్ళ రాజనన్నయ్య పట్టుకొచ్చే వస్తువుల్లో మీ కొక్కటి గూడా యివ్వదుట ఆవిడగారు."

"ఇవ్వదూ...! అయితే నేనేం చెయ్యాలబ్బా ?"

"దీనామ్మ కంచంలో అన్నం పెడదామని వెళ్ళింది.

అంతలో కుయెన్నాచ్చును 'చిన్నా' అంటూ చిన్నారి సిసిలీని పలకరించాడు.

'ఊఁ...' ఏవిటి తాతయ్యా ?

"ఈ తాతయ్య చచ్చిపోయాక ఎవరిమీద అలుగుతావే అమ్మడూ ?"

"ఎప్పుడు చచ్చిపోతావు ?"

"ఆ దేవుడి పిలుపు వచ్చినప్పుడు..."

"అప్పుడు కూడా నన్ను ఝుడిపిస్తావా ?"

"చిన్నా ! తాతయ్యకు వొంట్లో బాగా లేదని చెప్పాగదుటే ?"

"కలొచ్చిందా తాతయ్యా నీకు ?"

"ఔను కలొచ్చింది. ఆకల్లో నీకేమా పెళ్ళట: అంతా కారెక్కి వెడుతున్నామట,"

"అయితే నా పెళ్ళెప్పుడు ?"

"ఎప్పుడో ...... ?"

"మరైతే ఆరోజు నన్ను కూడా కార్లో తీసుకువెడతావా ?"

"ఆఁ"

"పెళ్ళినాడు నన్ను గూడా కారెక్కించి తీసుకువెడతావా ?"

కుయ్యెన్నాచ్చను ఫక్కున నవ్వాడు.

''పెళ్ళికూతురు లేకుండా పెళ్ళవుతుందిటే పిచ్చిపిల్లా? నీకు ముస్తాబు చేసి కారెక్కించి మరీ తీసుకువెడతాం...''

సిసిలీకి ఉన్నట్టే ఉండి అనుమానం వచ్చింది

తాతయ్య తన్ను మళ్ళీ భయపెడుతున్నాడేమోనని... లేకపోతే కారెక్కించి తీసుకువెడతానంటూ— నవ్వుతాడెందుకు?

''అన్నం పడ్డించా... రావచ్చు...''అంటూ దీనామ్మ కేకేసింది.'

కుయ్యెన్నాచ్చను నెమ్మది నెమ్మదిగా లేచాడు.

కర్ర పొడుచుకుంటూ నడిచివెళ్ళి, కాళ్ళూ చేతులు కడుక్కుని వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

భోజనమై లేచేసరికి 'కుయెన్నాచ్చా'— అంటూ వాకిట్లోంచి ఎవరో పిలిచారు.

ఎవరు? ... అంటూ కర్ర ఊతంతో నడిచి వచ్చి, చప్పున గుర్తుపట్టలేక పోయినా,— మనిషి చేరువకు వచ్చాక ఆనవాలు పట్టాడు... 'సత్యవాది పాప్పీ.'

''అరె ... నువ్వింకా యీ లోకంలోనే ఉన్నావన్నమాట."

''ఆఁ ... ఉన్నాననే అనుకుంటున్నా."

''నిన్న నెవరో పెళ్ళి శుభలేఖ యిచ్చేందుకు వచ్చినప్పుడు నాకు సరిగ్గా నువ్వే గుర్తొచ్చావు సుమా!''

''ఎవరొచ్చారు?''

''పొడుగ్గా తాడల్లే ఉంటాడు చూడు... మాత్తున్. ఆ మాత్తున్ కొడుకుల్లో ఒకడు... వాడే... నీకు,— మిరపకాయలు ఎండబోయడంలోగూడా సాయం చేస్తూండేవాడు... వాడి పేరేదో ఉండాలి.''

''కొచ్చోయేనా!''

''ఆఁ... వాడే... వాడే.'

'వాడి కొడుకు పెళ్ళి....''

ఆఁ... మరే, నేను వాణ్ణసలు గుర్తుపట్టలేకపోయాననుకో. వాచీ, చెప్పులు, గొలుసు, జరీ కండువా అదీ వేసుకుని ఎలా ఉన్నాడని చెప్పను?

కట్నం పదివేలట .. చెప్పాడు; కాలప్రభావం.

ఒకప్పుడు నువ్వు వాడిచేత చాకిరీ చేయించి, వాడిచేతిలో ఏ రెండు పైసలు

రాలుస్తూఉండేవాడివి, వాడి తల్లీ, తమ్ముళ్ళు తిండిలేక పస్తులుండేవాళ్ళు. మాత్రను పీకలదాకా కల్లుతాగి, తూలుతూ, పడుతూ, లేస్తూ తిరుగుతూండేవాడు.

ఎవరి అదృష్టం ఎలాటిదో... ఏం చెప్పగలం! కష్టాలూ వస్తూంటాయి... సుఖాలు వస్తూంటాయి. నాట్లు వస్తూంటాయి... కోతలు వస్తూంటాయి. అందుకనే 'కష్టసుఖాలు కావడి కుండలు'- అన్నారు. నిజమే మరి.

నువ్వా రోజుల్లో ఈశోచ్చను దగ్గర్నుంచి తిరువాదిన్నూరు డబ్బు వో పాతిక రూపాయలు అప్పు తీసుకోవడం... పది రోజులు పోయాక బ్రిటిషు రూపాయలు తిరిగి యిస్తూండేవాడివి కదూ? ఆ విధంగా యిచ్చిపుచ్చుకోవడాలు జరుగుతూండేవి... అతి నిజాయితీగా ఉండటం కూడా ప్రమాదమేనంటా.

''నిజమే నేనెవ్వరిని దగా చెయ్యలేదు ''

''ఏవిటి ?''

''నాకు వొకర్ని మోసగించడం చేతకాదంటున్నా.''

"హుఁ ... మోసం అంటే ఏవిటిట ?''

"ఏవిటి— అంటే,— ఏవిటో నువ్వే చెప్పాలి.''

"సరుకుల్లో మోసం చెయ్యడంలా ? మాటవరసకి నువ్వే ఉన్నావు. సందు మలుపులో,— వో సంచీ, త్రాసు— తక్కెడ పెట్టుకు కూర్చున్నావనుకో. పంటదారు డెవడో వోశేరు మిరియాలు బుట్టలో పోసుకుని తీసుకువెడుతూ ఉంటాడు. నువ్వేమో అతని దగ్గర మిరియాలు కొనేసి మరొకరికి అమ్మితావు సికో బేడ డబ్బులొచ్చాయి.

నిజాయితీగా బేరం చేసేవాడికైతే బేడడబ్బుల్లో నాలుగోవంతే లాభముంటుంది.

పోనీ వాడు మొదట అణన్నరే అన్నాడనుకో నువ్వు కొంటావా చెప్పు ... చూద్దాం. కొనవ్.

అర్ధణానుంచీ బేరమాడటం మొదలెడతావు. చివరికి ఏ అణాకో సరుకు పోయించుకుంటావ్. ఔనా ?

ఇది అన్యాయం కాదూ ?

వ్యాపారమంటే అలాగే చెయ్యాలి... చెయ్యాల్సిందే... నువ్వేచెప్పు. చెయ్యాల్సిందేలే ... నిజాయతీపరుడంటే— కూటికి గతిలేనివాడు. పనికిమాలినవాడు ... సాధుస్వభావం కలవాడు, అణిగిమణిగి ఉండేవాడు . మితంగా మాట్లాడేవాడూను... అంతేనా... ఏమంటావ్ ?''

''కావచ్చు''.

"లోకంలో... బతకాలంటే రవంత లౌక్యంగూడా తెలుసుకుని ఉండాలి. వేదాల్లో నిషేధించిన పన్లు చెయ్యరాదు. వితంతువులికి- దిక్కు-మొక్కు- లేనివారికి ఏ హానీ తలపెట్టరాదు. కష్టించి పనిచేయాలి సుంత నేర్పరితనం కావాలి. యుద్ధంలో కూటనీతి ప్రదర్శించడం లేదూ ? జీవితంగూడా వో పోరాటమేగా ?

సామర్థ్యం లేనివాడు శత్రువుచేతిలో వోడిపోతాడు. దాన్నే అపమానం... అపకీర్తి అంటారు కొందరు. కానీ... అది లెక్క చెయ్యరాదు.

నేను వెట్టియారు భూమినికొన్నా... దానివెనక ఎంత కథఉందో తెలుసా ?''

''ఆఁ ... ఆఁ ... ఇంతకుమునుపు ఎన్నిసార్లు చెప్పావో... ! సరే, — పోయిందేముందిలే.... మళ్ళీ యింకోసారె కానీ... ఎలాగూ నువ్వు చెప్పకుండా వొదిలి పెట్టవు... నాకు తెలుసు '' కానిమ్మన్నట్టు కొచ్చుప్పాపీ చతికిలబడి కూర్చున్నాడు.

అయితే అదివరకట్లే కథలు—కారుణ్యాలు గంటల తరబడి చెప్పడానికి తగినంత వోపిక లేదు కుయెన్నాచ్చనుకి కొంచెం మాట్లాడితే ఆయాసం వస్తుంది.

''భోజనం కాగానే విశ్రాంతి కావాలి మావయ్యకి- లేకపోతే అలసటగా ఉంటుంది. నాలుగడుగులు నడిస్తే తలతిరుగుడు...'' అంది వంటింట్లోంచి వచ్చిన దీనామ్మ.

''నాకు అలసటా లేదు... అనారోగ్యమూలేదు గాని నువ్వు లోపలికి పోమ్మా.

''నోరు మూసుకూర్చుంటే మాత్రం మనిషి నూరేళ్ళు బతుకుతాడా ఏవిటి వెర్రిగానీ ! మనమేం ఆ ఆదాములాగా 930 ఏళ్ళు బతకం గదా : ఏడాదో-ఆర్నెల్లో ఇంచుమించుగా బతకవచ్చు... బతికామే అనుకో... దానివల్ల లాభమేముంటట ? సరే పోనీ...గానీ, అన్నట్టు...చెపుతానన్నాగా... ?

వెట్టియారు గ్రామంలో చల్లమ్మకనే వో నాయరుండేవాడు.''

''తాంబూలం వేసుకుంటావా బాబాయి'' అనడిగింది దీనామ్మ.

''దానికేఁ ... ఉంటే ఇవ్వమ్మా... అయితే దాంతోబాటు అమాన్దస్తాగూడా యివ్వాలి... దంచుకోందే నమల్లేనే... అదే తంటా...'' అన్నాడు పాపీ.

''అయిదుశేర్ల పాలు తోడేసి చల్లచేసి పోసిన బాన- తట్టలో పెట్టుకొని మూడేసి రోజుల కోసారి వచ్చేవాడు. ప్రొద్దుగూకేవరకు- పైసాపైసాకి చల్ల అమ్మి,- అవచ్చిన డబ్బులతో ఉప్పు పప్పు మిరపకాయ కొనుక్కొని యిల్లు చేరేవాడు.

అలా పొద్దస్తమానం తిరిగి అలసిసొలసి వ్యాపారం చేస్తే అతగాడికి మిగిలే

లాభమెంతనుకున్నావ్- అణో—బేడో... అంతే.

ఓరోజు వాడు... వాడి పేరేదో ఉండాలి... శంకరంనాయరు ఆ... శంకరం నాయరున్నాడే, ... నా దగ్గరకు వచ్చి- కుయెన్నామాప్పిళ్లా! నువ్వో చిన్నసాయం చెయ్యాలి. నాకో యాభై రూపాయలు కావాలి. నా భార్య ఆసుపత్రిలో ఉంది. మందు కొనాలి- అనడిగాడు.

నాదగ్గర అప్పట్లో ఏదో చిల్లరమల్లర బేరాల తాలూకు కొంత పోగై ఉందనుకో. చూస్తూ చూస్తూ ఆడబ్బు... అంత డబ్బు... ఊరికే ఎలా యిస్తానూ... ఏ హామీ లేకుండా... ?

అప్పుడు అందుకు మార్గంకూడా వాడే చెప్పాడు.

నా అధీనంలో వో అయిదు 'పరా'ల భూముంది. ఆ భూమికేమో ఏడుగురు వాటాదారులున్నారు. నా వాటాలో వొచ్చేది సికిచ్చేస్తా, మిగతా ఆరుగురూనేమో వేరే ఊళ్ళో ఉన్నారు. ఇద్దరు తోబుట్టువులు—వాళ్ళ సంతతి ఉంది. ఆ చేను సాగుచేసే హక్కుగూడా నీకే యిస్తా. పండిన పంటలో సీవాటా పోను- మిగతాది ఎవరిది వాళ్ళకి యివ్వాలి... అన్నాడు.

ఈ బేరం వొప్పుకోవడమా— మానడమా? కష్టపడి కూడబెట్టుకున్న నాలుగు డబ్బులు చెయిజారిపోతే .. ?

అప్పటికింకా దక్షిణంవేపు యింట్లోఉండే మా మావయ్య బతికే ఉన్నాడు. ఆయన్ని పోయి సలహా అడుగుదామా అనుకున్నా. అయితే ఆయన యిచ్చే సలహాలు సంప్రదింపులు వ్యాపారానికి ఎంతమాత్రం ఉపకరించవు ఏమంటాడో తెలుసా— 'తలబెట్టిన పని అయింది'— అన్నామనుకో 'భేష్'— అంటాడు.

'కాలేదంటే'— సీ గ్రహచారం అంటాడు.

నాకసలు చిన్నప్పటినుంచి ఓ అలవాటుంది అదేవిటంటే— ఎవరైనా ఏదైనా సలహా యిచ్చారనుకో ఆలోచిస్తేగాని పాటించను. ... వినడం విన్నా నాకది అను కూలమని తోస్తేనే ఆచరిస్తా తప్ప లేకపోతే లేదు. అన్నిటికి భగవంతుడే సాయపడ తాడని నాకో గట్టి నమ్మకం... చెప్పొద్దూ.

సరే... కేశవన్నాయరుకి డబ్బిచ్చేశాను...''

''కాదు... శంకరం నాయరుకని...'' కొచ్చుప్పాపీ పొరబాటు సవరించాడు.

''ఆఁ... మరే, శంకరం నాయరుకే!,.. తర్వాత అతడేమో తనవాటా నాకు

రాసి యిచ్చేశాడు. అప్పటికి చేలోపంట కోతకి సిద్ధంగాఉంది కోతలయిన తర్వాత నేను పాలేరుని, ఎద్దును తీసుకుపోయి దుక్కి దున్నిద్దామని వెళ్లా. అప్పటికి మిగతా వాళ్ళందరికి ఈ భాగోతం తెలిసింది. శంకరం నాయరు వట్టి అబద్ధాలకోరు. వాడి చెల్లెలు—పిల్లలకి తిండికేం కొదవలేదు.

ఎవరు నువ్వని— అడిగాడో గూండావాడు నన్ను.

అంతా పోట్లాటకి- తగాదాకి దిగారు : ఎక్కడినుంచో ఓ క్రిస్టియనువాడొచ్చి... బలవంతంగా దుక్కి దున్నుతున్నాడన్నారు. నేను జరిగిన విషయమంతా ఏకరువు పెట్టగా— మరైతే మిగిలిన భాగస్వాములందరిచేత పట్టారాయించి పుచ్చుకున్నావా ?... అనడిగారు.

నే వాళ్ళకి చిక్కిపోయినా ... ఎద్దుని విప్పదీసి, .... ఇంటిముఖం పట్టా. ఏందుకంటే... నోరు పారేశామనుకో... ముక్కలు విరగ్గొడతారు.

నాపని ఎలా తయారైందంటే— పాడిపశువును అమ్మి, పోట్లగొడ్డును కొనుక్కున్నట్లయింది.''

అంటూ... కుయెన్నాచ్చను నిట్టూర్చాడు అలసిపోయినట్టు నాడు. దీనామ్మ గూడా ఈ కథంతా తలపుచాటున నిలబడి వింటూఉంది. ఏమంటే— మామగార్ని ఎక్కువ మాట్లాడొద్దని తానే కట్టడచేసిందిగామరి ?...

అదివరకు విన్న విషయమే అయినా... విన్నకొద్దీ స్వారస్యంగా ఉందేమో మళ్ళీ వినాలనిపించి విన్నది. నిజంగా ఆయనకేకనక వెనకటి ఓపిక- బలమూ ఉంటేనా కథకు తగినట్టు అభినయం చేసిమరీ చూపెట్టేవాడు ..

కుయెన్నాచ్చను తరువాయి కథ ప్రారంభించాడు.

అంతలోనే శివరాం కురుప్ వచ్చాడు. అతని నడకలో ఒకమాదిరి లయ, హుందాతనం ఉంటాయి. అడుగుల చప్పుణ్ణిబట్టి ఆ వచ్చే మనిషెవరో కనుక్కోవచ్చు...

దీనామ్మ లోపలికి చక్కాపోయింది.

కొచ్చుప్పాపీయే... ''రావయ్యా కురుప్... రా కూర్చో'' అన్నాడు.

కుయెన్నాచ్చను మాత్రం సమస్తం మరచిపోయి కథ చెప్పడంలో మునిగిపోయాడు.

నేనసలు యిక్కడికని రాలేదు,

''ఎద్దుని తోలుకుపొమ్మని ఆ కొచ్చుకృష్ణన్‌కి చెప్పేశాను.''

''ఎవరా కొచ్చుకృష్ణన్... ''

''ఆఁ ?''

''కొచ్చుకృష్ణనంటే ఏవరు...'' అనడిగాడు కొచ్చుప్పాపి.

''వాడే... పాలేరు..., అరె... నువ్వు... అయితే ఏం వింటున్నట్టు?''

''వాడైతే కొచ్చుకృష్ణను కాడే... ఉమ్మణి.''

''అదే... ఆ ఉమ్మణి..., కొచ్చుకృష్ణసనేవాడు వీడికి అన్నలే. సరేనా,...? నేను తిన్నగా చెప్పాటు గ్రామం వెళ్ళా. మనసులో చెప్పలేనంత కలవరంగా ఉంది. ఎలాగైనా సరే,— ఈ ఊబిలోంచి నేముందు బయటపడాలి. వాళ్ళచేను వాళ్ళకి పారేసా ... నేనిచ్చిన డబ్బు నాచేతికి తిరిగొస్తే ... నాకదే పదివేలనుకున్నా. అడుగుతూ అడుగుతూ అడంగుకు చేరుకున్నా. వాళ్ళంతాగూడా అన్నవస్త్రాలకి లోటు లేనివాళ్ళే. నేవెళ్ళి... వాళ్ళల్లోకి పెద్దమనిషన్నవాడితో వ్యవహారం సంప్రదించా. వాడే అందరికి నాయకుడు... వట్టి తాగుబోతు. వల్లమాలిన మర్యాదచేసి వాడిని కాస్త బుట్టలో వేసుకున్నా.

సూక్ష్మంగా చెప్పాలంటే పట్టా రాయించుకోవడానికి వెళ్ళినవాణ్ణి ఒక్కపైసా చేతిది పడకుండా, మొత్తం పొలానికి విక్రయపత్రం రాయించి పుచ్చుకున్నా. పైకమేమో వాయిదాల్లో చెల్లించేటట్టూను...''

''ఈ కథలన్నీ నేను మునుపు విన్నవే...'' అన్నాడు శివరాంకురుప్.

''ఏవిటి ?''

''నేను ఈ కథంతా అదివరకు విన్నదే అంటున్నా.''

''ఆఁ... ఆఁ ... విని ఉండొచ్చు... దానికేఁ... ?''

కొచ్చుప్పాపీ వెళ్ళడానికి లేచాడు... ''ఇంటిదగ్గర నాకు మేకొకటి ఉందిలే... అది ఆకలితో అల్లాడుతూంటుంది పాపం ... నమలడానికి నాలుగు పనసాకులు ఎక్కడ్నించైనా కొట్టుకొచ్చి దానికి పడేద్దామని బయల్దేరినవాణ్ణి..., ...మరిక వస్తా...''

''వెళ్ళిరా...''

కొచ్చుప్పాపీ వెళ్ళిన తర్వాత కుయెన్నాచ్చను శివరాంకురుప్‌ని 'సరుకుతెచ్చావా' అనడిగాడు.

"ఆ... ఆ... తేకుంటే వస్తానుటయ్యా!" అంటూ ఉత్తరీయపు కొంగు నుంచి వో పొట్లం తీశాడు కురుప్.

"ఇవాళ్టికి విసరంత లేదు... ఎలాగా... అని దిగులుపడుతున్నా ననుకో..., ఇది లేకపోతే పనికాదు. కురుప్! చిన్నప్పటినుంచి ఇది మాచెడ్డ అలవాటై పోయిందయ్యా! ఆ వైనం నీకు తెలుసా?"

"నువ్వే చెప్పావ్... "

"ఏవిటో... ఏమేమిటో చేశా. అన్నీ నిన్న మొన్న జరిగినట్టున్నాయి. ఎనభై—తొంభయి యేళ్ళకాలం క్షణంలో గడచినట్టుంది

"మనిషి తనేదో ఎల్లకాలం ... శాశ్వతంగా ఉంటాననుకొంటాడు. వెనకా ముందూ ఆలోచించడు ... ఏకంగా ఆకాశానికి నిచ్చెనలు వేద్దామనుకుంటాడు.

అంతా మాయ ... పనస చెట్టు ఆకులు చూసి మేసేందుకు వెంటబడిపోయే మేకలాగే, మానవుడు గూడా ఆ భగవంతుడు పన్నిన మాయకు లోబడి తిరుగుతుంటాడు.

నిజం ... అక్షరాలా నిజం ..."

కురుప్ మావయ్యా ... అంటూ వంటింట్లొంచి సిసిలీ పరుగెత్తుకుంటూ వచ్చింది.

"చిట్టి తల్లీ రామ్మా రా అంటూ" కురుప్ సిసిలీని వొళ్లో కూర్చోబెట్టుకున్నాడు.

"మా బంగారు తల్లీ...."

"మరే...? నాకేమో కథ చెబుతాననీ..."

"అంతే గదా ... చెబుతా... నీకే కథకావాలో చెప్పుమరి ... రాజకుమారుడు—రాజకుమారి కథ? ఆకు— మట్టిబెడ్డా కలిసి కాశీయాత్రకు పోయిన కథా... అన్నట్టు సరేగానీ, కథ చెప్పినందుకు కురుప్ మావయ్యాకు ఏమిస్తావో చెబుదూ?"

"పాయసం యిస్తా?

"ఏదీ పాయసం?"

"అమ్మ వొండుతూందిగా?"

కురుప్ పకపకా నవ్వాడు.

"భలే... భలే ... అమ్మ పాయసం వండుతూందా సిసిలీ?... అయితే పాయసం తినే వెడతాలే..." అన్నాడు కురుప్.

కురుప్ ఆ మాట కావాలనే రెట్టించి బిగ్గరగా అన్నాడు, అప్పుడే..., ఖుయొన్నా

చ్చనుకి గూడా అర్థమై ... అయినా నవ్వాడు.

''ఆఁ.... ఏవిటీ మరీ ... పాయసం వండకపోతే ... వేయిస్తారేవిటి ?'' అనడిగింది సిసిలీ బుంగమూతి పెట్టి.

అప్పుడు కురుప్‌కి ముద్దొచ్చి ... సిసిలీ బుగ్గమీద ముద్దెట్టుకున్నాడు.

అదే సమయాన కుయుచ్చెరుక్కను వచ్చాడు. అతడి చేతిలో ఆకటాకుతో కట్టిన పొట్లమొకటుంది.

శివరాం కురుప్ పాయసం తాగే వెళదామనుకున్నాడు గానీ,—కుయుచ్చెరుక్కను రాకతో వెంటనే లేచాడు.

అందుకు కారణం లేకపోలేదు.

ఆ యిద్దరికీ సయోధ్యత లేదు... మొట్టమొదట్లో యిద్దరూ స్నేహితులే కావడానికి ... కానీ ... ఏదో విషయంలో మాట పట్టింపు వచ్చి విడిపోయారు.

కుయుచ్చెరుక్కను నాలుక ఎటుబడితే అటు తిరుగుతుందని కురుప్‌కి తెలుసు...

ఎంత మాటయినా అనగలదనీ తెలుసు ... అందుకే అక్కడ నుంచి తప్పుకోవడం క్షేమమనుకున్నాడు.

''నాన్నా ... పడుకున్నావేఁ...'' అంటూ ప్రశ్నించాడు కుయుచ్చెరుక్కను.

''భేష... మంచి ప్రశ్న వేశావ్... పడుకోబోతే... పరుగెత్తమంటావురా ?''

''అహఁ... లేచి కూర్చోలేవా ?... అని ?''

''నాన్నా ?''

''ఊఁ ?''

''ఇంద... మాంసం, ... దూడమాంసం... తాజాగా ఉంది.

కుయెన్నాచ్చను వొత్తిగిలి ఆ పొట్లంవంక చూశాడు. ఇశ్రాయేలు సంతతికోసం ఆకాశంనుంచి పిట్టలు వచ్చిపడినట్టు ఇదో విచిత్రం.... ఎందుకో ముందరికాళ్లకు ఈ బంధం .. ?

''ఏవిట్రా సంగతి ?''

''ఇదుగో దీనామ్మ... ! వచ్చి ఈ పొట్లం తీసుకోమ్మా.''

దీనామ్మ బైటికి వచ్చింది.

''బాగా మసాలా వేసి నాన్నకి వొండి పెట్టు. నాన్న... ఒకప్పుడు ... చేతి కొద్దీ ఖర్చుబెట్టేవాడు,.. దర్జాగా బతికేవాడు... నా పరిస్థితి బాగుండక గానీ,... లేక

పోతే ఈ స్థితిలో ఉన్న నాన్నని వొదిలి పెట్టి ఊరుకునేవాణ్ణా? ప్చ్...

పోయిన శ్రావణమాసం నుంచి రామకృష్ణుడి దుకాణంలో సరకులు కొంటున్నా. ఇచ్చి పుచ్చుకోవడాల్లో ... యింకా వో అరవై రూపాయల అప్పు అట్టే ఉండి పోయింది. అదిప్పుడు పీకలమీదికి వచ్చింది. గట్టిగా దబాయిద్దామంటే—, ఆ మాత్రం అప్పుయిచ్చేవాడంటూదొరకాలిగా? అందుకే ఊరుకున్నా...''

అంటూ కుయుచ్చెరుకన్ను... తండ్రియేం చెబుతాడోనని సమాధానం కోసం ఎదురుచూస్తూ... రెండుక్షణాలు ఆగాడు. పొగజూరిపోయిన యింటికప్పువంక చూస్తూన్నాడు కుయెన్నాచ్చను. వాసాలన్నీ పుచ్చిపోయాయి.

నాన్నా! ఇకనే బయలుదేరుతా... పోయి ఎక్కడైనా డబ్బు అప్పు తెచ్చుకోవాలి..."

''సరే...''

కుయుచ్చెరుకన్ను లేచి వెళ్ళాడు...గుమ్మం దాకా వెళ్ళిన వాడు మళ్ళ తిరిగొచ్చి ...నాన్నా...'' అని పిలిచాడు.

''ఊఁ...''

''అవాళ నీకు ఫిలిప్పోసు డబ్బిచ్చి పోయాడుగదా...అదేమన్నా ఉందా? మా అబ్బాయి పైకం పంపగానే పట్టుకొచ్చి ఇచ్చేస్తా...''

''ఏవిటి?"

కుయుచ్చెరుకన్ను ఎంతో మన్ననగా... మర్యాదగా ... అదే మళ్ళీ అడిగాడు ...

సంతోషకరమైన సమాధానం కోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

కుయెన్నాచ్చను లోలోపల నవ్వుకుని — ఆరి వీడి తస్సాదియ్యా అసలు సంగతి యిదన్నమాట.

యాకోబు ఇస్సాకుని మోసగించడానికి వేసిన ఎత్తులాటిదే యిక్కడ వీడూ వేశాడు:

యాకోబుకి తండ్రి దీవెనతోబాటు యింటి పెత్తనం గూడా దక్కింది .... అనుకుని,—

''ఇంతకూ నీకు కాస్తో కూస్తో డబ్బు కావాలంటావ్? ఏఁ? ఒరే! నాకేం సంపాదనా... చట్టుబండలా చెప్పరా? వాడు అవాళ యిచ్చిందేదో ఖర్చయి పోయి

ఉండొచ్చు..."

"పోన్లే ... అయితే,– నే వెడతా నాన్నా..." అనేసరికి, కుయెన్నాచ్చనుకి పాపమనిపించింది...ఏక్క డలేనంత జాలి వేసింది:

పీడికి కొంచెం చిఋలిండి తినడం నేర్పింది నేనే... వీకి తెలివి యిలా యేడ్చింది. వీడి చాతుర్యమంతా యింట్లోనే వెలిగిస్తున్నాడు...

"అమ్మా !"

"ఏవిటి మావయ్యా ?"

"ఫిలిప్పోసు యిచ్చిన డబ్బులో ఎంత మిగిలిందమ్మా?"

"నలభయ్యో —యాభయ్యో ఉన్నట్టుంది."

"సరైతే ఆ డబ్బు తెచ్చి పీడికియ్యమ్మా..." దీనామ్మ మొదట కొంచెం సంకోచించింది... భగవంతుడా ఈ బాకీ మళ్ళీ వచ్చేది కాదే... అనుకుంది.

"ఇవ్వమ్మా ! రేపో ఎల్లుండో వాడి కొడుకు పంపగానే తెచ్చి యిచ్చేస్తాడుటలే..."

పట్టిమాట ... ఏం యివ్వడూ ,ఆ సంగతి ఆయనకి తెలీదాయేం ? ఏదో నా చేత యిప్పించాలని చెప్పిన మాటగానీ... అనుకుంటూ దీనామ్మ డబ్బు తెచ్చి యిచ్చింది. కుయుచ్చెరుక్కను తీసుకున్నాడు తీసుకునేటప్పుడు మాత్రం ... యిలా అడిగి పింగళించి పుచ్చుకుంటున్నందుకు ఎంతో బాధపడుతున్నట్టు నటించాడు. తన దారిన తాను వెళ్ళి పోయాడు....

గుమ్మం దాకా వెళ్ళిన వాడు మళ్లీ తిరిగొచ్చి...

"నాన్నా ! ఏమనుకోకు ... ఒక్కమాట. దీనామ్మకు గూడా చెబుదామనే అనుకుంటున్నా... ఆ దిక్కుమాలిన కురుప్ గాడు ఎప్పుడూ వస్తూంటాడెందుకుట ? వాడసలు మన గుమ్మంలో కాలు పెట్టతగిన వాడేనా చెప్పు ?

మనకు ఆగగృశత్రువులైన ఆ నాయర్ల ఇంటల్లుడుగదా వాడు నీకు మాట్లాడుకుందుకు మనషులు కావాలీ అంటే,– మన వాళ్లెవ్వరూ దొరక్కపోయారా చెప్పు. అంత దొరక్కపోతే నేనొచ్చి కూర్చుంటా సరేనా ?"

"ఊఁ..."

"నేనెప్పుడైనా రానీ... చూస్తా... ఆ కొరివిగాడు యిక్కడే ఉంటాడు. వాడిక్కడికి ఎందుకు రావాలీ .. అంట ?"

"ఒరేయ్... నువ్వు పోరా... పోయి'– ముందా కొట్టువాడి బాకీ తీర్చు పో...

ఆ డబ్బు నా నూనెకో— నలుగు పిండికో అవసరం వస్తుందని యిచ్చింది. కనుక.... సోమవారంలోగా రాగానే తెచ్చి యిచ్చెయ్...'.

"ఇస్తానని చెప్పొగదయ్యా ? మావాడు డబ్బు పంపగానే పువ్వుల్లో పెట్టి తెచ్చిస్తా... సరేనా ? నీకు నా మీద ఆ మాత్రం నమ్మకం లేదా... అంటూ కుయి చ్చెరుకర్రను చక్కాబోయాడు.

# నాలుగు

దీనమ్మ వంటిల్లు — వసారా పేడతో అలుకుతుంది మామగారు పడుకుంటున్న వసారా అక్కడక్కడ పెళ్లల్లేచి పోయింది.

అలుకుదామంటే— అస్తమానం అక్కడ ఎవరో ఒకరు వచ్చి కూర్చోవడంతో ... అవనే కావడం లేదు...

అసలది బల్లకూర్పుతో ఉన్న పాతకొంప. చుట్టూతా వసారాలు.

ఇల్లేమంత ఎత్తులేదు... చూసిపోకపోతే ద్వారా బంధాలు నెత్తికి తగులుతాయి.

ఇంటికి తూర్పున— ఉత్తరాన కాస్తంత ఖాళీ స్థలముంది... ఆ ఉత్తరం వేపున్న దొడ్లోనే నుయ్యుంది. ఆ నూతి చుట్టూ రాతి పళ్ళెముంది.

గదిలోకి గాలి— వెలుతురు అనరాదు— వినరాదు. అక్కడ పడుకోవడమంటే ప్రాణాంతకమే...

దక్షిణ దిక్కునున్న వసారానే కొబ్బరాకులతో దడికట్టి గదిగా అమర్చుకున్నారు.

అక్కడే పడుకుంటారు.

"అమ్మా!"

"వస్తున్నా మావయ్యా!..." అంటూ దీనమ్మ చేతులు కడుక్కుని వచ్చింది.

"ఏం చేస్తున్నావమ్మా?"

"వసారా అలుకుతున్నా... బొత్తిగా పెళ్లలు... పెళ్లలు లేచి పోతేను..."

"ఆఁ... దీనికి పైకప్పుగూడా మార్చాలమ్మా ... వాసాలు పెండెలు బాగా

చెకి పోయాయి... పాతవై పోయాయి.''

''అదంత సుఖమైన పనా మావయ్యా?''

''ఆఁ?''

''అహఁ... ఆ ఫిలిప్పోసు గారు ... వాళ్ళలాగా మనమేం కలిగిన వాళ్ళమా... వాళ్ళంటే మేడలు మిద్దెలు కట్టుకున్నారు .... మన వల్లేమవుతుంది... ఏదో యిలా పడి పోతూ... పడిపోతూ ఉన్న పూరి కొంపల్లోపడి కాలక్షేపం చెయ్యాల్సిన వాళ్ళమే గానీ...''

''తల దాచుకోవడానికే ఏదైతేనేమమ్మా చెప్పు. వస్తులు పడుకోకుండా గడిచి పోతే చాల్లే ... నేవేడుకునేది అదొక్కటే.''

''మిమ్మల్ని పస్తుపడుకోబెట్టం లేండి మావయ్యా!''

ఏమో... మాటయితే అన్నాగానీ, పస్తులుంచమని ఆయనకేవిటి నమ్మకం ?... అనుకుంది దీనామ్మ.

''నీ నోటి వాక్యాన యింతవరకు ఆకలితో అలమటించాలిసిన అగత్యం రాలేదులే తల్లీ !

నేను పుట్టినప్పుడు మా వాళ్ళకి చిల్లిగవ్వ లేదుట ఉండేందుకు యిల్లు లేదుట ... దున్నేందుకు చేను లేదుట.

అయితే ... నే చూడు మూడు 'పరాల' మాగాణి మూడున్నర ఎకరాల మెట్ట పొలం సంపాయించా... నా పిల్లలకి ఆస్తిగా యిచ్చా. చూశావా .?

అమ్మా ఎవరికైనా సరే భగవంతుడివ్వ దల్చుకున్నంతా ఇస్తాడు... అంతా వాడి చిత్తం... అన్నిటికి పెట్టిపుట్టాలి.

ఇశ్రాయేలు ప్రజని కనాను దేశం తీసుకుపోవడానికి మోషేకి శక్తి ఎలా వచ్చిందనుకున్నావ్ ?

చెపుతా...,

మోషే యెహోవాతో- హే ప్రభో ! నేనేమో మాట నేర్పరిని కాను ... నాకు మాట్లాడటం చేతకాదు... నాది బండనాలుక. ఏదో నత్తి నత్తిగా నసుగుతాను... ఈ నీ దాసుణ్ణి ఎలా కనికరిస్తావో— అని మొరబెట్టుకోగా--

యెహోవా యేమన్నాడంటే—

మనిషికి నోరిచ్చిన వాడెవడు ? మూగవాడిగాను- చెవిటి వాడుగాను పుట్టించిన

వాడెవడు? కంటికి చూపు యిచ్చిందెవడు? కళ్లులేని కబోదిని చేసిందెవడు?

ఎవరనుకున్నావ్ తల్లీ?

వీటన్నిటికీ కర్త ఆ యెహోవాయే...ఆయనకు తప్ప ఎవరికి సాధ్యం?

అప్పుడు మోషేతో యెహోవా యిలా అన్నాడు:

నువ్వు నిశ్చింతగా ఉండు...నీ నోటికి తోడై యుంటా... నువ్వేం చెప్పదలచుకున్నావో నీ నోటితో నేనే పలుకుతా- నీ నోట నేనే పలికిస్తానన్నాడమ్మా.''

''మావయ్యా నాకు తెలీకడుగుతా .... ఇప్పుడసలీ సోదెంతా ఎందుకు చెప్పండి?''

''ఈ యిల్లూ స్థలమూ ఎలా కొన్నానో నీకేం తెలుసు?''

''ఇప్పుడదంతా వింటూ కూర్చోవడానికి నాకు తీరికలేదు బాబూ! పిలిచిన పనేవిటో చెప్పండి.''

''చూడమ్మా ... కాస్త వేడి వేడిగా అంబలి యిస్తావేమోనని ...''

''అంబలి యింకా కాగలా... కాగ్గానే తెచ్చిస్తా.. ''

''సరైతే' ... నీ కంత వినాలని లేకపోతే వినొద్దులే వెళ్లు ... వింటే మాత్రం నీకేం తెలుస్తుందిలే ...?

అప్పటికసలు నువ్వు పుట్టి ఉండవు. నువ్వేకాదు ... మీ అమ్మయినా పుట్టిందో లేనేలేదో! కొచ్చాప్పి దగ్గర యీ యిల్లు కొనేప్పటికి నాకు దావాపు ఇరవై ఏళ్లుంటాయి. అంటే యిప్పటికీ యిల్లుకొని డెబ్బయి సంవత్సరాలయిందన్నమాట.

వాణ్ణి కొలంబో కొచ్చాప్పి అనేవాళ్లం.

వాడు పాపం ... ఆ రోజుల్లో పొట్టపోసుకుందుకని కొలంబో పోయాడు.

వాడు మంచి ఉన్నత కుటుంబంలో పుట్టిన వాడే ఆ యింట బుట్టిన వాళ్ళల్లో ... చివరి వాడు ....వాడు ఒకానొకప్పుడు ఈ పేట-పేటా కొచ్చాప్పి పూర్వీకుల్లో ఏశావు అనే వాడిదిట.

ఆ ఏశావు గుర్రమెక్కి ఊరంతా కలయ తిరుగుతూ ఉండే వాడట...

అందులో కథ ఉందిలే.

ఏనాడో పెరుంగ్‌శేరీనుంచి నలుగురన్నదమ్ములు పారిపోయి వచ్చేశారట.

వాళ్లల్లో పెద్దవాడు ఈ పనచ్చిమూట అనే పేటలో ఉండి పోయాడు ... అంటే ఆయన ఈ కొచ్చాప్పి పూర్వీకుడైన ఏశావుకి తాతన్నమాట.

మిగిలిన ముగ్గుర్లో ఒకాయన అమ్మలపప్పురఘూలోను, -రెండో ఆయన మాత్కాటు లోను, మూడో అతను కట్టానంలోను కాపరం పెట్టారుట.

అయితే ఈ కథలో నిజమెంతుందో అబద్ధమెంతుందో చెప్పలేం.

ఏది యేమైనా మేలోర్ఘుత్తువారి వంశం మాత్రం ప్రసిద్ధి కెక్కిందే.

అయితే అస్తంతా పోయింది ... వాళ్ల ఆస్తి పాస్తులన్నీ అమ్ముకుని అర్చుకున్నారు.

ఆఖరికి పోయినవన్నీ పోగా పెద్ద యిల్లొకటి ఉంటే, దాన్ని గూడా ముక్కలు చెక్కలు చేసి అమ్మేశారట.

ఇదుగో ఈ యిల్లుంది చూశావ్...? దీన్ని కొచ్చాప్పి పినతండ్రి కట్టించాడట.

కొచ్చాప్పి హయాంలో వాడికి తిండికి లేక పస్తులుండాలిసిన గతి పట్టింది.

అప్పట్లో వాడు మిరియాలు కోసేందుకు పోయేవాడు. ఆ కాలంలో ఈ కుయెన్నాచ్చను ఏదో చిల్లర మల్లర వ్యాపారం చేస్తూండే వాడు.

భారీయెత్తున వ్యాపారం చేద్దామంటే డబ్బు లేదుగా మరి! మిరియాలు కోసినందుకు కొచ్చాప్పికి రోజుకో అణాడబ్బులు కూలి అన్నమాట.

ఊళ్ళో యింటింటికి తిరిగి కాసిని పెసలు– ఉలవలు పోవు చేసుకు వచ్చేవాడు.

ఇంట్లో ఉండేది ... వాడు ... వాడి తల్లి ... అంతే. వాడి పినతండ్రి మత్తాయిని కల్లు దుకాణానికి ఎదురుగా మేజిక్ రావుత్తరు కత్తితో పొడిచేశాడు.

కొచ్చాప్పి తల్లిపోయిన తర్వాత ...ఎవరితోనో కలిసి సిలోను వెళ్ళి పోయాడు. నాలుగైదేళ్ల పోయాక తిరిగి వచ్చాడు'

వచ్చినప్పుడు వాడిదగ్గరేదో తనపాటి రొక్కముంది. స్నేహితులతో కలిసి చెడ తిరిగే సరికి — చేతిలో ఉన్న డబ్బంతా పది రోజులకల్లా హరించి పోయింది.

ఒకనాడు అర్ధరాత్రప్పుడు నా దగ్గరకు వచ్చి— కుయెన్నా! రేప్పొద్దున నేను కొలంబో వెళ్ళాలి... అన్నాడు

పెళ్ళి పేరంటం చేసుకుని యిక్కడే ఉంటానన్న వాడివి– మధ్యలో ఇదేవిట్రా -అనడిగాడు.

ఆదేం కుదరదులే ... అన్నాడు.

ఏం ?

ఏవిటా..., గొడవొకటి వచ్చి పడిందిలే.

గొడవ ? ఏవిటి అది...అనీ,—అలా తియ్యగా తియ్యగా ఉన్న విషయం కాస్త బయట పడ్డది.

వాడికి పెళ్ళయిందని ... సిలోనులో భార్యా — వో బిడ్డ ఉన్నారని పోలీసులు వాడికోసం గాలిస్తున్నారని ..., వెళ్ళక పోతే చిక్కన పడతాడని... తెలిసింది.

నేనిక్కడికిక తిరిగిరాను. ఈ యిల్లా స్థలమూ యిచ్చేసి పోతానన్నాడు.

నాకు ... వో యిల్లంటూ అమురుతుందని ఊహించను గూడా లేదు. నాకు బుద్ధి తెలిసినప్పటినుంచి వో చోటంటూ నిలకడగా ఉన్నదే లేదు... ఎప్పుడూ బైరాగుల మోస్తరు తట్టా బుట్టా నెత్తినేసుకుని తిరగడమే.

మా నాయన నల్లమందు వ్యాపారం చేసేవాడు ... దొంగచాటుగా తమిళనాడు నుంచి కల్తీలేని నల్ల మందు తెప్పించి చిన్న చిన్న మాత్రలుగా కట్టి అర్థణాకో మాత్ర చొప్పున అమ్ముతూండేవాడు. కొంత కాలం మానాన్నతో బాటు నేనూ తిరిగాను, మా నాన్నెప్పుడు నల్లమంపు కైపులో పడుండేవాడు. దాంతో జ్ఞాపక శక్తి ఉండేదికాదు.

సంచీలో పది మాత్రలే ఉంటే ... కాసేపయ్యాక లెక్కచూసి పధ్నాలు గుండాలే ... అనే వాడు.

నువ్వు కాజేశావేరా ? బయట పెడతావా లేదా అంటూ నన్ను గొడ్డును బాదినట్టు బాదేవాడు.

తర్వాత తర్వాత మా నాన్నతో వెళ్లడమే మానుకున్నా. సాధ్యమైనంతవరకు మా నాన్నని తప్పించుకు తిరిగేవాణ్ణి. గొడ్లకి నీళ్ల పట్టడం ... ఎరువులు మోయడం ...నీళ్లదేవడం వగైర చిల్లర పనులేవో చేస్తూ సంపాయించిన కూలి డబ్బుల్తో ఏ పుట్లో ... సెనగలో పాడో కొనుక్కు తినేవాణ్ణి:

యింతకూ చెప్పవచ్చిందేమంటే—కేవలం నూటయాభై అయిదు రూపాయలు పెట్టి కొచ్చాప్పి దగ్గర యీ యిల్లా స్థలమూ కొన్నా ... అదీ మొదలు.

ఇల్లు కాస్త మార్చి కట్టించాలి... బాగులు బోగులు చేయించాలనుకునే వాణ్ణి కానీ ...అది తీరని కోరికగానే మిగిలి పోయింది తల్లీ! ఏవిటోలే ... అనుకున్నవన్నీ అవుతాయా ?

అన్నిటికి ముఖ్యం ... ఆ భగవంతుడి దయ ఉండాలిగా... ఆయన ఆజ్ఞలేనిదే ఆకైనా కదలదుగా ?...

ప్రతి ప్రాణి ... ప్రతిజీవి ... ఆ సర్వమయుడి సంకల్పం ప్రకారం

ఆడాలిసిందే...

మనకు ఈ కళ్లు ముక్కు నాలుక చెవులు అన్నీ వాడిచ్చినవే.

కొందరికి యివి యివ్వలేదనుకో ... వాళ్ళు తమ ఖర్మానికి ఊరుకోవలసిందే గానీ,... తామేం సృష్టించుకోలేరు... ఔనా?

అతివృష్టి ... అనావృష్టి ... అనేవేవిటి ?

అవీ భగవదేచ్ఛే ... తల్లీ ...

వానకురిపించనూ వచ్చు... మానుకోనూ వచ్చు.

జల ప్రళయమొచ్చేటట్టు చేయనూ వచ్చు ... ఉన్న నీరంతా యిగుర్చుకు పోయేటట్టు చేయొచ్చు ... ఏం చెప్తాం... అంతా వాడి చిత్తం... మనదేం లేదనుకో.''

దీనామ్మ కూర చేస్తూండగా .. పుల్లుపరంపలో ఉన్న కీవరీతు రెండో కూతురు లీలామ్మాను, కాలాయిలో ఉండే ఫిలిప్పోసు కూతురు పొన్నమ్మాను వచ్చారు.

"అబ్బో ... ఏవిటీ విశేషం? దారితప్పి రాలేదుగదా?...'' అంది దీనామ్మ.

''అబ్బే అదేం లేదులే. ఈ దారి మరచి పోవడమే? మేము చిన్నప్పుడు తప్ప టడుగులు వేసింది. ... నడక నేర్చుకుంది ... నడిచింది యిక్కడేగా పిన్నీ ?''

''అది చిన్నప్పుడు ... యిప్పుడు మీరు పెద్దవాళ్ళు... ఆరిందాలయి పోయారే... ?''

''ఎప్పుడూ చిన్నవాళ్ళంగానే ఎలా ఉంటాం చెప్పు? సాధ్యంకాదే? అదీ నిజమే ...దీన్ని చూడు... అప్పుడే బిడ్డ తల్లి కాబోతూందీ?''

ఆ మాటవిని లీలామ్మ బిడియపడింది. అలా బిడియ పడుతున్నప్పుడు అ పిల్ల దాని మొహంలోకి మరింత అందం వచ్చిందనిపించింది.

ఆ మాటకొస్తే పెద్దాయన పిల్లలయిదుగురు అందమైన వాళ్లే. చక్కని చుక్కలు. ఆ అయిదుగురిలోకి పెద్దపిల్లే దాని గ్రహచారం కొద్దీ రోగిష్ఠిదయి పోయింది.

ఇప్పుడసలు లీలామ్మని పురిటికి తీసుకురావడానికి గూడా వాళ్ల డబ్బు లేదని వెనకాడారు. కానీ పిన్ని - అదే పినతండ్రి భార్యనే ఊరుకోక అప్పు సప్పు చేసి రప్పించింది.

పోలమ్మ పెళ్ళయి ఆరునెలలయింది. ఆ పెళ్ళికి కట్నకానుక లేవిటో ఏవిచ్చారో ... పెళ్ళి ఎలా జరిగిందో ఎవ్వరికీ తెలీదు. ఆఖరికి పెళ్ళికొడుకు అన్న దమ్ములకి గూడా తెలీదుట... ఆ కుర్రవాడి సంపాదనంతా తెచ్చి ... ఈవిడ గారి

చేతిలో పోస్తాడట. ఆ కుర్రవాడి తండ్రి గూడా ఏదో కంట్రాక్టరేట. ఒక్క రోజు పెళ్ళికే పదివేలదాకా అయిందని, ... కారు గీరూ... యిల్లూ అదీ గూడా యిస్తామన్నారనీ వినికిడి...

''తాతయ్య మంచి నిద్రలో ఉన్నట్టున్నాడు... పిలిచాం,... గానీ పలకలేదు... సరే, మేం పోయి తూర్పువేపు వరండాలో కూర్చుంటాం పిన్ని !''

''ఆఁ ...నిద్రాలేదు భద్రాలేదు అదంతా నల్లమందు మగత... నిద్రంటూ లేనే లేదులే.అర్ధరాత్రి కానీండి ... ఆకు చప్పుడైనా "ఎవరూ ?'' అని అడుగుతారు... అంది దీనామ్మ.

''అయ్యో— తాతయ్య — అప్పటికి — యిప్పటికి గుర్తుపట్టలేనంతగా మారి పోయాడు సుమా ? వెనకటి ఆ రూపమే వేరు— ఆకారమే వేరు" ...అంది లీలామ్మ,

లీలామ్మ ఆ మాటనేసరికి దీనామ్మ ఏమనుకుందీ...? తమరేదో ఆయనకి సన్నగా తిండి తిప్పలు పెట్టనట్టు, అందుకనే ఆయనంత చిక్కి శల్యమై పోయినట్టు అభిప్రాయ పడుతూందనుకుని అన్నది గదా—,

''సరెపోయె...ముక్లపయస్సేగానీ.. ఎదిగే వయస్సేం కాదు. ఏమోనమ్మా మా తిప్పలు మేంపడుతూనే, మేం తినసీ — మానుకోసీ, ఉన్నంతలో ఆయనకి ఏ లోపం చేయకుండానే చూస్తున్నాం ...''

''అబ్బెబ్బే ... మీరు పెట్టడం లేదని ... చూడటం లేదని కాదు పిన్నీ నేనంటూంది ... అసలా మాటెపరంటారు ... ఎందుకంటారు ''

''ఇంతకంటె ఎక్కువ ఎవరు మాత్రం చేయగలరు పిన్నీ ?...'' అంటూ దీనామ్మకి వత్తాసుగా పలికింది పొన్నమ్మ.

''అదే నేననేదీను ... డబ్బు ఉండటం లేకపోవడం కాదక్కడి విషయం. ఉపచారం చెయ్యడమంటే మాటలా ..? అది చాలా ఎక్కువైన సంగతి కాదూ....'' అంది లీలామ్మ.

''పోనిద్దురూ ... ఏమే లీలామ్మా ! అవాళ ఆ రావడం రావడం మళ్ళీ పోనేలేదుగా ?''

''లేదు పిన్నీ !''

''అయితే జోయిబాబు యింకా రానే లేదన్నమాట ?''

''ఆయన మద్రాసు వెళ్లారు సోమవారం వసారు... అంది.

ఎందుకు వెళ్లాడని మాత్రం దీనామ్మ అడగలేదు. ఎందుకంటే,— మద్రాసు బొంబాయి విమానాల్లో తిరిగేవాళ్ళని గురించి గుచ్చి గుచ్చి అడగడం అంత సబబు కాదని ఊరుకుంది.

క్రితం వారం చర్చిలో పొన్నమ్మని చూసినపుడు పొన్నమ్మ మెళ్ళో వేసుకున్న ఆ గొలుసు వేరు... యివాళ యిది వేరు.

''సిసిలీ బడికి వెళ్ళిందా?

''ఆఁ... వచ్చే వేళైందిలే.''

''బాబాయి ఎక్కడికి వెళ్లాడు పిన్నీ?''

''ఊళ్లోలేరు... రెండు రోజులైంది. ఏదో కన్వెన్షనని తిరుగుతున్నారు.

మీ బాబాయి సంగతేం చెప్పమంటావు తల్లీ! ఆయనకే విషయం పట్టదు ... ఇంట్లో ఉందో ... లేదో అక్కర్లేదు. కానీ ... ఆయనగారుడిగే వేళకి మాత్రం అన్నీ అమర్చి సిద్ధంగా పెట్టాలి. నా అవస్థ చెబితే తీరదనుకో.''

''నిన్ను గురించి మా అమ్మ ఎప్పుడూ అంటూనే ఉంటుంది పిన్నీ!''

''అమ్మడూ... తెల్లవారి జామునగా లేస్తే ... మళ్ళీ అర్ధరాత్రికి గానీ నడుం వాల్చేందుకు ఉండదనుకోండి.

ముసలాయనకి ఉపచారం చెయ్యాలి ... ఇంట్లో ఉందో లేదో చూసుకోవాలి. వచ్చి పోయేవారితో మాట్లాడాలి... మర్యాదలు చెయ్యాలి. ఒకటా ..? ముఖ్యంగా యింతగా చెబుతున్న కారణమేమిటంటే — అమ్మా! మన కుయప్పి భార్య అమ్మిణి లేదూ?... ఆ పిల్ల మొన్న .., మొన్నంటే మొన్నకాదులే, పోయిన వారం ఇక్కడికి వచ్చింది ... సంజెవేళప్పుడనుకో. మీ తాతయ్యతోనేమో ఎవరో వచ్చికూర్చుని మాట్లాడుతున్నారు. నేనేమో పనిలో పడి మునగానాం తేలానాంగా ఉన్నా. అటువంటి పరిస్థితుల్లో ఆవిడగారేం చేసిందో తెలుసా...? పోయి కల్లు విలా వాళ్ళ కీచాచీజీతో నేనదో తనని కంటచూసి, పంట పలకరించనట్టు ... నేరంగా చెప్పిందిట.

ఔన్లే... గొప్పింటి ఆడపడుచుగా ... అంటుకని ఆవిడగారికి నేను వాణకాలి కాబోలు. ఆ అమ్మతల్లికి నేను పెద్ద పీటవేసి మర్యాద చేయనట్టు,... యిలా ఏవేవిటో నోటికి వచ్చినట్టు అన్నదిఁ.

ఎటువంటి వాళ్లకి అటువంటి మాటలే వస్తాయి'' అంటూ దీనామ్మ గొంతు కొంచెం తగ్గించి ఇంకా చెప్పడం మొదలు పెట్టింది...

"మీరు .... చిన్న పిల్లలు ... మీతో చెప్పరాదు కానీ ... చూడు..., కుయుప్పితో పెళ్లయినాక గూడా దాని అదివరకటి ప్రియుడు ఇంకా అక్కడికి వస్తూనే ఉన్నాడట ... అయినా మనకెందుకొచ్చిన వెధవ గోలలే—"

"ఎవరెలా పోతే మనకెందుకు..." అంది పొన్నమ్మ,

లీలామ్మ ఏం మాట్లాడ లేదు... తను విన్నది మరో కథ:— అది— అమ్మిణేమో చేపలకూర ఎంతోయిదిగా చేసి తాతయ్య వాళ్లకోసం తెచ్చిందట ఆవిడ ధోరణిని బట్టి వెల్లడయిందేవిటీ అంటే — పిళ్ల తాతయ్యకు నచ్చినట్టు ఏదీ చెయ్యరని .. పెట్టరనీను. ఆయన ఆరోగ్యం అంతగా దిగజారి పోవడానికి కారణంగూడా అదేనని...,

అసలే మొదటినుంచి దీనామ్మకు అమ్మిణికి పచ్చగడ్డి వేస్తే భగ్గు మంటున్నప్పుడు, అమ్మో యీ మాటలన్నీ వింటూ దీనామ్మ ఊరుకోకేఁ ?

"అబ్బో... అంతటి ఆపేక్షకారిపోతూంటే పోనీ తీసుకు పోయి వో ఆయిదారు నెలల పాటు అట్టే పెట్టుకుని, ఆయనకు కావలసినవన్నీ రుచులు రుచులుగా చేసి, సుష్టుగా పెట్టుకోవచ్చుగా? అనవసరంగా యింత చిలవలు పలవలు చేసి చెప్పడం దేనికట? అంటూ అక్కసు పడ్డది దీనామ్మ.

ఇహ మాట మార్చాలని లీలామ్మ — "పిన్నీ ! రాజన్ అన్నయ్య దగ్గర్నుంచి ఉత్తరాలు వస్తున్నాయా..." అనడిగింది.

"ఆఁ ... రెండు నెలలు సెలవ పెట్టి వస్తానంటూ పోయిన వారమే రాశాడు."

"అలాగా..., ఈ సంగతి విన్నావా పిన్నీ ? కల్లువిలా వాళ్ల యిల్లుకట్టుకోబోతున్నారట. నిన్న వడ్రంగి కేశవన్ లేడూ స్థలం చూడటానికి వెళ్లాడట..." అంది పొన్నమ్మ.

"ఆఁ ? ఏవిటే నువ్వంటూంది ? మీ కుయుచ్చెరుక్కను బాబాయి యిల్లు కట్టబోతున్నాడనా ? ఎవరు చెప్పారే నీకు" అనడిగింది దీనామ్మ విస్తుబోతూ.

"మా శాం అన్నయ్య చెప్పాడు మూడు పెద్ద పెద్ద గదులుట, పోర్టికోట ... వంటిల్లుట ... ఒకటేవిటి .... అన్నీ ... పదిహేను వేలకి తక్కువ కాదన్నాడు మానాన్న..."

"ఇంతకూ వాళ్లో మంచి యిల్లుకట్టుకుని ఉండబోతున్నారన్నమాట," అంది లీలామ్మ.

"దానీ అన్నయ్య వాళ్లకి బొత్తులు— బొత్తులుగా డబ్బు పంపుతాడని కొంద

రంటారు.

వాళ్లేమో వొక్క పైసాగూడా పంపడంటారే ?

బ్లాకు మార్కెట్టులో డబ్బు సంపాయిస్తాడట,

వాడు అప్పుడప్పుడు గుట్టు చప్పుడు గాకుండా వచ్చి పోతూంటాడని వినికిడి...'' అంది పౌన్నమ్మ.

''లీలామ్మా ! ఏదో నువ్వన్నట్టు ఎవరంతట వాళ్లు సుఖంగా ఉండాల్సిన మాట వాస్తవమే ... కానీ.. మధ్య ఈ కుతంత్రం...కుట్ర —జిత్తులూ ఎందుకూ అంటూ'' —అంది దీనామ్మ.

''అంటే—?''

అదో గాథలే— అవాళ మావయ్య పోషణకి ఎవరెవరు ఎంతెంత యివ్వాల్సి ఉంటుందో తేల్చుకోవడానికని అన్నదమ్ములంతా యిక్కడ సమావేశం జరిపారులే.

అప్పుడు పౌన్నమ్మ తండ్రి వందరూపాయలిచ్చాడు. ఆయన యిచ్చిన వందలో యాభై ఖర్చయింది— యాభై మిగిలింది,

మీ కుయుచ్చెరుక్కను బాబాయి — ఇదుగో — మూడోనాటికల్లా తెచ్చి యిస్తానని చెప్పి ఆ డబ్బు కాస్త పట్టుకు చక్కాబోయాడు.

ఇప్పటికి సరిగ్గా నెలయింది — మళ్ళీ అయిపు లేదనుకో. మాకా బొత్తిగా యిబ్బందయింది. నేనే పోయి అడగవలసి వచ్చింది—యిలా ఉంటాయ్ వీళ్లచేసేపనులు.

పదిహేను వేలు వేలు కుమ్మరించి యిల్లు కట్టుకోగల స్తోమత ఉన్నవాడికి తీసుకున్న డబ్బు తిరిగి యివ్వాలనే యింగితం ఉండాలా వొద్దా — ఆ మనిషికి ? వీరు పెద్దమనుషులట — హవ్వ—''

''మరైతే అప్పుడు తాతయ్య ఖర్చుకేం చేశారు ?

''ఏం చేశాం —? భగవంతుడి మీద భారం వేశాం. పోయినవారమే అనుకుంటా — కుయప్పి వచ్చి వో పాతిక రూపాయలు యిచ్చి వెళ్లాడు.

అమ్మా పౌన్నమ్మా... ఈ గొడవంతా మీ నాన్నకు చెప్పకేవ్.... నీకు పుణ్యముంటుంది...'' అంది దీనామ్మ.

అంతలో లీలామ్మ ... ''ఇదిగో పిన్నీ ! ఈ పది రూపాయలు ఇమ్మన్నాడు నాన్న ... చేతిలో డబ్బు ఆడనందువల్ల ఇవ్వలేక పోయానని నొచ్చుకున్నాడు.

నా కోసం ఎంతో చేసి, —ఎన్నో యిబ్బందులుపడ్డ మా నాన్నకోసం నేనేం

చెయ్యలేక పోతున్నానంటూ అనుకుని అనుకుని బాధ పడతాడు పిన్నీ !''

''మీ నాన్న కనీసం అనుకోనన్నా అనుకుంటున్నారు... ఆపేక్ష ఉన్నప్పుడే అనుకోవడం గూడా జరుగుతుంది. నాకు తెలుసు... మీ నాన్న ఏదో... ఒక్కొక్కప్పుడు నోరు జారినా,— సహజంగా ఆపేక్ష— అంతఃకరణలున్న వాడు.''

''అయ్యోరాత .... యింట్లో చూడాలి పిన్నీ ! అయన ప్రతాపం ఇప్పుడు చూడు... నే రావడం వల్ల గూడా వాళ్ళకి బోలెడంత అప్పు అయింది గదా ! ఈ చిరాకులన్నీ పెట్టుకుని నాన్న అమ్మ మీద మాటికి ముందు విరుచుకుపడతాడు.''

''ఏమైనా చెప్పు .. మనసు మంచిదైతే — లోపలొకటి...పైకొకటి ఉండదు.

లీలా... నువ్వే ఆ డబ్బు మీ తాతయ్య చేతిలో పెట్టమ్మా... ఆయన సంతోషిస్తారు...'' అంది దీనామ్మ.

''ఎవర్రా అపీ...'' అనడిగాడు కుయెన్నాచ్చను.

''అదుగో... తాతయ్య లేచాడు... రావే పౌనమ్మ అంటూ లీలామ్మ పౌన్నమ్మా కుయెన్నాచ్చను మంచం దగ్గరికి వెళ్ళారు. అప్పటికింకా ఆయన కళ్లుమూసుకుని పడుకునే ఉన్నాడు.

''తాతయ్యా !''

''ఎవరు ?''

''నేను... పౌన్నమ్మని.''

''ఎప్పుడొచ్చావే అమ్మడూ ?''

''ఇంతకు ముందే.''

''మీ ఆయన రాలేదుటే ?''

''లేదు.''

''నీ పిల్లలేరే....?''

అనేసరికి లీలామ్మ అరచెయ్యి నోటికడ్డం పెట్టుకుని వస్తున్న నవ్వు ఆపుకుంది.

అంతలో... వంటింట్లోంచి దీనామ్మ వచ్చి — ''మావయ్యా ! పిల్లలు జెల్లలూ అంటున్నారు... అసలు వచ్చిన వాళ్లెవరో చూశారా... ? గుర్తుపట్టారా ?', అనడిగింది.

''అయితే వచ్చిందెవరంటావ్ ?''

''ఎవరో ... కళ్ళుతెరిచి చూడండి మరి!''

కుయెన్నాచ్చను అతికష్టం మీద కళ్ళు విప్పి చూశాడు.

"ఇదుగో... పుల్లుపరంప లీలాష్మ...కాలాయి పొన్నమ్మ మిమ్మల్ని చూడాలని వచ్చారు.''

''ఊఁ ...''

''మీరు సరే యివాళ వచ్చారు... రోజుచూసే 'చిన' తోనూ ఇలాగే మాట్లాడతారు మీ తాతయ్య. మేం విని విస్తు పోతూంటాం అనుకో. ఏవిటో లే... ఆయనకు రోజు రోజుకీ జ్ఞాపక శక్తి తగ్గిపోతూంది...'' అంది దీనామ్మ

''నా జ్ఞాపకశక్తి కేవిట్రా! నాకూ కల వచ్చిందమ్మడూ !.. కుయ్యమ్మ మీద —కుయ్యమ్మంటే—''

''విన్నాంలే—కుయ్యమ్మని మాకో మేనత్త ఉండేదని..., ఆవిడ మాటేనా నువ్వంటూంది?''

''ఆవిడ మీ రెండో బాబాయికంటే గూడా చిన్నదిట్రా—'' అంది దీనామ్మ.

''ఎలా ఉండేదని—? పచ్చని పసిమి—అన్నాడు కుయెన్నాచ్చను.

''ఇప్పుడవన్నీ నెమరువేసుకోవడం వల్ల లాభమేవిటిచెప్పు తాతయ్యా!

''ప్చ్— ఏం లేదు"—ఏదో గుర్తొచ్చింది.''

''మాపయ్యా! విన్నారా యీ విషయం? మీ అబ్బాయి కుయుచ్చెరుక్కను గారు ఉన్నాడే...పెద్దయిల్లు కట్టుకో బోతున్నాడట? నిన్ననే స్థలమూ అదీ చూసి నిర్ణయించారట,''

''అఁ?''

దీనామ్మ ఆ విషయం మరోసారి చెప్పింది.

''ఎవరు చెప్పారు?''

''పొన్నమ్మ చెప్పింది—ఠాంపట్టి చూసొచ్చాచట.''

కుయెన్నాచ్చను వో చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వు నిండుగా— నిర్మలంగా ఉంది.

అఁ— స్థలము ఉండొచ్చు —కొలతలు వేయుచ్చు—యిల్లు కట్టలేదు — ఆదేమని అడుగుతారా—వాడి తాహతు అంతేనంటా. వాడికి అమోఘమైన తెలివి తేట లున్నాయి — కానీ ఏం లాభం? అక్కరకు రావు—

వాడికున్న లౌక్యానికి— చాకచక్యానికి వాడీపాటికి లక్షాధికారై ఉండాల్సిన వాడు కదూ —.?

ఇంకా ఆ గుడిసెలోనే పడున్నాడుగా—? కూతుళ్ళిద్దరి పెళ్ళి అక్కడే చేశాడు.

ఇప్పుడిక ఆ పొరుగూళ్లల్లో ఉన్న మొగపిల్లల పోరు పడలేక పట్టుబలవంతాన యిల్లు కట్టాలనే నిర్ణయానికి దిగాడు కాబోలు.

ఎందుకంటే—వాళ్లకి పిల్లనిద్దామని వచ్చేవాళ్ళు చూస్తూ-చూస్తూ గుడిసెలో ఉన్నవాళ్లతో వియ్యమందడానికి వొప్పుకోరుగా —? పరువు తక్కువ గదా— అందు కనే— ఈ ప్రమేయానికి వచ్చి ఉంటాడని నాకు తోస్తూంది,

అనుకుంటారుగానీ,—కేవలం తెలివితేటలున్నంత మాత్రాన ఏమవుతుంది... భగవత్కృప ఉండాలిగా —?

నా అయిదుగురు సంతానంలోకి ఫిలిప్యోసే కొంచెం మేదకుడు! చిన్నప్పటి నుంచీ గూడా —వాడి స్వభావమేమిటంటే—వాడేక్కువ కష్టపడలేడు. మిగతా నలుగురూ అలాకాదు. బాగా నడుం వంచి చాకిరీ చేసేరకమే. మరి...అంతగా చాకిరీ చేస్తేనే గానీ ఆ రోజుల్లో యిల్లుగడిచేది కాదు. ఎక్కడెక్కడికో పోయి గడ్డి గాద మోసుకొచ్చేవాళ్లం. పేడ చేసే వాళ్లం. తెల్లవారుజామునే లేచి పార— పలుగు బుజా నేసుకుని పనికి పోయేవాళ్ళం...

నా పెద్ద కొడుక్కి కర్రపెత్తనం చెయ్యడం బాగా తెలుసు. రెండోవాడు ప౨ పాటల్లో మంచిచురుకైన వాడు. మా కుయుచెరుక్క నున్నాడంటే–, వాడు అప్పుడూ యిప్పుడూ కూడా ఒకటే ... సోమరి — టక్కరి...ఫిలిప్యోసు అసలా చాయలకే వచ్చేవాడుకాడు. వాడి వొంటికి చెమట పోస్తే వెంటనే వాడికిదగ్గూ— జలుబూ పట్టుకునేది. దాంతో వాడికి బడికి పోయేందుకు కూడా పడేదికాదు. వాడికి దాదాపు పదహారేళ్ళు వచ్చేసరికి—, ——

వాళ్ల మేనమామొకడు — రోడ్డు వేసేందుకు కాంట్రాక్టు పుచ్చుకుని— కూలీల్ని వెంట బెట్టుకు వచ్చాడు.

రోడ్డు మరమ్మత్తు చేయడమంటే— మంగిలికత్తి నూరి ఎడా పెడా గీరినట్టు— రోడ్డుకి రెండువైపులా అంచులంబడే కొద్దిగా చెక్కెయ్యడమన్నమాట.

ఆ పళాన నేనేం చేశానంటే—, వీణ్ణి వెంటబెట్టుకుపోయి— వీడు మావాడు— ఖాళీగా ఉన్నాడని మాట మాత్రం చెప్పగానే ఆయనా వీణ్ణి తన చేతికింద వేసుకున్నాడు.

ఆయన దగ్గర్నుంచి తిరిగి వచ్చేసరికి — మన వాడి దగ్గర కొద్దో గొప్పో డబ్బు చేరింది. అదే మొదలనుకో—

పనికిరాదనుకున్న బండ— పునాదిరాయి అయింది. అందర్లోకి వాడే

ప్రయోజకుడైనాడు''

''తాతయ్యా!''

''ఊఁ — ఊఁ''

''మళ్ళీ కళ్ళు మూసుకు పడుకున్నావేఁ ?''

''నిద్రపోవడం లేదు లేవే అమ్మడూ! మనసులో ఏవేవో ఆలోచనలు...

''అసలు నీకు ఈ ఆలోచనలన్నీ ఎందుకయ్యా?

''అమ్మడూ ! నువ్వు కాస్త నా వేలు పట్టుకోవే లేస్తాగానీ ... అన్నాడు కుయెన్నాచ్చను.

పొన్నమ్మ తన చెయ్యి ఆసరాగా యిచ్చి లేవదీసింది.

''ఆ చేతి కర్ర అందుకో తల్లీ : ''

''ఆ ( .. ఏవిటి ?... నువ్వు లేచి నడుద్దామనే ?''

''ఊఁ ... ఊఁ ... ముందా చేతికర్ర యిటియ్. కర్ర ఊతంతో లేచాడు. మనవరాళ్ళిద్దరి బుజాల మీద చేతులు వేసి పట్టుకుని అడుగులు వేసుకుంటూ వాకిట్లోకి వచ్చాడు చల్లటి గాలి తగిలేసరికి బాగా తెప్పరిల్లుకున్నాడు. ఎప్పుడూ పడుకుంటే గూడా విసుగ్గా ఉంటుంది. ... అసలు వాళ్లు లేవనిస్తేనా — కదలనిస్తేనా ... . ! కుయెన్నాచ్చను మనవరాళ్ళిద్దర్ని పరకాయించి చూశాడు. లీలామ్మ అందచందాల్లో ఏమిటి ... చాయలో ఏమిటి ... ఆరోగ్యానికేవిటి .... అచ్చంగా తల్లే.

ఫిలిప్పోసు కూతురుందంటే— అది చిన్నప్పుడంతా చీడపేలు కారుకుంటూ ఉండేది అయితే యిప్పుడు — వయస్సుతోబాటు మొహంలో కళ వచ్చింది,

ఎంతటి అనాకారికైనా .... వయస్సొస్తే,— కాస్తో కూస్తో అందం దానంతటఅదే వస్తుంది. అది ప్రకృతిసహజం ... కుయెన్నాచ్చను వచ్చి వసారాలో చతికిలబడ్డాడు.

''ఏమే ... అమ్మడూ ! మీ నాయనిప్పుడు గొడ్ల వ్యాపారం మొదలెట్టాడ్ఏవిన్నా .. నిజమేనా ....'' అడిగాడు

''నాకు తెలీదండి'' లీలామ్మ.

''డబ్బుకేఁ .... డబ్బు— వస్తుందనుకో ... వట్టి దిక్కుమాలిన పని .. ''

లీలామ్మ ఏం మాట్లాడ లేదు .... ఏమంటుంది కనుక ''తలప్పల్లి గ్రామంలో 'నాబు' — అని వో చెవులయ్యున్నాడు, వాడు దళారి. వాడు సంతలో రెండు మూడొందలు అలాగ్గా సంపాయించుకుంటాడు.

ఉదాహరణకి ... నువ్వో గొడ్డునిఅమ్మాలని సంతకితోలుకెళ్ళావనుకో ...

ఆ గొడ్డు కన్ను వంకరదో .... కాలువంకరదో అనుకో, నువ్వు నాణుని కలుసుకుంటావు.దళారి రుసుము యిస్తా ... సరుకు అమ్మి పెట్టమంటావు.

సరే,— వాడు వొప్పుకుంటాడు: క్రైస్తవుడొకడు ... రూపాయల సంచీ రొండిన పెట్టుకుని సంతలో ఎద్దుని కొనుక్కుందామని వస్తాడు.

అప్పుడు ఈ నాణు – ఏంచేస్తాడు...? ఆ వచ్చిన ఆసామితో సావాసం కడతాడు.

ఎంత ధరలో కావాలని అడుగుతాడు,

అవతలవాడు నలభై పైన - అరవై మించకుండా చూడమంటాడు,

వాడు డబ్బు రాబట్టుకోవాలిగా మరీ...?

అప్పుడు 'నాణు' ఆ ఆసామిని వెంటబెట్టుకుని నీ దగ్గరకొస్తాడు.

నిన్ను బొత్తిగా ఎరగనట్టే ఉంటాడు.

ఈ ఎద్దుని ఎంతకమ్ముతారని – అడుగుతాడు.

ఇంత అని వెల చెప్పగానే వీడా యెద్దుని పరిశీలించడం మొదలెడతాడు.

వాడోసారి దాన్ని నడిపిస్తాడు. దాని నోట్లో దంతాలు ఎన్ని ఉన్నాయో లెక్కబెడతాడు. వీపుమీద నిమురుతాడు. 'భేష్' – అంటూ ఆ కొనడానకి వచ్చిన ఆసామి చెవిలో ఏదో చెపుతాడు.

అంతే పనయి పోతుంది.

ఇదీ దళారీ చేసే యుక్తి......

అన్నట్టు...ఏం చెబుతున్నాను...?

ఈ విధంగా రెండు చేతులా డబ్బు సంపాయించి చిత్తుగా తాగి తందనాలు తొక్కేవాడా నాణు.

వాడికి చివరి చివరి రోజుల్లో గొంతు పూడుకుపోయింది. అసలు శబ్దమే వచ్చేది కాదు...'' అంటూ కుయెన్నాచ్చను చెప్పుకు పోతున్నాడు.

లీలామ్మ...పొన్నమ్మా నవ్వుకున్నారు.

దీనామ్మ వచ్చి... ''ఏవిటి మావయ్యా మీరు... ? వీళ్ళతో ఈ కబుర్లన్నీ దేనికి చెబుతున్నట్టు...?''

''ఆఁ,... ఊరికేనే... , ఊరికే చెబుతున్నాన్రా పిల్లలూ గంఛెంత,..? 'చిన్న'

- రాలేదా ?''

''వచ్చే వేళయింది.''

లీలామ్మ తన చేతిలో ఉన్న కాగితం పొట్లాన్ని తాతయ్య చేతిలో పెడుతూ, - 'నాన్న నీ కిమ్మన్నాడు తాతయ్యా'— అంది.

"ఏవిటీ...?''

''నాన్న నీ ఖర్చులకి వాడుకోమన్నాడు.''

''జోయిబాబు వచ్చేటప్పుడు నీకోసం వో ఉన్ని శాలువ తెమ్మని రాశా తాతయ్యా అంది పొన్నమ్మ.''

''జోయి బాబెవరే ?''

''వాళ్ళాయన ...'' అని చెప్పింది లీలామ్మ.

''అదేవిటే...మొగుణ్ణి బాబంటావేవిటే?

ఈ కాలంలో అలాగే పిలుస్తారంటూ లీలామ్మ, – దీనామ్మ పకపకా నవ్వారు.

''తాతయ్య యిక మేం వెళ్ళొస్తాం...'' అంది లీలామ్మ.

''సరే, — నేనూ...మీతో ఆ సందు చివరదాకా వస్తాపదండి.''

''అయ్యో .... అయ్యో ... ఇంకేమన్నా ఉందీ ... తాతయ్యా ... నువ్వు అంత దూరం రావడమే .. ?''

''ఓ, భేషుగ్గాను...''

''పిస్సి .... !''

''పిస్సిలేదు గిస్సిలేదు...పదండి...నే చెప్పాగదా...''

''మావయ్యా ఏవిటి మీరు మరీను ..నడిస్తేనేమో మీకు తల తిరుగుతుందాయె... పడిపోతారుగదా...!''

''నేనేం పడనుగానీ.... నువ్వూరుకో.''

దీనామ్మ మెదలకుండా ఊరుకుంది. ఆయనెలాగూ వినడని ఆవిడకు తెలుసు.

''అమ్మాయిలూ కాస్త పట్టుకోండే..."

''వచ్చేటప్పుడు—అచ్చన్ కుయున్నిగానీ, — సణ్ణినిగానీ తోడిచ్చి పంపండి తల్లీ! మీ బాబాయికి తెలిస్తే ఊరుకోరు...''అంటూ దీనామ్మ కేకేసి చెప్పింది.

వాళ్లు వెళ్ళారు.

పొన్నమ్మ—లీలామ్మ చెరో పక్కన పట్టుకుసీ నడిపిస్తున్నారు. గడపదాటి

వీధిలోకి వచ్చి సరిగ్గా నెల రోజులయింది.

నిజంగా ఆ నీలాకాశమూ, — పచ్చని చెట్లు, — పంటచేలు, — చర్చి, వగైరా లన్నీ మనస్సుకి ఎంత ఆనందాన్నిచ్చాయో ... కుయెన్నాచ్చనుకి బందిఖానాలోంచి బయటపడినంత సంబరం కలిగింది.

ఈ నేలంతా నా కాళ్ళకింద నలిగిందేగదరా ! ఈ చెట్లు చేమలు అన్నీ — నే చూస్తూ చూస్తూండగాపుట్టి పెరిగి పెద్దవైనవేగా ?

ఇంకా కొంతకాలంపోతే – నేనుండను ... కానీ ... ఈ గడ్డ ఈ చెట్టు పుట్టా ఎప్పటిలాగే ఉంటాయి.

మనమే ఉండముగానీ ... , ఎక్కడికి పోతామో .... ! స్వర్గానికో ... నరకానికో ... ? ఎవరికి తెలుసు ?

స్వర్గానికి పోయేటంత పుణ్యమేం చెయ్యలేదు ... ఆ మాటకొస్తే .... నరకానికి పోవలసినంత మహాపాపం ... ఏం కనబడటంలేదు ...

చెడు తలంపుతో ... కావాలని ... ఎన్నడూ ఏ పాపం చేసింది లేదు.

బ్రతుకు తెరువుకోసం కొద్దో గొప్పో చేసి ఉండొచ్చు. ఆ నాయరు వాళ్ళతో దెబ్బలాట జరిగింది ... అది పాపమా ? ఎందరో ... అదిరిపాటుతో ... అన్యాయానికి — అక్రమానికిదిగితే అరికట్టాను.

న్యాయ నిర్ణయం జరిగేటప్పుడు ... యెహోవా అనుచరుడుగూడా అవినీతిని అణిచేశాడట.

అయితే దావీదులాగా ఒక పాపం చేసినమాట ఖాయం. యెహోవా మోషేకి ఆదేశించిన పది సిద్ధాంతాలలో ఏదోదాన్ని — ప్రధానమైన దాన్ని ఉల్లంఘించాడట.

ఆ రోజుల్లో పాప పుణ్యాల గురించి ఆలోచించేందుకు తీరుబడిలేదట. అందువల్ల నరకయాతన ఉందో — లేదో.

ఆ ఆకాశాన్నుంచీ నిప్పులు కురిపించో ... గంధకపు చెరువులో తోయించో ఉండొచ్చు ... ఎవరికి తెలుసు ?

కుయెన్నాచ్చను చౌరాస్తాలో ఉన్న రామకృష్ణను దుకాణం వాకిట్లో ఉన్న బెంచీ మీద కూర్చున్నాడు.

రామకృష్ణనే లేచివచ్చి, — ఆయన్ని పట్టుకుని బల్లమీద కూర్చోబెట్టాడు.

"వ్యాపారం ఎలా సాగుతోంది ?"

''ఏదో ఉంచి ... ఏదో నెట్టుతున్నానంతే."

''మన వాళ్ళ సంగతి మీరెరగంది ఏముందీ .... కొనేటప్పుడే గానీ .... డబ్బిచ్చే టప్పుడు చొరవ ఉండదే ... అడిగితే కస్సు మంటారు ... ఏంచేస్తాం?''

''యాతనే''

''కుయెన్నాచ్చను బాబూ ! అన్నాననుకోకండి .... మీ అబ్బాయి దగ్గర్నుంచీ గూడా నా కింకా అరవై — డెబ్బయి రూపాయలదాకా రావాల్సిఉంది. సరుకు తీసుకుని నాలుగైదు మాసాలు దాటింది.''

''ఎవరు ... ? కుయుచ్చేరుక్కనేనా?"

''ఇంకెవరు ... ఆయనగారే.''

''అదేఁ....వాడు పోయినమాసం నలభయ్యో యాభయ్యో ఇచ్చినట్టున్నాడే...?''

''ఎక్కడిచ్చాడు బాబూ? నాలుగు పైసలుగూడా యివ్వందే....? అడిగితే ... నోరుపారేస్తాడు ... గయ్ఁ గయ్ఁ మంటాడు. సరే, — సరుకివ్వడం మానుకున్నా చెప్పొద్దూ ... ''

కుయెన్నాచ్చను యింకేం మాట్లాడలేదు. తన వాళ్ళని తనే బయటపడేసుకుంటే బాగుండదుగా మరి ?

అంతలో ఎక్కడ్నించి వచ్చాడోయేమో ఫిలిప్పోసు, సైకిలు ఆపి పట్టుకుని — ఆ దుకాణం ముందు నిలబడి ఉన్నాడు.

''నాన్నా ! ఇక్కడ కూర్చున్నావేఁ ?

''ఏవిట్రా ?''

''ఇక్కడ చతికిలబడ్డావేవిటి అంటున్నా?''

''అదా ..., కర్ర ఊతంతో మెల్లిమెల్లిగా నడవడానికి సాధన చేస్తున్నాలే. ఎంతసేపని ఆ మంచంమీద పడుండను?''

''ఎక్కడైనా ... దోవలో — పడిపోతే ?''

''ఏం కాదులే ......''

''ఏమీ కాదుట...., ఔను, — ఆ రోజు నీకు నేనిచ్చిపోయిన డబ్బు నీ మూడో కొడుక్కి అప్పిచ్చావుటగా?''

''....అని ఎవరు చెప్పార్రా నీకు ?"

''ఎవరో చెప్పార్లే .... యిచ్చావా లేదా?''

కుయెన్నాచ్చను ఏం మాట్లాడలేదు ....

"ష్ . ఊరుకో .... నడివీధిలో నిలబెట్టి నా తప్పొప్పులేం ఎంచుతావుగానీ... నువ్వు ముందు యింటికి నడవ్వోయ్ ... " అన్నాడు కుయెన్నాచ్చను.

ముసలాయన ఆ మాటనేసరికి — ఫిలిప్పోసుకి ఎక్కడలేని కోపం వచ్చింది.

"ఎలా ఊరుకోను ... . నీ కొడుకులకేమైనా సాయం చెయ్యదల్చుకుంటే, — నీ స్వార్జితమేమైనా ఉంటే యిచ్చుకో ... అంతేగానీ ... "

కుయెన్నాచ్చను అప్పుడుగూడా ఏం మాట్లాడలేదు.

"అవాళ నీ కొడుకులు — మనవలు అంతా వచ్చారుగా ... , ఎవరేం ఇచ్చారేం నీకు ?"

నువ్వే యిచ్చావ్ లే ... అయితే డబ్బు నా కిచ్చిన తర్వాత ... అదినాదే గదా ... , అది ఎవరికైనా యిచ్చుకోనీ ... మానుకోనీ, నా యిష్టం...నీకేవిటి?"

"అడ్డమైన వాళ్ళకీ కట్టబెట్టడం నా కిష్టంలేదు .. అందుకే చెబుతున్నా ఆ దిగమింగుడుగాళ్ళకి ఒకసారిస్తే చాలుతుందా? చీటికిమాటికి ఇవ్వడానికి ... ?"

"ఏమక్కర్లేదు ... పోరా ... పో ..."

"ఊ ... పోరా — ఇలాటి దిక్కుమాలిన అలవాట్లన్నీ చేస్తే ... ?"

"ఏరోయ్ ... ఏం ... మరీ చిన్నంతరం పెద్దంతరంలేకుండా పోయిందేరోయ్? నన్ను నువ్వు సతాయించడానికి వచ్చావా యేరా? పోరా ... . నడమంత్రపుసిరి ... నరాలమీద పుండు అన్న సామెతయిందే ... ? ఛండాలుడా ... నీచుడా ... "

ఈ అరుపులకి — కేకలకి జనం మూగారు

ఊరుకోవయ్యా కుయెన్నాచ్చను ... విన్నవాళ్లేమనుకుంటారు ... అని పోగైన జనంలోంచి ఎవరో అన్నారు.

అవె .... ఆ మాత్రం యింగితం ఆయనకుండాలెగానీ ... ఫిలిప్పోసు మెదలకుండా సైకిలెక్కి చక్కాబోయాడు.

అక్కడ చేరిన జనంలో ఒకడికి ఫిలిప్పోసంటే పడచల్లే ఉంది — వాడన్నాడు గదా —,

"సిగ్గూ ఎగ్గూ ... ఆ తండ్రికీ లేదు ... అంతకన్న ఈ కొడుక్కీ లేదు ఇద్దరూ ఇద్దరే ..."

వాడికి సాయం ఇంకొకడు :—

''ఆఁ ... డబ్బున్నంత మాత్రాన అంతా మా చేతిలోనే ఉందని విర్రవీగడం...
పెద్ద పొరబాటు.... అన్నాడు.

కీవరీతు చిన్నకొడుకు అచ్చన్‌కుయుఁ, కుయుచ్చెరుక్కను నాలుగో కొడుకు సణ్ణి కుయెన్నాచ్చన్ని తీసుకువెళ్ళడానికి వచ్చారు.

తాత మనవళ్ళిద్దరితోనూ బయలుదేరాడు.

నడిబజార్లో కూర్చుని ... ఇంతగా నోరు పారెయ్యడం .... ఈ రగడ తప్పే...
అయితే అవతలవాడు అంటూంటే నోరు నొక్కుకొని ఊరుకోవడం కుదురుతుందా ?

అసలు బలహీనంగా ఉన్నప్పుడు యిల్లు కదలడమే పెద్ద పొరబాటు.

''ఇంతదూరం ఎందుకొచ్చావ్ చెప్పు తాతయ్యా ?''

''నడవడం గుర్తుందో — మర్చిపోయానో చూద్దామనిరా.''

''భలేవాడివే ...'' అన్నాడు సణ్ణి.

సణ్ణివన్నీ పెద్దకబుర్లు. నిబ్బరానిగ్గానీ, తెలివితేటలకిగానీ. అంతా ఆ తండ్రే. దుంకుముక్కలా ఉంటాడు.

వెన్ను విరుచుకుని వాడు నడుస్తూంటే — ఆ నడక — ఆ తీరూ చూడాలి.
ఎరగనివాడైతే, — తప్పకుండా వోక్షణం ఆగి, చూసి మరీ పోతాడు.

''ఒరేయ్ ... ! నీ కెన్నేళ్ళురా ?''

''నాకా ? అచ్చన్‌కుయుఁకా ?''

''నీకేరా''

''పదిహేను''

'నాకు పదహారు నిండాయి' — అన్నాడు అచ్చన్‌కుయుఁ.

కుయెన్నాచ్చన మనవళ్ళిద్దర్ని మార్చి మార్చి పరికించి పరికించి చూశాడు.

పదిహేనేళ్ళవాడు — పదహారేళ్ళవాడి అన్నంటే నమ్మేటట్టు ఉన్నాడు.

సారవంతమైన నేలమీద ఎదిగిన చెట్టల్లే, — మంచి ఏపుగా, నేవళంగా ఉన్నాడు.

మరో సంగతిగూడా ఉంది. వీడి తల్లుందే ....

అయిదుశేర్ల బియ్యపు అన్నం ... అయిదు ముద్దలుగాచేసి, తిని హరాయించుకోగల శక్తున్నది .... అంత తిండిపుష్టి. దానికి తగినట్టే లక్షణమైన ఆకారమూ ... శరీరమూను.

''ఎన్నో క్లాసురా నువ్వు ?''

''సిక్స్‌త్.''

''మెట్రిక్యులేషను అయినాక ఏం చెయ్యాలనిరా నీ ఉద్దేశం ?''

''మా నాన్నేమో ... ఎక్కడికన్నా పోయి ... నౌకరీచేసి నాలుగు డబ్బులు సంపాయించుకోమంటాడు ...'' అన్నాడు అచ్చన్‌కుయుం.

''నిజమే .... వాడు అంతకంటె ఏం చెబుతాడులే ?''

''నేను మా దానీ అన్నయ్యతో కలసి బొంబాయి వెడతా''— అన్నాడు సణ్ణి.

''ఊఁ ... ఎక్కడికి పోయినాసరే,— కీపరీతు చెప్పినట్టు బ్రతుకు తెరువు చూసుకోండిరా.''

''రాజన్ అన్నయ్యని అడిగితే .... నన్నుగూడా మిలిటరీలో చేరుస్తాడా తాతయ్యా ... '' అనడిగాడు అచ్చన్‌కుయుం.

''అడుగుతే సరి ... ఎలాగూ వచ్చేనెల్లో వస్తున్నాడుగా...''

గుమ్మందాకా చేరుకున్నాక — ఇద్దర్నీ యిక వెళ్ళమని పంపించేశాడు.

లోపల్నుంచి ఏవో కబుర్లు వినబడుతున్నాయి. ఎవరా అని దగ్గరికి వెళ్ళి చూస్తే— 'కురుప్'.

సిసిలీకి రెండుపేర్లా యేవిటి ... ఇంట్లో పేరొకటి— బళ్ళో పేరొకటీనా... అనడుగుతున్నాడు కురుప్.

''ఏవిటేవిటి ?''

''ఓ కుయెన్నామాప్పిళ్ళా ... వచ్చేశావే ... ? సిసిలీ ఇవాళ బడినుంచి నాతో వచ్చింది''.

నేను ఆ దారంట వస్తూంటే ... 'కురుప్‌మామా'-- అని కేకేస్తూ పరిగెత్తుకు వచ్చి నా చెయిపట్టుకుంది. అప్పుడు దీని సావాసగత్తెలు— మరియమ్మా మాఘూ.... వెడుతున్నావటే — అనడిగినప్పుడు నాకు తెలిసింది ... 'సిసిలీ'— అని యింట్లో ముద్దుగా పిలుచుకునే పేరు కాబోలు అనుకున్నా. మరియమ్మవాళ్ల నాయనమ్మ పేరులే. క్రీస్తుప్రభువు తల్లిపేరు అదేననుకో ... అన్నాడు కుయెన్నాచ్చను.

''తెలుసు ... వల్లత్తోలు రాసిన 'మగదాల ఊరి మరియమ్మ' చదివాను.

ఏడవ్వమ్మా ... ఏడవ్వమ్మా !

మాననీయా ... మరియమ్మా !

ఏడ్చేవాళ్ళని ... ఏసుప్రభువే,

.... ఓదార్చుతాడు లేమ్మా'' అని .... రాశాడు.

''కురుప్ పొరబడ్డాడు. మగదాల ఊరి మరియమ్మ వేరు. ఏసుప్రభువు తల్లి మరియమ్మ వేరు ...''

''అలాగా ?''

మగదాల ఊరి మరియమ్మ పాపాత్మురాలు.

ఏసుప్రభువు పోనాడు పో ఫరీదీ (యూమల్లో ఒక తెగవాడు) యింట భోజనానికి కూర్చుండగా— ఆ నగరంలో ఉండే ఒక పాపాత్మురాలు పాలరాతిగిన్నెలో అత్తరుపోసి తీసుకువచ్చి—, తన కన్నీటితో ఆ ప్రభువు పాదాలుకడిగి, తన శిరోజాలతో తుడిచి, ఆ పాదాల్ని ముద్దుపెట్టుకుని అత్తరు పూసిందిట.

ఏసు ప్రభువుని ఆహ్వానించిన ఆ ఫరీదీ ఉన్నాగే మరియమ్మని చూసి... అయ్యో ఇది పాపాత్మురాలుగదా .... అనుకున్నాడు లోలోపల. అతని మనస్సులో ఉన్న భావాన్ని తెలుసుకుని ఏసుప్రభువు— ఏమన్నాడంటే,—

చూడు సిమోన్ ! .. ఒక వర్తకుడున్నాడు. ఆయనకో యిద్దరు అప్పుల వాళ్లున్నారు. ఒకడేమో అయిదొందలు, మరొకడేమో యాభై బాకీఉన్నారు. అప్పు తీర్చేందుకు యిద్దరిదగ్గరా డబ్బుల్లేవు. అందువల్ల ఆ వర్తకుడు వాళ్ళిద్దరి బాకీ రద్దు చేశాడు. అప్పుడు వాళ్ళిద్దర్లో వర్తకుణ్ణి ఎవరెక్కువ ప్రేమిస్తారంటావ్ ?

ఎక్కువ బాకీ చేసినవాడేనని నా ఉద్దేశం— అన్నాడు సిమోను.

సరిగ్గానే చెప్పావు ...

అంటూ ప్రభువు ఆమెవంక చూస్తూ సిమోనుతో అన్నాడుగదా— ఈ మనిషిని చూడు ... నేను నీ యింటికి వచ్చా ... నువ్వేమో నాకు కాళ్ల కడగలేదు ... కానీ ఈమె నా కాళ్ల తన కన్నీటితో కడిగి తన శిరోజాలతో తుడిచింది.... ఔనా...అని

ఆమెతో — నీ నమ్మకమే నిన్ను కాపాడుతుంది ... నిశ్చింతగా వెళ్ళిరా అని చెప్పాడు

ఆవిడే మగదాల ఊరి మరియమ్మ. ఆవిడ పరంగానే మరో విషయంగూడా చెప్పారు.

ఈ మగదాల ఊరి మరియమ్మాను,— ఏసుప్రభువు తల్లి మరియమ్మాను ఏసుప్రభువును శిలువ వేసినపుడు వాళ్ళిద్దరు సమానంగా దుఃఖించారట.''

''ఔను... ఈ కథంతా నాకూ తెలుసులే.''

అంతలో సిసిలీ వంటింట్లోంచి పరిగెత్తుకుంటూ వచ్చి– ''తాతయ్యా! రాజన్ అన్నయ్య వచ్చేనెలలో వస్తాట్ట ... ఉత్తరం వచ్చింది ...'' అంది.

''ఏవిటీ ... అమ్మడూ?''

''అహఁ... రాజన్ అన్నయ్యన్నాడే.... వచ్చేనెల్లో వస్తున్నాట్ట.''

''భేష్''

''మరైతే రాజనన్నయ్య తెచ్చే వస్తువుల్లో కురుప్‌మావయ్యకు గూడా ఏమన్నా యిస్తావా ...'' అనడిగాడు కురుప్.

సిసిలీ ఆలోచించి,– ''తెచ్చాక ... చూసి ... తర్వాతే చెపుతా'' అంది.

''అమ్మో గట్టిదే ... ఏమో అనుకున్నా .... చిన్నపిల్లయినా తెలివిగలదే'' అన్నాడు కురుప్.

''ఏమయ్యా పాము,- పిల్లయితే మాత్రం విషం ఉండదా? అలాగే అనుకో. ఆడవాళ్ళ తెలివితేటలు రెండురకాలు. ఒకటి ... ఇతరుల ఎత్తులకి మోసపోనూగలరు. రెండోది- సమయం వచ్చినపుడు కనిపెట్టి జిత్తులు చేయనూగలరు.

ఈ రెండూగూడా ఏదేను తోటలోనే మొదలైనాయి.

ఒక సైతాను పాములాగా మారి ఆడమనిషి దగ్గరకు వచ్చింది. ఆ ఆడమనిషేమో ఆ పాముకి లోబడిపోయి దాసోహమంది. ఆ సైతాను చేసిన దుర్బోధవిని,– ఆడమనిషి– జ్ఞానఫలమైతే తినేందుకు యోగ్యమైంది, చూపులకి అందంగాఉంది. తింటే వివేకం కలుగుతుందీ కనుక ఆ జ్ఞానఫలాన్ని కోసుకు తినేసింది.

ఆదాము,— కూడా ఉన్నట్టయితే అది కుదిరేదా?

తను జ్ఞానఫలాన్ని తినడమే కాకుండా భర్తకుగూడా పెట్టిందిగదా! సెబాస్.... అదీ తెలివంటే.

ఇంకా కథ ఉంది విను.

లాబానుకి రాహేలు–లేయా అని యిద్దరాడపిల్లలు. యాకోబు వాళ్ళిద్దర్నీ తీసుకుని ఉడాయించాడు.

లాబాను ఆయన అన్నదమ్ములు యాకోబు వెంటబడి వెంబడించి దోవలో పట్టుకున్నారు.

రాహేలు గృహదేవతా విగ్రహాలు ఎత్తుకుపోయింది. వాటిని రాబట్టాలి

అప్పుడు చూడాలి దాని తెలివి. విగ్రహాల్ని వొంటెమీద వేసిన సామగ్రుల్లో దాచేసి పైన ఎక్కి కూర్చుంది.

నరే, — అంతటా వెతికి వెతికి లాబాను రాహేలు దగ్గరకు వచ్చేసరికి,— ఏమందంటే,— మీ ఎదుట నేను లేవనందుకు ఏమీ అనుకోవద్దు. నేను కడగా ఉన్నా నని చెప్పి ఆ- తండ్రిని మోసగించి పంపించేసింది .... తెలుసా ?''

''భలే... భలే ఎత్తువేసిందే .... ?''

అంటూ కురుప్ చుట్టూ మార్మోగేటట్టు నవ్వాడు.

''నిజమే ఆడవాళ్ళ తెలివి— చాకచక్యానికి పురాణాల్లో యిలా ఎన్నో ఉదా హరణలున్నాయి.

పురాణాలదాకాగూడా వెళ్ళక్కర్లేదు.—

బటక్కనపొట్టలో వో విచిత్రం జరిగింది ... ఉణ్ణియమ్మ అనే ఆవిడ పాలాట్ట కోమన్‌ని తన శిరోజాల్లో దాచేసిందిటి. తోణ్ణూరాం వీటి కురుప్‌ల యింటి ఆడపడుచు ఉణ్ణియమ్మ. ఆ ఉణ్ణియమ్మేమో వాళ్ళకి గర్భశత్రువులైన కోమన్‌ని ప్రేమించింది. ఆవిడ స్నానానికని చెరువుకి వెడితే ఆవిడవెంట, వెంటబడి ఈ కోమన్‌గూడా వెళ్ళి,— ఆవిడతోబాటు చెరువులో దిగాడు. ఆవిడ పలచని బట్ట కట్టుకుందిట. నడుంలోతు నీళ్ళల్లో దిగిఉందిట. ఆవిడది ఒత్తయిన తలకట్టు. ఆ జుట్టుముడి విప్పి విరబోసుకుని- ఆ శిరోజాలకింద కోమన్‌ని దాచేసిందిట. ఆ అన్నదమ్ములు అంతటా వెతికారుట. కానీ . ఏం లాభం ? వలవేసి వెతికారు ... గాలాలువేసి గాలించారు కానీ ప్రయో జనం శూన్యం... వచ్చినదారినే తిరిగి చక్కాపోయారుట.

వాళ్లటు పోగానే ఉణ్ణియమ్మ వాణ్ణి నుట్టుచప్పుడు కాకుండా తన యింటికి తీసుకుపోయిందిట ... అదీ కథ''

''దీన్ని బట్టి కుయెన్నామాప్పిళ్లా ... ఆ ఉణ్ణి అమ్మది ఎంత తలకట్టో ...'' ఇటు అటు తొంగి చూసి కుయెన్నా —

'పడుకుంటే మంచమంతా పరుచుకుంటుందన్న మాట ... అన్నాడు మెల్లిగా ... "

''ఆరి ... ఆరి ... నీ తస్సాదియ్యా ... '' అంటూ కురుప్ పగలబడి నవ్వాడు

''భలేగా అన్నావ్''.

''ఏమిటి ?''

''అదే ... నువ్వు వర్ణించడమే.''

''వర్ణన కాదు ... ''

''అయితే ... ''

''స్వానుభవమే.''

కురుప్ విస్తుబోయి ... అలా నోరుతెరుచుకు ... చూస్తూ ఉండి పోయాడు ''... అరె ... యింతకాలం ఈ సంగతి చెప్పనే లేదేః ?''

''ఆ ... చెప్పేందుకేముంది ... ఏదో పాతపురాణం గుర్తొచ్చింది.''

చెప్పకుండా దాచా వన్నమాట"

''ఇక్కడ కూర్చుని చెప్పడం బాగుండదు. కోడలు వింటుంది. అది కాదు గానీ ... ఏదో ముప్పయిఅయిదేళ్లప్పుడు చేసిన పొరబాటును గురించి తొంభై యేళ్ళ వయస్సులో చెప్పుకోవడమేమిటి ? అయినా ఆకథ అందరికి తెలిసిందేకానీ ... తేలింది కాదులే. మా పిల్లలకే తెలుసు' మానాన్న మాకు పరువు మర్యాదల్నీ వారసత్వంగా యిచ్చాడని మా పెద్దవాడు అన్నాడు. ఏవిటో గతం తవ్వుకుని లాభమేమిటిలే."

''నాన్న !''

తిరిగి చూశాడు. కయ్యిచ్చేరుక్కాను మంచం దగ్గర నిలబడి ఉన్నాడు.

''ఏవిటి ?''

"నేను నీతో వోమాట చెప్పాలని వచ్చా.''

''చెప్పు''

''అది నీ వొక్కడికే చెప్పాలి.

అయితే ఏదో వ్యవహారమే ... అని శివరాం కురుప్ గ్రహించి, నేనిక లేస్తా కుయెన్నామాప్పిళ్ళా ... అన్నాడు.

''మందు రేపటికి అయిపోయింది. సాయంకాలానికి పట్టుకురా.''

''అలాగే ...''

''ఇంద ... డబ్బులు తీసుకుపో ...

''తర్వాత తీసుకుంటాలే ...'' అంటూ కురుప్ గడపలు దిగి బయలుదేరాడు.

''నాన్నా ! నీకు సల్లమందు తెచ్చి పెట్టాలంటే, — నీ కొడుకులు మనమలు ఉండగా, ... డబ్బిచ్చి బయట వాళ్ళని బతిమాలు కోవాలిసిన అగత్యమేమొచ్చిందీ

అంట ?

కురుప్ వెడుతున్న వాడు కాస్త వెనక్కి తిరిగి ఆగాడు.

''కురుప్ నువ్వెళ్ళు ... రేపు కలుసుకుందాంలే ....'' అన్నాడు కుయెన్నా ... ఎక్కడ వినిపోతాడోనని ...

నే నడుగుతున్న దదే ..., రేపెందుకు కలుసుకోవాలనే అడుగుతున్నా ?

''నాన్నా నీకేం కావాలో చెప్పు .... నే కొని తీసుకొచ్చి యిస్తా ... లేదూ ... నా పిల్లల్ని పంపించి తెప్పిస్తా ... అంతేగానీ ...'' ఎంతో ప్రాధేయపడి అడిగి తేనేగానీ మొగ్గనటువంటి కురుప్‌కి తలకొట్టేసినట్టనిపించింది.

''కుయుచ్చెరుక్కను మాప్పిళ్లే. ఏం... మీ నాన్నతో మాట్లాడితే నేరమా ? ఆయనడిగిన మందుతెస్తే అపరాధమా ?''

''నువ్వు మా యింటికి రావడానికి తగవు ... రావక్కర్లేదు. నీ అత్తవారి వేపు వాళ్లకి మాకు వచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. వాళ్ళ అన్నదమ్ముల వాళ్లంతా కలిసి మమ్మల్ని తుదముట్టించాలని వచ్చారు. కానీ.... మేం... అంటే ఏమనుకున్నావ్ ...? మీ నలుగురు బావమరదుల్ని పరలోకానికి పంపించేశాం. మరో ముగ్గురో నలుగురో ముక్కుతూ మూలుగుతూ చచ్చారు. మా వాడొక్కడు పోయాడు.

అయినా యివ్వన్నీ నీకుచెప్పి లాభమేమిటిగానీ,— నీకంటూ అసలో పరువూ— మర్యాదా అంటూ తగలబడితే అనుకోవచ్చు.

నాలుగు డబ్బులు పడేస్తేచాలు గడ్డితినమన్నా తింటావ్.''

''ఓరి దుర్మార్గుడా ! పోముందు ... నా యింట్లోంచి, నీకెన్ని గుండెలురా...'' అంటూ కుయెన్నాచ్చను గొంతుచించుకుని గావుకేకలు పెట్టాడు.

''కుయెన్నా మాప్పిళ్ళా... నువ్వూరుకోవయ్యా నేచెపుతా... నంటూ శివరాం కురుప్,— ''ఇదుగో కుయుచ్చెరుక్కను మాప్పిళ్ళే : నువ్వు చదివిన బళ్ళో నే చదవ లేదు. నీలాగా మాట్లాడ్డం నాకు చేతకాదు.

నేనీ గడపలో కాలుపెట్టవచ్చో— లేదో ఈ యింటివాళ్లే నిర్ణయించాలిగానీ నువ్వు కాదు. వాళ్లు కనుక రావద్దంటే— రావడం మానేస్తాగానీ ....

మీ విరోధులయింటి పిల్లని నే పెళ్ళిచేసుకున్నమాట వాస్తవమే కానీ,— కందకు లేని దురద కత్తిపీటకన్నట్టు... దాంతో నీకేం సంబంధం ? మీ అన్నదమ్ములంతా ఊరుకుండగా లేంది... మధ్య నీకేవిటి నాతో ... ? అసలు విషయం బయటపెట్టలేక

... అంతేనా ? అదే లంచం పుచ్చుకోవడం... దొంగసాక్ష్యం చెప్పడం...

''అది నీపని.... ఎక్కడికి పోయినా— పోయిన చోటెల్లా ఆడపిల్లల వెంట బడటం..., పెళ్ళి చేసుకుంటానని, నమ్మించి దగా చెయ్యడం ... ఇదేగా నీపని.

ఇంతకుమించి యిక్కడ అననుగానీ,— బయట కనబడతావుగా అప్పుడు ...''

''ఓ .... ఎక్కడికి రమ్మంటావో చెప్పు.... వస్తా .. '' అంటూ కురుప్ జారుకున్నాడు.

కుయుచ్చేరుక్కను—

''నాన్నా ! నువ్వు తిట్టినాసరే,— తిమ్మినాసరే, నేనేం అనుకోను... కానీ ... తప్పు జరుగుతుంటే మాత్రం తప్పకుండా అడ్డుకోవాల్సిందే...

నిన్నో సలహా అడుగుదామని వచ్చా ... కానీ, ... నువ్వు నన్ను వెళ్ళిపొమ్మన్నావ్...

ఔన్లే... నీయిల్లుగదా మరి ... అయితే నేనూ యీ యింటికోసం చెమటోడ్చి కష్టపడినవాణ్ణే ... ఆమాటమాత్రం మర్చిపోకు నాన్నా ! నీ సంతానంలో అందరూ ప్రయోజకులే... నే తప్ప నేనే అప్రయోజకుణ్ణి...'' అంటున్నప్పుడు కుయుచ్చేరుక్కను గొంతు విపరీతంగా గద్గదమైపోయింది...తడి ఆరిపోయింది...

''దీనామ్మా ! అబ్బాయికి కాసిని మంచినీళ్లు తెచ్చిపెట్టమ్మా !'' దీనామ్మ పెద్ద గ్లాసుతో మంచినీళ్లు తెచ్చియిచ్చింది.

అవి తాగి కుయెచ్చరుక్కను వెళ్ళిపోయాడు.

దీనామ్మ ఖాళీగ్లాసు చేత్తో పుచ్చుకుని మామగారి దగ్గరకు వచ్చి

''మావయ్యా !''

''ఊఁ ...''

''ఒక మాట అడగనా ?''

''ఏమిటో... అది ?''

''ఈ కురుప్‌దగ్గర నల్లమందు కొనడం మానేయరాదూ ? అతడు యిక్కడకు రాకుండా ఉంటే బావుండునే ...'' అంది.

''ఏం ? వాడిక్కడికి రావడం నీకూ గిట్టలా ?''

''మీరూ మీరూ కూర్చుని మాట్లాడుకుంటే నాకేం అభ్యంతరం లేదుగానీ...''

''అయితే యింకే, ... రానీ, ... నా ఆఖరిక్షణంవరకు వస్తాడు. నా కోసం వస్తాడు... అమ్మా... చూడు కుక్కలు మొరిగినంత మాత్రాన తలుపులు తరుచు కుంటాయా చెప్పు ?''

''సరే మీ యిష్టం ... నేనేం చెప్పను ?'' అంటూ దీనామ్మ లోపలికి పోయింది.

# అయిదు

బడికి వెళ్లబోతూ సిసిలీ తాతయ్య దగ్గరికివచ్చి—''తాతయ్యా ! నా ఫ్రాక్ ఎలా ఉందీ—'' అనడిగింది.

''బావుంది తల్లీ !''

''కళ్లు మూసుకునే ఎలా చెప్పగలవ్ ?'''

''కళ్లు మూసుకున్నా చూడగలనుగా !''

''అబద్ధాలు...

''చెపుతా చూడు ... ద్రాక్షగుత్తులు .... ఆకులు ఉన్న ఫ్రాక్ .... ఔనా ?''

''ఎలా కనుక్కున్నావ్ తాతయ్యా ?''

''చెప్పాగదా ! జ్ఞానులైన వారికి లోపల మరో కన్నుంటుంది. తెలిసిందా ? పూర్వం ఎలియాస్ అనే జ్యోతిష్కుడుండే వాడులే. ఆయనకి దేశంలో ముందు ముందు రానున్న —కరువు కాటకాల్ని ఎవరు చూపెట్టారనుకున్నావ్... ...యెహోవాయే. యెహోవా భక్తులు కనుక్కోలేనిదంటూ ఉండదనుకో తల్లీ !''

''అయితే— తాతయ్యా నువ్వుగూడా భక్తుడవేనా ?''

''ఔను'?...

''నీ కన్నీ తెలుస్తాయా ?''

''తప్పకుండాను.''

''నే పరీక్షలో ప్యాసవుతానా చెప్పు చూద్దాం.''

''అవుతావు.''

''వచ్చే సోమవారమే మాకు పరీక్ష.''

"బాగా చదివావా ?''

''చదివానులే గానీ.— మరి దేవుడికి చెప్పి ప్యాసుచేయించవా!''

"అదేలా కుదురుతుందమ్మా ? మన ప్రయత్నం మనం చేస్తే మిగతాది భగవంతుడు చూసుకుంటాడు బాగా చదివి పెట్టుకో.''

''సరే... తాతయ్యా నేవెడుతున్నా."

''వెళ్లిరామ్మా.''

చిన్న ఎంతో చలాకీగా దూకుతూ... గెంతుతూ పరుగు తీసింది. శబ్దం మాత్రం వినబడుతుంది. అలా వెడుతున్నప్పటి ఆపిల్లదాని రూపాన్ని కుయెన్నాచ్చను మనసులో ఈ విధంగా ఊహించుకుంటాడు:

మొహం మీద పడే ముంగురుల్ని వో చేత్తో సవరించుకుంటా ఇంకోచేత్తో రబ్బరు బాండు వేసిన పలకా పుస్తకాలు పట్టుకునుంటుంది.

పరమ గీతంలో చెప్పినట్టు— నువ్వు ఫరోయొక్క రథాశ్వముతో సమానము. ఏన్గెదీ ద్రాక్షతోటలోని — కర్పూరపు పూగుత్తులతో సమానము. షారోను పొలంలో పూసే సుందరమైన గులాబి పుష్పముతో సమానము నీ కన్నులు గువ్వకన్నులు. నీ తల వెంటుకలు గిలాదు పర్వతం మీద మేకల మందను పోలిఉంటాయి. నీ పెదవులు ఎరుపు నూలును పోలిఉన్నాయి. నీ చెవులు దానిమ్మ గింజల వైఖరిలో ఉన్నాయి. నువ్వు లేడి కూనల్లే చెంగు చెంగున ఎగురుతూంటావు.... మావిడి పూతల్లే మనోహరంగా ఉంటావని....

నాలుగైదు వసంతాలు గడిచేసరికి సిసిలీ! నీకు వయసొస్తుంది బుగ్గల్లో మెరు పొస్తుంది. కళ్లల్లో కాంతి వస్తుంది. పాదాలవరకు పరికిణీ కడతావు. అంటే— అప్పటికో పది— పన్నెండేళ్ళదానివవుతావు ... అంతే అయినా మీ అమ్మ మాత్రం నిన్నేం అంటుందనుకున్నావ్—? దీనికి పెళ్ళియీడైతే వచ్చింది గానీ,— పచ్చడి చెయ్యడమన్నా రాదుగదా... అని గూటిస్తుంది-

మరో మూడు నాలుగేళ్ళు గడిచాక — కిలకిలా నవ్వవు... అటూ యిటూ చూడవు .... వంచిన తల ఎత్తవు.... ఎన్నో కొత్త విషయాలు ఆకళింపు చేసుకుంటావు. అయినా ఏమీ ఎరగనట్టే ఉంటావు. మనసులో యేం ఉంధదు గానీ—, ఎప్పుడు ఏదో

పరధ్యానంగానే ఉంటావు   నీలో నువ్వే నవ్వుకుంటూ ఉంటావు.

అదోమలుపు ... ఇప్పుడిక నీకో తోడు కావాలి. ఒక చైత్రమాసం రాగానే నువ్వు కల్యాణమండపంలో కాలు పెడతావు. మళ్ళీ చైత్రం వచ్చేసరికి వో చంటి బిడ్డ తల్లి వవుతావు. గృహిణివై గృహకృత్యాలు నిర్వర్తించడంలో ఆరిందావైపోతావు. అచ్చం మీ అమ్మలాగే — కదిలిస్తే,- కూరనార, వంటావార్పు రోలు రోకలి ముచ్చట్లే చెబుతావు

...క్రిస్మస్ వస్తుంది చర్చిలో వార్షికోత్సవాలు జరుగుతాయి. నీ పెద్దకూతురికి చెల్లెళ్లో .... లేకపోతే నీ పెద్ద కొడుక్కి తమ్ముళ్ళో చెల్లెళ్ళో పుట్టుకొస్తారు.

దక్షిణం వైపు స్థలంలో పనిచేస్తున్న కూలీల అజ్మాయిషీ కనుక్కోడానికి నువ్వేవెడతావు.

యాభై రూపాయలుంటే యిమ్మని అప్పు అడిగేందుకు వచ్చిన తోమాసుకి ఏం జవాబు చెప్పాలా అని మీ ఆయన కాళ్లు కాలిన పిల్లిలాగా తిరుగుతూంటాడు. అప్పుడు నువ్వొచ్చేసి - "చేతిలో చిల్లిగవ్వ లేదనుకో అన్నయ్యా ! నిన్న వచ్చినట్టయితే ఏమైనా వీలుపడేది..." అంటూ సునాయాసంగా చెప్పేస్తావు

కాల చక్రం తిరుగుతూనే ఉంటుంది. చాలా చుట్లుచుడుతుంది నీ పిల్లలు కాలేజీ చదువులకి వస్తారు. వాళ్ళచదువులకోసం...ఫీజులు కట్టాలి...పుస్తకాలు...మీ ఆయనకి మధుమేహం .. పట్టుకుంటుంది. ఆయన మందూ మాకూ కొనాలంటే డబ్బుకావాలి చాలా యిబ్బందిగా ఉంటుంది. పిల్లదాని పెళ్ళికోసం దాచి ఉంచిన డబ్బులోంచి కొంత తీసివాడతావు.

మీ భార్యా భర్తలిద్దరూ సంప్రదించుకుంటారు ... ఈ పద్ధతేం బాగా లేదనుకుంటారు... ఎప్పుడు దిగులూ ...చీకూ ... చింతా... ఇహ యీనావ వొడ్డెక్కించే భారం నీ మీదే పెడుతున్నానంటాడు మీ ఆయన.

ఒకనాటి రాత్రి ... వేసవికాలపు రాత్రిసిసిలీ — అంటూ మీ ఆయన నిన్ను పిలుస్తాడు.

ఏమిటి?

నిద్రపోలా ?

లేదు.

ఏం?

ఏవిటి ఆలోచనలు...

నాలుగైదు రోజుల్నించి నాకేదో చాలా నీరసంగా ఉంది.

నాలుగైదు ఇంజెక్షన్లు పుచ్చుకుంటే సరి.

అదే అనుకుంటున్నా... అమ్మాయిని గురించి ఆలోచిస్తూంటే మనసుకి ఏదో దిగులుగా ఉంది.

తీరని సమస్య అవుతుంది...అతని నీరసం తగ్గదు. ఒకానొక రోజున అతగాడు ఈ లోకం నుంచి శాశ్వతంగా వెళ్ళిపోతాడు అయినా నువ్వు నిబ్బరం కోల్పోవు.

నీ పెద్దకొడుకు పెద్ద పరీక్షలో ప్యాసవుతాడు ఉద్యోగం దొరుకుతుంది. నీ ఆడపిల్ల పెళ్ళి చేస్తావు.

తర్వాత ... నీకో కోడలు వస్తుంది. అపైన నీ కూతురు— కోడలు బిడ్డ తల్లు లవుతారు... నువ్వు అమ్మమ్మవి — నాయనమ్మవి అవుతావు.

మళ్ళీ కరువు కాటకాలు వచ్చిపడుతూంటాయి. నువ్వు మునపటల్లే పని చేయలేక పోతుంటావు. కంటి చూపు తగ్గుతుంది. పెద్దగా చెబితే గానీ, — చెవులు వినబడవు— మొహం ముడతలు పడుతుంది. చేతిలో కర్రపుచ్చుకోకుండా నడపడం కష్టంగా ఉంటుంది. నీ కొడుకులు నీ మనవలు నీ క్షేమ సమాచారాలు కనుక్కుపోతూ ఉంటారు.

అప్పుడిక నీ పెత్తనమేం సాగదు. నీ కొడుకులో —కోడళ్ళో యింత పెడితే— తిని పడుకుంటావన్నమాట.

వాళ్ల విసుక్కోనీ - నసుక్కోనీ ... అన్నీ సహించాలి... ఆఁ ..., యింక ఎంతకాలం బతుకుతా కనుక... అనుకుంటూ సహించుకోవాలి ...

ఒకప్పుడు నీ తల్లీ తండ్రి -తాత ముత్తాతలు గూడా యిలా అనుభవించిన వారే -అనుకుంటూ కాలం గడుపు ... మహా ఉంటే ... 'ఆరగడియ'- అంటూ రోజులు దొర్లించు. అంతే.

ఇంతకూ చెప్పొచ్చేదేమంటే — ఆ మాయలో పడకుండా ఎవ్వరం తప్పించు కోలేమనుకో...

రకరకాల జనాభాతో సంపర్కం ఏర్పడుతుంది. దూరపు కొండలు నునుపను కుంటాం ... ... సుఖం కోసం పాకులాడి పరుగెడతాం ...రాత్రింబగళ్లు గిర్రున తిరిగి వస్తూంటాయి.

ఏదైతే సుఖమనుకుంటామో ,,, అనుభవంలోకి వచ్చాక అర్థంతా వట్టిది ....

వట్టి డొల్ల ... అనిపిస్తుంది.

నువ్వు సాలెగూడు కట్టడం చూడలేదూ ?

ఆ సాలెపురుగు ఏమనుకుంటుందో తెలుసా ... తనేదో మహా సామ్రాజ్యాన్ని స్థాపిస్తున్నాననుకుంటుంది.

క్షణం విశ్రాంతి తీసుకోకుండా — శ్రమపడుతుంది.

ఒకటి రెండు జీవాలు దాంట్లోచిక్కుకుంటే, — గుటకాయస్వాహా చేసేయ్యాలని దాని తాపత్రయం.

ఒక్కొక్కప్పుడు అది అనుకున్నట్టే అవుతుందిగానీ,— ఒక్కొక్కప్పుడు గూడు తయారు కాకుండానే పాపిష్టిగాలివచ్చి పాడుపాడుచేసి పారేస్తుంది.

అయినప్పటికి సాలీడు ధైర్యం కోలుపోక — నిబ్బరంతో ఉంటుంది ... కాబట్టి ... అందరూ దాన్నే ఆదర్శంగా పెట్టుకోవాలంటా.

సాంసారిక జీవితంలోగూడా ఈ ధక్కాముక్కీలన్నీ తింటూ నిభాయించుకోవాలిసుమా!

ఇంతగా కాళ్ళాచేతులా శ్రమపడతారుగానీ, — దాని వల్లమనకి వొరిగేదేవిటని... అనుకోరుగదా !

కేవలం అయిదుంబాతిక సెంట్ల భూమికోసం ఊళ్లోవాళ్ళంతా తగవుకి — తగాదాకి దిగారుకదా !

అందుకు నా పెద్దకొడుకు ప్రాణాల్ని బలిపెట్టాల్సివచ్చిందే?

ఉణ్ణిత్తాను దగ్గరకొన్న నలభైరెండు సెంట్ల పొలాన్ని ఆనుకుని అయిదుంబాతిక సెంట్లు సర్కారు వారి భూమి ఉంది

పట్టారాసి ఉందని మాట వాస్తవమేగానీ,— అనాదిగా అది సర్వేనంబరు మూడు వందల తొంభైనాలుగు, నలభైయేడుకి అనుబంధంగా ఉంది.

దాంతోబాటు ఉత్తరంవేపు నాలుగు మళ్ళమీద అరవైసెంట్లదాకా నాణు నాయరుదే.

వాటాలు పంచేటప్పుడు నాణు నాయరు కూతురికి ఈ భాగం వచ్చింది.

ఆవిడ శివరాం కురుప్ భార్యకి అక్కన్నమాట. ఆవిడభర్త శేఖరన్నాయరు ... చేను దున్నేందుకు వచ్చినప్పుడు కొలిపించాడు. దస్తావేజుల్లోనేమో అరవై రెండు సెంట్లని రాసుంది, తీరా కొలిస్తే యేభైయేదే ఉంది,

మిగిలిన అయిదు సెంట్లభూమి కుయెన్నగారు కొట్టేశాడన్నమాట.

దున్నడంతోబాటు-తగాదాకూడా ఆరంభమైంది. జనం గుమిగూడారు. నాలుగు పక్కల నాయర్లచేలే ... నాఋ నాయరు కొడుకులవి. అందులో ఏడు వాటాలున్నాయి. వాళ్ళంతాచేరి గొడవ మొదలెట్టారు. సర్వేయరుచేత కొలిపించి, — మిగిలిన నేలంతా తమకు కలవాలన్నారు. అదెట్టాకుదురుతుంది ?

అయినా ఆ గోల పడలేక సొంత ఖర్చులతో సర్వేయరుని రప్పించి కొలిపించాను.

శేఖరం నాయరు పొలంమొత్తం ఉన్నదే అరవై రెండుసెంట్లు. అప్పటికీ ఒప్పుకోక మహా మొండితనానికి దిగాడు. ఏవిటి చెయ్యడం? వాళ్ళ తరపు జనమే ఎక్కువ. అందుకని ఓ రోజు పొద్దున్నేలేచి ఉణ్ణియాత్తను దగ్గరికి వెళ్ళా ఒకానొకప్పుడు ఆ తాలూకాలో ఉన్న భూమిలన్నీగూడా వాళ్ళవాళ్ళవేట భలే గొప్పవాడు.

ఉత్తరీయం తీసి నడుముకి బిగించి, అరచేత్తో నోటిని కొద్దిగా మూసుకుంటూ ... అతివినయంగా నిలబడ్డాను.

ఏథా కుయెన్నా ?

మా రాజులు దయతలచి ధర్మంచేసిన చేను దున్ని — సాగుచేసి వండే నాలుగ్గింజలతో పిల్లాజెల్లాకి పెట్టుకుని కాలక్షేపం చేసుకుంటున్నాం బాజయ్యా...అంటూ కుయెన్నా విషయమంతా విన్నవించుకున్నాడు.

ఆయనెంతో గంభీరుడు. మితభాషిను. ఎన్నికగా ఒకటి రెండు మాటలకంటె— మాట్లాడడు.

సరె... నువ్వెళ్లిరా ... అన్నాడు.

శేఖరన్నాయరుని పిలిపించి ఆయన ఎంతగానో చెప్పాడు. వింటేనా ? తగాదా జరుగుతూనే ఉంది. ఎలాగో అలా ఆయేటికి చేను దున్నడమైపోయింది.

రెండో పంటకి చేను దున్నడంకోసం వెళ్ళినప్పుడు చూస్తే గట్టు మారింది.

మా పెద్దవాడూను—వాడివెంట కీవరీతు వెళ్లారు. కీవరీతు కూలీల చేతిలోంచి పారలాక్కుని చేనుకి అది వరకటి మోస్తరే గట్టు వేశాడు.

ఆ సమయంలో శేఖరన్నాయరు అక్కడ లేడు. కబురు చేరగానే వచ్చేశాడు.

మొత్తం మీద వో పదిమంది దాకా ఉన్నారంతే. ఈ లోపల మా పని వాళ్ళు పోయి కుయుచ్చెరుక్కన్ని, కొచ్చప్పావీన్ని పిలుచుకు వచ్చారు.

ఫిలిప్పోసు అక్కడ లేడు. మాత్తుకుట్టి కుఱ్రకుంక...ఏదో కొంపమునుగుతున్న వ్యవహారం అనుకుని మనసులో ఊహించుకున్నారు... కానీ... ఏం చేయగలడు.

శేఖరన్నాయరు వస్తూనే— పోండిరా పొలంలోంచి... వెధవ నా కొడుకుల్లారా.. అంటే,

నీ అబ్బ దిగిరానీరా... కొడకా... అన్నాడు కీవరీతు, కుస్తీ పట్లల్లో ఆరితేరిన ఘటం ఆ శేఖరన్నాయరు అంతే... ముందుకి ఉరికి కీవరీతు చెంపమీద ఛళ్లున లెంప కాయ కొట్టాడు... అదీ అసలంకురార్పణము.

మా పెద్దవాడు పంచాయితీ పెట్టిద్దామనే అనుకున్నాడు గానీ,— ఆ శేఖర న్నాయరు అనుచరుడు వాసు కురుప్‌వాళ్లు రెండో సారి తలపడటంతో ... ఆ ఉద్దేశం మార్చుకున్నాడు.

ఒకే దెబ్బతో వాసుకురుప్‌ని నేల కరచుకునేటట్టు చేశాడు. తన రొండి నుంచి కత్తి తీసి, మునిపంట తెరిచాడు. ఇరవై ముప్పయి మందిదాకా వచ్చారాయె దొమ్మీకి మరి ... ?

నాకు గుర్తున్నదల్లా — వారు ముప్పయి మందీను — మేం మాత్రం అయి దుగురం.

గందరగోళమంతావిని పాప్పచ్చను — వాళ్ళ బావమరిది వచారు వాళ్ళ చేతుల్లో పార — పిడి ఉంది. అదేవిధంగా అందరి చేతుల్లోనూ ఏదో వొ పరికరం ఉండనే ఉంది.

ఒకర్నొకరు కొట్టి చంపాలనే కసితో ఉన్నారు. కేవలం పిచ్చికుక్కలై పోయారు.

అరుపులు...గోల ... కేకలు...ఊరి పొలిమేరలదాకా వినిపించాయన్నారు.

ఎక్కడెక్కడి జనం పోగైనారు.

పొలమంతా నెత్తురు మడుగై పోయింది.

కొంత సేపయేసరికి ... ఉణ్ణిత్తాను ... పాపం పెద్దవాడు ఆయనగూడా వచ్చాడు.

ఆపండి గోల ... వెధవల్లారా...ఒక్కొక్కణ్ణి పట్టి జైల్లో పారేయిస్తా జాగ్రత్త అంటూ హెచ్చిరించాడు

అంతా సర్దుకున్నారు. అయితే ఎవడు చచ్చాడో...ఎవడున్నాడో తెలీడంలా ...

నా కోడళ్ళంతా గుండెలు బాదుకు బాదుకు ఏడుస్తూ కూర్చున్నారు. చేతిలో విచ్చుకత్తి పుచ్చుకుని కుయోమా స్పృహలేకుండా పడిపోయి ఉన్నాడు.

ఎదటివాడు చంపాలని కత్తి విసిరితే — దాన్నుంచి తప్పించుకోబోయిన కీవరీతు చేతి వేలు కాస్తా తెగిపోయింది.

నలుగురైదుగురికి పొట్టలోను — గుండెల్లోను కత్తిపోట్లు తగిలాయి.

కేవలం కురుక్షేత్రమల్లే తయారైంది.

కుయోమా పరిస్థితిని చూడలేకపోయాడు ... ఒరె నాయనా కుయోమా ... నిన్ను వాళ్లు పొట్టన బెట్టుకున్నార్రా తండ్రీ అంటూ కుయెన్నాచ్చు బావురుమన్నాడు.

మావయ్యా !

కుయెన్నాచ్చను వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

''మావయ్యా ... మిమ్మల్నే ... '' అంటూ దీనమ్మా బిగ్గరగా పిల్చింది.

''ఆఁ ... ''

''ఏడుస్తున్నారేవిటి ?''

''ఏడుస్తున్నానా ?''

''ఒరే నాయనా ... నిన్ను వాళ్లు పొట్టన బెట్టుకున్నార్రా – అంటున్నారేవిటి ?''

''చిన్న బడికి వెళ్ళిందా అమ్మా ?''

''వెళ్ళి చాలా సేపయింది ... లేనిపోనివన్నీ ఆలోచించి మెదడు పాడుచేసుకో వద్దని మీకు నిన్నగూడా చెప్పా ... ''

''బాన్లే...''

''కరుప్ వచ్చాడు.''

''ఏడీ ?''

''కాసేపు యిక్కడే కూర్చున్నాడు. అప్పుడు మీరు నిద్రపోతున్నారు లేప వద్దన్నాడు ... ఇదుగో ... నల్లమందు ... తెచ్చియిచ్చాడు ''

''మంచిదే ... రేపటికి ఎలాగూ కావాలిలే ... ''

''ఆనాడు కుయిచ్చెరుక్కను అన్నమాటలకి ... మళ్ళీనేని గడపతొక్కరాదు ... కానీ ... , మీ కోసమనే వచ్చానని చెప్పాడు ''

''నాకు తెలుసు ... అతను చాల యోగ్యుడు.''

''మావయ్యా మీకోసం ఎవరో వచ్చారు చూడండి వాకిట్లోనే ఉన్నారు

"ఎవరు ?"

"రాహేలమ్మ ..."

"ఆఁ ?"

"కీవరీతు బావగారి అమ్మాయి."

"పిలు ... పిలు"

రాహేలమ్మ వచ్చింది.

తలమీదినుంచి దుప్పటి ముసుగు పెట్టుకుంది ... కుయెన్నాచ్చను పరికించి చూశాడు"

వాళ్ళింటికి వారానికి వెళ్ళడం మానాక మళ్ళీ చూడలేదు.

"ఇలా దగ్గిరికి రా తల్లీ !"

"వద్దులే ... మొహంమీది కురుపులు తగ్గలేదు సరిగదా మరికాస్త ఎక్కువైనాయి."

"అమ్మడూ !"

"ఊఁ ..."

"ఈ తాతయ్యని చూసి పోదామని వచ్చావా అమ్మా !"

"ఊఁ ..."

"మొన్న నీమధ్య నీ చెల్లెలు వచ్చి వెళ్ళింది ... అప్పుడు నిన్నుగురించి దాన్ని ... అడిగా."

"తను నాకు చెప్పనే లేదే."

"చెప్పలేదా ?"

"సన్నెవ్వరూ ఏం అడగరు - చెప్పరు ... పట్టించుకోరు ..."

"అదేఁ ?"

"ఆక్కడ నా బతుకే అందరికి భారంగా ఉంది ... పీడగా ఉందనుకో ... ఎలా చావను ?"

"ఊఁ ...'

"చెల్లెళ్ళ మొగుళ్లు - యింకా చుట్టపక్కాలు ఎవరైనావస్తే నే బయటికి రారాదట ... కంటపడరాదట ... కట్టడ చేశారు ..." అంటూ రాహేలమ్మ ... దుప్పటి కొంగుతో కళ్లు వొత్తుకుంది.

"ఊరుకో రాహేలమ్మా ! .... లోకమే అంతనుకో... తల్లీదండ్రీగానీ, .... తోడబుట్టిన వాళ్లుగానీ ... అందరిగతి ఇంతేలే ..." అని ఊరడించింది దీనామ్మ.

"ఆ భగవంతుడికి దయలేదు ... భూభారంగా నన్ను యిక్కడే పడేసి పెట్టక పోతే ... ఎత్తుకుపోగాదా చెప్పు."

"నీ అత్తవారి వేపువాళ్లు ఎప్పుడైనా వచ్చారా ?"

రాహేలమ్మ ఏం మాట్లాడలేదు ... ఏం చెబుతుంది ? రాకపోకలు బందయినట్టు తాతయ్యకు బాగాతెలుసు .... తెలిసిగూడా అడిగితే ... !

కొంతసేపటివరకూ కుయెన్నాచ్చను — దీనామ్మ ఏం మాట్లాడలేదు. "ఎవర్నీ యిబ్బంది పెట్టకుండా ముందుగానే పోతే బావుండని నా కోరిక ......" అంది రాహేలమ్మ.

"ఆఁ ... మనచేతిలో ఏముంది ? .... అంతా వాడి చిత్తం."

"నాకేమనిపిస్తూందంటే —. గుట్టుచప్పుడు కాకుండా, — నావల్ల ఎవరికీ యే కష్టం లేకుండా కడతేర్చేసుకుందా మనిపిస్తూంది ..."

"ఏం మాటలవి రాహేలమ్మా ?"

"ఏవిటే ... ఏవిటి ?"

"ఏం లేదులే తాతయ్యా !...." అంటూ మనసులో దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది .... వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఏడవకు తల్లీ ! యెహోవా నీబాధ నివారణ చేస్తాడులే. ఆయన కసాధ్యమైన దేదీ లేదమ్మా ...."

రాహేలమ్మ కొంతసేపటివరకూ తాతగారి మొహంవంక అదేపనిగా చూస్తూ ఉండిపోయింది ... మళ్ళీ కోసారి కళ్లు తుడుచుకుంది

"తాతయ్యా నే వెళ్ళొస్తా ..." అంది.

"వెళ్ళిరా తల్లీ !"

పోబుద్ధి పుట్టక మళ్ళీ అక్కడే నిలబడిపోయింది

"రెండుజాములాయెగదా ... రెండు మెతుకులు తినివెడుదుగా లెమ్మంది" దీనామ్మ.

"వద్దు పిన్నీ !"

వరసకి పిన్ని కాబట్టి పిన్నీ అని పిలుస్తుంది కానీ, — వయసులో దీనామ్మ

కంటె రాహేలమ్మ పెద్దది.

కుయెన్నాచ్చను రాహేలమ్మ దుస్థితిని గురించి ఆలోచిస్తూ పడుకున్నాడు. పిల్ల దానిమీద తట్టుకోలేనంత ఆపద వచ్చిపడిందే!

తల్లి ... తోబుట్టువులు,— ఆ చేసుకున్నవాడు తిట్టేతిట్లు చివాట్లు అన్నీ సహిస్తూ పడుండాల్సిందే గదా ... ఇంతకూ అదిచేసిన తప్పేముంది ?

భగవంతుడు దానిపాలిట ఆ భయంకర రోగాన్ని పడేశాడు. అంత పాపిష్టి వ్యాధి మరొకటి లేదు.

దైవం ... దానికంత కష్టం ఎందుకుపెట్టాలి ? బహుశా దాన్ని పరీక్షించేందుకు కాబోలు.

నిశ్చలుడు ... నిర్దోషి ... దైవభక్తుడు ... సత్యవ్రతుడు అయిన అయోబుని పరీక్షించలా ... ?

వాడి లీలలు తెలుసుకోవడం ఎవరి తరం ?

మా కుటుంబంలో ఈ వ్యాధి ఎవ్వరికీ — అనరాదు వినరాదు. పోతే దీనికి — అటు తల్లివంక వారి నుంచే సంక్రమించి ఉండాలి.

పది పన్నెండేళ్ల పిల్లగా వున్నప్పుడు— దాని ఎడం చేతిమీద చిన్న పొడలా కనిపించింది.

సరే, అందుకని,— కషాయము- మాత్రలు అవీ చాలా పుచ్చుకుంది. వాడి ఐదుగురు కూతుళ్లలోనూ అదే పెద్దది. దాని తరువాత చెల్లెళ్లందరి పోషణ దానిదే.

కాస్త వయస్సొచ్చినప్పటినుంచి – పంట వార్పు అన్నీ చక్కగా సమర్థించేది.

ఆ పనిసందట్లో మందూ మాకూ తీసుకునేందుకు తీరికే ఉండేదికాదు.

దానికి పదిహేడేళ్లు వచ్చాయి. అప్పుడు దాని మేనమామ దానికో పెళ్ళి సంబంధం తెచ్చాడు.

పిల్లవాడు బ్యాంకులో గుమాస్తా

చూశారు ...... నచ్చాడు.

అప్పుడు రాహేలమ్మ తండ్రివచ్చి — నాన్నా ! పెళ్ళిచేస్తే వొళ్ళు నయమవుతుందేమోలే – అన్నాడు.

'అయితే పోనీ చేసేస్తే సరి'.

'పెళ్ళి చేయడానికి నేనేం పోసుక్కూర్చున్నానా...' అన్నాడు మళ్ళీ వాడు.

నిజం పడితే అంతే ... వాడిదగ్గరేమీలేదు.

అయిదుగురాడపిల్లలకి వాడు పెళ్ళిళ్ళుచేసి సాగనంపాలి.

ఆ తరువాత ఎలా గడుస్తుందో ... ఏమో ... !

ఆ రోజుల్లో ఈ కుయెన్నాచ్చను వ్యవసాయంచేసి, వ్యాపారంచేసి అంతో యింతో కూడబెట్టాడు.

'నలుగురు మనుషుల్ని తీసుకుపోయి — తాంబూలాలు పుచ్చుకు రండిరా—' అన్నాను.

అన్నమాట ప్రకారం వెళ్ళాడు, నిశ్చయం చేసుకున్నారు.

పెళ్లయిపోయింది.

సరిగ్గా పెళ్లయిన రెండువారాలకల్లా అత్తవారింటినుంచి పిల్లదాన్ని పుట్టింటికి పంపించేశారు.

ఆ పట్టుపట్టూ ఎవ్వరూ మళ్ళీ రానూలేదు ... పిలవనూ లేదు. అక్కగ్గా ... విచారించగా తేల్చిందేమంటే— పిల్లదాని చేతిమీద పొడఉంది ... పొడ ఉన్నట్టు పిల్ల వేపువాళ్ల చెప్పాపెట్టకుండా మోసం చేశారని దాని అత్తవారు ఫిర్యాదు చేశారు. నిజమే మరి ...

అయితే పెళ్లయిన తర్వాత ఆడపిల్ల అత్తవారింటి సొత్తు వాళ్ళు పెట్టుకోనీ... మానుకోనీ, చివాట్లు తిన్నా—చెప్పుదెబ్బలు తిన్నా అక్కడే పడుంటె పోయేది.

సరే ..., ఇక్కడ పడుంది ... ఇంతలో— ఆ వ్యాధి వొళ్లంతా వ్యాపించేసింది.

ఇంట్లోవాళ్లు దాన్ని గదిలోంచి అడుగు బయటపెట్టొద్దని ఆంక్షపెట్టారు. అందులో తప్పేముంది ? పూర్వకాలంలో అయితే,— ఇది మహాభయంకర వ్యాధి అని యెహోవా సీనాయి పర్వతంమీద మోషేతో చెబుతూ—

ఏ మనిషి దేహచర్మంమీద దద్దురుగానీ, పక్కుగానీ, నిగనిగలాడే తెల్లని మచ్చగానీ, కుష్ఠురోగపు పొడవంటిదిగానీ కనబడితే, వాళ్ళని యాజకుడైన అహరోను దగ్గరకుగానీ, లేకపోతే అతని కొడుకు దగ్గరకుగానీ తీసుకుపోవాలి.

ఆ యాజకుడు చర్మంమీదున్న ఆ పొడను పరీక్షిస్తాడు. ఆ పొడమీదున్న వెంట్రుకలు తెల్లబారినట్టయితే ఆ పొడ చర్మంకంటె పల్లంగా కనబడినట్టయితే — అది కుష్ఠుపొడ. యాజకుడు చూసి ఆ మనిషిని అపవిత్రుడని నిర్ణయించి— కడగా ఉంచు

తాడు... అన్నాడు.

"అమ్మా !"

"ఏవిటి ?"

"కాస్త అంబలి ఇప్పిద్దూ."

లేచి కూర్చుని దిండుకింద నుంచి వో మాత్ర తీసుకుని వేసుకున్నాడు. అంబలి తీసుకుని తాగాడు. మళ్ళీ నడుం వాల్చాడు. అప్పుడే గుమ్మంలో ఎవరిదో సంభాషణ వినిపించింది

ఫాదరు లోనా పక్షాన మాట్లాడుతున్నాడు. 'అదేం న్యాయం?...అంటూన్నాడు. ఆ మాట్లాడే వాళ్ళలో ఒకడు మాత్తుకుట్టే...రెండో వారెవరమ్మా అని కుయ్యెన్నాచ్చను అడిగాడు.

దీనామ్మ వాకిట్లోకి వెళ్ళి చూసొచ్చి –, "కార్తికపల్లి ఫాదరు—"అంది.

"ఆహాఁ..."

"ఒక మొగవాడు మనసుల్ని త్రిప్పి...సడివయస్సు ఆడమనిషిని కొట్టాడూ అంటే -అతగాడికేం పరువేడుస్తుంది అంట? ఆ మాటకొస్తే కొట్టినందుకు నేనేం అనను...ఎందు కంటావా... మా వొదినగారు నోరుతెగపారేస్తుంది ... అంతవరకూ న్యాయం." "ఒరే మాత్తుకుట్టే ! నువ్వు యింటదూరాన కూర్చుని కబుర్లు చెబుతున్నావ్ గానీ,... పక్క నున్న వాణ్ణి నేను... నేనన్నీ కళ్ళారా చూసి, చెప్పులారా పింటున్న వాణ్ణోయ్...

వొదిన వదినగారి స్వభావం అంతగా మారిపోవడానికి కారణమేమై యుంటుందో ఎన్నడైనా ఆలోచించావా?"

"ఆ ... ఆ ... అదీ తెలుసు "

"ఆ యింట అడుగు పెట్టినప్పటినుంచి ఆవిడకు శాంతి అనేదే లేకుండా పోయింది... ఎందుకంటావా ?

మొగుడు దుర్మార్గుడు కనుక... ఉద్యోగ రీత్యా ఊళ్లబదిలీ అయి వెళ్ళడమూ —, వెళ్ళినచోటల్లా వో పన్నెలాడిని పట్టడమూను...

ఇది తెలిసి వదినగారు మండిపడింది. పోట్లాడింది. ఏం చేసినా ఏం లాభం లేక పోయింది. అప్పుడిక ఆవిడ ఉండబట్టలేక తెగతెంపులు చేసుకు పోయింది. మళ్ళీ ఆ యింట అడుగు పెట్టలేదే ! ... పెళ్ళి అన్నది ఒక పవిత్రమైన బంధం... ఎవరితో ఎవరికన్నది నిర్ణయించేవాడు ఆ పరమాత్ముడే. కాబట్టి వైవాహిక బంధంలో ఉన్న

అంతర్యాన్నిగుర్తించి — ఆజన్మాంతము పతిని సేవించడం ఇల్లాలి కర్తవ్యం.

"ఎవర్నిగురించ్రా ... " అంటూ కుయెన్నాచ్చను ప్రశ్నించాడు.

"దీనామ్మ అక్కని గురించే మావయ్యా !"

"ఓహో మరియమ్మ మాటా ? ఆ విషయంలో భార్యాభర్తలిద్దరి తప్పూ ఉంది. ఆఁ ... దొందూ ... దొందే ... ఈ యింటికి తలుపులేదు — ఆ యింటికి ద్వార బంధము లేదన్న సామెతే."

"నాకు అక్క అయితే మాత్రం మీకు వొదినగారే గదా..." అంది దీనామ్మ గూటింపుగా...

ఫాదరు పెద్దగా నవ్వి— "అది కాదు... మీ అక్కచెల్లెళ్లంటే ఒక తల్లి గన్న బిడ్డలు గదా...

నేనంటే... మీ యింటి అల్లుడుగా వచ్చిన వాణ్ణిగానీ... ఒప్పుకున్నాం...నేను మీ యింటికి అల్లుడుగా వచ్చినప్పటికి— నీకో నాలుగేళ్లుంటాయనుకుంటా..."

"ఔను..."

వెంటనే ఫాదరు మనసులో అలనాటి దీనామ్మ రూపం మసలింది- సీతాకోక చిలకల్లే... ఆడుతూ పాడుతూ ...కేరింతలు కొడుతూ అంతట కలయ తిరుగుతూండేది,

ఆ రోజుల్లో ఫాదరు డీకను (ఉపయాజకుడు) అన్నమాట. దీనామ్మ కథ చెప్పించుకోవాలని బావదగ్గరే పడుకునేది.

అమ్మో... రణపెంకె...

పసితనం నుంచీ కలువపూవల్లే ఎంతో అందంగా ఉండేది. పదిహేను-పదహారేళ్ల వచ్చేసరికి... చక్కని చుక్కలా తయారైంది. అయితేయేం? పెళ్ళాం పోయిన వాడికిచ్చే పెళ్ళి చేశారు.

దాని మొహాన అలా రాసి పెట్టుంది.

ఆడపిల్లల పెళ్ళిళ్ల...వొంట్లో అనారోగ్యంతో,— ఆ తండ్రి పరిస్థితి తలక్రిందు లయిపోయింది. ఉన్నయిల్లూ స్థలమూ తప్పితే ఆస్తంతా అప్పులకిందే పోయింది.

అందచందాలున్నప్పటికీ పెళ్ళికావలసిన ఆడపిల్లలు, తల్లి దండ్రులకు బరువేగదా!

దీనామ్మని మాత్తుకుట్టికిచ్చి చెయ్యాలనే ప్రసక్తి తెచ్చినవాడు ఫాదరే.

మాత్తుకుట్టేమో ఆ ఫాదరుకు మేనమామకొడుకు. రెండో పెళ్ళివాడే అయినప్పటికి మాత్తుకుట్టికిచ్చి చెయ్యడానికి అంతా సమ్మతించారు.

చూపులకు బావుండేవాడు.

సలహాకి – సంప్రదింపుకి తగినవాడు.

''ఫాదర్! ఇప్పటికీ ఆ చర్చిలోనేనా ఉండటం ?''

''ఔను మావయ్యా?''

''ధర్మ సంఘంలో తగాదాలు—పోట్లాటలు ఇంకా అలాగే ఉన్నాయా ?

''మునపటంతగా లేవు.''

''కోప్రాస్పురాలో ఉండేవాడొకాయన... ఇప్పుడున్నాడా ?''

''లేడు...ఆయన కీర్తిశేషుడైనాడు. ఆయన పెద్దకొడుకే గ్రామ మునసబుగా ఉన్నాడు... అంటే మన ఇటిచ్చాండిజీ పిల్లుడన్న మాట.''

''ఓహో... తెలిసింది... అర్థమైంది.''

''ధర్మ సంఘంలో ఆదివరకటి మోస్తరుగా యిప్పుడు గొప్పవాళ్ళ మాటకేం చలామణీ లేదు.

ఈ సంఘాలన్నిటిలోనూ మెజారిటీ అంతా మాములు జనందే. వాళ్ల మాటకే విలువుంది.''

''అది మంచిదే... యిక్కడ అంతే.''

''అక్కయ్య ఎలా ఉంది?...'' అడిగింది దీనామ్మ.

నువ్వు పోయిన నెల్లో చూసివచ్చావ్‌గదా... అలాగే ఉందంతే. గోడలు అవి పట్టుకుని కొద్ది కొద్దిగా నడుస్తూంది ఇప్పుడో కొత్త వైద్యుడొచ్చాడు ... నడవడమే కాదు... పరుగెత్తిస్తానని ఆయన మాటిచ్చాడు... ఏమవుతుందో భగవంతుడికే ఎరుక.''

''ఏవిటేవిటీ ?''

ఆహాఁ... అక్కయ్యని గురించి అడుగుతూంటేనూ... మావయ్యకు పెద్దగా చెబితే గానీ వినపడదిప్పుడు... బిగ్గరగా మాట్లాడాలి. జ్ఞాపకశక్తి కూడా అంతంత మాత్రమే ... అంది దీనామ్మ ...ఫాదరీతో.

''అంతే ... అలానే ఉంటుంది. చివరి కాలంలో కళ్ల సరిగా కనపడవు ... చెవులు వినపడవు... ఈ అవస్థలన్నీ పడాలి ...తప్పవు...అంతేనా మావయ్యా?''

''ఆఁ...?''

''నే చెప్పింది రైటేగా ?''

''ఏమో... కావచ్చు... ఈ రోజుల్లో మీ మాటే నెగ్గాలి గదా!''

ఫాదరు పెద్దపెట్టున నవ్వాడు.

నవ్వనేది ఆయనకో సాధనం...

చంపేందుకు వచ్చిన శత్రువునైనా ఆ నవ్వనే సమ్మోహనాస్త్రం వేసి యిట్టే ఆకొట్టుకోగలడు. కుయెన్నాచ్చను అన్న మాటలో ఆంతర్యాన్ని గ్రహించాడు ఫాదరు.
ఫాదరు— కుయెన్నాచ్చను జాకోబైట్ విభాగంలో ఉన్న వేరువేరు శాఖలకి చెందినవాళ్లు

ఆ సంఘాల్లో పరస్పర వైరుధ్యాలుండేవి ఫాదరు సిరియన్ మతవాదులపక్షాన-కుయెన్నాచ్చనేమో కాత్తోలికా పక్షాన ఉండేవాళ్ళు.

న్యాయబుద్ధి — ధర్మచింత విషయంలో ఇరుపక్షాల వారు సమభావంతో ఉన్నా. —కార్యనిర్వహణ —వ్యవస్థల్లో మాత్రం సంఘంలో రెండు చీలిక లేర్పడ్డాయి...

"మావయ్యా నే నన్నదాంట్లో అబద్ధమేం లేదుగా... ఏమన్నా సందేహమా?"

"నే పట్టిన కుందేటికి మూడేకాళ్ళు ... అంటే నమ్మడమే ?"

"అదేం!"

"లేకపోతే యేవిటి? ఆ టర్కీ సుల్తానన్నట్టు—మీకు బుద్ధి లేక పోబట్టే అబ్దుల్ మసీహా ఆధిపత్యం వహించకుండా పోయాడు."

"అహం... ధర్మ సంఘం జారీచేసిన ఫర్మానానే వాపసు తీసుకుందిట."

"ఆం...పట్టిది. స్వార్థపరుల పన్నాగం...ఆ మాటకొస్తే—నాకోసారేదో జబ్బు చేసిందనుకో—అంతమాత్రంచేత నేను మాత్తుకుట్టి తండ్రిని కాకుండాపోతానా చెప్పండి?"

"అది వేరు....ఇది వేరు ... ఇక్కడ మనం ఒక ఆధ్యాత్మిక సభాధ్యక్షుణ్ణి గురించి మాట్లాడుకుంటున్నాం. సంఘ చరిత్రలోనే చెప్పారుగా — ఒకరికి అధికారం యిచ్చే హక్కుగానీ, తీసేసే హక్కుగానీ, ధర్మసంఘానికే ఉందని. ఆ ధర్మసంఘమే ఆబ్దుల్లాకి గురుస్థానమిచ్చి ఆధ్యాత్మిక అధ్యక్ష పదవిని కట్టబెట్టింది.

ఆధిపత్యమున్న సభాధ్యక్షుడే బట్టశ్శేరీ బిషప్‌ని పదవినుంచి తొలగించేసినట్టు ప్రకటించాడు .. మరి ?"

"హక్కంటావ్...హక్కు...ఏవిటా హక్కు? హక్కు ఇచ్చేవాళ్ళమూ మనమే, తీసేసే వాళ్ళమూ మనమే అయితే ? అదేంహక్కు. కూనను కురిశ్ (మత సంఘాలు రెండూ రాజీపడిన ప్రదేశం) నన్యనుంచి ఫర్మానా యిప్పించండయ్యా...అయితే...?"
మధ్యలో మాత్తుకుట్టి కల్పించుకుని—"నాన్నా ! ఇంత బలహీనంగా ఉన్నప్పుడు అంత గట్టిగా వాదించక పోతేయేం చెప్పు? సంఘంవాళ్ళంతా అక్కడ తగాదాలు—వ్యవహారాలు

అన్నీ సర్దుకుని రాజీపడినప్పటికీ — ఇక్కడ వాదోపవాదాలు మాత్రం తెగకపోయె...'' అన్నాడు.

''ఆఁ...ఎప్పుడైనా కానీండి...ఫాదరు — మావయ్య కలిశారో ఈ వాద ప్రతి వాదాలు జరగాలిసిందే...'' అంది దీనమ్మా గుమ్మంలోకివస్తూ.

ఫాదరు మరోసారి గగ్గోలుగా నవ్వాడు.

''ఏవిటి... ? మేం మాట్లాడుతుంటే, — పోట్లాడుతున్నట్టు ఉందా ?''

''లేదులే ... అవన్నీ మాటలే.''

''సరే...లేచి కాళ్లచేతులు కడుక్కొని కాసిని మంచినీళ్ళన్నా తాగుదురుగాని...'' అంది దీనామ్మ.

ఫాదరు నవ్వుతూ... ''మంచినీళ్లు తాగేందుకు కాళ్లచేతులు కడుక్కోవాలా..." అనడిగాడు.

వినీ విననట్టు దీనామ్మ చరచరా వంటింట్లోకి చక్కాబోయింది.

ఓ శేరుబియ్యం పిండికొట్టి ఉంచడం మంచిదైంది. ఆ పళాన దాంతో పుట్టు చేసింది. కొట్టుకుపంపి అరటిపళ్లు తెప్పించింది. పుట్టు ..., అరటిపళ్లు ... కాఫీ బల్ల మీదపెట్టి ... ''విశేషంగా ఏం చెయ్యలేదంటూ'' నొచ్చుకుంటున్నట్టు చెప్పింది దీనామ్మ.

ఇవన్నీ విశేషంకాక మరేవిటి? ... అంటూ ఫాదరు అప్పుడూ వో పెద్ద నవ్వు నవ్వాడు.

''సయమ్మోలు జ్వరం తగ్గాక కాలేజీకి వెడుతూందా ?''

''ఆఁ ... అయితే యింకా బలహీనంగా ఉంది.''

''రాజూమోను ఎలా ఉన్నాడు ?''

''ఆఁ ... ఆఁ ... ''

''అదివరకు వాళ్ళకు దీనామ్మ పిన్నంటే పంచప్రాణాలు. సయమ్మోలుకి సెలవ లిస్తేచాలు పరిగెత్తుకుని వచ్చేసేది.''

''ఇంకా ?"

''ఇప్పుడైతే వాళ్ళిక్కడికి రావడానికే అసహ్యించుకుంటారు. దీనా పిన్నికి వాళ్ళనుకున్నట్టు మంచి యిల్లా — వాకిలా ? నౌకర్లా -- చాకర్లా మా అక్కయ్య ఆరోగ్యం దెబ్బతిన్నాకనే...ఇవన్నీ...'' అంటూ దీనామ్మ కన్నీళ్లు తుడుచుకుంది.

''హమ్మయ్య...ఏడుస్తున్నావ్‌గదా...అందుకు ఫాదరేం చెయ్యగలరు ? ... ''
అనడిగాడు మాత్తుకుట్టి.

''మాత్తుకుట్టీ దాన్నేమనకు ... కాసేపు అలా ఏడవనీ ... ఎందుకంటే ఆడ వాళ్ళకి కాసేపలా ఏడిస్తేనేగానీ ఊరట కలగదు.''

అని ... ఫాదరు నవ్వుతూ... ''అయిందా తల్లీ ! ... నేను నీకేదో చెబుదామను కున్నా. మీ అక్కలిద్దరూ ఆర్థికంగా చూస్తే నీకంటే మెరుగ్గానే ఉన్నారనుకో. ఇంత వరకు మనం చెప్పుకుంది మీ పెద్దక్కను గురించే ... అనుకోవాల్సిన పనిలేదు ... నీకు తెలుసుగా ... డబ్బున్నందుకేమన్నా సుఖముందా...శాంతి ఉందా...ప్చ్...

పోనీ మీ శారా అక్కనిచూడు...మంచి వయసులోఉన్న రోజుల్లోనే ఆవిడకి అంగ వైకల్యం వచ్చేసిందిగదా !

నమ్మ నమ్మకబో...ఆవిడ ఆ గదిలోంచి బయటకివచ్చి పంధొమ్మిదేళ్ళయింది ఆవిడబాధ అది...

పోతే నువ్వన్నావంటే ... నీకు యిటువంటి చికాకులేం లేవు భగవంతుడు నీ విషయంలో అంత నిర్దాక్షిణ్యం యేం చూపలేదు. ఔనా ? ప్రాసంగికిలు చెప్పినట్లు — వలలో చిక్కిన చేపల్లే, ఉరుల్లో తగులుకొన్న పిట్టల్లే మనిషి ఎంతటి తెలివి తేటలు గల వాడైనా కాలంచేతిలో కీలుబొమ్మే సుమా...అంతేగా మాదయ్యా ? ''

''ఔనవును ....''

''వేదాల్లో చెప్పినముక్కే... , అయినా వేదాలన్నీ ఆపోశనం పట్టిన నీ ముందా నా పాండిత్యం గానీ...''

''నాకేం గుర్తు...ఉహు...ఎంతో తెలిసిన సొలెమోను రాజే నాకేం తెలీదన్నాడు ...అటువంటప్పుడు నేనేపాటి ? ''

ఫాదరు యికిలించాడు.

''నే నిక్కడికి రావడంలో మరో ఉద్దేశంగూడా లేకపోలేదు'' .... అన్నాడు ఫాదరు .. నెమ్మదిగా.

''ఏవిటి...అది ?'' అనడిగాడు మాత్తుకుట్టి.

''రాజన్ సెలవుపెట్టి — , త్వరలో రాబోతున్నాడని విన్నా. ఎప్పుడు వస్తాట్ట ? వచ్చేనెల మొదట్లో వస్తాడని అనుకుంటా .. అంతేనా ?''

''అనే రాశాడు...మరి... , ఏవిటి విశేషం ?''

''అహ॰ ... వో సంబంధం ఉంది.''

దీనామ్మ మాత్తుకుట్టి మొహంవంక చూసింది.

''ఏవిటి .. ఏవిట్రా...''అంటూ కుయెన్నాచ్చను ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న లెక్కచేయకుండా, – దీనామ్మ, – ''ఆ॰ ... ఇప్పుడంత తొందరే మొచ్చింది ... ఇరవై మూడేళ్లేగదా ... ''

''చాలవా యే॰ ? పూర్వకాలంలో అయితే పదహారేళ్ల నిండేసరికి మొగపిల్లవాడి పెళ్ళి చేసేసేవారు. ఏం మావయ్యా ?

''అది ఆ కాలంలో,...సరైన వయసులో పెళ్ళిచెయ్యడమన్నది ఏ కాలంలోనైనా మంచిదే.''

''ఇరవై మూడేళ్లు — అంటే సరైన వయస్సే. పిల్లదానికి పదిహేడేడేడేళ్లు ... ఏమంటావ్...ఈడు జోడు...''

''ఎక్కడుందే॰ పిల్ల ?''

''పుత్తనాట్టుక్కరాలో.''

''అన్నట్టు ఒకప్పుడు మీరక్కడ యాజకులుగా ఉండేవారుకదూ'' ?

''ఔను...ఈ మధ్య అక్కడికి వెళ్ళినప్పుడు ఆ పిల్లదాన్ని చూశా. నేనా ఊరు వొదిలి పెట్టేనాటికి ఆ పిల్లదానికో ఏడాదో—ఏణ్ణార్థమో ఉండేది.

చర్చి పక్కనే వాళ్ళిల్లు. మంచివాళ్లు ... అదేగదా ముఖ్యం. అ పిల్లదానికి తండ్రిలేదు. తల్లి దీన్ని కడుపుతో ఉండగా, — ఆయన ఏదో ప్రమాదంలో పోయినాడట.

పిల్లనిచూస్తే — అచ్చంగా దీనామ్మ చెల్లెలేమో అన్నట్టు ఉంటుంది.''

కొంతసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

''నాన్నా ; ఫాదరు చెబుతున్నమాట విన్నావా ?''— అనడిగాడు మాత్తుకుట్టి.

''పెళ్ళి విషయమేనా ?''

''ఆ॰.''

''అనువైన సంబంధం కనుకైతే, – పోయి చూస్తేసరి.''

''ఔను .... నచ్చితేనే ... చేసేది ... ముందు వాళ్ళింటినుంచి ఎవరో ఒకరు యిక్కడికి వచ్చి మాట్లాడతారు. తరువాత మీరువెళ్ళి పిల్లదాన్ని చూడొచ్చు.''

''మీకు అంతగా నచ్చిన సంబంధమైతే,—మళ్ళీ మేం చూడవలసిన పనేలేదు.''

''ఆలాకాదు ఇక్కడ్నించి ఒకరు వెళ్ళి ... వివరాలన్నీ అడిగి కనుక్కుంటే మంచిది.''

''కీవరీతుగానీ...లేకపోతే ఫిలిప్పోసుగానీ...ఎవరో ఒకరు.''

''అసలు ముందు రాజన్‌ని యిక్కడకు రానీయండి. వచ్చాక అబ్బాయి అభిప్రాయంగూడా తెలుసుకున్నాక మాట్లాడితే బావుంటుంది అంది దీనామ్మ.

''నిజమే ... అదే ఉత్తమం నేను సంబంధం ఉందని చెప్పాగానీ, దానికోసం తొందర పడాలిసినంత అగత్యమేంలేదు రాజన్ వచ్చాక...నేను మళ్ళీ వోసారి యీ వైపు వస్తా...'' అంటూ ఫాదరు గొడుగు తీసుకుని బయల్దేరాడు.

''అప్పుడే వెళ్లడమా...'' పోనీయనంటూ దీనామ్మ ఫాదరు చేతిలోంచి గొడుగు లాక్కుంది.

''పోనీ, ...తల్లీ...బోలెడు పన్లున్నాయి...'' అని బ్రతిమాలాడు...,'' ఆఁ... ఎప్పుడూ ఉండే పనులేగా భోజనం చేసిగానీ వెళ్ళడానికి'' వీల్లేదంది దీనామ్మ.

ఫాదరు మరదలు అంతగా బలవంతపెడుతూంటే. కాదనలేక ఉండి పోయాడు.

''చెప్పినమాట తో సెయ్యవద్దు ... ఎలాగూ రెండు జాములైంది కనుక ... '' అన్నాడు కుయెన్నాచ్చను.

ఆఖరికి ఫాదరు కుర్చీలో చతికిలబడ్డాడు.

''మావయ్యా నువ్వా అదేమాటంటే ... నేనెలా కాదనను ? నేను కాదు—కూడదు పోతానంటే.— దీనామ్మకి కోపం వస్తుంది. సరే,— అయితే నాదోమాట విను ... చూడు నాకోసమని ప్రత్యేకించి కూరానారా యేమీ చెయ్యొద్దు ... విన్నావా తల్లీ ? ''

''ఏమీ చెయ్యను ... ములగాకు, పప్పుకూరాను చిక్కుడుకాయ ఇగురూను చేస్తానంతే.''

ఫాదరు మళ్ళీ ఫక్కున నవ్వి—

''విన్నావా మావయ్యా! దీనామ్మ యింకా మర్చేపోలా ... చిన్నప్పుడు వాళ్ళింటికి ఎప్పుడు వెళ్ళినా ముఖ్యం ఈ కూరలే చేసేది. నాకు ములగాకంటే యిష్టమని— నే వెళ్ళగానే ములగాకు కొయ్యటం మొదలుపెట్టేది ...'' అన్నాడు.

''మరదళ్ళకి బావగార్లమీద ప్రత్యేకమైన అభిమానముంటుంది నేనా ఆనం దానికి పెట్టిపుట్టలేదులే'' అన్నాడు కుయెన్నాచ్చను.

''నిజమే మరి ..అత్తయ్యకు చెల్లెళ్లెవ్వరూ లేరుకదూ? నలుగురన్నలకు ఒక్కగా నొక్క చెల్లెలనుకుంటా...?''

మాత్తుకుట్టి వాకిట్లో ఎవరితోనో మాట్లాడుతున్నాడు...లోపలికి వచ్చి ఫాదరుతో ...''ఫాదర్, మీరుండండి . నే నిప్పుడే వచ్చేస్తా...'' నన్నాడు

''ఉఁ, ఎక్కడికి ?''

''తాకట్టు వ్యవహారమేదో వచ్చింది నేవెళ్ళడం చాలా ముఖ్యం ... అందుకని... నే వచ్చేలోపల మీరు వెళ్ళకండేఁ,'' అంటు మాత్తుకుట్టి బయటకి వెళ్ళిపోయాడు.

''ఏమయ్యా మీ అక్క కుయుమ్మరియమ్మ కులాసాగా ఉందా ?'' అంటూ ఫాదర్ని కుయెన్నాచ్చను ప్రశ్నించాడు.

''అక్కయ్య వొళ్ళేం బావుండటంలేదు. కీళ్ళనొప్పుల్తో బాధ పడుతూంది.''

''అలాగా ? నీ పెళ్ళప్పుడు చుట్టు పంచ కట్టుకుని, చొక్క తొడుక్కుని చర్చికి వచ్చింది...నాకు బాగా గుర్తు ఆ కాలంలో ఇప్పట్లాగా ఫ్రాకులు, ... బ్లవుజులు లేవుగామరి ?''

''లేవు ... లేవు.''

''కాల వైపరీత్యం అనుకో ... ఆ రోజుల్లో పెళ్ళికూతురు — పెళ్ళికొడుకుల దుస్తులెలా ఉండేవని ? పెళ్ళికూతురు చెవులకు నోటాలనబడే తాటంకాలు, పెళ్ళికొడుక్కి మెళ్ళో శిలువలాకెట్టు ఉన్న సన్నని గొలుసు...ఉండేది,

ఇప్పుడదంతా మారిమారి కోట్లు ప్యాంట్లు వచ్చేశాయి. ఆడపిల్లలు జాకెట్టు లోపల తొడుకునేదఉందే...దరిద్రం అది బయటకి కనబడుతూ ఉంటుంది...చూసే ఉంటావు.

''అఁ ... మరే,''

ఫాదరు నవ్వుతో యిల్లంతా ప్రతిధ్వనించింది.

కుయెన్నాచ్చను నవ్వాడు.

''అఁ ... మావయ్య మరీను ... ఒక్కొక్కప్పుడు మహా మోటుగా అనేస్తూం టారు ...'' అన్న దీనామ్మ మాట కుయెన్నాచ్చను చెవినబడలా.

''ఆ కాలంలో పెళ్ళిళ్ళంటే ఏమిటి ... పన్నెండేళ్ళ పెళ్ళికొడుకు ఎనిమిదేళ్ళ పెళ్ళికూతురూను. వాళ్ళకి పెళ్ళంటే ఏం తెలుస్తుంది....నామొహం ... ? అదో పెద్ద తిరునాళ్ళని ....వంటలు — పిండివంటలు, — హడావిడి...హంగామా...అంతే తెలుసు.''

''నిజమే ....''

''మొగ పిల్లవాడికి పద్దెనిమిది యిరవై యేళ్లు వచ్చినా పెళ్ళికాకపోయినట్టయితే — వాణ్ణి బ్రహ్మచారి అనేవాళ్లు. నే కూడా కొంతకాలంపాటు బ్రహ్మచారిగా తిరిగాను.''

దీనామ్మ వంటిట్లోంచి వస్తూ — మావయ్యకు వినేవాళ్లు దొరకాలిగాని ... ఆ సోది అలా చెప్పుకు పోతూనే ఉంటారు. అప్పైన...అలసి కూర్చుంటారు...''అంది.

''ఏవిటమ్మా'' అని పుయెన్నాచ్చను అడిగాడు.

''ఏంలేదు.''

''ఎక్కువగా మాట్లాడితే అలసి పోతారంటుంది.''

''ఆఁ ... చెబితే వింటేగా... ?''

''అలసటకేముంది ? వయస్సులో వచ్చిన అలసటేగానీ ... నోరు మూసుకుని కూర్చుంటే మాత్రం ఉండదూ ? పెళ్ళి విషయాలు ముచ్చటించుకుంటున్నాం కదూ ?... గుర్తొచ్చింది. అక్కమ్మనిచ్చి పెళ్ళిచేసేనటికి నేను పందొమ్మిదేళ్ళవాడిని. ఆ కాలన్నీ బట్టిచూస్తే మా పెళ్ళి ఆలస్యమనే చెప్పాలి. సరే, — తరుణంలోచేసే నాథుడెవరూ లేక పోబట్టి అనుకో. మానాన్న ఉన్నాడంటే యివేం పట్టించుకునేవాడేంకాదు. అటు పటప్పుడు...ఎలా జరుగుతుంది ?

చిల్లర - మల్లర వ్యాపారం చెయ్యగా చెయ్యగా నాలుగు డబ్బులు పోగయ్యాయి. అప్పుడు మా దూరపుచుట్టం పాకాయన — పరసకి బాబాయి అవుతాడు .... ఆయన ఒక సంబంధం తెచ్చాడు. పెళ్ళినాటికి అక్కమ్మ పధ్నాలుగేళ్ళది. పట్టి అర్భనాకారంగా ఉండేది. అయితే యేం పెళ్ళయిన నాలుగయిదు నెలలకల్లా బాగా తేరుకుంది. నాలుగో తరగతిదాకా చదువుకుంది మీ నాన్న చిన్నపిల్లలకి చదువుచెప్పే పంతులుగామరి ? చెల్లెలిని యింటి దగ్గరే కూర్చోబెట్టి బాగా చదువు నూరిపోసి తెలివి తేటలు వచ్చేటట్టు చేశాడు.

ఆఁ ? కమ్మగా పాడేవె నా పెద్ద బావమరది చెల్లెల్ని కాపరానికి పంపేటప్పుడు ఏమన్నాడంటే—లెబ్నాను ద్రాక్షతీగ ఎల్లకాలం పువ్వులతో పిందెలతో పచ్చగా ఉన్నట్టే మా చెల్లాయికూడా కలకాలం సుఖంగా ఉండాలని కోరుకుంటున్నా...నన్నాడు.

దీవించినట్టే జరిగింది. దాని చెయ్యిపడితేచాలు బంగారమయ్యేది. ఎంత సహనం ...ఎంత సమర్థింపు...అని చెప్పను ?

అయితే చివరి రోజుల్లో జరిగిన సంఘటన మాత్రం తట్టుకోవడం దాని వల్ల కాలేదు.

ఏం జరిగిందంటే — అప్పట్లో ఏశోవు నేను ఉమ్మడిగా వో దుకాణం పెట్టి నడుపు తూండే వాళ్ళం.

అవాళ రాత్రి నేను యింటికిరావడం కొద్దిగా ఆలస్యమైంది. నా చేతిలో కాగడా దీపం ఉండనే ఉంది.

ఈ ఏశోవుగాడు రెండు మూడొందలుదాకా తినేశాడు దాంతో నాకు ఎక్కడలేని వీరావేశం వచ్చిపడింది వాడికి నాకూ మాటామాటా వచ్చింది.

అక్కమ్మ పంచలో బుడ్డిదీపం పెట్టుకుని నాకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

నే వచ్చాక — నన్నేం పలకరించలేదు. కొంచెం సేపయాక ఇంత పొద్దు పోయిందేం ... అనడిగింది.

ఏశోవుతో పేచీ వచ్చిందిలే అన్నా.

ఏం ?

వాడూ ... నన్ను దగా చేశాడు

కొంచెంసేపు ఊరుకున్నట్టే ఊరుకుని,-'చెప్పేవాళ్లే దగాచేసిఉండొచ్చుగా'అంది,

ఏవిటీ ? మే మిద్దరం నిజాయితీమీద నిలబడతాం అని శపథంకూడా చేశావేం... వాజమ్మా. అంటూ అవిడ ముఖంవంక పరికించిచూస్తూ — మరిప్పుడీ చేసిన పనికి అర్థమేమిటి ... ?

మనసు మాట తప్పాం ... , ఇదీ ... , మసలితనంలో.

ఏవిటే నువ్వంటున్నది ?

నాకీ వయసులో వో నవతి దాపురించిందని విన్నాలెండి. అడపా దడపా సంతకి పోవడంలో కిటుకేవిటో నా కిప్పటికి తెలిసింది.

ఛత్ ... నోర్ముయ్యవే ...... ల ... ఒక్క తాపు తన్నానంతే...దిమ్మ తిరిగి పడిపోయింది. స్పృహ లేకుండా ... , నాకేమో చచ్చేటంత భయమేసింది.

ఆ తర్వాత ...... "

మావయ్యా అంటూ ఫాదరు పిలిచాడు.

ఉలకలేదు ... పలకలేదు.

"మావయ్యకు నిద్రపట్టినట్టుందే ... ?"

"అలా కబుర్లుచెబుతూ చెబుతూనే కునుకుతీస్తూంటారు. మెలకువ వచ్చిందో... తలాతోకాలేని కబుర్లు...మళ్ళీ మొదలు వాటికో అంతూ పంతూ అంటూ ఏం ఉండదు

...అలా చెప్పుకు పోతూనే ఉంటారు...'' అంది దీనామ్మ.

''ఔన్లే...తొంభై సంవత్సరాల వాడు...మెదడు చెప్పుచేతల్లో ఉండమంటే ఉంటుందా ?''

''వినేందుకు ఎవ్వరూ దొరక్కపోతే, - సిసిలీని పిల్చి కూర్చోబెట్టుకొని మొదలెడతారు.''

''బాలలు-వృద్ధులు సమానమంటారు వాళ్ళ మనస్సు కష్టబెట్టరాదు సుమా...''

''నానాటికి ఈయనగారి పరిస్థితి యిలా ఉంటూండటం వల్లనే నేను ఆఖరికి చర్చికి వెళ్ళడంగూడా మానేసుకున్నాను.''

''పెద్దలకి ఉపచారం చేస్తే పుణ్యమమ్మా : ఏసు ప్రభువేం చెప్పాడు... ? నాకు ఆకలేసింది...నువ్వునాకు అన్నంపెట్టలేదు. దాహం వేసింది – నువ్వునాకు మంచినీళ్ళు యివ్వలేదు. నాకు కట్టుకుందుకు బట్టలేదు...నువ్వు బట్ట ఇవ్వలేదు. నాకు జబ్బుచేసింది ...నువ్వొచ్చి నన్ను చూడలేదు కనుక నాయన్లారా ! ఇతరులకు మీరు చేతనైన సేవ చేయండి. ఇతరులకోసం చేసేసేవ మీరు నాకు చేస్తున్నట్టుగానే భావించండి ... అని చెప్పాడు.''

ఆ సమయంలో వాకిట్లోంచి ఎవరో వస్తున్నట్లు అలికిడయింది.

శివరాం కురుప్ గడపలెక్కిరావడం ఫాదరు గమనించాడు. పరికించి చూశాడు.

కురుప్ చెవిలో తులసిదళం...మొహాన గంధంబొట్టూ అదీ — ఫాదరు ఎంతో యిదిగా చూస్తున్నాడు.

''నిద్ర పోతున్నావా కుయెన్నామాప్పిళ్ళా ...''

''ఆఁ ... , రండి ... ''

కురుప్ లోపలికి వచ్చి ముక్కాలి పీటమీద కూర్చున్నాడు. 'మీరు' – అంటూ ఫాదరు ఎవరో కనుక్కుందామని అడగబోతూండగా – దీనామ్మ వచ్చి, 'మావయ్య స్నేహితులు' అని చెప్పింది.

''ఓ అయితే మీ పేరు శివరాం కురుపేనా ?'' అడిగాడు ఫాదరు.

''ఔను.''

''వీరు కార్తికపల్లిలో ఉండే ఫాదరు'' — అని దీనామ్మ ఫాదర్ని పరిచయం చేసింది.

''ఓహో...తెలిసింది...తెలిసింది...సిసిలీ-చెబుతూ ఉంటుంది ''

''అప్పుడప్పుడు కుయెన్నాయాప్పిళ్ళని చూసిపోవడానికి వస్తూంటా.''

ఆయన మంచి వేద-శాస్త్ర పరిజ్ఞానం ఉన్నవాడు...జ్ఞాన సాగరుడు. నాకు — ఆధ్యాత్మిక విషయాలమీద మక్కువ ఎక్కువ సూక్ష్మంగా ఆలోచిస్తే ... అంతా ఒక్కటే....పతిత జనోద్ధరణకోసం పరమేశ్వరుడు తన ముద్దుబిడ్డను భూమిమీదకు పంపాడు...అని క్రైస్తవ వేదమనే మీ బైబిలు ఘోషిస్తూంది.

హిందువుల పురాణాల్లో చెప్పిందీ అదే ... ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.'' అన్న గీతా శ్లోకం వినే ఉండొచ్చు...ఆలోచిస్తే...అన్నీ...అదే... తత్త్వమంతా ఒకటేననిపిస్తుంది సుమా!

''ఒక్కటి కాదు...''

"అన్నీ ఒక్కటి కావు ... ఏసు ప్రభువును విడిచి, ఏసు ప్రభువు చూపిన మార్గాన్ని వొదిలి, — అన్య మార్గగాములైన వారికి మోక్షంలేదు — అని మామతం.''

''మోక్షమంటే ?"

''మోక్షమే.''

'మోక్షప్రాప్తి'— చేసే కర్మమీద ఆధారపడి ఉంటుంది బాబూ ! శ్రీ కృష్ణ పరమాత్మ భగవత్సాక్షాత్కారం పొందడానికే జ్ఞానయోగ కర్మయోగాలని ఉపదేశించాడు. లోకేస్మిన్ ... యోగితామ్ ... అంటూ ...,''

''ఇవన్నీ మాకు నమ్మబుద్ధికావు.

''ఓహ్...సత్కార్యాలు చేసినప్పటికీ క్రైస్తవుడు కాకపోయినట్టయితే, — వాడికి మోక్షప్రాప్తి ఉండదనా మీ ఉద్దేశం ?''

''అంతేకాదు..., పరమపిత అయిన ఆ పరమేశ్వరుని పవిత్రనామోచ్చారణలో మునిగితేలని మానవ పుత్రుని రక్తమాంస భూయిష్ఠమైన దేహానికి పాప విమోచనము లేనేలేదు.''

''అందులో మీబోటివారికి నమ్మకం ఉండొచ్చు...''

''ఔను...ఏదైనా గురికుదరడాన్నిబట్టే ఉంటుంది.''

''ఆ విషయంలో మాత్రం మీకూ మాకూ పొంతనాలేదు....మా మతం ప్రకారం భూమ్మీద పుట్టిన ప్రతి ప్రాణికి ముక్తి అనేది ఉంది. వాళ్ళు ఏ మతాన్ని అనుసరించనీ ..., ఏ ధర్మాన్ని పాటించనీ - మా మతంఉందే, ...? అది సువిశాల మందిరంవంటిది దానికున్న ద్వారాలన్నీ ఎల్లవేళలా తెరుచుకునేఉంటాయి. ఎవరైనా రావచ్చు...విశ్రాంతి

తీసుకోవచ్చు, ఆకలి-దప్పిక అలసట పోగొట్టుకోవచ్చు. కామక్రోధాదుల్ని మనస్సులోంచి తరిమిగొట్టి, - ఆత్మ తత్వాన్ని అవగాహన చేసుకున్నట్లయితే మోక్షం కరతలామలకమే ... కామ క్రోధ వియుక్తానాం...విదితాత్మనామ్...అన్నారుగదా !''

సంస్కృత శ్లోకాన్నో దాన్ని ఉదహరించి క్రైస్తవమతానికే ఎసరు పెడుతున్నాడే- అన్నట్టు ఫాదరు ముఖంలో వేళాకోళంతో కూడిన వెకిలితనం ప్రస్ఫుటించింది.

అందర్నీ దగాచేసి వల్లో వేసుకోవడానికి యిదో ఎత్తు మీది.

''ఔనుగానీ...కురుప్‌జీ ! మోక్షప్రదాత ఏసు ప్రభువులా బలి అయినవాడు మీ మతంలో ఒక్కడున్నాడూ ఆ ప్రభువు చేసినన్ని వింతలు ఎవరైనా చేశారా ... ?'' అనడిగాడు

''ఏవిటా వింతలు ?''

''వింతలా ? ఏసు ప్రభువు జన్మమే వింత. కన్నెపిల్లకు పుట్టాడు''

''ఎవరన్నారు ?''

''ఆఁ ? ఎవరన్నారా ?''

''ఔను... , మీ నమ్మకాలు మీకు ఉండొచ్చు మీ లాగానే మాకూ నమ్మడానికి,- నమ్మక పోవడానికి హక్కుందిగదా ? ప్రతిదీ నమ్మాలని లేదుగా ?

నిజమే ... గురి కుదరడంలోనే ఉందని చెప్పనే చెప్పాగా ?'' అంటూ తను అన్నమాటను సమర్థించుకున్నాడేగాని, ... తిరిగి జవాబు చెప్పేందుకు ఫాదరు దగ్గర తగిన సరుకేం లేకపోయింది. ఆ దెబ్బతో కురుప్‌మీద శ్రద్ధాగౌరవాలు ఇనుమడించాయి.

''కురుప్‌జీతో వాదంలోకి దిగారా అంటే అన్యాయం సిస్టర్ ఉండదు - గానీ ... పోయి ముందు కాళ్ళు-చేతులు కడుక్కోరండి...'' అంది దీనామ్మ.

ఫాదరు నవ్వాడు.

''నిజమే మరి చర్చలో పడితే సమయం గడిచేదే తెలీదు...''అన్నాడు.

''కురుప్‌జీ వస్తేచాలు...మాయయ్యకి అలసట గిలసట అన్నీ ఎగిరిపోతాయి.''

''మానయ్యగూడా శాస్త్రి చర్చ చేస్తూంటాడన్నమాట ?''

''ఆయనెక్కడ ... ? జ్ఞాన సముద్రులు ... , సరైతే, — ఇకనే లేస్తా ఇంక మీ భోజనాలకి ఆలస్యంకానీయను...వస్తా...'' అన్నాడు కురుప్.

''ఉదేం లేదుగాని ... మీరుగూడా భోంచేసి మరీ వెళ్ళండి ... '' అన్నాడు ఫాదరు.

''మీ యిద్దర్ని కాళ్ళూ చేతులు కడుక్కోమనే నే చెప్పిందీసు ... '' అంది దీనామ్మ.

"భోజనానికేం చెయ్యొచ్చు ... నాకేం అభ్యంతరం లేదనుకోండి కానీ ... ఇప్పు డొద్దు...మరోసారి వస్తాగా. కుయెన్నామాప్పిళ్ళ నిద్రపోతున్నట్టున్నాడు...? సరే నే వస్తా'' అంటూ కురుప్ వెళ్ళిపోయాడు.

''మనిషి చాలా గట్టివాడు ... తెలిసినవాడు'' - అన్నాడు ఫాదరు — కురుప్ వెళ్ళగానే.

''మావయ్యకి కురుప్‌జీ అంటే ప్రాణంలో ప్రాణం ఈయనే మావయ్యకి నల్ల మందూ అదీ తెచ్చిపెడుతూంటాడు.''

''అలాగా... ?''

''కుయొచ్చెరుక్కుసుగారికి మాత్రం యీాయన పొడేగిట్టదు. ఏదో విషయంలో యిద్దరికీ మాటపట్టింపు వచ్చిందిట అందువల్ల అప్పట్నుంచి కురుప్‌జీ మనింటికి రావడం బావగారికి సుతరామూ యిష్టంలేదు.''

''ఊఁ ... ఆయన పోట్లాడంచి ఎవరితో లేద్దూ ?''

ఫోంచేసిన తర్వాత ఫాదరు కుయెన్నాచ్చాప మంచం దగ్గరకి వెళ్ళి పిలిచాడు.

నాలుగైదు సార్లు పిలవగా-పిలవగా మెళుకువ వచ్చింది లేచాడు.

"నే వెళ్ళొస్తా మాపయ్యా''

''వెళ్ళడమే ... ?''

''ఊఁ ... వస్తామరి.''

''దేవదూత గేబ్రియలు కనబడ్డాడు.''

''ఆఁ ...?''

''కనబడి...నా రెక్కలమీద ఎక్కి కూర్చో...అన్నాడు...నన్ను. ఏం వొద్దు ...ఈ దాసుడు కాలినడకనే వస్తాడు రెమ్మన్నా''

''ఓహో...కలొచ్చిందన్నమాట...'' అంది దీనామ్మ.

''ప్రార్థన చేసుకుందాం మాపయ్యా !''

''లేచి కూర్చోనా ?''

''వొద్దు...పడుకునే వుండండి ...'' ఫర్వాలేదు.

దీనామ్మ దుప్పటి ముసుగుపెట్టి, — ప్రార్థన చెయ్యడం మొదలెట్టింది.

ఫాదరు వో కీర్తనలో నాలుగు పాదాలు పాడాడు.

నాకు - సంపద అనుకుని చెప్పుకునేందుకేమిలేదు. ఏసుప్రభు వే నాకుసంపద- అంటూ కుయెన్నాచ్చను తరవునగూడ తనే ప్రార్థన చేశాడు.

దీనామ్మ ఫాదరును సాగనంపేందుకు గుమ్మందాకా వెళ్ళింది. వెనక్కి తిరిగివచ్చి "మావయ్యా! ఎంతగాఢ నిద్రపోయారు? కురుప్‌జీ - రావడం వెళ్ళడం గూడా జరిగింది..." అంది.

"లేపక పోయారుట్రా?"

"లేపకేం... లేపాం... లేస్తేగా? మీరు వేళకాని వేళల్లో మందేసుకుంటే అంతే అవుతుంది మరి..., ఏ వేళకి మెళకువరాదు."

"ఇప్పుడది తప్ప వేరేమార్గంలేదు తల్లీ!"

"ఆఁ... దురలవాట్లు చేసుకుంటే... అంతే"

"ఏం చేయను?"

"సరే, — లేచి కాళ్ళచేతులు కడగండి...అంబలి తెచ్చిస్తా."

"ఫాదరుకి భోజనం పెట్టావా?"

"ఆఁ"

ఎండు కొబ్బరివేసిన చిక్కుడుకాయకూర, నిమ్మకాయ ఊరగాయ అంబల్లో నంజుకోవడానికి భలే బావున్నాయి.

ఎంతో కాలానికి అ ఫాదరు మనింటికి వస్తే నే నిద్రపోయానేవిటా అనే నా విచారం...

ఔను...ఆయన తెచ్చిన సంబంధమేదో వద్దనకుండా చూడటం ఉత్తమం.

పిల్లవాడు చిన్నవాడని చెప్పడం వట్టి తెలివి తక్కువతనం. ఇదే సరైన వయసు. పిల్ల - అందంగా, ఆరోగ్యంగా ఉంటుందని చెప్పె... అంతకంటె కావలసిందేముంది కనుక?

"మావయ్యా:"

"ఏవిటమ్మా!"

దీనామ్మ అనుకున్నాడు — పక్కకు వొత్తిగిలిచూసి —

"ఎవరు? — అనడిగాడు —

"నేను మావయ్యా అన్నామ్మని."

ఫిలిప్యోసు భార్య అన్నామ్మ.

''మావయ్యా ! మా యింటికి వెడదాం రండి ?''

''నడవలేనుగా తల్లీ !''

''చాలా అర్జంటు...కారు తెప్పిస్తా...మీరు రాకపోతే అక్కడ తలలు పగల గొట్టుకునే పరిస్థితిలో ఉన్నారు పదండి...''

తోడి కోడలి గాబరా చూసి దీనామ్మ ఒక్కపరుగున వచ్చి — ''ఏవిటి ? ఏం జరిగిందక్కయ్యా ?'' అనడిగింది.

''ఏం జరిగిందా చెపుతా...మా పొరుగున పాచిపని చేసుకొనే దాసీదొకతుంది. అది యిప్పుడు మీ బావగారి పొదదాసి అయికూర్చుందమ్మా...అందుకని ఆ యింట్లో- అది ఉండటమో నే ఉండటమో తేలిపోవాలి...ఇవాళ...అదీ సంగతి.''

''ష్...మెల్లిగా...మెల్లిగా చెప్పు...''

''ఆఁ ... నా మొహం ... ఎవరన్నా వినిపోతారనేగా...సరేలే...కన్నకొడుకు తండ్రిమీద కత్తిదూసేదాకా వ్యవహారం ముదిరిపోతే...ఇంకా నువ్వేమిటి...''

''అయ్యో దేవుడా !

నువ్వా లేనిపోని అనుమానాలు పెట్టుకుని...కుర్రాణ్ణి వట్టి పుణ్యానికి వాడిమీద ఉసి గొలిపావేమోనని నా అనుమానం'' అన్నాడు సయెన్నాచ్చను.

''కళ్లారా చూశాకనుకనే చెబుతున్నా - అనుమానమేవిటి నా బొంద...''

''హుఁ ... అయితే చూసి చెబుతున్నదే అంటావ్ ?''

''అందుకే... , ఎందుకైనా మంచిది ... మీరొచ్చి చూస్తే — మీకే తెలుస్తుంది ...నే చెప్పడం కాదు.''

దీనామ్మకి ఏమనాలో...ఏం చెయ్యాలో తోచలేదు.

కొంచెం సేపయాక — , సయెన్నాచ్చను —

నేనొచ్చి చేయగలిగిందేముందమ్మా ... ?

''తండ్రి చెప్పినట్టు వినేందుకు వాడేమైనా చిన్నవాడా-చితకవాడా ? దేశాలేలగలి గినవాడు...గృహస్థు...డబ్బున్నవాడు...అవతల చెట్టంతకొడుకు ఎదిగి ఉండగా,... వాడికి తెలియాలిగానీ, — తొంభైయేళ్ళ యీ ముసలితండ్రివచ్చి చెబితేమాత్రం — ఏం విలువ యేడుస్తుంది చెప్పుతల్లీ ! ...'' అన్నాడు.

''అయితే యిప్పుడు నన్నేం చెయ్యమంటారో చెప్పండి. ఎవరితో చెప్పుకోను ?

చెప్పుకుందుకుగానీ, — చెప్పితెచ్చుకునేందుకుగానీ, నాకు తల్లా — తండ్రా ... తోడ బుట్టినవాళ్ళా ఎవరున్నారు ?'' అంటూ అన్నామ్మ ఏడవడం మొదలెట్టింది.

దారిన వచ్చేపోయే అమ్మలక్కలంతా ఏవిటి అని — అదేపనిగా చూస్తూంటేను,- దీనామ్మ అన్నామ్మ చెయ్యిపుచ్చుకొని ''లోపలికి పద అక్కయ్యా ... అక్కడ చెప్పు కోవచ్చు'' అని బ్రతిమాలింది.

సరే అన్నామ్మ లోపలికి వెళ్ళింది.

అన్నామ్మ చెప్పినమాట యధార్థమేకావచ్చని కుయెన్నొచ్చను అనుకున్నాడు. వెనకగూడా యిటువంటి మాటలే చెవినబడ్డాయి కోషంచేరి రోడ్డు కాంట్రాక్టు తీసుకున్న రోజుల్లో — మొగుడుపోయిన పంతులమ్మనెవర్నో పట్టుకున్నాడని వినికిడి ...

ఆఁ ... ఇందులో అనుమానంగానీ, — సందేహంగానీ, — కించిత్తుగూడాలేదు.

తట్టుకోలేని బాధ వచ్చిపడింది కాబట్టే అన్నామ్మ పరుగు పరుగు వచ్చింది.

ఔను తలకుమించిన పరిస్థితి యేర్పడినప్పుడు ఎవరికి మాత్రం ఏంచెయ్యాలో— ఎటుపోవాలో...ఏం తెలుస్తుంది ?

పాపం రమ్మని కాళ్ళా వేళ్ళా బతుకుతూంటికనుక పోతానే అనుకో— వాడు ఆరు బయట పడక కుర్చీలో పడుకుని ఉంటాడు...దొరల్లే. నేనుపోయి ఒరే ఇట్రారా అని పిలవాలి

సరే, — లేచివచ్చి ఏంనాన్నా అంటాడు.

ఒరే, — అన్నామ్మ చెప్పిందిరా ... అంటూ మొదలుపెట్టగానే...దాని తప్పుడు కూతలన్నీవిని నమ్మి...నాకు బుద్ధిచెప్పేందుకు వచ్చావా...? అంటాడు.

అహఁ అది కాదురా ...

నాకేం చెప్పకు...ముసలితనంలో ఎండోవండో పెట్టింపెంత తిని పడుండక... అంటాడు సరిపోతుంది.

వాడు గొంతుచించుకోవడం విని — వాడి పెద్దకొడుకు యివతలకు వస్తాడు.

ఆ పాపిష్ఠురాలు యీ యింట అడుగుపెట్టాలి ... దాని బుట్ట బద్దలకొట్టకపోతే చూడు...అంటూ వాడు రంకెలువేస్తాడు.

పోరా...పో...అని వాడినైతే తరిమిగొట్టగలనుగానీ, — ... , అసలు అనవల సింది నన్ను...నన్నేరా నాయనా తండ్రీ !

అమ్మా...అన్నామ్మా...అంటూ, వాళ్ళల్లో వాళ్ళకి ఎలాగైనా రాజీ కుదిరించా

లిగా, — అందుకని అన్నామ్మా లోపలికి పో తల్లీ అంటే — ఆవిడగారు వెళ్ళదు... అక్కడే నిలబడుతుంది.

ఈ గోలంతకి కారణం నువ్వే — నీ మూలానే... వేరే అనక్కర్లేదు. మా అమ్మని ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువులు తాగించి చంపావు...పైగా చెప్పొచ్చావ్ అప్పో...ఈ నాటికి అందరూ పెద్ద మనుషులే...అని నన్ను దెప్పి పొడుస్తాడు.

అప్పుడిక నేనేం అనగలను ? తలవొంచుకుని గప్‌చిప్‌గా తిరిగి రావాల్సిందేగా ... ? ఏదో అందామనిపోయి — అనిపించుకుని రావాలిసి వస్తుంది ...అందువల్ల వెళ్ళి ఏవిటి లాభం ?

ఒకానొకసారి అక్కామ్మగూడా ...,

ఔను, — ఇద్దర్లో ఎవరో ఒకరే ఉండాలి. వయసులో ఉన్నప్పుడంటే, ఒంట్లో సత్తువ ఉండేది కాబట్టి పనిమనిషిలాగా నువ్వు పురమాయించినవన్నీ చేస్తూ, నీ సుఖం... నీ ఆనందం కోసమే ఆరాట పడ్డాను...ఏ పాపం...ఎరగని దాన్ని...ఇకతట్టుకోవడం ...నా వల్లకాదు...అంటూ వాపోయింది.

నిజమే... , ఆవిడపట్ల ఎంత కటువుగా వ్యవహరించేవాణ్ణని ? నా జీవన నౌకకి చుక్కాని వంటిది ..., మనిషిలో ఎంత ఇంగితం ? ఎంత వివేకం ? సహజంగానే ఎంత మంచి స్వభావం ? ఉన్నా పోయినా గూడా నలుగురిచేత మంచి అనిపించుకుంది. దావీదు అన్నట్లు — ఇప్పుడనుకునేంలాభం ? పోయిన వాళ్లు తిరిగిరారు ఆవిడ్తో నే పోయి చేరుకోవాల్సిందేగాని ..., అవిడ బ్రతికి రాదుగదా !

లోపల అన్నామ్మ దీనామ్మ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"అదికాదే దీనామ్మా ! కొంతకాలంగా నేనూ దాని వాలకమూ, వయ్యారమూ, ఆ సింగారమూ, ఆ హొయలు అన్నీ గమనిస్తూనే ఉన్నా సుమా ? అయినా అనవసరంగా ఇంకోరిమీద అభాండం వేయడం మనకేంపని చెప్పు ?

ఈ కాళ్ళూచేతులూ బొత్తిగా నొప్పులు పట్టుకున్నాక అంత మరీ పొద్దున్నే లేవలేకుండా ఉంటున్నా.

కాస్తంత ఎండెక్కలేగానీ,...స్వాధీనం కావడంలేదు. అందువల్ల తెల్లవారేసరికి కాఫీ చేసియిచ్చేందుకు కుదరడంలా మా మనిషికి కోడికూ సేసరికి కాఫీతాగే అలవాటుగా మరీ ? ఒకనాడేమైందీ ... ? అది కాఫీ చేసి యిచ్చేందుకు పట్టుకుపోయింది.

కాఫీ యివ్వడానికి పోయిన మనిషి ఏవేళైనా తిరిగిరాలా మంచంమ్మీంచి లేచి

వెళ్లడమంటే — నాకు చేతకాకుండా ఉంది అయినా లేచా...ఆఁ? ఏదో పెనగులాడుతున్నట్టు అలికిడైంది.

ఉఁ.

ఆ బొంద తిరిగి వచ్చాక...దాని అవతారం చూడాలి...ఎలా ఉంటో! నాటి నుంచే అనుకో — నా మనసులో అనుమానమంటూ ప్రవేశించింది...

రోజూ వెడుతున్నట్టే — ఇవాళా అది గదిలోకి వెళ్ళింది. కొంచెం సేపయాక నేనూ, ఈడ్చుకుంటూ వెళ్ళా. దీనామ్మా! ఏం చెబుదునే తల్లీ! మూసిన తలుపులు తెరుచుకోగానే — నా కంటబడ్డ ఆ దృశ్యం...ఏం చెప్పమంటావ్...?

అయ్యో ... అయ్యో ... ,

ఆ తరువాయి చెప్పడం నావల్లకాదు తల్లో! నా గోలవిని నా కొడుకు బోణికుట్టి పరిగెత్తుకొచ్చాడు.

తండ్రీ కొడుకులు ఎదురు బదురుగా నిలబడ్డారు.''

''అన్నామ్మా!''

''ఊఁ?''

''ఈ సంగతి నేనాలోచిస్తాగానీ ... నువ్వెళ్ళిరా.''

''మీరు రారూ? బండి తెప్పిస్తాగా?''

''కీవరీతు చేత చెప్పిస్తాలే.''

''ఆయనమాట ఈయనగారు వినకేఁ?''

''వినక పోయాడో — నేనే వస్తా నీకెందుకు...నువ్వెళ్లు''

''వచ్చిన వొడిదుడుకులు ఎలావచ్చాయో అలాగే సర్దుకుంటాయి నువ్వేం దిగులు పడకు అక్కయ్యా — '' అంది దీనామ్మ.

''అమ్మా! భూదేవి కున్నంత సహనంతో ఉండాలిగానీ, — తొందరపడి అవివేకుల మనిపించుకోరాను సుమా?

సొలోమోను ఏం చెప్పాడు.

నీ స్వయంకృషితో నువ్వుజ్ఞానాన్ని సంపాయించు. సంపాయించుకున్న జ్ఞానాన్ని వృద్ధిచేసుకో. అదే నిన్ను ఉన్నతస్థాయికి చేరుస్తుంది. దాన్ని నువ్వు పదిలపరుచుకో... అది నీకు మేలు చేస్తుంది ... అంతేకాదు అది నీ శిరోభూషణంగా రాణిస్తుంది — '' అన్నాడు.

అన్నామ్మ వెళ్ళింది. ఆవిడ ఏకరువు పెట్టిన విషయమంతా కళ్ళముందు మెదిలింది.

డబ్బు ఉండగానే సరిగాదు...ప్చ్...

మూర్ఖుణ్ణి రోట్లొపడేసి రోకలితో అటుకుల పోటేసినట్టు — గభికీ గుభికీ దంచినా వాడి మూర్ఖత్వం వాణ్ణి విడిచి పెట్టదు.

మాత్తుకుట్టి యిల్లు చేరేసరికి రాత్రి బాగా పొద్దుపోయింది అయితే, — ఆలస్యమవుతుందన్న విషయం ముందుగానే తెలుసు. భోజనమైన తర్వాత దీనామ్మ సంగతంతా చెప్పింది.

తెల్లవారి జామునే దీనామ్మ లేచి —

"మావయ్యా" అంటు లేపింది.

"ఊం."

"రాహేలమ్మ చచ్చిపోయిందిట."

"ఎవరు చెప్పారు ?"

"ఇప్పుడే మనిషి వచ్చాడు."

"ఔను...నిన్ననే...నేను...అదే అనుకున్నా...ఓ ఏసుప్రభూ! ఈ ప్రాణాలు ఎగిరిపోయే లోపల యింకా ఏమేం చూడాలిసి ... వినాల్సి వస్తుందోనని ... అనుకున్నానమ్మా !

ఆం ?"

"మావయ్యా — అయితే మీరు వస్తున్నారా ?"

"ఉహుం ... మీరు వెళ్ళండి."

"బండి తెప్పిస్తా..."

"వద్దు తల్లీ నువ్వెళ్ళు."

వెళ్ళక పోయినప్పటికీ ... ఇక్కడే కూర్చుని అంతా చూడనూగలను, విననూ గలను.

అమ్మయ్య...దాని చెఱ విముక్తయింది. శాశ్వతంగా విముక్తి. యెహోవా నీ నామమునకు జయమగుగాక !

ప్రభూ ! నువ్వు సనాతనుడవు...అనాదివి. మనిషిని మట్టిలో కలిపేస్తావు. మానవ శిశువా ! మరలిరా — అని ఆదేశిస్తావు.

ఏళ్ళవేళ్ళు యిట్టే దొర్లించేస్తావు. కాలచక్రాన్ని తిప్పేవాడివి నువ్వే ... సృష్టి స్థితి లయాలకు కారకుడివి నువ్వే...

నీకు కోపం వస్తే — మాకు నాశం తప్పదు.

మా ఆయుర్దాయం దెబ్బయ్యో మహా ఉంటే యెనభయ్యో అది యిట్టే చెల్లి పోతుంది...మేం...ఎగిరిపోతాం...మాకు పొద్దు వాలిపోతుంది...,

పంచలో చాప పరిచి, — దాన్ని స్నానంచేయించి పడుకోబెట్టి ఉంటారు. పెళ్ళి నాటి బట్టలే కట్టి ఉంటారు.

తలవైపు కొవ్వొత్తిదీపం వెలిగించిపెట్టి ఉంటారు. దానితల్లి వంటింటి వసారాలో నులకమంచంలోపడి గుండెలు బాదుకుని గోలెత్తుతూ ఉంటుంది ... ఔను మరి ... మొట్టమొదటి బిడ్డగదా !

నిజానికి దుఃఖమంతా ఆ కని పెంచిన తల్లిదే ... మిగతా వాళ్లదేముందీ ? కాసేపనుకుని — ఊరుకుంటారు.

అదిగూడా పట్టి నటనే.

చెల్లెళ్లు — పిన తల్లులు, — పదినెలు మొత్తం వో ఇరవై మందిదాకా ఆడవాళ్లు ఆ తల్లి మంచంచుట్టూ మూగి ఉంటారు.

ఎవరైనా కొత్తవాళ్లు పరామర్శకి రాగానే, — అంతా కలిసి గొల్లుమని ఏడుస్తూంటారు.

'శాంతిగామ' — నుంచి పినతల్లి వస్తుంది. 'అయ్యో నా తల్లీ! ఎంత బాధ అనుభవించావే మాయమ్మా! నీ బాధ చూడలేకే ఆ భగవంతుడు — బాధనుంచి నిన్ను విముక్తురాల్ని చేశాడే అమ్మా ! అంటూ పెడబొబ్బలుపెట్టి రోదిస్తుంది.

శవపేటిక సిద్ధం చేస్తూంటారు. సన్నబట్ట తెల్ల పీలికలు కడుతూంటారు.

అందరికీ కబురుపంపి ఉంటారు.

ఔనౌను...తెల్లవారే సరికే అంతా వెళ్ళి ఉంటారు. చాలామందే వచ్చి ఉంటారు.

కుయెన్నాచ్చాను రాలేదా — అనడుగుతూంటారు.

'నడవలేడు' — అని జవాబు చెప్తారు.

ఎప్పుడు పోయింది..., — ఎందుకని ... అనడుగుతూంటారు. నిన్నరాత్రి... అన్నంతిని సుబ్బరంగా పడుకున్న మనిషమ్మా...

దానికి పిలుపు వచ్చేసింది.

ఔను ... అంతే అనుకోవాలి.

కోఝుంచేరి గ్రామం వాళ్లెవరన్నా వచ్చారా ?

లేదు ... వాళ్లెవ్వరూ రానేలేదు.

ఆఁ ... వాళ్లెందుకు వస్తారు ?

ఔను ... మరే,

ఫాదరీ వచ్చేశాడు. ఇక ఆలస్యం చెయ్యరాదు...ఏమంటావ్ కీవరీతు అన్నా ?

గొయ్యి సిద్ధంచేశారా ?

ఆ ... ఎప్పుడో చేశారు.

తొందరేంలేదు కానీండి. ఇంకా వచ్చేవాళ్లెవరైనా ఉంటే రానీండి అంటారు.

రావాల్సిన వాళ్ళల్లో మిగిలింది కుయెన్నాచ్చనే.

'నాన్న' — అనుకుంటారు.

కుయెన్నాచ్చను—? అని అడుగుతూ ఉంటారు.

చాలా బలహీనంగా ఉన్నాడు.

తొంభై యేళ్ళ తొక్కాయె ...

మా 'మూలమూట' వాళ్ల యిడిక్కులా అంతవాడే. అప్పుడే ఆయన పోయి పదేళ్ళయింది .... అని చెప్పుకుంటూంటారు.

ఫాదరీ లేస్తాడు.

ప్రార్థన కానిద్దాం.

అంతాలేచి నిలబడతారు. ఇంటి లోపలినుంచి వెక్కివెక్కి ఏడుపులు...

ఫాదరీ ప్రార్థనా వచనాలు చెబుతూ ఉంటాడు.

వచ్చిన జనంలోంచి ఎవరో కొందరుమాత్రం కలిపి అంటూంటారు.

నలుగురైదుగురు కలిసి మృతదేహాన్ని తెచ్చి పేటికలో పెడుతూంటారు.

అంతా కలిసి గొల్లుమని గోలెత్తుతూంటారు.

తల్లి — ఆ పీనుగమీదపడి ఏడుస్తూంటుంది. 'నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతున్నావా అమ్మా'—అని బావురుమంటుంది.

ఆ శవపేటికను మోసుకుంటూ,—శవయాత్ర సాగిపోతూ ఉంటుంది. వో శిలువ లేదు ... ఆచ్ఛాదన లేదు ... వో బాజా భజంత్రీలు ఉండవు.

''కాలం అనే వాహనం ఎక్కి నేను స్వర్గయాత్రకు వెడుతున్నాను నా దేశాన్ని

చూసుకోవడానికి త్వరత్వరగా పోతున్నాను.

చర్చిలో గంటలు మోగుతాయి.

చర్చిలో వెలుగుతూండే అఖండదీపం దగ్గర శవపేటిక దింపుతారు...తూర్పు దిక్కు తలాపుగాచేసి — ఫాదరీ అంత్యక్రియాకలాపాలు ఆరంభిస్తాడు.

ప్రభూ! ఈ లోకం వదిలి నిన్ను చేరుకుంటున్న ఈ దీనురాలి ఆత్మకు సౌభాగ్య దాయకమైన సర్వాలంకార శోభనిచ్చి, — ఆనందాన్నిచ్చి, షడ్రసోపేతమైన భోజనం పెట్టి, సంతృప్తిపరచెదవుగాక! అని ప్రార్థిస్తాడు.

మృత కళేబరాన్ని గోతిదగ్గరకు తీసుకువెడతారు. అత్తరు చల్లుతారు.

ఆ దేహాన్ని గోతిలో పెట్టేటప్పుడు మళ్ళీ అంతా కలిసి గొల్లుమని ఏడుస్తారు.

ఫాదరీ మట్టితీసి శిలువ ఆకారంగా గోతిలో చల్లుతాడు వో దేవునిబిడ్డా! ప్రభూ! మరణించిన మాకు — పునర్జన్మ లేకుండా దయచేసి కాపాడు తండ్రీ! — అని చెప్పగానే, — అక్కడకు వచ్చిన ప్రతి వొక్కరూ వో చిటికెడు మట్టితీసి ఆ గోతిలో వేస్తారు.

ఆ తరువాత పారతో మట్టితీసి గొయ్యి పూడుస్తారు. తల దిక్కున కొయ్య శిలువచేసి గుచ్చి నిలబెడతారు ... అంతే ... అయిపోతుంది.

# ఆరు

రాజన్ స్నానం చేసివచ్చి దువ్వెనకోసం వెతకడం మొదలెట్టాడు. తలుపుల మీద, — దర్వాజాలమీద అంతటా గాలించాడు.

పెట్టిన వస్తువు పెట్టినచోట ఉండదుగదా ..., అని చిరాకు పడ్డాడు.

దీనామ్మ వంటిట్లోంచి వొక్క పరుగునవచ్చి — "ఏవిటి నాయనా" ... అనడిగింది.

"దువ్వెన."

"ఆ మారెమ్మ తీసి ఎక్కడ పడేసిందో ..., " అంటూ వెతికి దువ్వెన తెచ్చి

యిచ్చింది దీనామ్మ.

రాజన్‌కి కోపం ముక్కుమీదే ఉంటుంచి. నోట్లోంచి మాట వచ్చిందీ అంటే, — అది తక్షణమే అయి తీరాల్సిందేనన్న మాట.

తల దువ్వుకుని...బట్టలు మార్చుకుంటూ ఉండగా, — దీనామ్మ, —

"నాయనా ! రాజన్ ఎందాకా వెడుతున్నావ్ బాబూ ?" — అనడిగింది.

"వీధి చివరిదాకా."

"రేపు పుత్తనాట్టుకరా వెళ్ళాలనుకున్నారుగదా మరి ?"

"ఏమో ... నేనెక్కడికి పోను."

"అయ్యో...అదేంమాట....? పిల్లయింటివాళ్లు మనం వస్తామని అన్ని యేర్పాట్లు చేసుకుని ఎదురు చూస్తార్రా తండ్రీ !"

"చూస్తే చూడనీ, ఏం, నన్నడక్కుండా— పెట్టకుండా మిమ్మల్నెవరు మాటివ్వమన్నారు ?"

"నీ యిల్లు బంగారంగాను....పిల్లని....పిల్లవాడిని కనుక్కొని మరీ పెళ్ళిమాటలు మొదలెడతార్రట్రా ఎక్కడన్నా ? చోద్యంగా ఉంది. ఏదైనా సరైన తరుణంలో జరిగితేనే అందంరా బాబూ !"

"ఔనూ, అసలీ యింట్లో ఇంకో మనిషొస్తే ఉండడానికి చోటుందా అని ... అహఁ ... నడుంవాల్చాలీ అంటే ..., చోటేదీ చెప్పు .... ?"

దీనామ్మ ఎదురు చూడని ప్రశ్నయిది.... అందుకే కొంచెం తటపటాయించింది. కొంచెం సేపాలోచించి—

"అన్ని సదుపాయాలూ చేసుకున్నాకనే, — పెళ్ళంటే కుదురుతుందా చెప్పు ఆఁ ... సదుపాయాలకేవిటిగానీ, ... వాటంతటవే వస్తాయి..." అంది.

"అదేవిటి పిన్నీ! కాస్తలో కాస్తయినా వసతి అంటూ ఉండాలిగా? మనమంటే ఎలాగో అలా సర్దుకుంటామనుకో...కానీ...ఏ వసతిలేని చోటికి పరాయి పిల్లని తెచ్చి రొష్టు పెట్టడందేనికి ?"

"రాబోయే కోడలుపిల్ల సర్దుకుపోయే స్వభావం గలదైతే...ఈ అసౌకర్యాలన్నీ పరిసిపోతాయిరా...లేదూ ... ? ఈ యింటి మరమ్మత్తంతా పూర్తయే వరకు నువ్వు ఉద్యోగం చేసుకునేచోటే తీసుకుపోయి అట్టేపెట్టుకో....ఎవరు కాదన్నారు ?

ఇలా వితండవాదమంతా అయిన తర్వాత నిజంగానే ఆ యింట యే విధమైన

నదుపాయం లేదన్న సంగతి దీనామ్మకి గుర్తొచ్చింది.

నిజంపదితే— పెళ్ళయ్యాక ఆ కొత్తదంపతులు వాళ్ళపాటికి వాళ్ల స్వేచ్ఛగా.... కలుసుకుని ... కులాసాగా కబుర్లు చెప్పుకోవడానికి వో గది అంటూ ప్రత్యేకంగా ఉండొద్దూ ?

ఆ యింట ఉన్నవి సామానుకొట్లలాటివి రెండేరెండు గదులు. అవి నరమాన వులకి ఉపయోగపడవు. మిగతాచోటంటూ ఉన్నా మరుగంటూ లేదు.

ఆ ఫాదరు సంబంధం తెచ్చాడుగదా .... పిల్లని చూడటం, నచ్చితే పెళ్ళి చేసె య్యటమే ... అంతగా కావాలంటే,— దక్షిణంవైపు వసారాని బల్లకూర్పుపెట్టి గదిగా మార్చేస్తే సరిపోతుంది లెమ్మని— మనసులో వో నిర్ణయానికి వచ్చేసింది దీనామ్మ.

రాజన్ గడపదాటి వెళ్లబోయే సమయానికి కుయెన్నాచ్చను చూసి,— ''ఇట్రారా !'' -అని కేకేశాడు.

రాజన్ దగ్గరకు వెళ్ళాడు.

''ఎక్కడికి వెడుతున్నావ్‌రా ?''

''సందు చివరిదాకా వెళ్ళొస్తా.''

''ఆఁ ?''

''ఈ సందు చివరికి .... వెళ్ళొస్తా.''

''కాస్త పెద్దగా చెప్పరా ... బిగరగా చెబితేగానీ వినబడదు.''

''ఊఁ.''

''కళ్లుగూడా ఆట్టే కనబడటంలా.''

... ... ... ... ...

''నువ్వొచ్చిన తర్వాత మీ బాబాయిల్ని కలుసుకున్నావ్‌రా ?''

''ఆఁ ... వెళ్లా.''

''ఏమన్నారు ?''

''ఏమంటారు ?''

''నామట్టుకు నా సంగతి చూడు: యిక్కడ నేను మంచాన పడున్నానని ఎవ్వడికీ గుర్తేలేదుకదా ! బహుశా నన్ను గురించి తల్చుకునేందుకు వాళ్ళకి తీరిక గూడా లేదనుకుంటా.

కీవరీతు ఉన్నాడంటే వాడికి మధ్యాహ్నాట అరవై రోజులు ధబ్బు యిబ్బందే. వాడి

పెద్దకూతురు చచ్చిపోయింది. అది పోవడం ఒకందుకు మంచిదే అనుకోవాలి. లేక పోతే దానికది నరకం. చచ్చిపోయింది కాబట్టి బతికిపోయింది. ఒకపిల్లేమో పంతు లమ్మగా చేస్తోంది. దానికింకా పెళ్ళికాలా. అదికనుక పెళ్ళిచేసుకుని వెళ్ళిందీ అంటే— మనవాడి గతి అధోగతే.

ఆ పిల్లదానికి మాత్రం ఆ ఊబిలోంచి ఎప్పుడెప్పుడు బయట పడదామా అనుంది.

కీవరీతు దాన్ని ఓ అయ్యచేతిలో పెట్టక,— తన కొంపలోనే కట్టిపడేసుకోవాలను కోవడం దండగరా ... ఎందుకంటే,— ఏం చెపుతాం ... రేపు దానికి నచ్చిన వాడెవడైనా కనబడితే,— హాయిగా వాడితో చెట్టాపట్టాలేసుకుని ఉడాయించవచ్చు ... అప్పుడు వీడేం చెయ్యగలడో చెప్పరా!''

''నాకు తెలీదు ....'' అని రాజన్ నెమ్మదిగా అన్నాడు.

''ఏమన్నావ్‌రా ?''

రాజన్ మాట్లాడలేదు.

''దానిసంగతి అలాఉంది ..., అయిందా ..., ఇక మధ్యవాడున్నాడంటే వాడు తిమ్మిని బ్రహ్మిని బ్రహ్మిని తిమ్మిని చేస్తూ ఏదోవిధంగా రోజులు వెళ్ళదీస్తున్నా డనుకో. తనపని సాధించుకోవడంలో మాత్రం ఘటికుడే. పోనీ అలాగైనా బాగు పడ్డాడా అంటే అదీలేదు.''

''తాతయ్యా ! ఇప్పుడివన్నీ ఎందుకు చెబుతున్నట్టు? నాకు అన్నీ తెల్సులే గానీ ....''

''ఏవిట్రా ?''

... ... ...

''ఏమంటున్నావ్‌రా ?''

''ఇప్పటికి మూడునాలుగేళ్లనుంచి నేను నా సంపాదనంతా నాన్నకి పంపుతున్నా. అంతపంపినా యిప్పుడేం మిగిలిందో చెప్పు. ఏం చేయకపోయినా కనీసం యింటి మరమ్మత్తయినా చేయించి ఉండొచ్చుగా ? అదీ లేకపోయె. ఎక్కడెక్కడి డబ్బు బండి చార్జీలకి పోసి — ఊళ్ళు ఏలడమే సరిపోతుండె ...'' అంటూండగా దీనామ్మ యివతలకి వచ్చి,—

''ఒరె నాయనా ! ఈ విషయంలో మాకు రోజూ కీచులాట తప్పదనుకో ...''

అంది.

"అయితే ... సరే, ... నేనోపని చేస్తాలే ..."

"ఏవిటి ?"

"ఏంలేదు తాతయ్యా ! ఉపాయమొకటి ఆలోచించాలే."

కుయెన్నాచ్చను కొంచెం గాబరాగా దీనామ్మవంక చూశాడు. దీనామ్మ మొహంలో గూడా దిగులు తొంగిచూసింది. వాడుకనుక అలిగాడో అందరిపని అయినట్టే .... అనుకుంది.

"వాడు యింట్లో డబ్బుపెట్టి ఊళ్ళు తిరగడురా ... ఊళ్ళు తిరిగేందుకని వాడికి వేరేడబ్బు వస్తుందిలేరా ... మహా ... నీ ... ,"

"ఆ ... వస్తుంది— ఎక్కణ్ణుంచి ? అలా డబ్బొస్తే రావచ్చుగానీ ... ఎంత సేపూ ఆయనకి కావాల్సింది లోకుల మెప్పులు మెహర్బానీలేగా ... ఆ తిరుగుడు ... అందుకేగా ?"

ఎంతైనా కుయెన్నాచ్చను కొడుకు పక్షమే మాటాడతాడు ... ... నిజానికి అంతేగా ... ?

ఎవరైనా సరే,— తన కొడుకుల్ని ఏమీ అనరాదు ... అసలు తన కొడుకుల మీద ఈగ వాలనీడసుకోండి కుయెన్నాచ్చను.

"కావాలంటే బయటికిపోయి నలుగుర్ని కనుక్కోరా ... మీనాన్న ఎలాటి వాడో ... ఎంతటివాడో ... మేలోఘుత్తు మాత్తుపుట్టి కొడుకువైనందుకు గర్వపడాలిరా నువ్వు ఏమనుకున్నావో ... ఆఁ ?"

"మావయ్యకు ఎప్పుడూ కొడుకుని వెనకేసుకురావడమే పని ... " అంది దీనామ్మ.

"ఇందులో వెనకేసుకు రావడమేముంది ? ఉన్నమాటే ... ఆ బిషప్పు వాడి కోసం కారు పంపిస్తున్నాడా లేదా ... చెప్పు ?"

"జానసుకో ...."

"లేకపోతే ఏవిటామరి ? నువ్వా—, నువ్వు పంపుతున్న ఆ పాతికో పరకో తోనే యింతయిల్లూ గడుస్తూందనుకున్నావ్రా ? ఏటా చేలోంచి అంతో యింతో వస్తూనేఉంది. బియ్యమూ— గట్రా నాలుగైదు మాసాలపాటు తిరిగి చూడకుండా సరిపోతున్నాయి అయినా నువ్వు పంపేదాంతోనే పబ్బం గడుస్తూందనుకున్నావా ?

ఇల్లూ—ఖర్చూ అంటే మాటల్రటూ ? వెర్రినాయనా !'

ఇప్పుడిక దీనామ్మగూడా మామగారికి వంతపాడటం మొదలెట్టింది.

''మాపయ్య యిక్కడే ఉంటూండటంవల్ల,— వచ్చేపోయే జనంతాకిడీ ఎక్కువై పోయిందిరా బాబూ ! ...'' అంది.

కాసేపు ఎవరు మాట్లాడలేదు.

కొంతసేపయిన తర్వాత దీనామ్మ కుయెన్నాచ్చనుతో— "మావయ్యా ! రేపు మన రాజన్ పుత్తనాట్టుకరాకి పెళ్లిచూపులకి వెడుతున్నాడు.''

''రేపా ?''

''ఔను.''

''అమ్మా ! పెళ్లంటే మొదట చూడాల్సింది — వంశమర్యాద. స్త్రీగానీ— పురుషుడుగాని కుటుంబ గౌరవాన్ని ఎంతవరకు నిలబెడుతున్నారన్నది గమనించడం రెండోవిషయం. ఇకపోతే మూడోదేమంటే—, పిల్లదాని గుణగణాలు పిల్ల పిల్లవాడికి అనువైందా కాదా అన్నది కనుక్కోవాలి. ....'' అన్నాడు.

కుయెన్నాచ్చను ఇక ఎంతసేపయినా అలా కబుర్లమీద కబుర్లు చెప్పుకుపోతూనే ఉంటాడని రాజన్ మెదలకుండా, చక్కాబోయాడు

రాజన్ మొట్టమొదట పెళ్ళిచూపులకి పోనంటే పోనన్నాడుగానీ, తర్వాత సరే నని ఒప్పుకున్నాడు.

కీవరీతు చిన్నకూతురు శీలామ్మ భర్త బేబీ — రాజన్ కలసి వెళ్లేటట్టు ఖాయం చేశారు.

బేబీ తాలూకాఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ సరదాగా ఉండేరకం...రాజన్‌కి ప్రాణ స్నేహితుడూను.

అదివరకు వాళ్ళిద్దరూ దోవను పోతూపోతూ కనబడ్డ ప్రతి ఆడపిల్లని విమర్శిస్తూండేవాళ్లు...అప్పటి ధోరణి అది.

బేబీమాత్రం రాజన్ వచ్చినప్పుడల్లా...''ఒరేయ్ రాజన్ ఈ సారి నువ్వు సెలవలకి వచ్చినప్పుడు ... నీ ముక్కుకి తాడు వెయ్యకపోతే చూడు'' అంటూ హెచ్చరిస్తూండేవాడు.

ఈసారిక ఆ అదను రానే వచ్చింది.

రాజన్ బేబీ ఉదయానే బయలుదేరారు — వాళ్లున్న చోటికి పెళ్ళికూతురు వాళ్ళ

ఊరు ముప్ఫయిమైళ్ళ దూరానుంది. అందులో ఇరవై యేడుమైళ్లు బస్సు ప్రయాణం. మిగతా మూడుమైళ్లు కాలినడకమీద పోవాలి.

మధ్యలో రెండు రేవులు వస్తాయి.

రెండో రేవుదగ్గర వో చర్చిఉంది. ఆ చర్చిపక్కనే ఆ పిల్లవాళ్ల యిల్లుంది.

అయినప్పటికీ యిల్లు కనుక్కోవడానికి ఒకరిద్దర్ని అడగవలసే వచ్చింది.

గుమ్మంలోకి వెళ్లేసరికి లోపలినుంచి నడివయస్సులోఉన్న వో పెద్దమనిషి వాకిట్లోకి వచ్చి —

''ఇల్లు కనుక్కోవడం కష్టం కాలేదుగదా ... '' అంటూ లాంఛనంగా పలకరించాడు.

లేదులేండి — అన్నాడు గుంభనగా బేబీ.

ఇల్లు సొంతం కట్టనిదే అయినా అందంగా ఉంది. పై చెక్క సున్నం అదీ కానేలేదు ....

వీధి సావిట్లో ఒకావిడ నిలబడి ఉంది.. బహుశా పిల్లదాని తల్లి అయ్యుండాలి... అనుకున్నాడు రాజన్.

ఆవిడ వాళ్ళిద్దర్లోను పెళ్ళికొడుకు ఎవరా అన్నట్టు మార్చి మార్చి వాళ్ళ మొహాల వంక తేరిపార జూస్తూంటేను — , బేబీ గ్రహించి —

''పెళ్ళికొడుకు ఇతను,—నేనేమో అతని వెంటవచ్చిన వాణ్ణి. — నా పేరు బేబీ'' అని చెప్పేశాడు.

అతనలా చెప్పగానే నడివయసులో ఉన్న ఆ పెద్ద మనిషి ఆవిడ చిరునవ్వు నవ్వారు. ఇతడు చాలా కలుపుగోలు మనిషల్లే ఉన్నాడనుకున్నారు.

అప్పుడా పెద్దమనిషి అన్నాడుగదా —

''నేనేమో ఈవిడకి తోడబుట్టినవాణ్ణి. మేము ఇక్కడికో తొమ్మిది — పదిమైళ్ల దూరంలో ఉన్నాం.''

''మా బావగారు ఈ చర్చిబళ్లోనే పని చేస్తూండేవారు. ఈ స్థలం కొన్నాడు ... యిల్లు కట్టడం మొదలెట్టాడు కానీ....పూర్తి కాకుండానే పోయాడు.''

''మీరేం చేస్తూంటారు?''

''నేనా... ? నేనూ ఉపాధ్యాయ వృత్తే.

''అదే అనుకున్నాలెండి.''

"ఎలా అనుకున్నావ్ ?"

"మీరు మాట్లాడే ధోరణి...ఆ తీరుబట్టి ...

పెద్దమనిషి నవ్వాడు ... నీకు సెలవ ఎన్నాళ్ళు నాయనా? అని వెంటనే రాజన్‌ని మన్ననగా ప్రశ్నించాడు.

"రెండు మాసాలు."

"అరవై రోజులన్నమాట?"

"కాదండి...యాభై ఆరు రోజులే...సెలవ రానూపోనూ ప్రయాణం అదీ..."

"ఓహో...అంటే నీకు ప్రయాణం ఎన్ని రోజులు పడుతుందేఁ?"

అయిదారోజులుదాకా పడుతుంది.

"బేబీ బాబూ! ఏదో అడగదల్చుకున్నట్టున్నావ్?"

"ఊఁ."

"ఏవిటి?"

"మీరెప్పుడైనా మిలిటరీలో పనిచేశారా?"

ఆ మాటడిగేసరికి ఆ గదంతా నవ్వుల్తో నిండిపోయింది.

వాళ్ళతో రాజన్‌గూడా ఏకమైనాడు.

"ఆఁ ... ఆ ... వెలగబెట్టాలే. 1943 లో చేరాను. 1947 లో డిస్‌చార్జి అయినా."

అంతలో ఆ పిల్లదాని తల్లివచ్చి .... "లేచి కాస్త కాళ్ళచేతులు కడుక్కుంటే కాఫీ...అదీ..." అంది అనగానే బేబీ...లేచి, —

"ఓ...దానికే — ... మాకేం అభ్యంతరంలేదు — అన్నాడు.

తేనీటి విందు మరోగదిలో ఏర్పాటు చేశారు.

ఇద్దరూ కాళ్ళుచేతులు కడుక్కుని వచ్చి బల్ల దగ్గర కూర్చున్నారు.

అంతలో లోపల తలుపు తెరుచుకుంది.

ఒక మెరుపు తళుక్కున మెరిసింది ...

పరికిణీ — వోణీ..., చేతిలో ఫలహారాల పళ్లెం... వొంచిన తల, కాటుక తీర్చినట్లున్న పెద్ద పెద్ద కళ్లు...,

కళ్లు జిగేలుమన్నాయి.

చేతులు వణికాయి ... వెలవెల బోయింది ...

ఫలహారాల పళ్ళాలు వస్తున్నాయి...వచ్చేశాయి.

కాఫీ కప్పులున్న...ట్రే...వచ్చింది.

సన్నని నాజూకైన ఆ చేతి వేళ్లకు కాస్త వొణుకు తగ్గింది.

ఆ గాబరా అంతా వెలిసింది...

కాఫీ తీసుకోండి బాబూ అంది పిల్లదాని తల్లి.

"ఆఁ ..."

"తండ్రి లేని పిల్ల ... , తెలుసనుకుంటా ?"

"తెలుసు."

"దీన్ని ... నాలుగోనెల ... కడుపుతో ఉండగా ... వీళ్ళ నాన్నగారు చని పోయారు."

"ఊఁ"

"నాకు ... ముగ్గురాడ పిల్లలు .... పెద్ద పిల్లలిద్దరూ పెళ్లయి అత్తవారిళ్లకు వెళ్ళారు."

"ఊఁ ..."

"వీళ్ళ నాన్నగారు బతికున్నట్లయితే..." అంటూ ఆవిడ కళ్లు తుడుచుకుంది.

కాఫీ టిఫిను తీసుకున్నాక లేచి చేతులు కడుక్కున్నారు...వాళ్లు

ఆ తల్లి బలవంతాన...ఆ మెరుపుతీగ మళ్ళీ గుమ్మంలోకి వచ్చింది.

అప్పుడా గదిలో రాజన్ ఒక్కడే ఉన్నాడు.

పమిటకొంగు చేతివేళ్ళకువేసి మెలి తిప్పుతూ నిలుచుంది....బిక్క మొహంతో... పలకరిస్తే బావురుమనేట్టుంది.

"పేరేమిటి ?"

"నిన్నే ... ?"

"శాంతమ్మ"— అని ఏదో జపమల్లే గొణిగింది.

"ఏ క్లాస్ ?"

"సిక్స్థ్."

"ఇప్పుడింకా సిక్స్థ్ ఫారం అంటున్నారా ?"

"టెంత్ స్టాండర్డు"

"ఆఁ ... అలా చెప్పు ... స్కూలు యిక్కడికి ఎంతదూరం ?"

''వో మైలు.''

''ఇప్పుడు మైళ్లెక్కడున్నాయ్ ?''

శాంతమ్మ కొంచెం గాబరాపడుతూ — ''అంటే—? '' అనడిగింది.

''ఇప్పుడంతా కిలోమీటర్లేగదా ? ''

అనగానే, — జారిపడే మంచు బిందువులోని క్షణికమైన కాంతిలాగా....ఒక్క క్షణం శాంతమ్మ పెదవిమీద సన్నని చిరునవ్వు మసలి తక్షణమే మాయమైంది.

అంతలో పిల్లదాని తల్లి వచ్చి — ... ,

''నాయనా ! మేము గొప్పగా కట్నకానుకలేం యిచ్చుకోలేం ... నాకున్న ఆస్తల్లా నా ముగ్గురాడపిల్లలే...'' అంది.

''ఊఁ ... ''

'తరువాత అనుకుని ప్రయోజనం లేదు.

నేను పిల్లల్ని ఎంతో కట్టుదిట్టాన పెంచా ..'' అని చెబుతున్నప్పుడు ఆవిడ కళ్ల వెంట జలజలా నీళ్లుకారాయి.

రాజన్ చెయిజాపి శాంతమ్మ చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు.

శాంతమ్మ కంపించిపోయింది. గాబరాపడుతూ తల్లివంక చూసింది.

అతడు చేసిన పనిని ఆమోదిస్తున్నట్టే తల్లిముఖంలో కనబడింది.

''శాంతమ్మా ! ''

''ఊఁ ...''

''నేను నీకు నచ్చానా ?''

నచ్చావని చెప్పేందుకు, — శాంతమ్మకి సిగ్గు ముంచుకొచ్చింది.

''చెప్పు.''

''మరైతే .... , మీకు ... నేను ? '' అంటూ వినపడీ వినబడనట్టు అడిగింది.

సమయానికి ఆ మాత్రం తెలివిగా నడుచుకున్నందుకు ఆ తల్లి మనస్సుకు చెప్పలేనంత ఆనందం కలిగింది.

'నేను నచ్చానా'— అని అడుగుతున్నప్పుడు — ఆ పిల్లదాని అరచేతిని గట్టిగా నొక్కుతూ రాజన్ 'ఓ'— అన్నాడు.

''నువ్వు దానికీ నచ్చావు బాబూ ! — ఆ మాట చెప్పడానికీ అది బిడియపడుతూందిలే ...

భార్యాభర్తలుగా మీ యిద్దర్నీ భగవంతుడు నిర్ణయించేశాడు.

ఇహపోతే, — సంప్రదాయానుసారం ఆ పెళ్ళి తతంగం కాస్త అయిందని పించాలి...'' అంది.

''వచ్చేవారం ఓ మనిషిని యిక్కణ్ణుంచి మా యింటికి పంపించండి .... తేదీ నిర్ణయంచేసి, ఉత్తరాలు, శుభలేఖలురాసి ఏర్పాటుచేసుకునేందుకు సరిగ్గా ఉంటుంది ..'' అన్నాడు బేబీ...బయల్దేరబోతూ.

''అలాగే''

తిరిగి వెడుతున్నప్పుడు రాజన్‌లో ఒక కొత్తదనం... ఒక తీయని బాధ... మనసులో ఒక నూతనరాగం...., మధుర భావన, మంజుల ఆలాపన ...

''రాజన్‌బాబూ నేను నచ్చానా ? .... అంటూ ..., ''

రాగానే అడిగింది దీనామ్మ —, అడిగితే ''నచ్చింది పిన్నీ'' — అని నిస్సంకోచంగా, ఏమాత్రం బిడియపడకుండా చెప్పేశాడు రాజన్.

మా వాడు పిల్లని చూడగానే ముగ్ధుడైపోయాడంటూ దీనామ్మ అప్పుడే ఇరుగు పొరుగు వారందరికీ చెప్పనుగూడా చెప్పేసింది.

చెప్పిన ప్రకారం పుత్తనాట్టుకరానుంచి ఆదివారంనాడు నలుగురు మనుషులొచ్చారు. ఆ వచ్చిన వాళ్లెవరంటే – పిల్లదాని మేనమామ, ఇద్దరు పినతండ్రులు, తర్వాత, — ధర్మసంఘం తరపున ఒకరూను.

కట్న కానుకలను గురించి ఒక ఒప్పందానికి రాకుండానే, తాంబూలాలు పుచ్చుకోవడానికి నిర్ణయించారు.

పిల్లదానికి పుట్టింటివారు ఉన్న ఆస్తిలో మూడోపంతు అంటే, — నలభై సెంట్ల భూమీను, యిల్లూ యిచ్చేటట్టు, — పెళ్ళిఖర్చు కొంత భరించేటట్టూను...

ముఖ్యమైన మాటలన్నీ మాటాడుకోవడాలైనాయి. కానీ...మాత్తుకుట్టి మాత్రం అంత మాత్రంచేత సంతృప్తిపడలేదు.

అయితే —

పిల్ల—పిల్లవాడు ఒకరినొకరు నచ్చారు. కాబట్టి ఒప్పుకోవాలసిందే తప్ప ... గత్యంతరం లేని పరిస్థితి అయింది.

ఆ పరిస్థితుల్లోనే ముఖ్యమైన సంఘటనొకటి జరిగింది.

ఆ మరుసటి ఆదివారంనాడు ప్రార్థనలైన తర్వాత ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళారు.

అప్పుడు మేలో ఝుత్తు వాళ్ళ యింటికి వో ముసలాయన వచ్చాడు. బాగా దెబ్బయి — దెబ్బయి అయిదేళ్లుంటాయి. ఎండనుబడి నడిచి నడిచి — అలసి సొలసి వచ్చాడు.

'కుయెన్నాచ్చన్' — అంటూ వాకిట్లోంచే కేక పెట్టాడు.

అప్పటికి రాజన్ యింట్లో లేడు. అతను వాళ్ళ మేనమామల యింటికెళ్లాడు దీనామ్మ లోపల్నుంచివచ్చి — 'రండి' — అని ఆహ్వానించింది ఆయన వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"నిద్రపోతున్నట్టున్నాదే ? "

"ఆఁ ... అలసట .. నీరసం...యిప్పుడే కాస్త కునుకు పట్టింది."

"తొంభయ్యో పడిలో పడ్డాడుగా మరి....ఆ మాత్రం ? "

"ఆఁ .... "

"నేను మొట్టమొదట ఆలప్పుఝాలో మిరియాల వర్తకం చేస్తూండేవాణ్ణి. ఈ కుయెన్నాచ్చనుగూడా — మిరియాల బేరానికే వస్తూండేవాడు. ఆనాటి పరిచయంమాది ఇంతకు మునుపుగూడా యిక్కడికి వచ్చా . అయితే...అబ్బో...అది ఏనాడో... చాలా కాలం క్రితం..."

"ఓహో...?"

"నువ్వా...ఆయన మనవరాలివేనా ? "

దీనామ్మ కొంచెం సిగ్గుపడుతూ — "కాదండీ...నేను ... వారి కోడల్ని..." అంది.

"ఆహాఁ ... అయితే మరి యిప్పుడు యింతకూ పెళ్లైవరికి ? "

"అబ్బాయిది...ఆ పిల్లవాడికి తల్లిపోయింది...."

"అయితే నువ్వు రెండో సంబంధమన్నమాట ?"

"ఔను."

"అలాగా ... మా పిల్లల్లో వో పిల్లని యిక్కడ వేలమ్మాకువులో యిచ్చా .... అక్కడికే వెడుతున్నా.

కుయెన్నాచ్చనుతో వో మాట చెప్పిపోదామనిపించింది..."

"మావయ్యని లేపమంటారా పోనీ ?"

"లేపమ్మా ... లేవు ... నేను .... వెళ్లిపోవాలి..."

"మావయ్యా ? "

కుయెన్నాచ్చను కదల్లేదు మెదల్లేదు...చేత్తో కదిలించింది.

''ఇటు చూడండి మావయ్యా! ... ఎవరో ... మీకోసం వచ్చారు...''

''ఎవరు ? ''

''కళ్లు తెరిచి చూడండి మరి ? ''

''గుర్తు పట్టావా... ? నేను ... కొనచ్చిరా లోనాన్ని.''

''ఎవరు — ? మిరియాల లోనానేనా ? ''

లోనాన్ ఫక్కున నవ్వాడు.

''అఁ ... మరే,''

''అమ్మా ! కాస్త అంబలి తెచ్చిపెడుదూ !

వేడివేడి అంబలి కాస్త తాగిన తర్వాత, లోనాన్ని తేరిపార చూశాడు.''

''ఏవిటి గుర్తొచ్చానా లేదా ? ''

''ఆ ... ఆ ...''

''చాలా ఏళ్ళయిందిగా మరి ? ... చూసి ... ?''

''వొళ్ళు బావుండటం లేదు ... నిస్త్రాణ ... నీరసం ...''

''బావుంది...నిస్త్రాణ ఉండక ఏమవుతుంది ? ''

''నీ కూతుళ్ళల్లో వోదాన్ని వేలమ్మాకవు ఇచ్చావుకదూ ? ''

''ఔను ... అక్కడికే వెడుతూ, సరే,—నువ్వు మా ఊరి వారితో వియ్యమంద బోతున్నావని తెలిసి...''

''ఎలా తెలిసింది ? ''

''మా కోతచ్చిరాకును—పుత్తన్నాట్టుకరాకి నాలుగు మైళ్ల దూరమేగా?

పెళ్ళి విషయమాయె ..ఆ నోట ఆ నోట బడి—నా దాకా వచ్చింది. మొదట్లో మేమూను — ఆ పిల్లదాని యింటి వాళ్లూను, — ఒక చర్చికి — ఒకే ధర్మ సంఘానికి చెందిన వాళ్ళమే.

''తర్వాత వాళ్ళు వాళ్ళ చర్చి – వాళ్ల ధర్మసంఘం వేరు చేసుకున్నారు:''

''సంబంధం మంచిదే నంటావా ?''

లోనాను కాసేపు ఆలోచించి నవ్వుతూ, – ''మంచిదా అంటే – ఎం చెప్ప మంటావ్ ... అహఁ ... అడగడంలో ఆంతర్యం ఏవిటి ?''

''నే ననేది ... ఆ పిల్ల ... ఆ పిల్ల దాని తల్లిదండ్రులు ... వాళ్ల కుటుంబం

... సం|ప్రదాయం ... అదీ ...''

''పిల్లకేఁ ... పిల్ల నిక్షేపంలాగే. మంచివాళ్లే ... ఒకప్పుడు ఆభిజాత్యం ఉన్నవాళ్లే ... మరి ...''

''పిల్లదానికి తం|డ్రి లేడట .... ?''

''ఆ పిల్లది తల్లి కడుపులో ఉండగానే, — మూడో నాలుగో నెలలపుడు — తం|డికాస్త పోయాడటగా ?''

కొంచెం తటపటాయించి, లోనాసు, —

''తం|డ్రి ఉన్నాడే — '' అన్నాడు.

''ఏవిటి ?''

''పిల్లదాని తం|డ్రి నిక్షేపంలా ఒతికే ఉన్నాడు. ఆయనో ఫాదరీ.''

ఆమాట వినఽడే సరికి దీనామ్మకి ఎవరో తన మెడబట్టి మెలిపెడుతున్నట్టని పించింది.

''ఆఁ ?''

''పదిహేను యిరవై సంవత్సరాల|క్రితం పుత్తనాట్టుకరా చర్చికి కార్తికప్పల్లిలో ఉండే ఒక ఫాదరీని నియమించారు. ఆయన కూతురే ఆ పిల్ల.''

విస్తుబోతూ కుయెన్నాచ్చను దీనామ్మ వంక చూశాడు. తనని లేవదీసి కూర్చోబెట్టమని సంజ్ఞచేశాడు.

దీనామ్మ పట్టుకుని లేవదీసి కూర్చోబెట్టింది.

''ఇదేవిటీ వింత ... ? ఎక్కడైనా ఉందా ?''

''కుయెన్నాచ్చన్ ! ఉన్నమాటే చెబుతున్నా...నువ్వా ఫాదరీని ఎరుగున్నావో లేదో ... !''

ఆ ఫాదరీ మా బావగారే ... మా అక్క పెనిమిటే అని చెప్పాలని దీనామ్మకి నాలుక చివరిదాకా వచ్చిగూడా — ఆపుకుని, ''మీరు పెద్దలైయుండి యిలా మాట్లాడటం ఏం బావుండ లేదండి ...'' అనే సరికి లోనాను మొహం చిన్నబుచ్చుకున్నాడు.

''అమ్మాయి ! నువ్వు నా చిన్నకూతురితో సమానము ... పెళ్ళిళ్లకి అడ్డుపుల్ల లేసి ఆపించడం ... సంబంధాలు పడగొట్టడం ... నా ఉద్యోగమనుకునేవ్? పొరబాటు తల్లీ ! ... కావాలంటే కనుక్కో ..., కుయెన్నాచ్చనుతో ఉన్న స్నేహంకొద్దీ — ఏ స్నేహధర్మాన తెలిసిన విషయం చెప్పి పోదామని వచ్చాగానీ ....

ఆ మేస్టరు పోయిన ఏడాది తర్వాతనే ఆవిడ ఈ పిల్లని కన్నది

ఆ రోజుల్లో ఆ ఫాదరీ వాళ్ళింటనే ఉండేవాడు. ఆవిడ గర్భవతి అయిందన్న విషయం చెవిన బడగానే ... అక్కణ్ణించి మకాం ఎత్తేశాడు .. బదిలీ చేయించుకు చక్కా బోయాడు ....

రహస్యమేం కాదు ... ఇది అందరికీ తెలిసిందే. లోకులంతా ఆవళాన బిషప్ తో ... ఈ ఫాదరీకి శిక్ష వేయించాల్సిందేనంటూ ఫిరియాదు చేశారు.

చాలా గోలైందిలే ... కానీ ... ఆ తరువాత ఆవిడే ఆదుకుని — శిక్ష పడకుండా చేసింది.''

కుయెన్నాచ్చను మొహంలో కనబడుతున్న కలవరం చూసి, లోనాను — "ఇది పదిహేను ఇరవైయేళ్ళక్రితం జరిగిన చరిత్ర. మనం తేలిగ్గా మర్చి పోవచ్చు..., అంతేగానీ ... పిల్ల పెళ్ళికి తగుతుందో — తగదో నే చెప్పడం లేదు ... నాకు తెలిసిన విషయం ... నేనెరిగిన విషయం మీకు చెప్పానంతే ... అన్నాడు.

అంతా నిశ్శబ్దం ...

బహుశా అది నిజమే కావచ్చు ... అయితేమాత్రం ... ఈ ముసలాయన ఏదో మునిగిపోయినట్టు వచ్చి ... ఈ ఇదంతా ఎందుకు ఏకరువు పెట్టాడ్రా దేవుడా ... అని దీనామ్మ లోలోపల ఎంత బాధపడిందో !

వచ్చిన పని అయిందిగా — ఇక లోనాను బయల్దేరబోతూ —

''కుయెన్నాచ్చన్ ! సెలవు తీసుకుంటానయ్యా — '' అన్నాడు.

కుయెన్నాచ్చను ఏం మాట్లాడలేదు.

''అమ్మా .. బయలుదేరనా మరి ?''

ఆవిడ — పలక లేదు.

లోనాను వెళ్ళిపోయిన తర్వాత కుయెన్నాచ్చను — 'అమ్మాయీ' ! అని పిల్చాడు.

''ఏవిటి ?''

''ఒకవేళ కొంపదీసి నిజమే కనుకైతే ?''

దీనామ్మ ఏం జవాబు చెప్పలేదు. కుయెన్నాచ్చను ఇలా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఆ మాటే కనుక నిజమైతే — వాళ్ళిద్దరూ అన్నా చెల్లెల వరసవుతారే ... ?

ఫాదరు ఉంపుడుగత్తె కూతురు. అయితే మట్టుకు ? .... ఫాదరు — మాత్రు కుట్టి తోడి అల్లుళ్ళు అయినప్పుడు ... అన్నకూతురిని – తమ్ముడి కొడుక్కి ఇచ్చి నట్టు కాదూ ? ఏవిటి ఈ గోల ... ?

వెనకటికో కథ ఉండేది :—

దావీదు కొడుకైన అబ్షాలోముకి తామారు అనే చెల్లెలుంది ... ఆవిడ చక్కని చుక్క ... ఆ చుక్కని దావీదు కొడుకైన అమ్నోను మోహించాడు.

అమ్నోను మిత్రుడు యెహోనా బాబు ... జిత్తులమారివాడు అతగాడు చెప్పిన ప్రకారం అమ్నోను జాయిలా పడ్డట్టు నటిస్తూ మంచంలో పడుండగా, — తండ్రి అతణ్ణి చూడటానికి వస్తే — అమ్నోను అన్నాడు గదా — నా చెల్లెలు తామారు వచ్చి నాకో రెండు పూరీలు చేసి పెడితే బావుండు ... ఆ పిల్లదాని చేతి పూరీలు తింటేచాలు ... అంటూ తన కోరికను వెల్లడించగా — తామారు వచ్చింది ... పూరీలు చేసింది.

అప్పుడు అమ్నోను ఏమన్నాడంటే — ఆ పూరీలు ప్రత్యేకంగా గదిలోకి తెచ్చిపెట్టకున్నాడు తను తినేటప్పుడు ఎవ్వరూ చూడరాదన్నాడు.

సరే అపళాన ఆవిడ పూరీలు గదిలో తీసుకు వెళ్ళింది. తామారు పూరీలు తీసు కుని గదిలోకి రాగానే, అమ్నోను ఆవిణ్ణి బలాత్కరించి ... మానభంగంచేశాడు.

రెండేళ్లు గడిచాయేమో ....

ఎఫ్రాయిమ్ దగ్గరున్న బయల్హాసోరులో గొర్రెలబొచ్చు కత్తిరించే తరుణంరాగా — అమ్నోను ద్రాక్షరసం తాగిన మైకంలో పడున్నప్పుడు — అబ్షాలోము తన సేవ కులచేత అతణ్ణి చంపించి, తన చెల్లికి మానభంగం చేసినందుకు ప్రతీకారం తీర్చు కున్నాడు.

నిజంగా చంపి చంపి పోగులు పెట్టాల్సిందే !

''మాపయ్యా !''

"ఏవిటమ్మా ?

''ఎవర్ని ... ? చంపాలంటున్నారెవర్ని ?''

''ఆఁ ... ? ఆమాట నిజమేనంటావా ?''

... ... ... ...

ఛీ ... తుచ్ఛుడు ... బురఖా తగిలించుకున్నంత మాత్రాన ఫాదరీ అవుతాడా ?

"నాకేం తెలీదు ... నన్నేం అడక్కండి మావయ్యా! ... నన్నేం అడక్కండి ..." అంటూ దీనామ్మ వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది.

"ఈ పెళ్ళి జరగదు ... జరగదని ఉత్తరం రాసి పడెయ్యండి. పిల్లవాడు నౌకరీకి వెళ్ళిపోవాల్సి వచ్చింది కనుక...మనం నిశ్చయం చేసుకున్న ప్రకారం...."

మీ అబ్బాయి రానీండి మావయ్యా!...వచ్చాక.

"ఏవిటి?"...

"ఈ సంగతి వాడకట్టంతా తెలిసిపోయిందీ అంటే — మనకే అవమానం ... అప్రతిష్ఠాను...ఏమనుకున్నా వో..."

"ఊరుకోండి మావయ్యా!"

సాయంకాలానికి మాత్తుకుట్టి రానే వచ్చాడు..., సరే ముగ్గురు తమ్ముళ్ళకి ... కుయప్పికి కబురు పంపాడు.

కబురు వెళ్ళగానే, కీవరీతు-కుయప్పి మాత్రం వచ్చారు. విషయమంతా విన్నాక, — కీవరీతు అన్నాడుగదా — పెళ్ళి చెడగొట్టాలని తయారయ్యే పెద్ద మనుషులు కొందరుంటారు ... కాబట్టి జాగ్రత్తగా ఉండాలి.

ఒకవేళ తన కొడుక్కి ఆ పిల్లదాన్ని చేసుకుందామనుకున్నాడేమో..., వాళ్ల వొప్పుకోక పోవచ్చు...అంటూ అనుమానాన్ని వెలిబుచ్చాడు...

ఏది ఏమైనా...కొంచె అడిగి...కనుక్కోవాలిసిందే.

అసలు అక్కడేదో కిటుకుంది. లేకపోతే పెద్దవాడు ఆయన అంతదూరాన్నుంచి యీ విషయం మూటగట్టుకుని మోసుకు రావలసిన అగత్యమేమిటి ... అన్నాడు మాత్తుకుట్టి.

నేననేదీ అదేరా...ఆ ముసలాడి మొహంమీదే ఛడామడా అడిగేయాలిసింది.

నాన్నా అర్థంలేని మాటలెందుకుగానీ, — ఊరుకో అన్నాడు కీవరీతు.

మర్నాడు మనిషిని పంపించారు...విచారించడానికి. ఎంతైనా సూటిగా అడగ లేరుగదా! చాలామందిని ఎంతో తెలివిగా అడిగారు ... కనుక్కున్నారు.

మునపటికంటె గూడా అనుమానం మరింత ఎక్కువైందప్పుడు.

అంతా మోసం...దగా అనిపించింది.

ఆ పళాన వాళ్లకి ఉత్తరం రాసి పడెయ్యాలనుకుంటున్న సందర్భంలో — ఘన మామల యింటినుంచి రాజన్ ఊడిపడ్డాడు.

ఇల్లు చేరుకునే లోపలే అతడికి జరిగిన కాండంతా తెలిసిపోయింది.

బేబీ అంతా పూసగుచ్చినట్టు చెప్పేశాడు ..విని అతగాడు విస్తుపోయాడు.

ఎంతో ఆశతో...అనురాగంతో కట్టుకున్న ఊహా సౌధం కళ్లముందే నేలకూలి తునాతునకలై పోయినట్టు కూడబెట్టుకున్న ధనం అవసరానికి వాడుకుందామంటే — మాయమైనట్టు అనిపించింది...అన్నం నీళ్ల పద్దనిపించింది.

ఏదో—మానసిక సంఘర్షణ ... అలవికాని ఆందోళన ...

క్రమంగా అల్లకల్లోలమంతా అణిగి...

మనోమందిరం...ప్రశాంత నిలయమైంది...

వెలుగుతున్న కొవ్వొత్తి దీపం ... చేత్తో పట్టుకుని ఒక మనిషి యింటి గుమ్మం దగ్గర నిలబడింది.

కాటుక తీర్చినట్టున్న పెద్దపెద్ద కళ్లతో — వెలుగులు వెదజల్లే అందమైన మోముతో, మనసు దాచిన అనురాగామృతంతో తడిసిన — రమ్యమైన పెదవులతో —

ఆలస్యం చేశావేఁ ?

ఆఁ ?

ఎంత సేపటినుంచి నీ కోసమై నిరీక్షిస్తున్నానో !

నువ్వు రాకపోతే అన్నం తిననని నీకు తెలుసుగదా ?

నువ్వెవరివో... ? నేనూహించినట్టుగా లేవు.

ఏవిటి ?

నేననుకున్నట్టుగా లేవు... , మొదటిసారి నిన్ను నేచూసినపుడు నువ్వు ముసుగులో ఉన్నావు.

లేదు...ఎన్నడూ లేదు...రాజన్‌బాబూ ! తాకిచూడు.

మీ నాన్నెవరు ?

ఉలిక్కిపడింది...తెల్లబోయింది...కంట నీరు బెట్టుకుంది...

నాన్న ?

అవును .. నాకు తెలియాలు ... కార్తికపల్లి ...

చేతితో నోరుమూసుకుంది. ఆ సంగతంతా అడగ వద్దన్నట్టు కళ్లు వేడుకుంటున్నాయి.

రాజన్‌బాబూ !

ఊఁ ...

ఈ దీపకాంతి చూస్తున్నావుగా ?

ఊఁ.

ఇది అపవిత్రమైందా ?

ఊహుఁ.

ఈ మైనం మలినమైందా ?

తెలీదు.

అయితే... నేనీ కాంతిని... నా చేతిలో చేయివేసి బాస చేశావ్ కదూ ?

.. ... ...

చెప్పు రాజన్‌బాబూ ! నేను నీకు నచ్చానని అన్నావుగదా ?

* * * * *

నిశ్చయ తాంబూలాలకి రానవసరం లేదంటూ పిల్లవేపు వాళ్ళకి రాసిన ఉత్తరాన్ని మాత్తుకుట్టి కుయెన్నాచ్చనుకి చదివి వినిపిస్తూండగా — రాజన్ వచ్చి — "అప్పుడే ఉత్తరం రాసేయడం గూడా యిందన్నమాట..." అన్నాడు.

"చాలురా...చాలు...ఇవాళే పంపించెయ్...." అంటూ కుయెన్నాచ్చెను సలహా యిచ్చాడు.

"ఏదీ చూడనీ..." అంటూ అడిగేసరికి ఇవ్వడానికి తటపటాయించినా మాత్తుకుట్టి రాజన్ చేతిలో పెట్టాడు.

ఉత్తరం చదివాడు....చదివి, —

"ఈ ఉత్తరం పంపద్దు..., ఆ పిల్లనే చేసుకుంటా...నాకా పిల్ల నచ్చింది... మనకి కావాలిసింది పిల్ల గుణగుణాల వరకేగానీ..." అన్నాడు రాజన్.

"ఛీ .... మూర్ఖుడా ! ఏమన్నావ్ ? పరువు—ప్రతిష్ఠ అక్కర్లేదురా ? ఉత్తరం ఇటియ్...

పంపవద్దుట . పంపవద్దు."

రాజన్ ఉత్తరం ముక్కలు ముక్కలుగా తుంపి, — అవతల పారేశాడు.

అదే సమయాన మాత్తుకుట్టి కొడుకుని లాగి లెంపకాయ కొట్టాడు.

"ఏరా నీకు అదే నచ్చింది ? నచ్చుతుంది.. నచ్చుతుందిరా," అంటూ మాత్తుకుట్టి కోపావేశంతో ఊగిపోతున్నాడు.

రాజన్ నాలుగైదు క్షణాలపాటు రెప్పవాల్చకుండా మాత్తుకుట్టివంకు చూసి, —

''నాకు నచ్చిన పిల్లని నే చేసుకోవడంలో తప్పేవిటి ? '' అనడిగాడు ... రోషంతో

''చేసుకుంటావ్ ..'' అంటూ మాత్తుకుట్టి పచ్చిగా తిడుతూ, — మళ్ళీ రాజన్ మీద చెయి చేసుకోబోయాడు.

రాజన్ తండ్రిచేయి గట్టిగా నొక్కి పట్టుకున్నాడు.

''నేను నీ సొమ్మేం కాజేశాను...? దోచుకున్నాను ? ... ఎందుకు మాటిమాటికి చెయెత్తుతావ్...ఏవిటి నీ...''

దీనామ్మ మధ్యలో పరిగెత్తుకువచ్చి కొడుకు చేతిలోంచి భర్త చెయ్యి విడిపించింది.

"ఇదెక్కడి ఖర్మరా ? తండ్రీ కొడుక్కీ జొత్తిగా వొళ్ళు తెలీకుండా పోయింది'' అంటూ లబలబలాడింది.

కుయెన్నాచ్చను మంచం మీంచి లేచి...ఒరె...ఒరె కుర్రాణ్ణి కొట్టకురా ... వాడేదో అవివేకంగా వో మాటన్నంత మాత్రాన . నువ్వు ఏకంగా వాడి ప్రాణం తీసేటట్టున్నావేరా...'' అని గిలగిల్లాడి పోయాడు.

సిసిలీ తల్లిని పెనేసుకుని వొకటే ఏడుపు.

''పోరా...పో...నీకు నాకు సంబంధంలేదు . పో...పోరా ''

''నీ పెట్టు పోతలు నాకేం అక్కర్లేదు.. ఇది నా తాతగారి యిల్లు ..

''నోరుముయ్యరా రాజన్ ... కన్న తండ్రిని పట్టుకుని అంత మాటంటావ్‌రా నువ్వు...'' అంటూ దీనామ్మ అరిచింది.

''అయితే పిన్నీ! తండ్రులు కన్న బిడ్డల్ని యిలాగే కొట్టి చంపుతారా చెప్పు ? ఒక కన్న తండ్రి కొడుకుని తిట్టే తిట్లేనా అవి ?''

''కొట్టా వచ్చు...తిట్టా వచ్చు...చూడు తండ్రిని దూషిస్తే మాత్రం .. భగవంతుడు దండిస్తాడు సుమా...''

''ఈ యిల్లు...నా కొడుకుదేరా.. నువ్వు పోరా పో...'' అన్నాడు కుయెన్నాచ్చను.

ఆ తర్వాత రొప్పడం మొదలెట్టాడు కుయెన్నాచ్చను.

రాజన్ మరి...ఇక అక్కడ ఆగలేదు. అక్కడ్నుంచి విసురుగా బయటకి వెళ్ళిపోయాడు.

''ఆ వెధవని నెత్తికెక్కించుకుంది నువ్వేనే .... నీ వల్లనే ...'' అంటూ మాత్తుకుట్టి కోపమంతా దీనామ్మ మీద చూపించాడు. దీనామ్మేమీ మాట్లాడలేదు. ఆ మంట చల్లారనీమనుకుంది. అంతత్వరగా ఆ ఉద్ధృతం తగ్గదనే ఆవిడ భయం ... ఎందుకంటే — మాటపట్టింపు వచ్చిందంటే మాత్రం ప్రాణాల్ని సైతం లెక్కచెయ్యని రకం ...''

''ఆ పిల్లది వాడికేదో పెట్టి ఉండాలి ... !''

''ఏవిట్రా ... ?'' ఏవిటి అనడిగాడు కుయెన్నాచ్చను.

ఎవ్వరూ మాట్లాడలేదు.

అలుముకు పోయే మంటల్ని అదనుకు ఆర్పేసట్టే — ఆందోళన తెచ్చిపెట్టిన మౌనం శాంతిలా ఆవరించింది. అంతటా నిశ్శబ్దం అలుముకుంది.

కీపరీతు కుయప్పి మళ్ళీవచ్చారు.

కుయెచ్చెరుక్కన్ని, ఫిలిప్పోసుని స్వయంగా దీనామ్మే పోయి పిలుచుకు వచ్చింది.

ఫిలిప్పోసు తోటేదో కొనాలని మలబారు వెళ్ళి అంతకు మునుపే వచ్చాడు.

వచ్చిన పరిస్థితిని గురించి సలహాలు సంప్రదింపులు చేశారు. రాజన్ చింపి పారేసిన ఉత్తరం లాటిదే మరొకటి రాయమని మాత్తుకుట్టిని పోరుబెడుతున్నాడు కుయెన్నాచ్చను.

కుయుచ్చెరుక్కను వల్లకాదంటే — వల్ల కాదన్నాడు.

నలుగురు జేరితే తర్జన భర్జనలు తప్పవుగదా !

అహఁ ... ఎవడో కూసిన తప్పుడు కూతవిని అంతటి ఫాదరీమీద అభాండం వేయడం తగదంటూ

''ఏవిట్రా నువ్వలా మాట్లాడతావ్ ? ...'' అన్నాడు కీపరీతు.

''అనుకుంటున్నమాటే ....''

''చూడు ... ఆ ఫాదరీ సంగతి ఎవడిక్కావాలోయ్ ?'' సంబంధం నచ్చనప్పుడు వెళ్ళి ఎలా సాధ్యమూ అంట ?''

''నచ్చకపోవడ మేమిటి ? ఎవరికి నచ్చాలి చెప్పు.''

''ఏవిటి చెప్పేది నా బొంద ... ఖర్మ ...''

మాత్తుకుట్టి మాట పూర్తికాకుండానే కుయప్పి మధ్యలో అందుకుని —'' చూడు

బాబాయ్ ... మనం వొప్పుకోక పోయినా ... రాజన్ మొండిపట్టు పట్టి — ఆ పిల్లనే చేసుకుంటానని కూర్చున్నా డనుకో ... అహఁ ... మనమాట కాదని — ఆ పిల్లని రిజిస్ట్రారు ఆఫీసుకు తీసుకుపోయి పెళ్ళి చేసేసుకున్నాడనుకో – మనమేం చెయ్యగలం చెప్పు ?

''చేసుకోనీ ... మానుకోనీ, - మాట విననప్పుడు ... ఎలా పోయినా సరే.''

''అదేవిటి ? వాడికేం నష్టం ? వాడు ప్రభుత్వోద్యోగి. నీ దయాధర్మ బిచ్చమేం వాడికి అక్కర్లేదు ....''

''కనుక నేను వాడన్న దానికల్లా తందాన తాన అనాలేఁ ?''

''అనాల్సిందే మరి .... కాలం తీరు అలాగే ఉంది.''

విషయం తేల్చకుండానే .. ఎవరి యిళ్ళకు వాళ్లు పోయారు. రాజన్ మళ్ళీ తన మేనమామల ఊరెళ్ళి పోయాడు అతడికి నలుగురు మేనమామలు. అందరికి పెళ్ళిళ్ళయ్యాయి. అన్నదమ్ములంతా కలిసే ఉన్నారు. నలుగురు వడ్డీ వ్యాపారంచేసి డబ్బు సంపాయిస్తూంటారు ... అంతేకాకుండా వాళ్లంతా చిట్ఫండు — బ్యాంకు వగైరా వగైరా ఉద్యోగులు. రాబడిలో యేవిటి — ఖర్చులో యేవిటి — అంతా ఉమ్మడే ఆ అన్నదమ్ముల్లో అంత మంచి సఖ్యత — సయోధ్యత ఉన్నాయి.

రాజన్ మొహం వేలాడేసుకుని వెళ్లేసరికి — మావయ్యలు, — అత్తయ్యలు అంతా ఎవరికి వారనట్టు వచ్చి అలా ఉండటానికి కారణమేమిటో ఆత్రంగా అడిగి కనుక్కున్నారు.

రాజన్ని వాళ్లంతా కనుపాపలా చూసుకుంటారు:

ఏమైందిరా — అనడిగే వాళ్లు.

నాయనా రాజా ... ఏం జరిగిందిరా ... అనే వాళ్ళాను. రాజన్ ఇక అప్పుడు తమాయించుకో లేక — ఒక్కసారి బావురు మన్నాడు. చెప్పాలంటే గొంతు గద్గదమై పోయింది. తనెంత బలహీనుడై పోయాడో అప్పుడే గుర్తించాడు. చెంపవాచిపోయి ఉండటం పెద్దమావయ్య కొచ్చుకుట్టి చూశాడు.

పదరా నేనూ వస్తా పద ... కారణం కనుక్కోవాల్సిందే. పద .... అన్నాడు.

మేనమామ మేనల్లుడు కలిసి వచ్చారు. సాయంత్రందాకా చూసినా — ఎడీ ... మాత్రుకుట్టి ? అందనే లేదు.

కుయెన్నాచ్చను — దీనామ్మ యింట్లోనే ఉన్నా, — కొచ్చుకుట్టి వాళ్లనేం

అడగ దల్చుకోనూలేదు. దీనామ్మ అడిగి కనుక్కోవాలని శతవిధాల ప్రయత్నించింది. కానీ ... సాధ్యం కాలా.

కొచ్చుకుట్టిని తమయింటి వసారాలో చూసీ చూడగానే మాత్తుకుట్టి కొంచెం సందిగ్ధంలో పడ్డాడు.

''అయ్యా! బావగారూ ఎప్పుడూ రావడం ...'' అంటూ పలకరించాడు.

''మధ్యాహ్నమే వచ్చాం ...''

మాత్తుకుట్టి మెదలకుండా వంటింట్లోకి పోయి - వచ్చిన వాళ్ళతో మాటా — పలుకూ అయిందా లేదా, అంటూ ఎంతో లౌక్యంగా భార్యనడిగి కనుక్కున్నాడు.

బావమరదులిద్దరూ సమవయస్కులే. ఒకప్పుడు ఆప్తమిత్రులు వాళ్లు.

మాత్తుకుట్టి బయటకు వచ్చి .. ముఖ్య విషయమేమైనా ఉందేవిటి ? ..'' అనడిగాడు ... కొచ్చుకుట్టిని.

''ఇక్కడేదో ముఖ్యవిషయం ఉన్నట్టు వినికిడి ... అది కనుక్కు పోదామనే వచ్చా ...'' అన్నాడు.

''ఏం ...? మనవాడేం చెప్పలేదా ?''

''సరిగ్గా చెప్పలేదు. దవడ వాయడమే తెలుస్తూంది.''

''ఓ ... అది ... కనుక్కునేందుకా ... వచ్చింది ..., సరే.''

''అదేం లేదు ... నీ కొడుకు ... నువ్వు వాణ్ణి చంపి పాతేస్తే మాత్రం ఎవరడగ్గలరు ?'

''మరైతే ... ?''

''ఏం లేదు. మనకీ ... మనకీ చుట్టరికమంటూ ఒహటేద్చెగా ... ! మీరు వీడికేదో పెళ్ళిమాట తలబెట్టినట్టు విన్నాం ... ఇప్పుడది దవడ వాచిపోయే వరకు వచ్చిందంటే, — ఏవిటో ... ఏమైందో ...''

''ఆఁ ... సంబంధం చూడగానే అయిపోతుందా ?''

''సంబంధాలు రాగానే సరా ?''

''అహఁ ... మీరు చెప్పినట్టే వెళ్ళాడు. పిల్లని చూశాడు ... పిల్ల వాడికి నచ్చడమూ జరిగె ... మరైతే యిప్పుడీ గోలా హంగామా దేనికి ?''

''ఒరె ... కొచ్చుకుట్టీ! చెపుతావిను ... ఆ పిల్లవాని తల్లి మంచిది కాదుట్రా ...'' అన్నాడు సమొన్నాచ్చను.

''మంచిది కాదంటే ? పెళ్ళి పిల్లదానితోనే గానీ, ... తల్లినిచ్చి కాదుగదా...?''

అప్పుడిక మాత్తుకుట్టి ఒక యెత్తు వేశాడు. ఉపాయంతో సమస్యా పరిష్కారం చెయ్యాలని యత్నించి-

''బాపగారూ ! మనసులో ఏదో అపోహ పెట్టుకుని మాట్లడకండి ... చూసీ చూడగానే సంబంధంలో ఉన్న లోటుపాట్లు ఎవరికి మాత్రం తెలుస్తాయికనుక ? నిశ్చయం చేయడానికి ముందు నలుగుర్ని అడిగి కనుక్కొని విచారించడం భావ్యమేగా ? ఆపైన నచ్చితే చేస్తాం ..., మనలోమాట ... అసలు విధానం అంతేగదా ...? అహఁ ... మీరు మాత్రం అది కూడదంటారా ...?''

వేళ కనిపెట్టి దీనామ్మ గూడా మాత్తుకుట్టికి వత్తాసుగా — ''అబ్బాయి రాజను ఆ తరువాత ఇష్టం అగచాట్లపాలు కారాదనేగా మా తాపత్రయమూను ...'' అంది.

''అదెవరు కాదన్నారు ... కూడదన్నారు ... అసలే సంబంధం తెచ్చింది మీ మేనమామ కొడుకు ... కార్తికప్పల్లిలో ఉండే ఆ ముసలాయనేటగా ? పెద్దలు ... వాళ్లు చూసి నిర్ణయించిన దాన్ని మనం కాదనడమేమిటి ? అదీగాక వెళ్ళి చూశారు. మీకా సంబంధం నచ్చింది ... ఇప్పుడిదేమిటి ? పిల్లదాని తల్లి మంచిది కాదని భోగట్టా తెచ్చిందెవరు ? ఎవరా చెప్పిన వారు ?''

మాత్తుకుట్టి అప్పుడిక చిక్కుల బడ్డాడు.

దీనామ్మకుగూడా ఏం చెప్పాలో తోచలేదు.

పిల్ల ఒక ఫాదరీకి పుట్టిందని చెప్పడమెలా ? ఆ చరిత్రంతా చెప్పాలన్నా సిగ్గే. అది కేవలం విన్నమాటేగానీ— చూసిందీ పెట్టిందేం కాదు ... ఆ మాట కొస్తే ...

అంచువల్ల సూటిగా కాకుండా కొంచెం డొంకతిరుగుడుగా చెప్పడం మొదలెట్టాడు.

''ఆవిడ మంచి వయసులో ఉండగానే ... భర్తకాస్తా పోయాడట. ఇంట్లోనా అదుపు పెట్టడానికెవ్వరూ లేరట. అటువంటి స్థితిలో— అట్టే మోసపోయేందుకు ఎంతైనా వీలేగదా మరీ !''

''ఛీ ... ఏంమాటంటా అవి ? ఆ ధర్మసంఘం చర్చిలో ఉండే ఫాదరీ సయానా మీ మేనమామ కొడుకేగదా ? ఆ చెప్పినాయన నెత్తంగా అన్నీతెలిసే చెప్పాడా అని ? ఎవరేమన్నా అనుకోనీ ... రాజన్‌కి నచ్చిందాపిల్ల ... చేసేస్తేపోయె.''

మాత్తుకుట్టి కొచ్చుకుట్టి మొహంవంక పరకాయించి చూశాడు. ఇతగాడు పోట్లా డాలనే పనిగట్టుకు వచ్చినట్టున్నాడు. కాబట్టి వాళ్ళకిచెప్పి వొప్పించాలనుకోవడం దండగ ... అనుకున్నాడు.

''కొచ్చుకుట్టి ఏమంటున్నాడురా ...'' అని కుయెన్నాచ్చను అడిగాడు.

''ఏముందీ ... ; ఆ సంబంధమే చేసెయ్యమంటున్నాడు''

''వీల్లేదు ''

''అహఁ ... ఇదికాకపోతే మరొకటి ... , వాడికిప్పుడు పెళ్ళీడేఁ మించి పోలేదుగదా బావగారూ ?''

''అదిసరే అనుకో .... యిప్పుడీ సంబంధం చేసుకోవడంలో నీకు అభ్యంతర మేవిటో చెప్పవయ్యా ?''

''అన్నయ్యా ! వాళ్ళిద్దరు— వరసకి పినతండ్రి పెత్తండ్రి బిడ్డలవుతారు ... అది ... ''

''నువ్వు ముందు లోపలికి పోవే ...'' అంటూ దీనామ్మని కసిరాడు మాత్తు కుట్టి ...

''ఈ సంబంధం చేసుకోవాలనే రాజన్ కోరిక—'' అన్న కొచ్చుకుట్టి మాటకు—

మాత్తుకుట్టి యెద్దేవాగా నవ్వుతూ—

''కోరిన కోరికలన్నీ ఫలిస్తాయిటగానీ ... , యీ పెళ్లికనుక చేసుకున్నాడో... యిహ వాడికీ మాకూ తెగతెంపులన్నమాటే ...'' అన్నాడు.

''అహఁ ... పోనీ వాడే ఏరికోరి ఏదోపిల్లని చేసుకువచ్చాడనుకోండి .... తమ రప్పుడేం చేస్తారు బావగారూ ... నాకు తెలీక అడుగుతా ?''

''అది పంతానికో పట్టుదలకో చేసేపనిగానీ ... వాడంతవరకూ దిగితే చెపుతాగా ... అయినా వాడు నామాట అంతతేలిగ్గా తోసెయ్యడు.''

''నేనూ యీనాటివరకు మా నాయన చెప్పుచేతల్లో ఉన్నా ...''

''ఆమాట విడిచిపెట్టు ... అందరికీ తెల్సిందేగానీ .... ''

''ఏవిటి తెలుసు ?''

''అదే ... అనడమెందుకులే ... బావుండదని చూస్తున్నా ....''

''ఫర్వాలా ... చెప్పు ... విందాం ...''

''ముప్ఫయియేడేళ్ల వయసులో, ఎదిగిన పుత్రవాడికి తండ్రివై యుండిగూడా,

వో పద్దెనిమిదేళ్ళ పడుచుని ప్రేమించి పెళ్ళిచేసుకున్నావే .... ? అదీ ... మీనాన్న యిష్టప్రకారం చేసుకుందేనా ?''

''మీ చెల్లెలు చచ్చిందని— నే సన్యాసం తీసుకోవాలాయేం ?''

అప్పుడిక దీనామ్మ అంతవరకు తలుపు చాటునున్న మనిషి కాస్త యివతలకు వచ్చింది.

''ఎవరి వీలు వారు చూసుకుంటారు దానికేముందీ ? రేప్పొద్దున ఈ పెద్దమనిషి కూతురే చదువుకనో సందెకనో పోయి ఎవణ్ణయినా కొట్టుకొచ్చిందనుకోండి ... అప్పుడేం చేస్తారట ?''

''కులనాపకురాలా ... ఫో ముందు ...'' అంటూ మాత్తుకుట్టి దీనామ్మ చెంప చెళ్లుమనిపించాడు.

''రాత ... నా సమ్మంలో నిలుచుని,— నన్ను నానామాటలు అంటూంటే,— నే నోరుమూసుకుని విని పడుండాలీ ... ఖర్మ ...''

''నానా మాటలా ... ఏవిటో ?''

''మాటలు మిగలడం మంచిదికాదు ... ఊరుకోండి ...''

''నేనూ అందుకే చూస్తున్నా ...''

కుట్టిన్నాచ్చన కర్ర ఊతంతో లేచి—

''నా గొంతులో సుక్కెడునీళ్ళు కాచిపోసేందుకు వచ్చినపిల్లని పట్టుకుని తిట్టి దిగబారబొయ్యడానికా నువ్విక్కడకి వచ్చింది—'' అనడిగాడు.

కొచ్చుకుట్టి లేచి వెడుతూవెడుతూ—

''మంచిగాఉంటే అంతా మంచిగానే ఉంటారు ...., మంచిగా ఉండకపోయినా ... దిగుల్లేదు ...,'' అని చక్కాపోయినాడు.

ఈవిధంగా సలహాలు సంప్రదింపులు,— తగాదాలు,— బెదిరింపులు తర్జన భర్జనలు — అన్నీ అయినాయి.

రాజన్ వారంరోజులు యింట్లో భోజనం చెయ్యాలా. ఆ పిల్లనిచ్చి చెయ్యక పోతే,— ఇక జీవితంలో పెళ్లే చేసుకోనని అందరికీ చెప్పేశాడు.

'తల్లిలేని పిల్లవాడుగదా'— అని యింతకాలం వాడు ఆడింది ఆట- పాడింది పాటగా సాగించారు— కాని ఈ వొక్క విషయం మాత్రం మాత్తుకుట్టి ససేమిరా వొప్పుకోదలచుకోలేదు.

ఒకనాడు పొద్దున్నే,— కీవరీతు వచ్చి-- మాత్తుకుట్టిని నిద్రలేపి కూర్చో బెట్టాడు

కుయెన్నాచ్చను పడుకున్నా— మెళుకువగానే ఉన్నాడు. ఈ పెళ్ళిప్రమేయం వచ్చాక కంటికి కునుకు దూరమైపోయింది.

ఏలుబడిలోఉన్న దేశాన్ని పరాయివాళ్లు చేజిక్కించుకుని పంచుకుపోతూంటే,— అలసి సొలసి అధైర్యపడిన ఏలికలాగా అయిపోయాడు కుయెన్నాచ్చను.

. అసలు ఆయన మంచాన పడుండటం మూలానే యిన్ని అనర్థాలు వచ్చాయి.

ఆయన ఉమ్మసానున్న రోజుల్లోనైతేనా ... యిన్ని అవకతవకలు జరిగే అవ కాశమే ఉండేదికాదు ... అమ్మా ...? ఎవరికన్ని గుండెలు ?

''నాన్నా ! నేను నీ పెద్దకొడుకుని గదా ! నీవు వొంట్లో అనారోగ్యంగా ఉంది కాబట్టి,— నువ్వు చెయ్యాల్సిన పనుల్ని బాధ్యతపడి,— సక్రమంగా నిర్వర్తించడం యిప్పుడు నావంతు అందువల్ల నా నిర్ణయానికి నువ్వు వొప్పుకోవాలి. మాత్తుకుట్టి గూడా కాదనడని నా ఉద్దేశం ...'' అన్నాడు కీవరీతు.

''ఏవిట్రా బ్రదర్ ?''

''రాజన్ పెళ్ళి ఆ పిల్లదానితోనే జరపాలి జరగాలి .... అని భగవంతుడు ఆదేశించినట్టు స్వప్నమయిందిరా నాకు.''

''ఒరె నాయనా . వాళ్ళిద్దరూ అన్నాచెల్లెల వరసవుతార్రా'' అన్నాడు కుయెన్నాచ్చను.

''అర్థం పర్థం లేనిమాట ... ఊరుకుందూ ... ఎక్కడో ఏదో ... చుట్టరికం గానీ ... దగ్గరా దాపా .. ! అందువల్ల పనికొస్తుంది ... భేషుగ్గా పనికొస్తుంది.''

''రాజన్ మేనమామ ఇక్కడికి వచ్చి— అన్నమాటలు విన్నావ్రా ''

''అన్నీ విన్నా .... దాన్నిగురించి పెద్ద చాటింపేం చేసుకోక్కర్లేదులే ... మరొక్క మాటగూడా ఆలోచించండి ...

కుర్రవాడు నలభయ్యో యాభయ్యో ఏంపంపుతున్నాడో అది చూపెట్టుకునే మీరు యిల్లు గడుపుకుంటున్నారుగదా ... అటువంటప్పుడు వాడిమీద పెత్తనం చలా యించి, ఆ ఉన్న ఆధారంకాస్త గూడా కూలదోసుకుంటే ఏం చేస్తారు చెప్పండి.''

మాత్తుకుట్టి మోకాళ్ళ నడుమ తల ఆనించిపెట్టి కూర్చున్నాడు. మొహం ఎత్తలేదు.

కుయెన్నాచ్చను కీపరీతు అన్నది యేమీ బోధపడనట్టు గుడ్లు మిటకరించి,— నోరు తెరుచుకుని ఊరికే అలా పడుండిపోయాడు.

గోళ్లు గిల్లుకుంటూ ఎటోచూస్తూ గుమ్మంలో నిలబడింది దీనామ్మ.

"నాన్నా !"

"ఏం ?"

"నే చెప్పింది నిజమేగదా ?"

"నే నొప్పుకోలేనురా."

"అదేం ?"

"అదేమంటే— చెప్పేందుకేముందిరా బ్రదర్ ..."

"నీకు అదేమంచిదని తోస్తే చేసెయ్ ..."

కుయెన్నాచ నేం మాట్లాడలేదు. దీనామ్మా అంతే ... వాళ్ళు ఓటమిని వొప్పు కుంటున్నట్టు ... మౌనంగా ఉండిపోయారు.

# ఏడు

పెళ్ళి సన్నాహాలైతే జరుగుతున్నాయి కానీ, ఎవ్వరూ ఏ కోశానా సంతోషంగా లేరు. సంతోషపడుతున్న వాళ్లెవరైనా ఉన్నారా అంటే — ఒక్క నిసిలీయే.

తనకు ఆడుకునేందుకు యిద్దరు ముగ్గురు స్నేహితురాళ్లు - స్నేహితులు దొరి కారు. అదే — రాజన్ మూడో మేనమామ కూతురు సూసను, ఎల్లు పరంప వాళ్ల ఎలుకుంట్టి కూతురు కొచ్చుమోలు, కుయప్పి కొడుకు అజయనూను.

నలుగురూ కలిసి పందిట్లో — యింట్లో — దొడ్లో అంతటా కలయ తిరిగి పరిగెత్తుతున్నారు ... గంతు లేస్తున్నారు.

పెళ్ళి పనులు చేయడం కోసమని కుయప్పి తల్లి, కీపరీతు భార్య, కుయుచ్చె రుక్కను భార్య గూడా వచ్చారు. ఇరుగు పొరుగునుండే అమ్మలక్కలు వచ్చి తొంగి చూసి పోతున్నారు.

ఆవాళ మంగళవారం. మర్నాడు బుధవారం ... గురువారం తెల్లవారు జామునే పెళ్ళి.

బుధవారం సాయంకాలం పిల్చిన వాళ్లందరికి తేనీటి విందు. పెళ్ళికి పిల్లవేపు

నుంచి యాభైమంది దాకా వచ్చేవాళ్లున్నారు వాళ్లకు విందు చెయ్యాలి. ప్రధానం పెట్టడం, శుభలేఖలు యిచ్చిపుచ్చుకోవడాలకోసమని రెండు కార్లల్లో వో పది పద కొండు మంది జనం బయలు దేరింది. ఎవరెవరంటే — ధర్మ సంఘానికి చెందిన ఫాదరీ, ఇంట్లోంచి కీవరీతు, ఫిలిప్పోసు, కుయప్పి, — కొచ్చుకుట్టీను, వీళ్లుకాక ధర్మసంఘం తరపు మనుషులు ఆరుగురు – వెరసి పదకొండుమంది ...

పోతే కార్తికప్పల్లి ఫాదరుకు శుభలేఖ పంపనేలేదు కుయుచ్చెరుక్కన్‌కి మాత్రం ఈ పని సుతరామూ నచ్చలేదు. మిగతా వాళ్లెవ్వరూ అంతగా పట్టించుకోలేదు గానీ ... అసలా ప్రధానం జరిగేనాడే కొంత రగడ ప్రారంభించాడు కీవరీతు — .

"మా పిల్లవాడికేం తక్కువ ... గవర్నమెంటు ఉద్యోగముంది. అయినింట పుట్టినవాడు. మేమేం ఈ పాటి సంబంధం దొరక్క రాలేదు ... అంటూ ..." అంకురార్పణ చేశాడు

"ఇక్కడొచ్చిన లోటేవిటిట ... కావలిస్తే నలుగుర్ని కనుక్కుంటే సరిపోయె. ఈ దెప్పి పొడుపు మాటలు దేనికి —" అన్నారు అవతలివాళ్ళు.

"అడగడాలు – కనుక్కోవడాలు అన్నీ అయినాయి."

"అయితే ఇంకేం మరి ? అన్నీ తెలిసినప్పుడు ..."

"అదేం లేదు. మాకు కావలసిందల్లా పిల్ల ... ఆ పిల్లదాని గుణగణాలూను ..."

మధ్యలో కుయప్పి కల్పించుకుని. "ఎందుకొచ్చిన మాటలివి ... అనవసరం ..., మనం వచ్చిన పనేదో కానిచ్చుకుని పోదాం ... పదండి" అన్నాడు.

"అయ్యా ! మీరు డొంకతిరుగుడుగా మాట్లాడకండి. మీకు అభ్యంతరం ఏదైనా ఉన్నట్టయితే మానేయండి ... అంతే ఇందులో బలవంతమేం లేదు."

మా నిర్ణయం మేం మొదటే చేశేశాం ...

"ఏవిటి అది ?"

గుసగుసలు ఆరంభమయ్యాయి ఒకరికొకరు మెల్లిమెల్లిగా చెవులు కొరుక్కోవడం మొదలెట్టారు. వివాదంలోకి దిగారు అయితే యాజకుడు ఎంతో యిదిగా సర్ది చెప్పడం వల్ల విషయం ప్రశమించలేదు. శుభలేఖలు యిచ్చి పుచ్చుకోవడాలైనాయి. తేనీటి విందు ... విందు భోజనాలు కాగానే వచ్చిన వారు బయలుదేరి వెళ్ళి పోయారు.

తూర్పు వేపున్న ఖాళీ జాగాలో పందిరి వేశారు. ఫిలిప్పోసు యింటినుంచి

తెచ్చిన సింహాసనంలాటి కుర్చీని పెళ్ళి పందిట్లో అమర్చారు కుయెన్నాచ్చనేమో పడక్కుర్చీలో పడుకున్నాడు. దక్షిణపు వేపు వసారాలో ఆడవాళ్లు విందుభోజనాలకి కావలసిన సరంజామా అంతా సిద్ధం చేసుకుంటున్నారు. సంభారాల కొట్టు తాళం చెవులు దీనామ్మ చేతిలో ఉన్నాయి. చూసే వాళ్లు ... చేసేవాళ్లు ... చెప్పేవాళ్లు ... వినేవాళ్లు ... అంతా హడావిడిగా అటూయిటూ తిరుగుతున్నారు.

"అమ్మా, చిన్నా ! సిసిలీ ! అల్లరి చెయ్యొద్దని చెప్పానా లేదా ? చక్కగా పోయి ఆ పనస చెట్టుకింద ఆడుకోండమ్మా ... మా తల్లిగా" ...

"సోపు గింజలెక్కడమ్మా దీనామ్మా ? '

"ఇదుగో ... తెస్తున్నా పిన్ని !"

"అయ్యో...అంపాటు యింటి పిన్నిగారు నిలబడే ఉన్నారే ! కూర్చోండి ..."

"ఇదుగో నేప్ ... ముల్లత్తురా వాళ్ళింట్లోంచి గరిటె తెచ్చారా లేదా ?"

"మనిషి వెళ్ళాడు".

మాత్తుకుట్టి పైపైకి సంతోషంగా కనబడుతున్నాడే గానీ, — తోచీ తోచకుండా తిరుగుతున్నాడు.

రాజన్ ప్రధానం జరిగిన తరువాత, — కన్నతండ్రితోగానీ, — కట్టుకున్న యిల్లాలితోగానీ మనస్సువిప్పి మాటాడలేదా మానవుడు ... సరిగదా, - తండ్రీ కొడుకులు గూడా అమిత ముభావంగా ఉన్నారు.

అన్నగారి సలహాని అంగీకరించడం ... మాత్తుకుట్టికి అది కేవలం తన చేత కాని తనాన్ని వెల్లడిస్తున్నట్టనిపించింది కొడుకు పంపే ఆ నాలుగు రూకల నాశించి. — అయినదానికి కానిదానికి ఆమోదించనే అక్కర్లేదు.

వాడి తల్లి పోయిన తరువాత రెండో పెళ్ళి చేసుకున్నమాట నాస్తవమే. అయినా వాడిమీది ఆపేక్ష ఆవగింజంత గూడా తగ్గలేదే ? అష్టకష్టాలన్నట్టుపడి, — అప్పుసప్పు చేసి వాణ్ణి చదివించాడు ! తీరా సమయానికి వాడు తనమాటనేం లక్ష్యం చేశాడు ... తనకేం విలువ యిచ్చాడు ? అవన్నీ తల్చుకుంటూంటే మనస్సు వికలమై పోతోంది ... ఇన్ని చికాకులు ఉండబట్టే ... ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డదన్నట్టు, — వట్టిపుణ్యానికి ఆ భార్యమీద విరుచుకు పడటంగా ఉంది.

"మావయ్యా !"

"ఊఁ ...,"

''అంబలి గానీ ... కాఫీగానీ కావాలంటే చెప్పండి.''

''ఇప్పుడేం వద్దుగానీ ... అబ్బాయి ఎక్కడ! వాడు కుర్రాడు రాజన్ ఏమైనాడు ?''

''రాజనా ? మేనమామగారింటికి వెళ్ళాడుగా ?'' ఇంకా రాలేదు.

''అదేవిటి ? ముహూర్తం వేళకన్నా వస్తాడా ... లేకపోతే పోయి పిలుచుకునే రావాలా ?''

దీనామ్మ జవాబేమీ చెప్పలేదు.

పెళ్ళిమాటలు జరుగుతున్నప్పటినుంచి రాజన్ ఎక్కువగా మేనమామల యింటనే గడుపుతున్నాడు.

రాజన్ సెలవు పెట్టి యింటికొచ్చిన లగాయితు దీనామ్మే వెంట వెంటబడి ''నాయనా! చన్నీళ్లు పోసుకుంటావా — వేణ్ణీళ్లు పోసుకుంటావా, — కాఫీ తాగుతావా? టీ తాగుతావా ...'' అంటూ ఆప్యాయంగా అడిగేది.

ఆటువంటి పిన్నిగూడా అతగాడికి పనికిరాలేదు ... ఏమీ కానిదానికిందే అయింది.

రాజన్‌కి పన్నెండు పదమూడేళ్లు ఉన్నప్పుడు ఆడదిక్కులేని ఆ యింట, — మార్తుకుట్టి రెండో భార్యగా అడుగుపెట్టింది దీనామ్మ ... కుర్రవాడిమీద అప్పటి నుంచి పాతుకుపోయిన ఆ మమకారం వల్లనే ... ఆ బాధగూడా.

అసలీ చిక్కులన్నిటికీ మూలకారణం ఈ పెళ్ళి ప్రసక్తే ... అంతా ఆ భగవదేచ్ఛ ... అని సమాధాన పడాల్సిందే ... భగవంతుడు వాళ్ళిద్దరికీ రాసిపెట్టినప్పుడు — అది జరగకుండా ఆపడం ఎవరితరం ?

''యోబు తన గ్రంథంలో ఏమని రాశాడంటే —''

''బందాల్లో నా కాళ్లు బిగించావు.''

''నా నడత నువ్వు కనిపెడుతూనే ఉన్నావు''

''నా అరికాళ్ళ చుట్టూ గిరిగీసి పెట్టావు''

ఆడదాని కడుపున పుట్టిన వాడు

అల్పాయుష్కుడు - దుఃఖితుడు —

అవుతాడని'' చెప్పనే చెప్పాడు ... మహానుభావుడు.

అవరాను పెట్రొమాక్సు దీపాలు తెచ్చాడు. అతడితో పాటు కీపరీతు కొడుకు

అచ్చన్‌కుయుఁ, కుయుచ్చెరుక్కనుకొడుకు సణ్ణి, ఫిలిప్పోసు కొడుకు శాంకుట్టిగూడా వచ్చారు.

''రాజనన్నయ్య ఎక్కడ తాతయ్యా'' అంటూ సణ్ణి అడిగాడు.

''వాడూ...ఇక్కడ లేడురా...!''

''ఎక్కడికి వెళ్ళాడు ?''

''నాకేం తెలుసురా ? మీ నాయనెక్కడ ? ''

''దూడని కోస్తున్నచోటున్నాడు.''

''ఆఁ ? ''

''దూడని నరుకుతున్నారుగా...అక్కడున్నాడులే.''

''అవునూ, ... పదిహేనిరవై కోళ్ళుగూడా వున్నట్టున్నాయి. వచ్చిన పెళ్ళివారికి కోడిమాంసం ... గొడ్డుమాంసం పెట్టాలని కాబోలు ... !''

''ఊఁ.''

''ఒరే, - నా పెళ్ళినాడైతే — ముప్ఫయి బాతులు, వో ఇరవై కోడిపుంజులు వండిపెట్టారంతేగానీ ... ఈ దూడలు దున్నలూ లేవుసుమా ? ''

''ఆ రోజుల్లో కోడి ఖరీదెంతని ... ? కేవలం అర్ధణా అంటే రెండుకాన్లు...''

''అంతేనా ? ''

''మరి? దూడలు దున్నపోతులు తెస్తామంటే నేనే వొద్దన్నా చెప్పొద్దూ ...

ఆ రోజుల్లో కిరియనుకక్క అని వో పెద్దతలకాయ ఉండేవాడు ... ఆయన అన్నింటికి తగుదునంటూ తయారయ్యేవాడు. చచ్చి ఏ లోకాన ఉన్నాడోగానీ ... గొప్ప వ్యవహారకర్తలే ...

ఆ మాటకొస్తే, — ఎవరికైనాసరే కష్టానికిగానీ, — సుఖానికిగానీ వచ్చి నిలబడేవాడు సొంతమనిషల్లే పెత్తందారీ చేసేవాడు -

పప్పు - ఉప్పు యింతకావాలి ... ముక్కాముడుసు యింత ఉండాలి — అని సలహా యిచ్చేవాడు.

నేనేమో నిర్మొహమాటంగా చెప్పేశాను ... కక్కా !

ఎందుకొచ్చిన శ్రమగానీ నీకు? హాయిగా వేళకివచ్చి కూర్చుంటేపోదా చెప్పు... అనేశా.

ఆపళాన ఆయన ఏమనుకున్నాడో ఏమోగానీ ... నేనేం ఘరాయివాడినారా !

వేళకివచ్చి కూర్చుని తినిపోయేందుకు.

అలా వచ్చేందుకు వేరే ఉంటా్రా...పోన్లేగానీ...చెప్పావ్‌గా...సరిలే...అంటూ చకా్కబోయాడు...

ఆ పోత పోతా ఎక్కడికి పోయినాడో ... గుర్తులేదు ... ఆ తరువాత ఆయన బతికిందీ తక్కువే...అంటూ పిచ్చాపాటీ చెప్పుకు పోతూండగా...ఎవరో వో నలుగురు ముసలివాళ్ల పందిట్లోకి వచ్చారు.

సణ్ణి ..., కూడా వచ్చిన స్నేహితులు వెళ్ళిపోయారు.

అరె ..., ''నయమే...ఇంతదూరం వచ్చావే'' అన్నారు కుయెన్నాచ్చన్ని చూసి పలకరింపుగా.

కుయెన్నాచ్చను పరకాయించి చూశాడు...గుర్తుపట్టాడు.

కొచ్చుప్పాపీ ..., తరువాత ? కుయ్యమ్మను, — పెణ్ణుక్కరా బావమరది, - కొలాంపి మత్తాయీను.

''ఇహ దారి పడదామని'' - అన్నాడు కుయెన్నాచ్చను.

"ఏవిటి నువ్వూ...ప్రయాణమే ?''

"అన్నట్టు వేళయిందిగదా మరి...''

''ఔను...సందెపడింది - ఇంకా మహా ఉంటే వో 'అరగడియ'.''

ముసలివాళ్ల నవ్వుతూ ...,

'నిజమే ... అరో ... పావో ...!'

''కూర్చోండర్రా...! ఒరే...అబ్బాయిలూ !''

'ఏవిటి తాతయ్యా !'

''పోయి కాస్త ఆకు పక్క, - ఆ పాన్దాను పట్టుకురండిరా !

పాన్దాను వచ్చేసింది.

మత్తాయి పాన్దాన్ని తనకు దగ్గరగా లాక్కుని, - తాపీగా తమలపాకు మడుపులు తయారు చేసుకోవడం మొదలెట్టాడు.

మత్తాయికి భోజనం కంటెగూడా తాంబూలమంటే మహాప్రీతి. ఎంత యిష్టమంటే పడుకుని నిద్రపోతున్నా బుగ్గన తమలపాకు ఉండాల్సిందే.

మొదట్లో గొడ్లవ్యాపారం చేస్తూండేవాడు, అలప్పుర్రా వెళ్ళి తక్కువ ధరకు పశువుల్నికొని తెచ్చేవాడు.

వాటిని బాగా మేపి మేపి, - చూడివై నాక, మంచి వెలకు అమ్మేస్తుండేవాడు.

ఒక్కొక్కప్పుడు వందా-రెండొందలు అదనంగా గిట్టుబడి ఉంటూండేది.

ఇప్పుడిక ఒంట్లో వెనకటి జవసత్త్వాలు ఉడిగిపోయాయి. రెండో భార్య పెట్టే దయా ధర్మబిచ్చంతో కాలక్షేపం చేస్తున్నాడు.

''పెళ్ళి హడావిడి ఎంతవరకొచ్చిందీ'' ... అంటూ కొచ్చుప్పాపీ అడిగాడు

''ఆఁ ?''

అదే...పెళ్ళి పనులూ అవీ ఎంతవరకూ అయినాయీ అంటున్నాడు. ఏవిటి... నీకు చెవుల్లేవేఁ ?... అని కుయ్యేమ్మను ... అంటున్నపుడు - గుప్పున కల్లు కంపు కొట్టింది.

కుయ్యేమ్మను వచ్చిన నలుగురిలోకి వృద్ధుడు. ఎనభై అయిదేళ్ళుంటాయి ఇంకా ఆరోగ్యం చెక్కుచెదరకుండా ఉంది. వట్టి హాస్యగాడు — సందెపడ్డాక వో చుక్క వేసుకుంటాడు. ఆ తరువాత కండువాతీసి తలకి సాగాచుట్టి దుకాణం నుంచి యింటిదాకా పల్లె పదాలు పాడుకుంటూ నడక సాగిస్తాడు.

''మేము నందు చివర నిలబడి ఉండగా - కుయ్యేమ్మను పడమటి వైపుగా పాడుకుంటూ వస్తున్నాడు ...

సరే, - అందరం కలిసి, - మీయింట పెళ్ళిగదా, - పన్లోపని చూసి, - పలకరించి పోదామని వచ్చేశాం...ఔనూ...ఇంతకూ పెళ్ళెప్పుడు ?''

అంటూ అడిగాడు పెణ్ణుక్కురా బావమరది —

అతణ్ణి అంతా బావమరదనే అంటారు ... అసలా ఊరికే బావమరది ఆయన. మంచివాడు వొకరి జోలికి సొంతికి వచ్చేరకంకాడు. ఎక్కడైనా తగాదాలు పోట్లాటలు వస్తేమాత్రం రాజీ కుదిరించి మరీ వస్తాడు.

ఆయన కుయెన్నాచ్చనుతో మాట్లాడుతూ -

మా అన్నకూతుళ్ళలో వో పిల్లదాన్ని పుత్తనాట్టుకరాయే ఇచ్చారు. దాని తోడి కోడలికి ఈ పెళ్ళికూతురు తల్లి బాగా తెలుసుట.''

''ఆఁ ... ? అలాగా ''

''ఔను.... వాళ్ళయిల్లుగూడా ఆ చర్చి చేరువలోనే ఉంది.''

''వాళ్ళ వంగసం ఎటువంటిదంటావ్ ?''

"మంచి భక్తి ప్రపత్తులున్న వాళ్లు..."

"అయితే పిల్లది గుణవంతురాలై యుంటుంది ..., మాకు కావాలిసిందీ అదే."

ఆ అపవాదు నిజమో – అబద్ధమో ... !

అయినా గతం తవ్వి తలకెత్తుకోవడం దేనికిగాని ?

'అనుమానం పెనుభూతం' – అన్నట్టు,– ఎంత కావలసిన వాళ్ళయినా సరే,– ఇటువంటి వ్యవహారాల్లో కాస్త ముందు వెనుకలు ఆలోచించి మరీ అనాలి గానీ ...

లేకపోతే... ఇంతంటే... అంతంటారు.

"ఇది విన్నావా... కుయెన్నా?"

"ఏమిటి ?"

"మూలత్తరా చిన్నదొరగారు లేరూ? ఆయన పోయాడు."

"చిన్న దొరగారా?"

"చచ్చిపోయాడు."

"ఎప్పుడు?"

"ఇవాళ పొద్దునే టెలిగ్రాం వచ్చిందట వెళ్లారు ఆస్పత్రిలోట... అక్కడే కన్ను మూశాడట...

చాలా రోజులుగా జబ్బుతో తీసుకుంటున్నాడు పాపం...

గొంతుకలో పుండట ?"

"ఆహా ... కంఠ సర్పిటగదా ?"

"సరే, ... ఏదైతేనే... ప్రాణం తియ్యడానికి ... ?"

"మంచి వయసులో ఉన్నాడు. మహా ఉంటే ముప్పయి ముప్పయి అయిదేళ్ళ కంటే ఉండవు"

"పెద్ద దొరగారు పోయిన తర్వాత కుటుంబ భారమంతా చిన్న దొరగారి మీదే పడింది."

"జబ్బుకి మంచి–చెడు తేడాయేముందిట...?

అయినా ఎప్పుడూ మంచివాళ్ళకే ముంచుకొస్తుంది."

"మాత్తుకుట్టియేడీ ?"

"ఇక్కడే ఉండాలి... బహుశా లోపలికి వెళ్ళాడేమో !"

అంతలో యిద్దరాడవాళ్లెవరో వచ్చారు. సరే, - ఇక ఆ ముసలివాళ్లు నలుగురు బయల్దేరాలని లేచారు. ఇక మేం బయల్దేరుతాం...వృధాగా శ్రమయివ్వడం దేనికిగానీ? పడుచు వాళ్ళయితే కనీసం... కాస్తో కూస్తో పనీ పాటా చేసిపెడతారు...మా వల్ల... ప్చ్... అన్నాడు కుయ్యేమ్మన్.

దీనామ్మ పందిట్లోకివచ్చి ఇదుగో తాతా ... కాస్త కాఫీ తాగి వెడుదురుగాని ఉండండి...అంది.

"వద్దమ్మా వేళకాని వేళల్లో కాఫీలు వద్దు...ఏం వద్దు రేపు వస్తాం గదా ... " అన్నాడు కొలాంచి.

"కుయెన్నాచ్చన్ వెళ్లొస్తామయ్యా...! "

"మంచిది."

వచ్చిన ఆడవాళ్ళిద్దరు తిన్నగా కుయెన్నాచ్చన్ దగ్గరికి వచ్చారు.

"ఈవిడ్ని గుర్తుపట్టారా మామయ్యా ? "

కుయెన్నాచ్చను 'లేదు' — అన్నట్టు తల ఆడించాడు.

"మన రాజన్ పినతల్లి."

అయితే ఈవిడ్ని ఏ ఊరిచ్చారు ? పత్తనంతిట్టాయేనా ?

ఈవిడేమో రాజన్ పెద్దత్తయ్య..."

"కొచ్చుకుట్టి భార్యేగా ? "

"ఆఁ ... మరే ..."

"మంచిది...లోపలికి వెళ్ళండమ్మా."

"వొంట్లో...నెమ్మదిగా ఉంటూందిగదా ! "

"అఁ ... ఏదో నెట్టుతున్నా ..."

వచ్చిన ఆడవాళ్లు లోపలికి వెళ్లారు

"వొంట్లో నెమ్మదిగా ఉంటూందా ... " ఏదో వొకటి అడగాలిగదా అని అడగటమేగానీ, ... చచ్చుప్రశ్న — అనుకున్నాడు తనలో.

"నాన్నా"

"ఎవరది ? "

"నేను...కుయుచ్చెరుకన్ని"

"ఏమిటా ? "

'కాఫీగానీ...అంబలిగానీ తాగావా లేదా ? ''

"కాఫీ తాగాలేరా ? ''

''పెళ్ళి శుభలేఖలు అందరికి పంపినట్టేనా ? ''

''పంపక పోవడమేవిటి...పంపే ఉంటారు.''

''అయితే కార్తికపల్లి ఫాదరు మాటేవిటి మరి ? ''

''పంపలేదట.''

''అదేం ? ''

''ఏమో...ఎవరికి తెలుసు ? ''

''నాకు అదే అర్థం కాకుండాఉంది...ఎవర్నడిగితే వారే తమకు తెలీదంటూంటే...'

''ఇహపోతే అసలు వాణ్ణి ... అదే పెళ్ళికొడుకు తండ్రిని కనుక్కుంటే తేలిపోతుంది ... ఏమో అతగాడు మాత్రం చెపుతాడని నమ్మకమేవిటి ? ''

''ఇక్కడిప్పుడు ఎవరి పెత్తనమో తెలీడంలేదు. ఉన్న బంధుకోటిలో అతి ముఖ్యమైన వ్యక్తికి శుభలేఖ పంపలేదంటే అర్థంలేనిమాట.''

''మా అన్నదమ్ముల పిల్లలందరి పెళ్ళిళ్ళకి ఆయన రావడమే కాదు ... వచ్చినప్పుడు నలభై యాభై రూపాయల విలువచేసే కానుకలుగూడా తెచ్చి ముట్టజెప్పాడు.

నా కూతుళ్ళిద్దరి పెళ్ళిళ్ళకి వచ్చాడు ''

''అయితే యింకేం ? మిగతా పిల్లల పెళ్ళిళ్ళకిగూడా పిలు ..వస్తాడు ''

కుయుచ్చేరుకన్ను వెనక్కి తిరిగి చూశాడు. ఫిలిప్పోసు వచ్చి ఉన్నాడు. అతణ్ణి చూసి, కాస్త ఆగి, — ఆలోచించాడు ఎందుకంటే ఫిలిప్పోసుతో చాలా జాగ్రత్తగా తూచినట్టు మాట్లాడాలి.

''అయితే యేవిటి యింతకూ ఎవరికి వారేనంటావ్ ? ''

''లేకపోతే అంతా ఒకమాట మీదున్నారా...ఒకటిగా ఉన్నారా ? ''

''ఏం నాన్నా ? "

''జవసత్వాలుడిగి పడున్న తండ్రి యేం చెబుతాడు ?

తను బతికున్నంతవరకూనన్నా అన్నదమ్ముల్లో భేదాభిప్రాయాలు వద్దంటాడు. అన్నమాటతో తమ్ములు ఏకీభవిస్తారనుకుంటా..." అన్నాడు కుయెన్నాచ్చను.

''ఇప్పుడీ సోదంతా దేనికి ?

పంపసార్లు నువ్వు చెప్పడమూ ... మేం వినడమూ అయింది.''

''లోకం నోరు ముయ్యగలమా ? అన్నీ తెలిసిగూడా...

నాయనా కుయుచ్చేరుకుట్టన్ ! అనవసరమైన ఈ ఆగం దేనికి చేస్తారో తండ్రీ !

చాలు...చాలించండిరా -- పోండి ... పోయి మీమీ పనులేవో చూసుకోండి...'' అంటూ హెచ్చరించాడు కుయెన్నాచ్చను.

''పోతున్నాలే...పొదరుకి మీరు శుభలేఖ పంపకపోయారో ఈ పెళ్ళింట నేను అడుగు పెట్టను...పచ్చి మంచినీళ్లు ముట్టను...తెలిసిందా ? ''

అంతలో మాత్తుకుట్టి వచ్చాడు ! ''ఇదుగో...రావడం రాకపోవడమనేది వాళ్ళ వాళ్ళ యిష్టాన్నిబట్టి ఉంటుంది. మనతోనే లోకముందను కోవడం పొరబాటు."

ఇలా వాదం పెరిగిపోతూ ఉండగా పురోహితుడు ఆయన అనుచరులు వచ్చారు.

''అయ్యా ! పొద్దున మీకోసం వెతికాం...అక్కడ మీరులేరే ? ... అనడిగాడు మాత్తుకుట్టి.

ఆఁ .... నేను 'కాయంకులం, దాకా వెళ్ళా ... ఊఁ ... పెళ్ళి హడావిడి ఎందాకా వచ్చింది ? ఏమేం చెయ్యబోతున్నారు ?

ఏముందీ ... కొంతమందికి విందు చెయ్యాలి ... అందుకు తగిన ఏర్పాట్లు చెయ్యాలి.''

''అ-అ-అ...అం...తే...తే...నా... ఇ—ఇ—ఇ...ఇం...కే...కే...కేం లే—లే...లే... ద...ద్దా... ? ''

''లేకేఁ ? ఉంది ... పిల్లవాడు పిల్లదాని మెళ్ళో మంగళసూత్రం కట్టాలి.''

''భే...భే...భే—ష్...ష్షు... అ...అ ...లా... , చె...చె...చె...చ్చె... ప...వ...ప్పం...డి...''

అంతా విరగబడి నవ్వారు. పురోహితుడుగూడా గొంతు కలిపాడు.

''ఏవిటయ్యోవ్...కుయెన్నాచ్చన్ ! మీరు మెదలకుండా పడుకుంటే ఏమయి నట్టు ? ''

''ఏం చెయ్యమంటారయ్యా ? ''

''అహఁ ... మా మాటలు విన్నారా లేదా ? ''

''వినపడలేదే...''

''పెళ్ళిమాటలే చెప్పుకుంటున్నాం...రేపొస్తాం...అసలు కథా కమామీషు ఏవిటో

తెలుసుకుపోదామని వచ్చాం.''

పురోహితుడు,— కూడా వచ్చినవాళ్లు చక్కాబోయారు.

మాంసం కొయ్యడానికి నలుగురైదుగురు పడుచువాళ్ళు పందిట్లో చేరారు.

గంపలో కొబ్బరి బొండాలేసుకుని మరో నలుగురు వచ్చారు. అక్కడ చేరిన జనాభా నవ్వులు - కేరింతాలతో ఆ పందిరంతా మార్మోగిపోతూంది. ఏవేవో ముచ్చట్లు చెప్పుకుని పెద్దపెట్టున నవ్వినప్పుడల్లా ... కుయెన్నాచ్చసు ఏవిటేవిటని అడగడం ... వాళ్ళంతా ... ఏంలేదు ... ఏం లేదు తాతయ్యా అని చెప్పడం. మళ్ళీ మెల్లిగా ఆయనకు వినపడకుండా — ఈ ముసలాయన కాసేవు మాట్లాడకుండా పడుకోడేఁ ...? అనుకుంటూండటం. తొమ్మిది గంటలప్పుడు ఫిలిప్పోసుభార్య అన్నామ్మ వచ్చి – ''మావయ్యా ?'' అని పిలిచింది

''ఉఁ ... ''

''లేవండి ... భోజనం చేద్దురుగాని ... భోంచేసి పడమటి వసారాలో పడుకుందురుగానీ ... మంచం అక్కడే వేసి ఉంది.''

''ఇక్కడే పడుకుంటా లేమ్మా ...''

''ఇక్కడ ఈ దీపాల వెలుతుర్లో నిద్రేం పడుతుందిగానీ ... పదండి...''

లేచాడు ... అన్నామ్మ చేతిని ఆసరాగాయిచ్చి .... అయన్ని నెమ్మదిగా నడిపిస్తూ పడమటి వసారాలో వేసిన మంచంమీద కూర్చోబెట్టింది. ఆ తర్వాత కంచంలో అన్నంపెట్టి తెచ్చింది.

''నువ్వెప్పుడొచ్చా వమ్మా ?''

''ఇంతకు మునుపే వచ్చా.''

''మీ పిల్లలెవరైనా వచ్చారా ?''

''రోశమ్మ వచ్చింది ''

''పెద్దదానికి ముగ్గురు పిల్లలు కదూ ?''

''ఆఁ ... మరే ... కలకత్తానుంచి అల్లుడు ... పిల్లలు ... అదీ వస్తామంటూ ఉత్తరం రాశారు కానీ ... ఇంకా రాలేదు.''

''ఏవిటి ...? నువ్వూ ... మీ ఆయన కీచులాడుకోకుండా ఉంటున్నారా ? ... ఏవమ్మా ?''

''అది ఈ జన్మకు కుదరదు ''

"ఏసు ప్రభువు చెప్పినట్టు — అరవై డెబ్బయిసార్లు క్షమిస్తే సరి ..." అరవై డెబ్బయి సార్లుకాదు ... ఆరువందలసార్లు యిక్కడికి క్షమించడమైంది. ఇహ నావల్ల కాదు బాబూ! నేను క్షమిస్తే యెంత ... క్షమించకపోతే యెంత? నేను మన్నించి నంత మాత్రాన అయ్యేదేం లేదు. క్షమించాల్సినవాడు ఆ ప్రభువే. కానీ యిప్పుడు ..., ఆయనకు ..., ఆ భయంగూడా లేదనే తోస్తూంది ..."

"ఆ మనిషి వెళ్ళిపోయిందా యింకా లేదా ?"

"వెళ్ళి పోయింది ... పోతేయేఁ ... దానికోసం ... వెతుక్కుంటూ అక్కడికే పోతున్నారని విన్నా."

"తనంత యెత్తు బిడ్డలున్నారు ... కూతుళ్ళపెళ్ళి చేసంటాలై ఇద్దరేసి ముగ్గురేసి బిడ్డల తల్లులయ్యారు. అయినా యింకా పడుచు కుర్రాణ్ణి అనుకుంటున్నాడు కాబోలు ... అన్నాడు —" కుయెన్నాచ్చను.

అడమైతే అన్నాడుగానీ...ఎంత పొరబాటు చేశానని నాలుక్కరచు కున్నాడు.

నేను మాత్రం ఏం తక్కువ? ... నేనూ దగా చెయ్యాలా ?

ఫా ... ... ...

"నే వెళ్ళనా మావయ్యా! ... లోపల అందరూ ఏవో పనులు పాటలూ చేస్తున్నారు ... నేను మాత్రం ఊరికే కూర్చుంటే బావుండదుగదా ... మరి ?"

"వెళ్ళిరామ్మా !"

"మీరు పడుకోండి ... నిద్ర పోక పోయారంటే ... తెగ బద్ధకంగా ఉంటుంది."

"ఉఁ ..."

కుయెన్నాచ్చను పడుకున్నాడు. పందిట్లో దీపాలు మిలమిలా మెరిసి పోతున్నాయి.

నేలమీద చాపలు పరిచి ఉన్నాయి. ... ఆ చాపలమీద నలుగురైదుగురు పిల్లలు పడుకుని నిద్ర పోతున్నారు. మంచం కిందేమో బాణలి ... గరిట ... బూరెల మూకుడు అన్నీ ఎక్కడినుంచో తెచ్చి ఉంచారు. నిద్దర రావడం లేదు. పగటి పూట పడుకుంటే రాత్రి యిక ఒక్కకునుకు పట్టడమే కష్టం ...

శ్రావణమాసం ... వర్షాకాలం ... వానలు కురిశాక యేటికి వరదొచ్చినట్టు వచ్చింది ... వానలు వెనకట్టాయి. మంచి బలిసిన రెండు యెడ్లని తోలుకుంటూ

పంపానదిగుండా వొడ్డుకు చేరుకున్నాడు. సంతకుపోయి వస్తున్నాడు. ఎడ్లల్లో ఒక టేమో మచ్చలది ... ఒకటి మామూలుది ... జములుగా పలుపులు ... తీరా రేవు చేరుకున్నాక చూస్తే బొన్నలేమో ఆవలి తీరాన ఉన్నాయి.

ఎదురు చూసేందుకు వోపిక చాలక పలుపులు చేత్తో పట్టుకుని రేవులో నావ యెక్కాడు.

నావనిండా కిక్కిరిసిన జనం ... ఏటి మధ్యకి పోయేసరికి యెద్దు రెండూ నావని లాక్కుంటూ ఎదురీదటం మొదలెట్టాయి. ముకుతాటిని బిగించి పట్టి వాటిని అదుపులోకి తీసుకు రావటానికి శాయశక్తులా యత్నించా. కానీ ... అవి మాట వింటేనా? నావేమో ... పల్లానికి కొట్టుకు పోయింది. ప్రయాణీకులంతా గగ్గోలు పెట్టే శారు. ... పగ్గాలు విడవమని ..., ఎలా విడవను?

ఆ పళాన యేటిలో దూకేసి ... ఈదుకుంటూ పోయా ఆ నీళ్ల వొళ్లు కోసేస్తు న్నట్టు ఉన్నాయి ... చలికి చివరికి చచ్చీ చెడీ ... అన్నట్టు వొడ్డుకు చేరా .... ఎక్కడ ...? రేవుకి రెండు మూడుమైళ్ళ ... దిగువను ...

ఇప్పుడదంతా తల్చుకుంటూంటే గూడా వొళ్ళు ఝల్లు మంటుంది.

బట్టలు పిండి కట్టుకున్నాను. బొత్తిగా కొత్త చోటు. వారిని వీరిని అడగ్గా అడగ్గా వో సందు కనబడింది. ఆ సందు నబడి పోతున్నా ... అదంతా ఎర్రమట్టే ... చుట్టూ నేమో జీడిమావిడి తోపులు. చిన్న చిన్న గుట్టలు ... పొదలాను. అలా ... అలా పోతూనే ఉన్నా ... ఇంకా ఆరేడు మైళ్ల పోతేనేగానీ మెయిన్ రోడ్డు వచ్చేటట్టులేదు.

సందెపడే వేళయింది. ఏం చెయ్యాలి? జిమ్మన చీకటిపడే సమయానికి వో యింటిగుమ్మం దగ్గిరకిచేరా.

మంచి పెంకుటిల్లది. వోపినంత జాగాఉంది. దొడ్లో పనస చెట్టూ అదీ ఉంది.

ఈ యింట్లో ఎవరండీ...అంటూ కేకపెట్టా.

జవాబు రాలేదు.

ధైర్యంచేసి ఎడ్లనేమో ఆ పనసచెట్టుకి కట్టేశాను.

అంతలో ఒక ఆడమనిషి మెట్లెక్కుతూ వచ్చింది.

స్నానం చేసివచ్చిందన్నమాట. బక్కెట్టులో ఉతికిన బట్టలున్నాయి. తడి తువ్వాల మీద కప్పుకుంది. దాదాపు ముప్ఫయి అయిదు,— నలభై లోపే ఉండొచ్చు.

ఎర్రని బుగ్గలు ..మడమలు తాకుతున్న నల్లని నిడుపైనకురులు ఆవిడ నన్ను

...నేను...ఆవిణ్ణి కాసేపలానే చూస్తూ ఉండిపోయాం.

"ఎవరు ? ఏంకావాలి..." అనడిగింది.

చెప్పాను...ఈ రాత్రికి తలదాచుకుందుకు చోటుకావాలి. ఈ ఎడ్లని కట్టుకోవడానికి ..దానికి...

"పంచలో కూర్చో"

"ఈ యింటి యజమాని లేరా ?"

ఏం మాట్లాడలేదు . మెదలకుండా లోపలికి చక్కాబోయింది.

తడి బట్టలు ఆరేసి — బట్టలు మార్చుకుని వచ్చింది.

ఎడ్లు దొడ్లో కట్టేశాగా...ఆ చేరువనే గడ్డివాము ఉంది. వో మోపెడు గడ్డితెచ్చి వాటిముందు పడేసి వచ్చేసరికి — బల్లమీద కాఫీగ్లాసు పెట్టుంది.

పంచలో ఇంకోకావిడెవరో కూడా ఉంది.

"పెణ్ణమ్మా యితగాడేనా మీ అన్న..." అనడిగింది.

"ఔను పెద్దమ్మా ! చాలాకాలంగా బయట ఊళ్ళల్లో తిరుగుతున్నాడు."

"ఓహో ... నంతకి పోయి వస్తూంటే ... చెల్లెలు గుర్తొచ్చిందన్నమాట .. విశేషమే. పిల్లలెందరు ?"

"ఆరుగురు."

"మొగ పిల్లలెందరు — ఆడ పిల్లలెందరు ?"

"అయిదుగురు మొగపిల్లలు.. ఒక్కతే ఆడపిల్ల"

మీ తమ్ముణ్ణి నే చూశాలేవే...పెణ్ణమ్మా ..ఇక్కడే చూశా.

బట్టల వర్తకమేదో చేస్తున్నాడు కదూ ?"

నాకు ముచ్చెమటలు పట్టాయి ఏం-చిత్రంగా ఉంది ?

"ఆ...మరే నమ్మా...మా తమ్ముడూ నిలకడగా ఏ పనీ చెయ్యడు. వాడి దదోనైజం. యిప్పుడు వాడికి సర్కారు వారి ద్వారా కొండ మీద రవంత పొలమేదో దొరికింది...ప్రస్తుతం దాని సాగుబడిలో ఉన్నాడు."

"బతికి పోయాకు."

"పెణ్ణమ్మా వెళ్ళిరానా ?"

"చీకటి పడకుండా యిల్లు చేరడమే మంచిదిలే."

ఆవిడ వెళ్ళింది.

''ఏం...? స్నానం పానం అక్కర్లేదాయేం ?''

''ఆఁ ?''

పకపక నవ్వు. వెన్నెల విరిసినట్టే ఉందానవ్వు.

అప్పటికి నాకో ముప్ఫయి అయిదేళ్లుంటాయి .... అంత వయసున్నట్టే కనబడేది కాదు .... పెద్ద కుర్రాడికి పెళ్ళయింది...పిల్లలున్నారో - లేదో గుర్తులేదు గానీ ...

''అబద్ధమెందుకు చెప్పావ్ ?''

నవ్వింది.

''ఏది అబద్ధం ...? అన్నవరసేగా చెప్పా. అలా చెప్పడంగూడా నేరమేనా?''

నేరంకాదూ ? నిన్ను చూస్తేనే మూర్తీభవించిన పాపమల్లే ఉన్నావ్ — అనుకున్నాడు మనసులో.

''వేడినీళ్లు కాగాయి ... పోయి స్నానం చేసిరండి.''

స్నానం చేసివచ్చాక, ... ఇద్దరం మాట్లాడుతూ కూర్చున్నాం.

ఆవిడ మొగుడు ఎక్కడో మేస్త్రీట. నెంకోసారి వచ్చి పోతూంటాడట ... పిల్లల్లేరట.

అన్నం వొడ్డించింది ..., ముందుగా తెలిసి ... ఏదో ఏర్పాటు చేసినట్టు బ్రహ్మాండమైన విందుభోజనం.

దగ్గర కూర్చుని అడిగి కనుక్కుని వద్దనేదాకా మరీ తినిపించింది ... ఏవిటో... అంతా కలల్లే అనిపించింది.

ఎంతో కాలం ఎడబాసి ... కలుసుకున్నామా — అనిపించింది.

భోజనాలయ్యాక మళ్ళీ కబుర్లలో పడ్డాం ...

చెప్పదల్చుకున్నదేవిటో తెలీదు ... మెదడు ఆలోచించడం మానేసింది. మొత్తం మీద...చెప్పలేని...కలవరం...ఏదో ముప్పురానున్నట్టు....గాబరా .... అదీ స్థితి ... రాత్రి బాగా పొద్దుపోయాక ... లోపల గదిలో పక్కవేసింది.

''ఇక పడుకోండి...''

''అహఁ ... ఒక్క చాపచాలు ... వో చాప పంచలో పడేస్తేచాలు.''

''అమ్మో చలి''

''చలా ? ఏమంత చలని ... నా మొహం. లోపల వేడిగా ఉంటుంది. ఉక్కబోస్తుంది. ఊపిరాడదు.''

''ఎంతో తిరిగాగానీ ... అంతవరకూ ఎన్నడూ యిటువంటి అనుభవం రుచి చూడలేదు.''

ఇద్దరు పడుకోవడానికి వీలైన మంచిపనితనం చేసిన పట్టెమంచం...దానిమీద ఎత్తయిన పరుపు...మెత్తని రంగుల దుప్పటి...

వెనకటికి సొలోమాను పరమగీతంలో పాడినట్టు —

''హే ప్రభుకుమారీ ! నీ పాదాలు ఎంత అందంగా ఉన్నాయి !

గుండ్రని నీ ఊరువులు, — చెయి తిరిగిన శిల్పకారుడు చేసిన — ఆభరణాలవలె ఉన్నాయి.

నీ ఉదరం గోధుమ రాశిలాగా ఉంది

నీ ఇరు కుచములు జింక పిల్లల కవలను పోలి ఉన్నాయి.

నీ కంఠము దంతగోపురం

నీ కన్నులు హెష్బో పట్టణంలో బత్రబ్బీం ద్వారం దగ్గరున్న రెండు తటాకాల వంటివి.

నీ నాసిక దమస్కు దిక్కుకు చూసే లెబనోను శిఖరంతో సమానము ... ప్రియురాలా ! నీవు సుందరివి ... సుందరివి ...'' అని.

తొంభైయేళ్ళ వృద్ధుడికైనా — ఆ అందాన్ని తల్చుకుంటే గంగవెర్రులెత్తుతుంది సుమా...!

చక్రాలేసు కూతురిలాగా —ప్రాతఃకాలంలో మంచు ఎక్కువ కురిసినప్పుడు... హృదయం వేడెక్కితే...మనస్సు అడగదా —

నా చొక్కా విప్పేశాను...

అది మళ్ళా ఎలా తొడుక్కోను ... ?

కాళ్లు కడుక్కున్నాను...

వాటికి మళ్ళీ బురద పట్టించడం దేనికి ?...

తెల్లవారకుండానే లేచింది...పాలు పోయని నల్లకాఫీ తయారుచేసింది.

పెత్తనానికి వచ్చిన పెద్దమ్మగారిని మస్కా కొట్టించేశాం...

ఇప్పుడిక ఎవరికంట పడకుండా వెళ్ళిరమ్మని చెబుతూ ముద్దుపెట్టుకుంది.

''పెణ్ణమ్మా ! నీకు.. ఏం...ఇవ్వలేకపోయాను...''

ఇంకా నయం ... ఇవ్వక పోవడమేమిటి ! ఇప్పుడిచ్చిందేమిటి ?

నిజంగా నా కంతవరకు అటువంటి అనుభవమే లేదు...

నా మెడచుట్టూ తన చేతులువేసి...పిల్లలకి మల్లే భోరున యేడ్చింది...

సాయంత్రానికి యిల్లుచేరుకున్నాను.

నేను యేటిలో కొట్టుకుపోయి మునిగి చచ్చిపోయాననుకుని, — యింటిదగ్గర — వాళ్లు గుండెలు బాదుకుని ఏడుస్తున్నారు.

నలుమూలలా వెతకడానికి జనం వెళ్లారు.

ఎలా మొదలైందంటే — అసలు, ఆ ప్రయాణంలో — నడిచి ... నడిచి నాకు విపరీతంగా దాహంవేసింది. సరే ఆ యిల్లు చూస్తే ... ఎవరూ మనిషి కనబడలా ... ఆపళాన మెల్లిగా దొడ్లోకి జొరబడి...వో కొబ్బరిబొండాం కొట్టుకున్నా ... అంతటితో ఆ సంగతి మర్చిపోయినా పోయేది.

ఉహుఁ ... మర్చే పోలేకపోయినా —

మళ్ళీ మళ్ళీ చూడాలని మనసైంది ... అందుకోసం ఎన్నో ఎత్తులు వేశా ...

పెట్టెలోఉన్న డబ్బు తగ్గడం...ఆరోగ్యం దెబ్బతినడం జరిగాయి.

ఒకటి రెండు నెలల తరవాత వో రోజు వెళ్లా.

వెడితే —,

"దేనికోసం తపించానో — అది ఫలించిందంటూ ఆవిడ సంతోషంతోను ... " రవంత సంతోషంగానూ చెప్పింది.

"ఏవిటి ?"

"గాభరా పడవలసిన అగత్యమేం లేదు...ఆ మనిషి ఈ మధ్య రెండు మూడు దఫాలు వచ్చారు..."

"ఓహో"

మనస్సు తేలికపడింది. కొంతకాలం గడిచింది.

పగటిపూట రావద్దని కట్టడ చేసింది ... ఇరుగు పొరుగు వాళ్ళకి అనుమానం కలిగింది...అందుకని...

రాత్రిళ్ళు దొంగచాటుగా పోవడమూ, .... తెల్లవారక మునుపే వచ్చేయడమూ జరుగుతూండేది.

ఒకనాడు...నా భార్య...యాదాలాపంగా అననే అంది...ఈ మొగాడిని నమ్మరాదు...వట్టి దగాకోరు మనుషులు...అని..,

... ... ...

'నాకో సవతి దాపురించిందిలే'...అని...

పెణ్ణమ్మ,— పెద్దమ్మా అని పిలిచే ముసలిదానివల్లే అసలు గొడవంతా వచ్చిపడింది ఆవిడకేం పనీ పాటూ లేదు.

వచ్చేది...అన్నీ గుచ్చిగుచ్చి అడిగి ఆరాతీసి చెవినేసుకుని చక్కాబోయేది.

విషయం అంతటితో ఆగిపోలా.

ఆవిడ నా పాలిటి అయస్కాంతమైంది ... నా మనస్సు దోచుకుంది. నా కదో వ్యసనంలా తయారయింది.

ఒకసారి అక్కడికి వెళ్లేసరికి— ఆవిడచేత 'అయన'— అని పిలవబడే వ్యక్తి— అక్కడున్నాడు ... కంటబడ్డాను. అప్పుడిక ఆయనగారి తెలివి చూడండి ... ... "ఎవరు ? ఏం కావాలి" అంటూ పరాగ్గా అడిగాడు.

"చేంపర్తుంయి నాళ్ళ యిల్లెక్కడ ... ? అనడిగా ... అప్పుడు తట్టిందంత వరకే.

చేంపర్తుంయి వారిల్లా .... అంటూ భార్యాభర్తలిద్దరూ ఒకరి మొహం వొకరు చూసుకున్నారు ... అలా వాళ్లని సందేహంలో ఇరికించేసి అప్పటికా గండంగడిచి గట్టెక్కా. కానీ యింటికి తిరిగి వెళ్ళలేదు ... వెళ్ళలేదూ అంటే ... వెళ్ళిపోవాలని మనస్సుకి తోచలా .. అక్కడికో రెండుమైళ్ళ దూరాన వో కల్లుదుకాణం ఉంది. దాంటో దూరి చిత్తుగా తాగేశా — తాగిన తర్వాత మనస్సుకి .... వల్లమాలిన నిబ్బరం వచ్చిపడింది ... కల్లులోఉన్న మజా— అదే ...

ఆపళాన వాడి చేతిలోంచి ... తన్నుకుపోయి సుఖపడాలన్నంత ఉద్రేకం వచ్చింది. కానీ ఎలా ? అప్పటికే ... ఆ మనిషి ... అదే ... నా వీర్యాన్ని ధరించిన ఆ ఇల్లాలు— ఎవరూ... ? అంటూ పలకరించింది.

సామెతలో చెప్పింది అక్షరాలా నిజమనిపించింది :-

"జారస్త్రీ పెదవులనుండి తేనె కారుతుంది.

దాని నోటిమాటలు నూనెకంటె నునుపైనవి.

దానివల్ల కలుగు ఫలము ముషిణిపండంత చేదు ...

అది రెండంచులుగల కత్తి—అంత పదునుగలది ..." అని.

తను నశాలో ఉన్నాడు. ఆకుల చాటునుంచి తొంగిచూశాడు. కల్లుదుకాణానికి

ఎదురుగుండా ఉన్న రోడ్డుమీంచి నలుగురైదుగురు మనుష్యులు పరిగెత్తుకుంటూ వస్తున్నారు ఎడ్లు తోలుకుంటూ ఎవడైనా ఇటువచ్చాడా అంటూ.

కిళ్ళీకొట్టువాణ్ణి అడుగుతున్నారు.

దుండుముక్కలా ఉంటాడా ?

ఆఁ ... ఆఁ ...

షాపులో దూరాడు.

షాపు తలుపు దగ్గరికి వచ్చి— చూశారు.

"ఒరే ... రా ... బయటికి ... రారా ముందు ... "

కత్తి చేతిలో పుచ్చుకున్నా ... ఎప్పుడూ కత్తివొకటి, కూడా ఉండనే ఉంటుంది.

బయటికిపోయి మాటాడుకోండంటూ కిల్లీకొట్టు ఆసామి హెచ్చరిక చేశాడు.

జబ్బపుష్టి గలవాడే అయినప్పటికి ... భయమేసింది. ఏమీ తెలియని కొత్త చోటు. ఎదురుగుండా ... నెత్తిమీద శత్రువు ··· కొంపదీసి వారి గుప్పెట్లో యిరుక్కుంటే ... ? అయినా గాబరా పైకి కనబడనీయలేదు.

"ఊఁ ... ఏవిటి ?"

జవాబుగా ఒక లెంపకాయ మొట్టింది. ఆపాను. కత్తి దూశాను. కత్తి లాక్కోవాలని ప్రయత్నించిన వాడి చెయ్యి చీరేశాను. మరొకడు దుడ్డుకర్ర పెట్టి చేతిలో కత్తి ఎక్కడికో ఎగరగొట్టి పారేశాడు. తర్వాత... ఏం జరిగిందో గుర్తులేదు. ఏముందీ... ఇచ్చుకోవడం ... పుచ్చుకోవడం ... తన్నులాట—కుమ్ములాట ... వాడు వెలికిలా పడగానే— బ్రతుకుజీవుడా' — అంటూ చీకట్లో దూసుకు పారిపోయా.

ఏడెనిమిది రోజులైన తర్వాత ఒకనాటి సాయంత్రం యింటికి చేరా. పంచలో వెణ్ణమ్మ కూర్చుని ఉంది.

వాకిటినిండా కిటకిట్లాడుతూ జనం. వెణ్ణమ్మ మొగుడు ఆవిణ్ణి చావాచితకా బాది ... బాది గర్భవిచ్ఛిత్తి చేశాడుట. అంతేగాదు ... యింట్లోంచి గెంటేశాడట కూడాను.

ఇహ ఈ లోకంలో ఆవిడకు ఎవరు దిక్కు ? కాబట్టి ఆవిణ్ణి ఆదుకోవాల్సిందే.

ఈ సంగతంతా విని నా పెద్దకొడుకు వచ్చాడు... వచ్చి "నాన్నా ! నువ్వా... కన్న సంతానానికి చక్కని వారసత్వం ఇస్తున్నావు. చాలు.... ," అన్నాడు... ,

వాడలా అనడం ... నాకింకా బాగా గుర్తే. కొచ్చుప్పాపీ, — మత్తాయే — ఆవిణ్ణి వెంటబెట్టుకుని తీసుకువెళ్లారు. ఆవాళ ఎక్కడో అట్టేపెట్టి, — మర్నాడు... ఉద్వాసన చెప్పేశారు. ఏదో కొంతడబ్బు ముట్టజెప్పారు ... ఆ తర్వాత మళ్ళీ ఎన్నడూ కన బడలా..., ఆపైన తొమ్మిది పదేళ్ళకి ఆవిడ చచ్చిపోయినట్టు తెలిసింది ... ... అదీ ... ...

కోడి కూసింది ... జాముకోడి అనుకుంటా. దాహం వోపక్క ... దడ ... గాబరా .... వొహటికాదు.

"అమ్మా !"

ఎక్కడా అలికిడి లేదు ... అంతా ఎక్కడివారక్కడ పడి నిద్రపోతున్నా రేమో మరి ? పందిట్లో మాత్రం దీపాలు వెలుగుతూనే ఉన్నాయి.

"తాతయ్యా !"

"ఎవరది ?"

"నేను కుట్టి అమ్మను."

"ఎప్పుడొచ్చావ్ తల్లీ ?"

"ఎంతోసేపు కాలేదులే .. అమ్మకేమో లేస్తే తలతిరుగుతూంది ... సరే, అందుకని అందరికి అన్నాలుపెట్టి వచ్చేసరికి యీ వేళయింది."

"అమ్మడూ ! దాహంరా ... పోసీ ... అంబలి అయినా ఫర్వాలేదు."

కుట్టి అమ్మ పంచలోకి వెళ్ళింది. దీపం వెలిగించి పట్టుకు వచ్చింది.

"అంబలి చప్పగా చల్లారిపోయింది ... ఉండు పోసీ కాఫీచేసి తెస్తా ...." అంది.

"కాఫీ పొడి... , పంచదార అవీ ఎక్కడుంటాయో నీకు తెలుసుటమ్మా ?"

"చూస్తాలే."

కుట్టి అమ్మ మళ్ళీ పంచలోకి వెళ్ళింది. గిన్నెలు తీసిన చప్పుడు—పొయ్యిలో నిప్పు రాజేసింది.

పిచ్చిపిల్ల ! ఒక్క పిలుపుకే మేలుకుంది.

ఈ పెళ్ళికొడుకున్నాడే ... అదే ... రాజన్ దీనికంటె ఏడెనిమిదేళ్లు చిన్న వాడు. ఇంతవరకు తమ కుటుంబంలోనే పదిపన్నెండు పెళ్లిళ్ళకు హాజరై చేసింది. దాని తప్పేవిటీ అంటే— యింతకాలానికి అది తన స్వార్థం చూసుకోపడ్డమే ,.. అదే

తప్పట.

ఎల్లకాలం చెట్టూచేమలా ఇంకొకరి సంరక్షణె చేస్తూ కూర్చోమనడం ఏం భావ్యం? అలా అనుకోవడం ఎంతటి స్వార్థం. అది రెక్కలు ముక్కలు చేసుకుని పదిరూకలు సంపాయించి తెచ్చిపడేస్తే— మంచిదన్నమాట?

ఆమాటకొస్తే— దాని కాలో — చెయ్యో నొచ్చితే- దాని అతీగతీ ఎవరు కనుక్కుంటారట? దాని గొంతులో గుక్కెడు నీళ్ళెవరు పోస్తారట?

పోనీ ... తమ్ముడిదగ్గరే ఉండనుకుందాం. దీని కూతురంత వయసులోఉండే ఆ మరదలు కొన్నిరోజులు పోయాక— నెమ్మదిగా మొగుడి చెవులో ఊదుతుందనుకోండి ...

ఈ పెళ్ళి పెటాకులులేని ఆడపడుచు మాపాలపడ్డది. దాని అతీగతీ కనుక్కునే వాళ్ళు అవతల ఎవరూలేరు ... దానికా పోయేందుకెక్కడా ఇరువులేదంటూ విసుక్కోవచ్చు.

అంతమాటనకు ... మా అక్కయ్య పూనుకొని యింత చెయ్యకపోతే, మా కాపరమంతా వీధినబడి అడుక్కుతినాల్సి వచ్చేదని వాడే జవాబుచెపుతే—

నాకెందుకొచ్చింది .... మీకే తెలుస్తుంది ... ఈ బొటాబొటీ రాబడిలో యిల్లు దిద్దుకోవడం ... ఎంత కష్టమో ... అని ఏదేదో పనస చెబుతూ భోరున ఏడుపు మొదలెడుతుందనుకోండి.

ఆ పళాన— ఆ మొగుడనేవాడు చాలా జాలిగుండె కలవాడు కనుకైతే, భార్య కంట తడిపెట్టగానే- మనస్సు కరిగిపోతుంది... చిన్నప్పుడెంత హుషారైనవాడైనా... పెద్దయ్యాక ఎంత సౌమ్యుడైనా ... మారిపోవచ్చు .. ''అక్కయ్యా పోయి ఎక్కడైనా ఉండరాదూ? ఇక్కడే పడి వేళ్ళాడాలాయే .... అనే తలంపు వచ్చిందో ఆవిడంటే గిట్టడం పోయి రోత బయలుదేరుతుంది. మాట్లాడటంలో ఏవగింపు కనబడుతుంది. సూటీపోటీ మాటలారంభమవుతాయి.

తల్లీ తండ్రీని బట్టే పిల్లలూ మారుతారు.

ఎన్నన్నా పడుతూ, — ఎంతోకాలం ఓపిక పడుతుంది. చివరి చివరికి తట్టుకోలేక.. చెల్లెలి దగ్గరికి ప్రయాణమవుతుంది.

వయసులో తనకంటె చిన్నదైనా మనవల్నెత్తిన పౌకావిడ దోవలో కనబడి — ఎక్కడికే కుట్టిఅమ్మా అంటూ పలకరిస్తుంది.

తంకమ్మ దగ్గరికి వెడుతున్నా...అంటుంది.

ఒకటి రెండేళ్ళగా నీ తమ్ముడి దగ్గర ఉన్నట్టున్నావ్ ?

ఆఁ ...

ముక్తసరిగా జవాబు చెబుతూ మనసులో ఉన్న బాధ బయట పెట్టకుండా వెళ్ళి పోతుంది.

ఆవిడ తన స్నేహితురాలే...ఆవిడకేవిటి నిక్షేపంగా యిద్దరు కొడుకులు...వేల రూపాయల జీతగాళ్ళు...ఆవిడగారి సానుభూతివల్ల తనకి వొరిగేదేం లేదుగా ?

''తాతయ్యా...! కాఫీ...''

''ఊఁ ...''

''చూడు .... వేడి ఎక్కువగా ఉందేమో ? ... అంది.

వేలితో తాకి చూసి, –

''కాస్త చల్లార్చు...'' అన్నాడు.

కొద్దిగా...చల్లార బెడుతూ పట్టింది. ఎంతో యిష్టంగా తాగాడు.

ఆ వేడి క్రమంగా పొట్టలోకి ప్రవేసిస్తూంటే....హాయిగా ఉన్నట్టు తోచింది.

''నువ్వు పడుకోలేదేఁ తల్లీ ? ''

''నాకు...అంత తొందరగా నిద్రరాదు...'' అంది.

''నాలాగానే అన్నమాట...'' అన్నాడు.

''నీకంటె...వయస్సు కారణం...ముసలితనంలో ఎక్కువ నిద్ర రాదంటారు? ''

''కూర్చో...ఇలా...మంచం మీద కూర్చో.''

''కాళ్లు పట్టమంటావా ?''

''పట్టు ''

''నా చిన్నప్పుడు నీకు కాళ్ళు పడితే...మాకు చిల్లర డబ్బులు ఇస్తూండేవాడివి కదూ? అందుకోసం దానికుట్టి జోణికుట్టి తగువులాడుతూండేవాళ్ళ గూడాను...ఏమైనా నేనే నెగ్గేదాన్ని.

దానీ కుదురుగా ఉండేవాడు...గానీ...కాలాయివాళ్ళ జోణి మాత్రం మహా తుంటరిగా ఉండేవాడు.

అది చిన్నప్పటిమాట తాతయ్యా...ఇప్పుడు వాడెంత పెద్దమనిషని.''

''అమ్మలూ ! నీకు మరో సంబంధమేదైనా వచ్చిందిటే? ''

... ... ...

''చెప్పు తల్లీ!''

''ఊఁ... ''

''ఎక్కణ్ణించి ?''

కుట్టి అమ్మ జవాబేం చెప్పకుండా కాళ్లపడుతూనే ఉంది.

''మాటాడవేమే అమ్మడూ ?''

''సంబంధమంటే -- సంబంధంకాదు తాతయ్యా — నాతోబాటు మా స్కూల్లో పనిచేసే వో మాస్టరు.''

''ఎవరు ? ... ఎక్కడి వాడు ? ''

ఆయనకా ఉద్దేశం ఉందనిమాత్రం చెప్పారు.

''ఏమన్నాడే ? ''

అప్పుడు కుట్టి అమ్మ ఇరకాటానబడింది ... అసలు చెప్పకుండా ఉండాల్సిందనుకుంది.

''అమ్మా ! ''

''ఏవిటి తాతయ్యా ? ''

''చెప్పమ్మా ఏం జరిగిందో ? ''

వాళ్ళది తోటుపురూ.. పేరు థామసు . రెండో పెళ్ళిట. పిల్లల్లేరట ... '' అంటూ ఎట్టకేలకు ధైర్యంచేసి చెప్పింది,

''ఇంకా ... ? ''

''అమ్మకి చెప్పాను...అమ్మ నన్ను చూసి భోరున ఏడ్చింది ''

''ఆయన– అసలు గోపాలన్నాయరు ద్వారా నాన్నకి కబురు పంపారు.

నాన్నేమో ఆ మేస్టార్ని నానా దులుపులు దులిపి పంపించాడు.

మీ నాయన దగ్గర నీ పెళ్ళికి కావలసినంత డబ్బు లేదుగా మరి ?

అందుకనే...''

''డబ్బేం అక్కర్లేదు ... కట్నం యివ్వాల్సిన అగత్యమూ లేదు. ఎటొచ్చి పెళ్ళికయ్యే ఖర్చు నేనే పెట్టుకుంటానాయె ''

''నువ్వా ? ''

''అవును.

సరేగానీ, ... ఏ తెగకి చెందిన వాళ్లట ? ''

''ఆ మాట ... అడగలేదు.''

అవున్లే ..., తెగ — అడగాలిసిన అవసరమేం ఉందిలే ?

కుల గోత్రాలు, — వయస్సు — వగైరా విచారించి మంచి సంబంధం తేవడమన్నది...తండ్రి చెయ్యాలిసిన విధి. అతగాడు చెయ్యలేదు కాబట్టి, — వరించి వచ్చిన వాడెవడో వాడే యోగ్యుడు అని కుయెన్నాచ్చను లోలోపల అనుకున్నాడు.

''తాతయ్యా ! నేనొకటి చెయ్యదలుచుకున్నా.''

''ఆఁ ? ''

వేడి కన్నీటి బిందువులు రెండు కుయెన్నాచ్చను పాదాలమీద రాలాయి.

''ఏవిటిది ?''

... .. ...

''అంతటి పనేం చెయ్యక్కర్లా తల్లీ! మీనాన్న రానీ...నే చెపుతా. ఏదో దారి దొరక్కపోదులే.''

''ఆఁ, ఇంతవరకు కనబడని దారి ... ఇక మీదట కనబడుతుందని నమ్మకమేవిటి ?''

''చెల్లెళ్ల వాళ్ల సకుటుంబాలుగా వచ్చినప్పుడు నాకు ఇంట్లో నడుం వాల్చేందుకు చోటు ఉండదుగదా! నేను పోయి మేకలు అవీ కట్టేసే ఆ జానెడు పంచలో పడుకోవాలిసిందే. వానకురిసిందా అంటే చూరునీళ్లు పడుతూ ఉంటాయి.

వాళ్ళకసలు ధ్యాసే ఉండదు — అక్కడంటూ ఒకళ్లున్నారని ..? ''

కుట్టి అమ్మ తాతగారి కాళ్లమీద పడిన కన్నీటి బిందువుల్ని పవిట చెంగుతో తుడిచింది.

''పో...అమ్మా...పోయి పడుకోపో...తెల్లవారొచ్చిందిగానీ....''

ఆకుపచ్చ బూనీసు తాతయ్యకి కప్పి కుట్టి అమ్మ వెళ్ళింది.

వెళ్ళిన మనిషల్లా అట్టే వచ్చేసి—''తాతయ్యా! ఇంకొంచెం కాఫీ తాగుతావా? ...'' అనడిగింది.

''వద్దమ్మా నువ్వెళ్ళి పడుకో...పో...''

కుట్టిఅమ్మ వెళ్ళిపోయింది కానీ...ఇంకా ఎదట ఉన్నట్టే అనిపించింది.

ఆ పిల్లది అన్నమాటలే మనస్సులో మెదలసాగాయి.

రమ్మంటే వెడతానంది...విన్న వాళ్లకు ఎంత సిగ్గుమాలినదో అనిపిస్తుంది...గానీ ఏం చేస్తుంది...తప్పనిసరి...ఇది అనాదినుంచీ వస్తూన్నదే...

యూదా కోడలు తామారు ఏం చేసింది ?

యూదా పెద్దకొడుకైన ఏరు చచ్చిపోయాడు...అప్పుడు యూదా తన రెండో కొడుకైన ఓనానుతో—నీ అన్నభార్య దగ్గరకు పోయి మరిది ధర్మాన్ని నెరవేర్చి, — నీ అన్నకు సంతానాన్ని కలిగించమన్నాడు. ఓనాను ఆ విధంగా చెయ్యలేదు. అందుకు యెహోవాకు కోపం వచ్చి అతన్ని చంపేశాడు.

అప్పుడు యూదా, — నా కొడుకు షేలా పెరిగి పెద్దవాడయ్యేదాకా — నువ్వు నీ తండ్రియింట విధవరాలుగా ఉండుమని తన కోడలైన తామారుతో చెప్పాడు.

అప్పుడిక తామారు తండ్రియింట ఉండటం మొదలెట్టింది.

షేలా పెరిగి పెద్దవాడైనప్పటికిగూడా యూదా తామారుని పిలిపించలేదు.

అప్పట్లో యూదా గొఱ్ఱెబొచ్చు కత్తిరించే నిమిత్తం తిమ్నాతు వెళ్ళబోతున్నాడని తామారుకు తెలిసింది.

ఆపళంగా తామారు తన వైధవ్య వేషాన్ని తీసేసి మేలి ముసుగుతో—ఒళ్లంతా కప్పుకుని తిమ్నాతుకుపోయే మార్గంలో ఉండే,-- ఏనాయిము ద్వారం దగ్గర కూర్చుండగా, యూదా ఆవిణ్ణి తన కోడలని తెలీక, ఎవరో వేశ్య అనుకుని, తనతో రమ్మని అడిగాడు.

అందుకావిడ నువ్వు నాతో చేరినందుకు నాకేమిస్తావని అడిగింది. నేను నా మందలో మేకపిల్లనొదాన్ని యిస్తానన్నాడు . అయితే అది యిచ్చేవరకు ఏమైనా కుదువ పెడితేనే ఒప్పుకుంటానంది. అప్పుడతను నేనేం కుదువబెట్టాలని అడిగినప్పుడు ఆవిడ,— నీ ముద్ర — దాని దారము, నీ చేతికర్ర అని చెప్పింది.

సరే వాటినిచ్చి ఆయన ఆవిణ్ణి చేరాడు. ఆవిడకి ఆయనవల్ల గర్భం కలిగింది. అప్పుడావిడ పోయి తన ముసుగుతీసేసి ఎప్పటిలాగా తన వైధవ్యవేషం వేసుకుంది.

తరవాత యూదా తను ఆవిడ దగ్గర కుదుపెబెట్టిన వస్తువుల్ని విడిపించి తెచ్చేంటుకు— స్నేహితుడిచేత మేకపిల్లని పంపించినపుడు .... ఆవిడ కనబడలేదు.

దాదాపు మూడు మాసాలైన తరవాత... యూదా— ఆవిణ్ణి బయటికి తీసుకు రండి . ఆవిణ్ణి కాల్చిపారేయాలన్నాడు. అప్పుడిక తామారు గుట్టు బయటపెట్టేసింది ... అంతా ఏకరువు పెట్టింది ... యూదా పశ్చాత్తప్తుడయ్యాడు. ఆవిడే తన

కంటే నీతిమంతురాలన్నాడు ... తామారు కవలపిల్లల్ని కన్నది... వారే .. పెరెసు-జెరెహూను.

మనస్సులో ఏవేవో ఆలోచనలు ... ఆకాశంలో పెద్ద వెలుగుట. ఆకాశం తలుపులు తెరుచుకుందిట. పతకాలు తాపిన గోపురంట. గోపుర ద్వారందగ్గర దేవ దూతలైన గేబ్రియలు — మీకాయెలు ద్వారపాలురట. వారు బంగారు మెట్లమీద పాదాలు మోపుతూ భూమిమీదికి దిగివస్తున్నారట. సూర్యకాంతుల్తో విరచితమైన ఊర్ధ్వ వస్త్రం ..., మంచులాగా తెల్లగా స్వచ్ఛంగా ఉన్న శిరోజాలు ... ...., చేరువకు వస్తున్నారు ... పాత స్నేహితుల్లాగా.

ఆకాశం మధ్యలో నిలబడి పోయారు.

'ఎవరండి .... మీరు'— ? అని అడగాలని నాలుక చివరిదాకా వచ్చింది.

నా మనస్సులో మాట అర్థం చేసుకున్నట్టుగా వాళ్లే—

గుర్తుపట్టలేదా— అంటూ పలకరించారు.

సంకోచిస్తూ— 'లేదు'— అన్నాను.

'దావీదు కుమారుడు సొలొమోనుని' అని చెప్పాడు.

అంగవస్త్రం నడుముకి బిగించి, నొసట చెయ్యి ఆనించి, వినయంగా నిల బడ్డాడు ... మహాజ్ఞాని ...

వస్తావా ... తీసుకువెడతాం.

అయ్యో !

ఏమిటి ?

మనవడి పెళ్ళి.

నవ్వుతారు .... ఆ నవ్వు ప్రతిధ్వనించింది.

పెళ్ళి పేరంటాలు యిలా జరుగుతూనే ఉంటాయి... అన్ని పెళ్ళిళ్ళకి నువ్వు హాజరు కావాలంటే కుదురుతుందా ?

అయ్యో !

ఈ విందులు వినోదాల్లో ఆనందమేముందోయ్ అమాయకుడా ? క్షణికమైన వాటిని గురించి ఆసక్తి చూపడం — ఆరాటపడటం మూర్ఖుల లక్షణం ... జ్ఞానులైన వారు సుఖదుఃఖాలకి అతీతంగా ఉంటారు ... జ్ఞానుల హృదయం ఆనంద మందిరం .. మూర్ఖుల హృదయం శోకగృహం ...

''తాతయ్యా !''

''ఆఁ... ఆఁ...''

''నిద్రపోతున్నావా ?''

''ఏదో కునికిపాట్టు .... ''

''తెల్లగా తెల్లవారింది... కాస్త కాఫీ పట్రానా ?''

''పట్టుకురామ్మా !''

అప్పుడే వెలుతురు వస్తూ—వస్తూ ఉంది .... అది చీకటి వెలుగుల సమ్మేళనం. వెలుతురు చీకట్లని పారదోలుతూంది.

కుట్టి అమ్మ కాఫీ తెచ్చింది. తాగాడు. ఆడవాళ్లు,— పిల్లలు,— అంతా లేచారు. పందిట్లో మాంసం కోస్తున్న వడుచువాళ్లు ... ఇప్పుడు నిద్రపోతున్నారు. బహుశా రాత్రంతా పనిచేసి,— తెల్లవారిజామున నడుంవాల్చి ఉంటారు.

ఎండెక్కాక ..., కుయెన్నాచ్చను పందిట్లోకి వచ్చి పడక్కుర్చీలో పడు కున్నాడు. బంధుమిత్రులు — చుట్టపక్కాలు వస్తూవస్తూ ఉన్నారు. చర్చిలో ఉత్స వంలా పెద్ద హడావిడిగా ఉంది

పడుకుని చూస్తూ ఉన్నాడు .... పడుచువాళ్ళు పనిపాటలు చేస్తూంటే నిజంగా చూడముచ్చటగా ఉంటుంది.

తనుగూడా లేచి అటూ యిటూ తిరగాలని ... ఏదో వోపని అందుకోవాలని ఆరాటంగా ఉన్నాడేకానీ, ... లేవ సత్తువ లేనివాడికి ఆరాటం ... ఆత్రం ఉన్నా యేం లాభం ?

మధ్యాహ్నం నుంచీ ... ఇక పిలిచిన అతిథుల రాక ప్రారంభమైంది.

వచ్చినవాళ్లల్లో చాలావరకు అన్య సంప్రదాయానికి చెందినవాళ్లే. ఒక్కొక్కరూ రావడం ... యోగక్షేమాలు కనుక్కోవడం ...

అంతలో వో గొంతు— ''ఓ ... కుయెన్నామాప్పిళ్ళా ! ఇక్కడ కూర్చు న్నావుటయ్యా ...'' అంటూ పలకరించింది.

ఆ గొంతు శివరాం కురుప్‌ది. రెండువారాలై కనబడటం లేదు.

''రావయ్యా కురుప్ మహానుభావా !''

కురుప్ వచ్చి పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.

''ఏం బొత్తిగా నల్లపూసవై పోయావ్ ?''

''ఖాతా పుస్తకాలు అవీ ... సరిచూసేందుకని— ఎర్నాకులం వెళ్లవలసి వచ్చింది. నీకు మండుపంపే ఏర్పాటు చేశానే .. అందలేదా ?''

''లేదే ...''

''ఆరోగ్యం తిన్నగా ఉందా ? రాలేకపోయానన్న మాటేగాని మనసంతా యిక్కడే ఉందనుకో.''

''ఆ ...... అన్నీ చక్కబడుతున్నట్టే... లే...''

కురుప్ అడిగిన ప్రశ్నకిది జవాబుకాదు. అయినా కురుప్ ఏం మాట్లాడలేదు. సమయాన్నిబట్టి నడచుకోవాలిగా ... పెళ్ళి హడావిడిలో యోగక్షేమాలు కనుక్కోవడానికసలు ఎవరికి తీరుతుంది? అందరూ పనుల్లో మునిగి ఉంటారాయె. వచ్చేవారికి స్వాగతాలు ... పందిరి అలంకారాలు ... వంటలు వార్పులు ... వాహ టేవిటి ?

కుయప్పి,— కురుప్ దగ్గరికి వచ్చి ... 'కాఫీ తాగుమరుగాని రండి ...' అని పిలిచాడు.

''ఆఁ ... పోయిరావయ్యా !''

''అలాగే ... అలాగే ... దానికేం ...''

పఘుపలత్తిల్ రామకృష్ణన్, పనచ్చివిలా వాసుకురుప్ మేనల్లుడు శ్రీధరన్ విశ్వతోపాటు శివరాం కురుప్‌గూడా కాఫీకి వచ్చాడు. వాసుకురుప్ గిట్టడు ... కానీ ఆయన మేనల్లుడు రాజన్ మిత్రుడు... పద్దసవాళ్లలో ముఖ్యుడు అవరాను. అతగాడు తెల్లవారకుండానే వచ్చేశాడు. నిజమైన మిత్రుణ్ణన్న మాట నిలబెట్టుకున్నాడు చెయి తిరిగిన వంటవాడికిమల్లే ... ... నడుముకి అంగవస్త్రం బిగించి హడావిడి పడిపోతున్నాడు.

ఇంత మంచివాడు... పీడు ఎన్ని మాటలు పడతాడో ! ఇంతకూ వాడి దోష మేవిటి అంటే— వాడి తండ్రి కసాయివాడు కావడమే.

వెనకటికి... ద్రాక్షతోటకి తోటమాలిని నియమించేందుకు పోయిన యజమానిని గురించి చెబుతూ ఏసుప్రభువు— ముందువాడు వెనక్కి,— వెనకవాడు ముందుకి వస్తాడు... ఈ ముందువెనుకల కర్థం... ?

రాజులం.... సేనాపతులం అని విర్రవీగినవారు నయితం... క్షణంలో కూలిపోక తప్పదు .. సుమా...

మంచబుద్ధిగల మానవుడు... ఈ యథార్థాన్ని తెలుసుకోలేడు ... అన్నాడు.

కాఫీ తాగినతర్వాత కురుప్,— మిగతా మిత్రులంతా సెలవు పుచ్చుకున్నారు.

రాత్రి జరగబోయే విందుభోజనాలకి సన్నాహాలు చేస్తున్నారు.

"మాత్తుకుట్టీ!"

"ఏవిటి నాన్నా ?"

"కుయుచ్చెరుకన్ను వచ్చాడ్రా ?"

మాత్తుకుట్టి బదులు చెప్పకుండా ఏదోపనిలో ఉండిపోయాడు.

"అమ్మా... దీనామ్మా ..." అని పిలిచేసరికి—

కీవరీతు భార్య కుయుమ్మరియమ్మ వచ్చి,— "ఏం కావాలి మావయ్యా ? దీనామ్మ సామానుకొట్లో ఉంది...." అని చెప్పింది.

"అహఁ ... కల్లువిలావాళ్ళ పిల్లాజెల్లా రాలేదా?..." అంటూ అడిగాడు.

"వస్తే వస్తారు లేకపోతే లేదు మీ కెందుకు...ఊరికే ?

ఇష్టముంటే వస్తారు ... అస్తమానం వాళ్లు రాలేదా వీళ్లు రాలేదా అంటూ కూర్చుంటే..." అంటూ ఫిలిప్పోసు విసుక్కున్నాడు

రాత్రి విందు భోజనాలైనాయి.

కుయెన్నాచ్చను కుర్చీలో కూర్చుని — అపతలవాళ్లు అడక్కపోయినా —, సలహాలు సందేశాలు యిస్తూ, — విమర్శలు వ్యాఖ్యానాలూ చేస్తూ ఉన్నాడు.

జిమ్మున చీకటి పడ్డాక పోయి —, పడమటి వసారాలో మంచంమీద పడుకున్నాడు

తెల్లవారబోయే వేళకి—కంటిన కునుకు పట్టింది. అప్పటికే వంట పనులు జరుగుతున్నాయి.

తొమ్మిది గంటలకు చర్చికి వెళ్లేందుకని ఏర్పాట్లు చేశారు.

ఆడవాళ్లు పిల్లలు అంతా పందిట్లో కూర్చుని కాఫీలు తాగారు.

ముగ్గురాడ పిల్లలు ... కుయుమ్మరియా, రాజన్ పెద్దత్తయ్య, ఒక పినతల్లి — మొత్తం ఈ పటాలమంతా పెళ్ళి కొడుకుతోబాటు వెళ్లడానికి సిద్ధంగా ఉన్నారు. పురోహితుడనబడే ఫాదరీ ఆయన అనుచరులు అంతా వచ్చేశారు.

"కూర్చోండి యాజక మహాశయా !"

"పెళ్ళికూతురు వాళ్ళంతా ఎప్పుడొస్తారట ? "

"పదకొండుగంటలకల్లా వచ్చేస్తారు."

''రాహుకాలం ఎప్పుడు ?''

''గురువారం గదా...మధ్యాహ్నం...తర్వాతనే ఉంటుంది ''

"అయితే యిక ప్రార్థనచేసి బయలుదేరడం మంచిది....వేళ అవుతూంది.''

''ఆ(, చర్చికి యిప్పుడేపోయి ఏంచేయాలి ... వాళ్లు వచ్చిన తర్వాత వెడితే చాలదూ ?''

''చాలు...సిద్ధంగానే ఉంటిమిగదా !''

''కాసిని మంచినీళ్ళయినా తాగుదురుగాని...చేతులు కడుక్కోండి.''

"మంచినీళ్లు వద్దుగానీ....కాఫీయే యిప్పించండి...''

''బానూ,—మీరుగూడా చర్చికి వస్తున్నారా ? ఏవిటి ?''

''అబ్బే లేదు ... రాలేను బాబూ ! ''

''ప్చ్...నాన్న చర్చికి వచ్చి ..అంతసేపు కూర్చోలేడు.

''నిజమే . ఏదో మాటవరసకి అడిగా గానీ ..''

బేబి రాజన్‌ని పందిట్లోకి తీసుకువచ్చారు. ప్రార్థన కాగానే కుర్చీలో కూర్చోబెట్టారు.

అప్పుడిక దక్షిణలిచ్చి — ఆశీర్వాదంపొందే తతంగం జరగాలి. మొట్టమొదట తాతగారైన కుయెన్నాచ్చను దీవెన పొందాలని పురోహితుడు ఆదేశించాడు.

''నాన్నా''

''ఊఁ.''

''దక్షిణ పుచ్చుకో...''

అవరాను కుయెన్నాచ్చను చేతికి ఊతమిచ్చి లేవ దీశాడు.

రాజన్ తాంబూలం తాతగారి చేతిలో పెట్టాడు.

అది తీసుకుని,— అతణ్ణి దగ్గరకు తీసుకుని — గుండెలకు హత్తుకుని, మాడున ముద్దెట్టుకున్నాడు. తలమీద చెయిపెట్టి—ఆకాశంలోకి చూస్తూ —

హే ప్రభో ! నన్ను కటాక్షించు. దయచూపి నా అపరాధాలన్నీ మన్నించు. ఈ చిన్నవాడు మా వంశాంకురం...ఈ అంకురాన్ని సుడిగాలులు — జడివానలనుంచి తప్పించి రక్షించు తండ్రీ !

నారు పోసినవాడివి — నీరుపోసే వాడివి నీవే.

నీ సాయంతో వెతికి, — నువ్వనుగ్రహించిన కన్నెతోనే జీవయాత్ర సాగించ

దలచాడు.

ఆ చిన్నది మా చిరంజీవికి చేయుతయై నిలచుగాక ! అంటూ దైవాన్ని వేడుకున్నాడు.

రాజన్ తలమీద ఒక ఆనంద బాష్పాన్ని రాల్చాడు.

ఆఁ ... ఆఁ ... కుయెన్నాచ్చన్ ... ఇక ... కూర్చోండి .... అన్నారు.

మిగతా వాళ్ళకిగూడా దక్షిణ యివ్వడం జరిగింది. అంతలో శాంకుట్టి సైకిలు మీద పరుగున వచ్చి— మూడు కార్లల్లో వాళ్ళంతా వచ్చేశారని చెప్పాడు.

''అయితే పదండి.''

సంభారాల గదిలో పడుందేమో...వొళ్ళంతా చికాకుగా ఉందనిచెప్పి దీనామ్మ స్నానంచేసి బట్టలు మార్చుకుని వచ్చేసరికి కొంచెం ఆలస్యమైంది.

''పిస్నీ ! దీవించు ... '' అని అడగ్గా దీనామ్మ తల్లిస్థానంలో ఉంది కనుక రాజన్‌ని వాటేసుకుని... భోరుమంది.

''అయ్యో నీ యిల్లు బంగారంగానూ! అదేం పనమ్మా...శుభ సమయంలో...'' అన్నారు....

''అమ్మా...వాణ్ణి బయలుదేరనీ...''

సంతోషించాల్సిన తరుణంలో, అయిన కన్నతల్లులకి కలత — దిగులు తప్పకుండా ఉండే గడియ అది...

అది జీవితంలో వొక మలుపు. అల్లారు ముద్దుగా చూసుకుని, — ఎన్నో ప్రయాసలకోర్చి పెంచి పెద్దచేసిన కుర్రవాణ్ణి ఒక చిన్నది — సర్వ హక్కులతో తన వాణ్ణిగా చేసుకుంటుందిగదా మరి ? తరువాత వాళ్ళిద్దరూ ఏకమవుతారు...వాళ్ళ ఉనికి వేరు... వాళ్ల పడుకునే గదివేరు...వాళ్ళ సంపాదన వేరు...

ఎంత చేసినా ఈసడించుకోకుండా ఉంటారా ? చివరి గడియల్లో గొంతులో గుక్కెడు నీళ్ల పోస్తారా ....? ... అని అనుకుంటూ ... దీనామ్మ ఇంకా మరికొందరు పెళ్ళికి తరలి వెడుతూంటే చూస్తూ నిలబడ్డాడు కుయెన్నాచ్చను.

కొంతసేపయాక చర్చి గంటలు మోగాయి.

వంట వాళ్లల్లో వొకడు — గంట మోగుతూంది...ఇహ పెళ్ళి తతంగం ప్రారంభించబోతున్నారు...త్వరగా కానీండి ... అరగడియలో వాళ్ళిక్కడికి వచ్చేస్తారు ... అని హెచ్చరించాడు.

ఈడు జోడుగా ... పెళ్ళికూతురు — పెళ్ళికొడుకు వొకరి సరసను వొకరు ఉంటారు

భగవంతుడే వరుడు...ధర్మమే వధువు . అని భావన చేస్తారు.

ఆమెకు మంగళదాయకమైన వలువలు కట్టబెట్టి—దైవాంశ సదృశమైన ఆ స్వరూపాన్ని వరుడు అర్ధాంగిగా స్వీకరిస్తున్నట్టు నిర్ణయిస్తారన్నమాట.

''ఏవరు ? చెరియనేనా ?''

''ఏవిటి నాయనా ....''

''చూస్తూ నిలబడ్డారేవిటి ?...కానీండి మరి ...వాళ్ల వచ్చేలోపల తెల్ల బట్టలు... ఉన్ని శాలువలు....పరవండి....''

ఇక ఇప్పుడు ఉంగరం తొడిగే వేడుక ప్రారంభమై ఉంటుంది.

ఉంగరంమీద చేయివేసి — 'పరిశుద్ధమైన సంఘ సంతాన సంతోషానికి'—అంటూ దీవిస్తూ పురోహితుడు పెళ్ళికొడుకు కుడిచేతి ఉంగరపు వేలికి ఉంగరం తొడుగుతాడు...

తల్లుల్లారా! మీరు మీ భర్తల్ని ... సాక్షాత్తూ పరమేశ్వరుడిగా భావించాలి ... వారి ఆజ్ఞల్ని పాటించాలి. ఏసు ప్రభువు ఏ విధంగానైతే — ధర్మానికి సంఘానికి రక్షకుడో అదేవిధంగా భర్త భార్యకు రక్షకుడు పోషకుడు కావాలి ..

సంఘం ప్రభువు చెప్పిన ఆజ్ఞకు లోబడి ఉన్నతీరునే .... భార్యగూడా ప్రతి విషయంలోను...భర్తను అనుసరించి నడుచుకోవాలి సుమా ! ... అంటూ ప్రమాణం చేయిస్తాడు.

''దీనామ్మ !''

''ఓయ్...''

''చేసిన ఏర్పాటంతా సరిపోతుందా...? సామాన్లు అవీ....?

అరటి పళ్ళు చాలుతాయా....అని ? చాలకపోతే ?

అహఁ ... నణ్ణని సైకిలిమీద సంతకు పంపారు కదూ?''

''ఆఁ ... వాడు తెస్తాడు తిండి మావయ్యా ?''

''ఏవిట్రా ?''

''కాస్త కాఫీ తాగుతారా ?''

''ఉహుఁ.''

భోజనాలు ఎప్పుడవుతాయో ఏమో !

అనుననుకో...

'కిరీట సేవ'—అవుతూంటుంది...ఈ పాటికి.

పెళ్ళికొడుకు తలవంచి నిలబడి ఉంటాడు ... శిలువ వేసిన బంగారు గొలుసు ఎడమ చేతిలోకి తీసుకుని—, కుడిచెయ్యి వరుడి తలపైనపెట్టి పురోహితుడు "క్లీలోబీ దేతు మోరోడ్"—పారాయణ చేస్తూంటాడు.

మంగళసూత్రం కట్టేముందు పెళ్ళికొడుకుని పెళ్ళికూతురి వెనక నిలబెడతారు. ముడిబాగా పడాలిగదా... ఒకవేళ పడకపోతే పురోహితుడు చెప్పిమరీ వేయిస్తాడు.... అప్పుడు సిగ్గుగా ఉంటుంది.

పెళ్ళికి ప్రత్యేకించిన ఉడుపులు కడతారు. ఆ తర్వాత పెళ్ళికూతురిమీద ఆడ బిడ్డలకు హక్కు ఏర్పడుతుందన్నమాట... అప్పుడిక వాళ్ళు వధువును తాకి, సవరించి ముస్తాబు చేస్తారు.

"పవిత్రులైన పితరులు .... పూజనీయులైన పూర్వీకులు మనకప్పగించిన నిధి... ఇది...., అదే విధినిర్వహణ. బిడ్డలారా ! గుర్తుంచుకోండి. మీరిప్పుడు ప్రభువు యొక్కయు మానవకోటిని తరింపజేయడానికి అవతరించిన ఏసుప్రభుని యొక్కయు, పరిశుద్ధులైన ప్రచారకులయొక్కయు, ప్రజలయొక్కయు సమక్షంలో ఉన్నారు. భగవత్సాక్షిగా మీరిరువురు భార్యాభర్తలైనారు ... మీ మీ బాధ్యతలను మీరు సక్రమంగా నిర్వర్తింతురుగాక ... అని పురోహితుడు సువార్త చెబుతాడు.

"పన్నీరు చల్లేందుకు యిద్దరు పిల్లలు కావాలిగా ?"

"కుయప్పి కూతురూను .. ఇంకా...."

"నేనూ చల్లుతా నాన్నా... ,"

"భేష్ ... వాళ్ళు వచ్చేవేళకి మీరిద్దరూ ఇక్కడే ద్వారం దగ్గర సిద్ధంగా ఉండండేఁ ?

నిమ్మకాయలు—అగరువత్తులు. చందనం... అన్నీ రెడీ చేసుకోండి."

అచ్చన్ కుయ్యి చెమటతో తడిసి ముద్దయి చర్చినుంచి ఒక్క పరుగున వచ్చాడు.

"ఏవిటి నాయనా ?"

"పెళ్ళి తతంగమంతా అయిపోవచ్చింది..."

"సరే, సువ్వొస్తున్నప్పటికి అక్కడేం జరుగుతూంది ?"

''వధూవరుల చేతులు కలుపుతున్నారు.''

''భేష్... భేష్...''

''ఏవిటేవిటి . . '' అంటూ కుయెన్నాచ్చను అడిగాడు.

''చేతులు కలిపారుగదా ?''

''ఆ... ఆ... ప్రమాణమొక్కటే మిగిలింది.'?

ఆ వధువు తనవారినందరిని వొదులుకొని, వరుని కలుసుకుందన్నమాట. వారిద్దరూ భార్యాభర్తలయినారు.

భర్త అయినవాడు భార్యను సుఖపెట్టాలన్నమాట ... ప్రేమగా చూసుకోవాలి.

తాను పస్తున్నాసరే,— భార్యకు కడుపునిండా పెట్టాలి. తనగొంతు దాహంతో ఆర్చుకు పోతున్నాసరే,— ముందు భార్య దప్పిక తీర్చాలి.

ఈ పిల్లదికూడా భర్తకు తలలో నాలుకయై మెలగాలి వాకిట్లోకి వో బండి వచ్చి ఆగింది. పిల్లలంతా అక్కడికి పరుగుతీశారు. ఆడవాళ్లేమో తొంగిచూశారు

ఊఁ.... వాళ్లే... పెళ్ళివారే ..

కుయెన్నాచ్చను కుర్చీలోంచి లేవబోయాడు .... ఆసరా యిచ్చేందుకు చేరువలో ఎవ్వరూ లేరు. అంతా పెళ్ళికూతుర్ని చూసేందుకు పరిగెత్తారు.

పెళ్ళికూతురివేపు వారిలో పెద్దయెవరు ?

ఆ తెల్లని గెడ్డం... మీసం ఉన్నాయనా ? లేకపోతే ఆ జరీకండువా వేసుకున్న మనిషా ... ?

కాలు మోపడానికి నేల తిన్నగాలేదు ... పందిట్లో అంతా గందరగోళంగా ఉంది ...

ఇదుగో పిల్లలూ .... !

... ... ...

కాస్త పట్టుకోండిరా ....

ఒకడు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అయితే వాడు వచ్చేలోపలే కుయెన్నాచ్చను లేవడం... పడిపోవడమూ గూడా అయింది.

# ఎనిమిది

అప్పుడే తెలతెలవారుతూంది ... తెల్లవారు జామునగా వెలిగించిన దీపం ... యింకా మినుకుమినుకు మంటూంది. రాజన్ మళ్ళీ వోసారి పెట్టెతెరిచి చూసుకున్నాడు ... పే బుక్కు, రైలు వారంటు, — లీవు సర్టిఫికెట్టు ... అన్నీ ఉన్నట్టే ... సరే, పెట్టెమూసి గుమ్మంవేపు చూశాడు. బేబీ యింకా రాలేదు. తను వచ్చాకనే బయలు దేరమని చెప్పాడు. ... ఇంకా రానేలేదు ... పక్కచుట్ట — పెట్టె మోయడానికి చాత్తను వాకిట్లో సిద్ధంగా ఉన్నాడు.

రాజన్ గడియారం చూశాడు అయిదున్నరైంది. రైలేమో ఆరుగంటల నలభై నిమిషాలకు వస్తుంది.

బేబీ వచ్చేలోపల మనం ప్రార్థన చేసుకుందాం బాబూ ! అంది దీనామ్మ.

''మాత్తుకుట్టి యింకా రాలేదాయేం ?'' అంటూ కుయెన్నాచ్చను మంచంమీద పడుకునే ప్రశ్నించాడు.

ప్రొద్దు పోయినా సరే రాత్రికి వచ్చితీరుతానని చెప్పే వెళ్ళారు. అంతవరకు ఎదురు చూడటానికి — రాజన్ వెళ్ళవలసినవాడుగదా మరి ? ... అంది దీనామ్మ.

''ఇదుగో అమ్మడూ ! కొత్తకోడలూ ! ఆగ్రంథం తీసిచదువు ... భజన సంహిత చదువమ్మా ...'' అన్నాడు కుయెన్నాచ్చను.

శాంతమ్మ పొంగి వచ్చిన కన్నీరు ... కన్నీటితో తడిసి గారకట్టిన బుగ్గలు ఎవరికి కనబడకుండా ఉండేందుకు మొహం వోసారి తుడుచుకుంది. రాత్రంతా కంటి మీద కునుకు లేదు.

''అమ్మడూ ! పుస్తకం తెరిచి ఏపేజీ వస్తే ... అది చదువు. ఫలితం తెలుస్తుంది ...'' అన్నాడు.

శాంతమ్మ పరిశుద్ధగ్రంథం తెరిచింది ... పొంగిపొర్లివస్తూన్న కన్నీటిని ఆపుకుంటూ —

"హే దేవా యెహోవా ! నీ శరణుజొచ్చి యున్నాను. నన్ను కాపాడుము. నన్నెన్నడును చిన్నబుచ్చకుము. నీ నీతినిబట్టి నన్ను రక్షింపుము. నన్ను రక్షించుటకు నాకు ఆశ్రయ శైలముగాను, ప్రాకారముగల గృహముగను ఉండుము ... నా కొండ

... నాకోట నీవే ...'' అంటూ చదివింది.

ఇక కన్నీరు ఆపుకోలేక పోయింది. ఆ గ్రంథ పుటలమీద గూడా ఒకటి రెండు కన్నీటి బొట్లు రాలాయి. కళ్ళు నీళ్ళతో నిండినందువల్ల అక్షరాలన్నీ అలికేసినట్టు కన బడు తున్నాయి.

''భయంలేదు తల్లీ! యెహోవా వెన్నంటి ఉంటాడు లేమ్మా! నీ చేతుల్లో నేను నా ప్రాణాల్ని అప్పజెబుతున్నా ... దేవా యెహోవా ... నా భారం నీదే — అని వేడుకోమని'' హెచ్చరించాడు కుయెన్నాచ్చను.

''ప్రార్థన కానీండి మావయ్యా ... అని హెచ్చరించింది దీనామ్మ. ప్రార్థన అయింది ... బేబీ వచ్చాడు. పెట్టె పక్కచుట్ట చాత్తనుచేత స్టేషన్‌కి పంపారు.

''వెళ్లొస్తా తాతయ్యా'' — అన్నాడు రాజన్.

''వెళ్ళిరా బాబూ! యెహోవా చల్లగా చూస్తాడులే ''

''వెళ్ళొస్తా పిన్నీ!'' అన్నాడు దీనామ్మతో.

''క్షేమంగా పోయిరా నాయనా. వెళ్ళగానే ఉత్తరం మాత్రం రాయి ... అని చెప్పింది దీనామ్మ.

శాంతమ్మ అంతవరకు తలుపు పట్టుకుని నిలబడిందల్లా రాజన్ దగ్గరికి వచ్చేసరి కల్లా గిరుక్కున గదిలోకి చక్కాబోయింది. వొకర్నొకరు చూసుకున్నారు ... రాజన్ శాంతమ్మని దగ్గరికి తీసుకున్నాడు. కన్నీటితో తడిసిన శాంతమ్మ బుగ్గల్ని ముద్దెట్టు కున్నాడు. అలా ... ఆ కౌగిలిలోనే కరిగి పోవాలనుకున్నట్టుంది ... పాపం ...

సిసిలీ నిద్ర పోతూంది. తల్లి దీనామ్మ — రాజన్ అన్నయ్య వెడుతున్నాడని చెప్పి సిసిలీని లేపింది.

''రాజన్ అన్నయ్యా!''

''మళ్ళీ త్వరగా వచ్చేస్తా చిన్నా .. '' అన్నాడు రాజన్.

''నాయనా! ఉత్తరం రాయడం మర్చిపోకే ...'' అని మరోసారి హెచ్చరిక చేసి చెప్పింది దీనామ్మ.

''ఉఁ ... అలాగే ...

గుమ్మం దాటేదాకా ఎలాగో తమాయించుకుంది శాంతమ్మ. ఆ తర్వాత ... ఆపుకోలేక వెక్కి వెక్కి యేడ్చింది.

''ఏడవరాదు తల్లీ!'' అని ఓదార్చాడు కుయెన్నాచ్చను.

''ఆరు మాసాల్లో వచ్చేస్తాడు .. మరీ అంతగా బాధపడరాదు ... దేవుణ్ణి తలుచుకుంటూ ఎదురు చూడటమే ... కాలం ఎంత సేపు.. ? ఇట్టే గడిచిపోతుందిలే ...'' అని దీనామ్మ సముదాయించింది. చెప్పడం తేలికేగానీ, ... పడేవాళ్ళకే తెలుస్తుంది ... బాధ ... అడవిలో ఉండనీ ... ఎడారిలో ఉండనీ .... నన్ను వెంట ఉండనిమ్మని, నాకు ఆయన తప్పఎవ్వరూ లేరని, — ఆయన తోటిదే లోకమని వేడుకున్నానంది. నిజమేమరి ... శాంతమ్మకి రాజనే సర్వస్వమూను. పుట్టింటికని వెళ్ళినా చుట్టపుచూపుగానేగా. తోడబుట్టిన వాళ్లు గానీ, — చుట్టాలుగానీ .. ఇరుగు పొరుగు గానీ — పనచ్చి మూట శాంతమ్మ వొచ్చిందంటారు ... యోగక్షేమాలు అడిగిన తర్వాత ఎప్పుడూ వెళ్ళడం అనడుగుతారు. ఇక్కడైతే — 'రాజన్ భార్య' అంటారు. ఆ అనుబంధంతో వచ్చిందే — ఈ యింటితో సంబంధమూను.

రాజన్ యిష్టమేదో — అభీష్టమేదో చేరువనుండి తెలుసుకుందుకు పట్టుమని పది రోజులన్నా ఒకచోట లేకపోయే ... తొమ్మిది పగళ్ళు .. తొమ్మిది రాత్రులు ... క్షణంలా గడిచిపోయాయి ... అనుకుంది శాంతమ్మ.

''ఇక నిద్రపోమ్మా .. అర్ధరాత్రికావచ్చింది'' అంది దీనామ్మ.

''నిద్దర రావడం లేదండి ...'' శాంతమ్మ

''ఏవిటి రాత్రంతా జాగారం చేస్తావాయేం ... ? అనడిగింది.

''ఇవాల్టికింతే.''

''ఏడవరాదని చెప్పానా ? పడుకోమ్మా —'' అంటూ —

''ఎన్ని వొడిదుడుకులు వచ్చినా నిన్ను కాపాడేందుకు నా రెక్కల్లో సత్తువ వుంది లెమ్మనట్టు — దీనామ్మ శాంతమ్మని దగ్గరకు తీసుకుని, గుండెలకు హత్తుకుంది. ఏమైనా ... శాంతమ్మకు ఆ రాత్రి కంటికి కునుకురాలేదు.

''శాంతమ్మా''

''ఏమండీ !''

''ఇట్రా .... కాస్త కాఫీ తాగుదువు గాని ...''

''వద్దు ... వద్దండి.''

''అదేం ... నే చెప్పానా లేదా ... బాధ ఉంటే మనసులోనే దాచుకోవాలి గానీ .. ఆం ? ఆడదాని అదృష్టం యిలాగే ఉంటుందిలే. ఇంద .... తీసుకో ... తాగు. ఈ కాఫీ తాతగారికి యిచ్చిరా.''

అప్పుడిక వద్దని చెప్పకుండా వో గుక్కెడు కాఫీ తాగింది. ఆ తరువాత గ్లాసులో పోసి తాతగారికి యిచ్చేందుకు తీసుకుపోయి —, "తాతయ్యా!"

"ఆఁ ?"

"కాఫీ."

ఆ గద్గద కంఠం గుర్తించాడు . కుయెన్నాచ్చును లేచి గ్లాసు అందుకుంటూ,—

"దిగులు పడరాదు తల్లీ! జ్ఞానసంతురాలైన యిల్లాలు భర్తకు పరువు తెస్తుంది. తన వివేకంతో యిల్లు చక్కదిద్దుకుంటుంది. అందచందాలున్నా అవివేకి కనకైతే — ఆ యిల్లాలు అలంకారంచేసి నిలబెట్టే దిష్టిబొమ్మకు సమానమనుకో ... తెలిసిందా ..."

"ఆఁ ..."

"ఎక్కడ ?"

"నీతి సుధలో ఉంది."

"అదే "

"నేను ... పరిశుద్ధ గ్రంథాన్ని రెండు సార్లు క్షుణ్ణంగా చదివా తాతయ్యా ... ఆదివారపు బడిలో గూడా చెప్పేదాన్ని."

"భేష్"

"మా అమ్మేమో మహిళా సమాజం కార్యదర్శిని. ఒక్కరోజయినా సరే, — ఉదయంగానీ, -- సాయంత్రంగాని ప్రార్థన చెయ్యకపోతే ఊరుకోదు."

"అమ్మా! అయితే ఆ కార్తికపల్లిలో ఉండే ఫాదరు మీయింటికి వస్తూండేనా?"

"ఆఁ ... అప్పుడప్పుడు వస్తూండేవారు."

"ఆ ఫాదరుకి నువ్వంటే ఆపేక్షేనా ?"

ఓ ... నన్ను కన్నకూతురులాగే చూసుకుంటారు. అమ్మాయీ అనే పిలుస్తారు తాతయ్యా!

ఆయన కొంతకాలం మా యింట ఉండేవారట. నాకు అంతగా గుర్తు లేదనుకోండి అప్పటికి నేను చాలా చిన్నదాన్ని.

ఆఁ ... విషయం దారిలోకి వస్తూంది..., ఔనూ,— ఊరికేనే మీయింట ఉంటూండే వాడన్నమాట ?

నువ్వు ఆ ఫాదరు కూతురివేనమ్మా... పరికించిచూస్తే పోలికలు బాగా కనబడు

తున్నాయి. ఆ కొనతేలిన ముక్కూ. ఆ ఉంగరాల జుట్టు... అదీ.

ఆ ముక్కూ మొహం తీరుని బట్టి చూసే—చేజిక్కిన దొంగసొమ్ములా కొట్టొచ్చినట్టు కనబడుతూనే ఉంది ... అయితేయేం ? ఇక్కడున్న సజ్జంతా దొంగపక్షం వారేనే. అందుకని అనుకునేం లాభం ! పోనీ... నష్టం ఎవరికట ?... ఫాదరీకే... ఇంతకు మునుపు.... తనుగూడా యీ కుటుంబంలో ఒక సభ్యుడు... యాజకుడు... కోడలు దీనామ్మ మెచ్చుకునే వారిలో ఒకడు.

మా బావగారు ఫాదరీ అంటూ మాటికిముందు చెబుతూనే ఉంటుంది. కానీ... ఇవాళ... ? ఆ ఫాదరీ కేవలం పంటచేలకి,— కడుతూ కడుతూఉండే యిళ్ళకి దిష్టి తగలకుండా కట్టే దిష్టిబొమ్మలాటివాడని తేలిపోలా ? అదంతా పై వేషమేగానీ... లోపల సరుకేం ఏడ్చిందిట— బూడిద బుగ్గిను...

జ్ఞానఫలం తిన్నటువంటి ఆదాముని దొంగని చెప్పి యెహోవా యెదుట హాజరు పెట్టినట్టుగానే, ఇవాళ... ఆ ఫాదరీపని అలాగే ఉంది.

సరే... ఇందువల్ల అటు ఆయన— యిటు వీళ్ల నష్టపోయేదేం లేదుకానీ ... పిల్ల లక్షణమైందే ... జ్ఞానవంతురాలు ... దైవచింత ఉంది. అన్నివిధాల పిల్ల వాడికి తగిన పిల్లపోదూ... అనుకున్నాడు... తనలో కుయెన్నాచ్చను.

''తాతయ్యా !''

''ఊఁ ''

''కాఫీ తాగండి... చల్లారిపోతూంది...'' అంది శాంతమ్మ.

''అమ్మా... సరే,— దానికేంలే గానీ,— మీరుభయులూ మిగతా అందరి యిళ్లకి విందు భోజనాలకి వెళ్ళినట్టేనా ?''

''లేదు పెద్దపిన్నిగారింటికి వెళ్ళలేదు.''

''ఓ... నీ మామగారి రెండోఅన్న యింటికి వెళ్ళలేదంటావా ?''

''వాళ్లంతా యిక్కడికి వచ్చినప్పుడు చూశాననుకోండి . '' అంది శాంతమ్మ.

వాళ్ల మనస్సులో అప్పట్లో నో గుంజాటన ఉంది ... అందుకే పెళ్ళికంటూ వచ్చినా... అంటీముట్టనట్లు ఊరుకున్నారు. అదీగాక నాలుగు పైసలు ఖర్చుపెట్టవలసి వస్తే చెయ్యి వెనక్కి తీసుకునే రకం... ఏమన్నా అంచే,— నాకేముంది... బీదవాణ్ణి నలుగురు పై మనుషులొస్తే నా కొంపలో కూచునేందుకుగూడా జాగాలేదు... అంటూ వేదఅరుపులు అరుస్తాడు వాడు. ఆ మాటకొస్తే అదీ నిజమే... హరిజనుల్ల గుడిసె

కంటేగూడా అధమ స్తంగా ఉంటుంది వాడి కొంప...వాడి స్థితీను..., అనుకుంటూ...

''అమ్మా మనవాడు రైల్లోనేగా వెళ్ళాడు...'' అని ప్రశ్నించాడు కుయెన్నా చ్చను.

''ఊఁ''.

''అయితే యీపాటికింకా బండిలోనే ఉంటాడు.''

ఆ తర్వాత శాంతమ్మకి ఒక్కొక్కటిగా గుర్తురావడం మొదలెట్టింది.

రేపు ఉదయం మద్రాసు ... అక్కడ రైలు మారాలి. ఆపైన మువ్పయి యెనిమిది గంటలకు ఢిల్లీ. ఆ మరుసటిరోజు అమృతసర్.

స్నేహితులంతా నవ్వులతో కేరింతాలతో ఉంటారు. ఫొటోచూసి అభిప్రాయాలు చెబుతూంటారు.

శాంతమ్మా !

ఉఁ ... ...

నన్ను పెళ్ళిచూపులకి వచ్చినప్పుడే 'రాజా' అని పేరుపెట్టి పిలిచావ్ కాదూ ?

మిమ్మల్ని ఎప్పుడో చూసినట్టే అనిపించింది. నా మనస్సు మీలాటి వ్యక్తినే కోరింది.

అబద్ధాలు.

నిజం రాజూ !

ఆ తర్వాత మాట్లాడనీయలేదు. ఎప్పుడు చూసినా నవ్వులు... ఎగతాళీలు. పనిచేసేందుకు స్థిమితం ఉండనిస్తేనా ? ముభావంగా ఉన్నట్టు .. అలిగినట్టు నటించ డాలు... అంతలో ఎవరో చెణుకులు విసరడాలు..., కవ్వించడాలూ, నవ్వించ డాలూను... అవ్వన్నీ ఒక్కొక్కటిగా జ్ఞాపకానికి వచ్చాయి శాంతమ్మకి.

శాంతమ్మ ఖాళీ గ్లాసు చేత్తో పట్టుకుని వంటింటోకి వెడుతూండగా, — ఎవరో ఒకాయన పడుచుగానే ఉన్నాడు ... గుమ్మంలోకి వస్తూండటం గమనించింది పలక రింపుగా నవ్వాడు. శాంతమ్మ తలొంచుకుని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

''తాతయ్యా ! ''

''ఎవరు ?''

''నేను.''

''నేనంటే ?''

దీనామ్మ యివతలకి వచ్చింది.

''అదె ...ఎవరొచ్చారో...మావయ్యా...మీరు గుర్తుపట్టనే లేదా?'' అనడిగింది.

''ఎవరమ్మా ఆ వచ్చింది ? ''

''మావయ్యా...కాలాయి జోయికుట్టి...''

'రాజన్ ఉన్నాడా వెళ్ళిపోయాడా...''

''ఉదయానే వెళ్లాడురా...''

''నిన్న పొద్దున బజార్లో కనబడ్డాడులే.''

''ఒరేయ్...ఇట్రారా''

''నేను యివాళ వయనాడు వెడుతున్నా తాతయ్యా! ''

''వలయాపట్టమ్ వెడుతున్నావుట్రా ?''

దీనామ్మ నవ్వి ..., ''మావయ్యకు పెద్దగా చెబితేనేగాని వినబడదు బాబూ!''

''వలయాపట్టమ్ కాదు మావయ్యా! వయనాడు...మలబార్లో ఉందే...? ''

''ఎందుకురా అక్కడికి ? ''

''అక్కడ వో వంద ఎకరాల తోట కొన్నాం.''

''ఎందుకు ?''

''నేనిక మీదట అక్కడే ఉండిపోవాలని ..., వెళ్ళాక యిప్పట్లో ఇటు వైపుకి రాను...రాదల్చుకోలేదు.''

''అదేవిటి...నువ్వక్కడ ఒక్కడివే ఉంటావా ?'' అనడిగింది దీనామ్మ.

ఒక్కణ్ణీ ఉండటమే మంచిది...వో నౌకర్ని పెట్టుకుంటాను ''

''అసలేం జరిగిందో చెప్పుబాబూ ! ''

''నాన్న నేను ఇక ఒక యింట ఉండటం కుదరదు.''

''అదేం ? తగాదా వచ్చిందా ? ''

''ఏవిటి పిన్నీ ! ఏవిటీ నీకు విషయమే తెలీదాయేం ?

సర్లే, తలకాయలు బద్దలు కొట్టుకోవడమే ... తరువాయనుకో, అంతదాకా రాకుండానే పోదామని.''

''ఏవిటమ్మా...ఏమంటున్నాడు ? ''

''ఏంలేదులెండి మావయ్యా...అయితే అన్నమ్మక్కయ్య ఏమంది ? ''

''అమ్మేమంటుంది ? ఆవిణ్ణి ఏమన్నా అననిస్తేగా ? అమ్మకి వొంట్లో గూడా బావుండటం లేదు.

ఏది యేమైనా తేల్చిపారేయాలి....''

''ఒరె...ఒరె...మీ నాయన సంగతేట్రా? తేల్చిపారేయడానికి నీకేం హక్కుంది రా వెర్రినాయనా !''

''లేకపోతే...పేటలో తలెత్తుకు తిరగాలా వద్దా చెప్పు తాతయ్యా !''

''పేటేవిటి — ఊరేవిటి ... నే చూడని ప్రవేశంగానీ, ... నే నెరగంది గానీ ఉంది్రటా...? నాకు చెబుతావ్. మంచి అన్నది...ఏకోశానా లేదు...ఎవర్లో ఉందిరా మంచి... ?''

''మెల్లిగా మాట్లాడండి మీకు పుణ్యముంటుంది ... కోడలు అక్కడే ఉంది .... మావయ్యకు ఇవాల్టికీ విషయం చాలు ... అదే పట్టుకూర్చుంటారు ... '' అంది దీనామ్మ.

కుయెన్నాచ్చను ఆ మాట వినిపించుకోలేదు.

''ఏపనైనా తెలిసి — ఆలోచించి చెయ్యాలి. తప్పుచేస్తే దండించేందుకు ఆ పరమేశ్వరుడే ఉన్నాడు...''

''ఎంతయితే మాత్రం లోకానికి వెనకపక్కల్లేదంటావా తాతయ్యా !''

''అయ్యో .... ఈ కాలంలో .... అదేం మాటరా ? శ్రోత్రియుణ్ణన్నవాణ్ణిగూడా నమ్మడానికి లేదనుకో నాన్నా...అటువంటప్పుడు – మిగిలిన వాళ్ల వో లెక్కా–జమా ?''

''ష్....ఊరుకోండి మావయ్యా ?'' అని దీనామ్మ కొంచెం నొక్కి చెప్పింది.

''తాతయ్యా! వెళ్ళొస్తానా?''

''పోయిరా బాబూ!''

''వెళ్లొస్తా పిన్ని !''

''వెళ్ళిరా....జోణిపట్టీ !''

జోణిపట్టి వెళ్ళాక దీనామ్మ—'మావయ్యా'! అనిపిలిచింది.

ఊఁ.

''మీరేం అంటున్నారో మీ కసలు తెలుస్తూందా ?''

''అంటే ?''

''అహఁ .... కొత్తకోడలు లోపల ఉందన్నమాట మర్చిపోయారా ? ఫాదరీని

ఉద్దేశించి శ్రోత్రియుడు అదీ యిదీ అని మాట్లాడుతూంటే, — శాంతమ్మ ఎక్కడ వినీ పోతుందోనని, ముందు నాకు గాబరాగా ఉంది...''

''ఔను...అమ్మాయి లోపల ఉందన్నమాటే మర్చిపోయా సుమా! ''

''అదేవిటి మరీను? అంత ఆలోచించకుండా పెట్టకుండా అనెయ్యడమే? ... ఆ మాటకొస్తే...

ఆయనగారు చేసిందీ—చాలా తలవొంపుల పనేగా...''

''ఏవిటమ్మా నువ్వంటూంది?''

''అహఁ ... జోణికుట్టి తండ్రి సంగతే...చెబుతున్నా....''

''ఎవరి వంతు బాధపస్తే...వాళ్ళనుభవించాల్సిందే...తప్పదు మరి.''

''పోనీలెండి గానీ మావయ్యా! ఇకమీద ఈ లేనిపోనిమాటలన్నీ మాట్లాడకండి... బావుండదు...'' అని చెప్పి దీనామ్మ లోపలికి వెళ్ళాక, కుయెన్నాచ్చను— తనలో...

''ఇకమీదట ఎవర్ని గురించీ ఏం అనను ... ఎందుకొచ్చిన గొడవ! అడుసు తొక్కనేం కాలు కడగనేల అని భగవంతుడి ఎదట కర్మ విచారణ జరిగే రోజున లెక్కా డొక్కా అంతా వొప్పించాల్సిందేగా...అప్పుడిహ నేను ఎరగననో... వినలేదనో ....వంక పెట్టి తప్పించుకుందుకు వీలుండదు....

పరిశుద్ధ గ్రంథంలో సవిస్తరంగా చెప్పనే చెప్పారుగదా :—

''నేను ఒకనాడు నా యింటి కిటికీగుండా తొంగిచూశాను. వచ్చే పోయే జనం మధ్యలో ఒక నవయువకుణ్ణి చూశాను. అతగాడు...ఆ ఆడమనిషి యింటివైపు దారిన బడి పోతున్నాడు. అనుకోకుండా అక్కడ వో జారస్త్రీ అతడికి ఎదురైంది. ఆవిడ స్వార్థంతోకూడిన చాపల్యంతో...సిగ్గు బిడియం లేకుండా...అందిగదా—నేను ప్రేమార్పణం చేసుకుంటానని యివాళే మొక్కుకున్నాను. అందుకు నిన్ను కలుసుకోవాలనే బయలుదేరాను.

మంచంమీద పరుపువేసి, పరుపుమీద రాగిరంగు లతలు తీగలు ఉన్న దుప్పటి పరిచాను. మా ఆయన యింట్లోలేడు. దూర ప్రదేశాలకు వెళ్ళాడులే ... రావయ్యా ...అంది.

ఆ స్త్రీ వెంటబడి వెళ్లేవాడుగూడా ... భగవంతుడి కోర్టులో విచారణ జరిపేటప్పుడు ... అన్నీ ఏకరువు పెట్టుకోవాలిసిందే సుమా ...! అని గొణుక్కుంటూ ఉండగా, —

... ... ...

వాకిట్లో ఏదో రణగొణ ధ్వనిగా...మాటలు...

సిసిలీ పరిగెత్తుకొచ్చి...శాంత వొదిన్ని చూడటానికిట...చాత్తప్పులయను తల్లి వాళ్లు వచ్చారని,—వాకిట్లో ఉన్నారని చెప్పింది.

"చాత్తప్పులయను తల్లా ?"

"అవును దొరా ! ... నేను ... అరుకీని." .

"ఊఁ ... "

శాంతమ్మ ఎంతోమంచిది అంది అరుకీ

ఊఁ ? "శాంతమ్మ నీ దృష్టిలో మంచిదేనన్నమాట ... " అనుకున్నాడు కుయెన్నాచ్చను

"శాంతమ్మ బంగారు బొమ్మగదా దొరా...ఎంత బాగా పాడుతుంది ?

"పాడుతుంది గూడానా ?"

"ఆఁ ... అడగండి దొరా పాడుతుంది "

"దొరా ... !"

"ఏవిటే అరుకీ ?"

"అహఁ ... ఏంలేదు దొరా ... చిన్నమ్మగారిని చూసిపోదామని వచ్చానంతే. కోతలకి పోయాను ... దొరా ... శాంతమ్మ తల్లి చక్కనిచుక్క ... అచ్చంగా... ఆ పోయిన చిన్నమ్మగారల్లేనే ఉంది దొరా..."

"ఏదీ ... మా కుయ్యమ్మ లాగానేనా ?"

"మరేనయ్యా ! మొహం చూస్తే అంతా అలానే ఉందయ్యా !"

"ఊఁ."

"చిన్నమ్మగారు గుర్తొస్తే ఏవిటో ... చెప్పలేనంత విచారమొస్తుంది దొరా ... నేను మన పెరట్లో అరటి మొక్కలకి ఎరువు చల్లడానికి వస్తే, — ఏమే అరుకీ యింత పెందలాడే వచ్చావేమే ... ఎరువు ... అన్నింటికీ వేశావా ? సరే, ... అయినా నే పోయి చూసి వచ్చాక ... డబ్బులిస్తాలే ... అనే వారయ్యా !"

"సీ ... అది నా యింటి దీపం ... ఆ దీపం వెలుగుతున్నంత వరకు ... లేచాను ... తిరిగాను ... సంపాయించి ... తెచ్చి పడేశాను ... అంతే ... ఆ దైవమే ... దీపం వెలిగించి చూపాడు ... మురిపించాడు ... ఆర్పేశాడు ..."

''అవును దొరా!'

''ఏమే ... నీ కొడుకేమైనా నీ అతీగతీ కనుక్కుంటున్నాడా?''

''వాడికి భార్యా ... నలుగురు పిల్లలు ఉన్నారుగదా దొరా! వాళ్లని పోషించు కునేసరికే, — వాడికి గుడ్లు వెళ్లకు వస్తున్నాయి దొరా! అటువంటప్పుడు ...''

''ఊఁ ... సరే ... పోయిరా ... చాత్తాన్ని వోసారి పంపించు'' కుయె న్నాచ్చనుకి గుర్తొచ్చింది ...

తేవను అరుకీని తీసుకువచ్చినప్పుడు — దానికో పదమూడు పధ్నాలుగేళ్లుండేవి. హరిజనుల పిల్ల మంచి సురుగ్గా ఉండేది. నాట్లు ... కోతలు ... ఊడ్పులు ... ఎరు వేయడం ... కలుపుతీయడం ... అన్నింట మంచి చెయితిరిగిన మనిషి. చూపులకి గూడా నదరుగా ఉండేది. బాగా కష్టపడి పనిచేసేది ... అంత చేసినా ... దాన్ని ఎవ్వరూ యిప్పుడు తల్చుకోవడంలా ..., ఇప్పటి పడుచువాళ్లు పనిచేస్తున్నట్టు నటించి పైసా రాబట్టుకుంటారు. అదీ తప్పేగదా? రాత్రింబగళ్లు చేలగట్లమీద అరటి పిలకలకి చాకిరిచేసినందువల్ల వాళ్ళకి వొరిగిందేముంది? పస్తులుండి పనిచేసి, అర్థాయుష్షుతో పోవడమేగా? ఎరువుల బస్తా నెత్తిమీద పెట్టుకుని మోసుకు వస్తూ వస్తూ కాలుజారి — దొర్లిపడి ఆ తేవను తమ్ముడు కంటన్నాళ్ళీ అక్కడికక్కడే ప్రాణాలొదిలాడు.

వాళ్లు చెమటోడ్చి చాకిరి చేయడమూను, ఫలితం మరొకరు అనుభవించడ మూనూ. మజాగా ఉండడమూనా?

ఇది పూర్తిగా అన్యాయం కాదూ? అయితే పరిశుద్ధగ్రంథంలో — ఈ మాటా చెప్పారు :-

పాత నిబంధన ప్రకారం ..., సుఖదుఃఖాల్ని అనుభవించే రెండు తెగల వాళ్లూ ఉన్నారు. ప్రభువాక్యామృతంలో చెప్పాడుగదా — ''నిర్ధనుల డబ్బును ధనవం తులకిస్తాడట ... అదేమంటే? చేతికున్న అయిదువేళ్లు ఓ తీరున ఉండవుగదా! పది అరటి మొక్కల్ని తెచ్చి వో చోట నాటితే, — అన్నీ తలో విధంగానే పెరుగుతాయి ... కానీ ... ఒకే మాదిరిగా ఉండవు. అల్లాగే ఈశ్వర సృష్టిలో చిన్నా — పెద్దా రక రకాల వాళ్లూ ఉంటారుసుమా ... అని...

''తాతయ్యా మొహం కడుక్కోండి ... కాఫీ తాగుదురు గానీ!'' అంది శాంతమ్మ.

శాంతమ్మ దిగులు ఎంత మనస్సులో దాచుకున్నా మొహంలో కనబడక పోలేదు

... కుయెన్నాచ్చను గ్రహించాడు.

కుయెన్నాచ్చనుకి కాఫీయిచ్చి, — ఏమన్నా అడుగుతారేమోనని, శాంతమ్మ గుమ్మం దగ్గరే నిలబడింది.

కురుప్ కొంతకాలంగా కనబడుటం లేదన్న సంగతి కుయెన్నాచ్చనుకి గుర్తొచ్చింది. రాజన్ పెళ్ళయిన తర్వాత ఒకే వొక్కసారి వచ్చాడంతే ...

బహుశా అవాళ ... మధ్యాహ్నం వస్తాడేమో అనుకున్నాడు. కానీ ... అనుకున్నట్టు కురుప్ రాలేదు. బాతాఖానీ కొట్టేందుకు ఎవ్వరూ దొరకనందువల్ల తనలో తానే ఏదో ఆలోచిస్తూ కాలక్షేపం చేశాడు.

అర్ధరాత్రయినా కంటిమీద కునుకంటూ రాలేదు నిద్ర పట్టీపట్టక ఉన్నస్థితిలో ఎవరో — మంచం దగ్గరికి వచ్చి ''బాబాయి ఉన్నాడా'' అడిగారు.

''ఎవరు వాడు ?''

''నేనే తాతయ్యా !''

''అమ్మా !''

''వస్తున్నా ...''

''దీపం వెలిగించు ...''

శాంతమ్మకి — దీనామ్మకి ఒక్కసారే మెలకువ వచ్చింది. దీనామ్మ దీపం వెలిగించి వంచలోకి తీసుకువచ్చింది.

గెడ్డాలు మీసాలతో నిలబడిఉన్న ఆ మనిషిని చూసి హడలి పోయింది.

''ఏం పిన్నీ ! నన్ను గుర్తుపట్టలేదా ?''

ఎగాదిగా చూసింది.

''దాని పుట్టినా ...'' అంది.

''ఔను ...''

''హోరి దేవుడా ! నేను నిజంగా కనుక్కోలేక పోయానయ్యా, అసలు కనుక్కోవడం ఎలా ? ఈ మీసాలు...ఈ గెడ్డాలు చూసిన వాళ్ల ఝడుసుకు చచ్చేటట్టుండె ...'' అంది.

దానికతను ఫక్కున నవ్వాడు.

''బాబాయి ఎక్కడికి వెళ్ళాడు ....'' అనడిగాడు

''కోల్లమ్ వెళ్ళారు ... మావయ్యా ! ఏవిటి మీకింకా గుర్తుపట్టనే లేదా ?''

''మన కల్లువిలావాళ్ళ దానికుట్టి.''

''ఆఁ ?''

''కుయుచ్చేరుకక్కన్ బావగారి కొడుకు ...''

''దీపం సరిగ్గా చూపించు ...''

దీనామ్మ దీపం తెచ్చిచూపించింది ... ఆపాదమస్తకం చూశాడు.

శాంసన్‌లాగా వొడ్డూ పొడుగూ ... దూలమంతెత్తున్నాడు ... పేంటు ... కోటు ... చేతిలో పెట్టె ...

''ఇప్పుడు నువ్వెక్కణ్ణించి వస్తున్నావ్‌రా ?''

''బొంబాయి నుంచీ తాతయ్యా !''

''ఎక్కణ్నించి ?''

''బొంబాయి నుంచట ... '' అంటూ దీనామ్మ బిగ్గరగా అరిచి చెప్పింది.

''సాయంత్రంగా బయల్దేరావా ?''

అన్న ప్రశ్నకు దానికుట్టి నవ్వి, —'' బయల్దేరి రెండు రోజులైంది ... తాతయ్యా ! బొంబాయి నుంచీ రెండు రోజుల ప్రయాణం ...''

''అలాగా ... ఇంత కాలానికి వచ్చినవాడివి — మరీ రెండు రోజులే ఉండి వెళ్ళిపోవడ మేమిట్రా ?''

దానికుట్టికి ఆయన ధోరణే అర్థంకాలేదు. ఊరికే చూస్తూ నిలబడిపోయాడు.

''చెవులు బొత్తిగా వినిపించడం లేదబ్బాయి .. ఆయనకి ... ఎప్పుడూ ఏదో పలవరించడమూను ....''

''ఏరా — నువ్వూ .... మీ నాన్నకేం పంపించవుటగా ?''

''అని ఎవరన్నారు తాతయ్య ?''

''ఏమోరా ... వాడు ... ఎప్పుడూ యిబ్బంది పడుతూ ఉంటాడురా. మీ కోసమని ఎన్నో ఎత్తులువేసి, జిత్తులు చేసి, మిమ్మల్ని పెంచి యింతవాళ్ళని చేశాడురా వాడు. వాడు ఒంటినిండా బట్టకట్టుకోవడానికి గూడా యింతదాకా నోచుకోలేదురా ... వాడూ .... పెద్దవాడైపోయాడు ... ఇంకా పారా పలుగూ పుచ్చుకుని, ... బరువు పనులు చెయ్యడానికి ,.. సత్తువ ఎక్కడుందిరా వాడికి ?''

''అదంతా వట్టిది తాతయ్యా ! మీ కన్నుకప్పడానికి అలా అంటున్నాడంతే...''

''ఆఁ ?''

''ప్రతినెలా నేను రెండొందల యాభై రూపాయలు వాడుకోవడానికి పంపుతున్నా ... అది చాలదాయేఁ ?''

కుయెన్నాచ్చన్ విస్తుపోయాడు.

''పది పదిహేను వేలకి ఏదైనా యిల్లుంటేగూడా చూడమని రాశాను.''

''మావయ్యా ! వాళ్లు కల్లువిలాలోనే యిల్లు కట్టుకోబోతున్నారని మీకు అవాళే చెప్పాగా ...'' అంది దీనామ్మ.

''ఎంత ఉన్నా లేదో అని మొత్తుకోవడం ఆయనకి అలవాటై పోయిందిలే.'' అన్నాడు దానికుట్టి.

''మరైతే యీ సంగతంతా నాతో చెప్పలేదేఁ ? ''

''ఆయన ఎవ్వరితోనూ ఉన్నదున్నట్టు చెప్పడు.''

''నాయనా ! ఏవిటో వీళ్ల తరహా...ఎదట బడితే మరీ నిప్పు—ఉప్పు సామెతగా ఉంది. మాటామాటా అనుకోవడం .... మావయ్యకి మనసులో మాత్రం ఎవరన్నాసరే వల్లమాలిన ఆపేక్ష—'' అంది దీనామ్మ.

''చాలా రోజులుగా అనుకుంటున్నా...రావాలి వచ్చి తాతయ్యని చూడాలి....అని. తాతయ్య మీద కలగూడా వచ్చింది...ఏదో చాలా సుస్తీగా ఉన్నట్టు.''

''జబ్బూ గిబ్బూ ఏంలేదుగానీ...బాగా బలహీనంగా ఉన్నారంతే. అది రోజు రోజుకూ ఎక్కువవుతూంది.''

దానికుట్టి పేంటుజేబులోంచి వందరూపాయల నోట్లకట్టొకటి తీసి, అందులోంచి అయిదు కాయితాలు తీసి దీనామ్మ చేతిలో పెడుతూ, ''పిన్నీ ! ఈ డబ్బు అట్టేపెట్టు... తాతయ్య ఖర్చుకి దానికి ఉంటుందన్నాడు.''

''వద్దుబాబూ !''

''అదేవిటి ? నేనేం పరాయి వాడినా ? పెద్దవాడు .. తాతయ్యకు దగ్గరుండి ఉపచారం చెయ్యవలసిన విధి నాకూ ఉందిగా ? అయితే అది నాకు వీలుపడదు కాబట్టి ఏదో రూపేణ ఈ డబ్బు సాయమన్నా చేద్దామని...అంతే ...'' అన్నాడు.

అంతగా చెబుతున్నప్పటికి దీనామ్మకి తీసుకోవడానికి సంకోచంగానే ఉంది.

''సంకోచమెందుకు పిన్నీ ! నా దగ్గర ... డబ్బుంటూ ఉండాలెగానీ, ... ఈ ముష్టి అయిదు వందలుకావు,—అయిదు వేలయినా సరే, ఖర్చుంటూ వస్తే చేసేందుకు వెనకాడను సుమా,..''అన్నాడు.

సరే, దీనామ్మ నోట్లు పుచ్చుకుని గుప్పెట్లో పెట్టుకుంది.

''తాతయ్యా ! ''

''ఊఁ.''

వెళ్ళిరానా ... అంటూ, దానికుట్టి తాతగారి పాదాలకి మోకరిల్లాడు. దీవించమన్నాడు.

దానికుట్టి తలమీద చెయిపెట్టి—కుయెన్నాచ్చను—ఆకాశం వంక చూశాడు.

తను కన్నబిడ్డలగానీ...మిగతా మనవలు వాళ్ళూగానీ, యింతవరకు అడగంది ...దానికుట్టి తన్నడిగాడు...

హే ప్రభో యెహోవా! దయచూడు తండ్రీ! దుర్మార్గులుచేసే కుట్రలనుండి, అవినీతిపరులుచేసే మోసాలనుండీ, వీణ్ణి కాపాడు తండ్రీ! నదీ తీర భూముల్లో ఉండే, ఉద్యానాల్లాగా, యెహోవా పెంచిన చందన వృక్షంలాగా, నీటివనరుల పెరిగే దేవదారు వృక్షంలా...సంరక్షించు...అని వేడుకున్నాడు.

నీకే యిబ్బందీరాదు.... క్షేమంగా పోయిరా బాబూ అని దీవించాడు.

దానికుట్టి తాతగారి పాదాలు ముద్దుపెట్టుకుని వెళ్ళిపోయాడు.

దీనామ్మ గుప్పెట ఉన్ననోట్లు లెక్కపెట్టిచూసింది. ఏవిటో వింతగా తోచింది ...కలేమో అనిపించింది. ఇంత పెద్ద మొత్తం ఎన్నడూ చేత్తో తాకి ఎరుగదు.

సిసిలీ నాన్నగారితో ఈ విషయం చెప్పడమా...? అహఁ. మావయ్యకూ—నాకూ మాత్రమే ఈ విషయం తెలుసు బట్టల పెట్టెలో దాచి ఉంచుతా. ఏదైనా అత్యవసరం వచ్చినప్పుడు బయటికితీసి, అందర్ని ఆశ్చర్యచకితుల్ని చేయాలనుకుంది.

దానికుట్టి జేబు వందరూపాయల నోట్లతో నిండిఉంది. చూస్తూంటే విన్నదంతా నిజమేనేమో అనిపిస్తూంది. ఓడలో వచ్చే సరుకుల్ని ప్రభుత్వం వారికి తెలీకుండా దొంగ చాటున కొని అమ్ముతూంటాడని,—

ఒకటి రెండు నెలలకోసారి గుట్టు చప్పుడు కాకుండా అర్ధరాత్రో అపరాత్రో కల్లువిలావచ్చి పోతూంటాడని, .... ఏమన్నా చేసుకోని ..., వాటి వల్ల నా సొమ్మేం పోదుగా... ఏదో... , అపేక్షంటూ ఉండబట్టే అర్ధరాత్రయినా వచ్చాడు. తాతగారికి వాడుకుందుకు డబ్బు ఇచ్చిపోదామని మనసు పడ్డాడు —

''అమ్మా !''

''ఏవిటి ?''

''ఎంత ఇచ్చాడమ్మా ?''

''అయిదొందలు.''

''ఏవిటి ? అయిదు వందలా ?''

''ఆఁ ... మరే. అందరూ డబ్బిచ్చే ఆపేక్ష చూపలేరుగా...? కేవలం ఆపేక్ష పడేవాళ్లు మాత్రంలేరా...? మీ అబ్బాయికి చెప్పమంటారా?...'' అనడిగింది దీనామ్మ.

''ఆఁ ? ''

''ఈ విషయం మీ అబ్బాయికి చెప్పమంటారా ? ''

''వద్దు ... చెప్పకు. చెప్పావా అంటే — వాడు నీతో ఏవో నాలుగు కల్లబొల్లి కబుర్లుచెప్పి ఆ డబ్బు కాస్త పట్టుకు చక్కాపోయి నేలపాలుచేసి పారేయగలడు ... '' అన్నాడు.

''సరైతే, — బట్టలపెట్టె అడుగున పెడుతున్నాలెండి. అవసరమేదైనా వచ్చి నప్పుడు తీసుకోవచ్చు...'' అంది.

''ఆఁ ... అదే మంచిది.

ఒక్కోసారి ఎంతో పెద్దపెద్ద అవసరాలు వచ్చిపడుతూంటాయి ముందు ముందు రానున్నాయి గదమ్మా ! ''

''అంటే....?''

''అదే .. నా సమాధి కట్టించడానికి . దినవారాలకి దానికి...''

''అబ్బబ్బబ్బ ... ఎప్పుడూ ఈ మాటలేనా చెప్పండి ? అవన్నీ చేసేందుకు వందమందున్నారు.''

''అదికాదు తల్లీ ! ... మనచేతిలో నాలుగు డబ్బులు అట్టేపెట్టుకోవడం ఎందుకైనా మంచిదీ అంటా.

ఎంత హీనంగా నన్నాకానీ, — సమాధి కట్టక తప్పదు ... పెద్ద పెద్ద వాళ్ళ పక్కన కాకపోయినా, — ఎక్కడో దూరాన్నైనాసరే, ... కట్టాలి .. పోనీ...'ఒంటరి గానే'—ఉంటాను. ఏసు ప్రభువు పుట్టిన రోజున, ఆయన పునరుజ్జీవితుడైన రోజున కొవ్వొత్తులు వెలిగించితీరాలి. ప్రభువు పునరుజ్జీవితుడై వచ్చేటప్పటికి, దాసుడు సేవకు సిద్ధంగా ఉన్నాడంటూ లేచి నడవాలిగదా ! ... ''అని చెప్పుకు పోతున్నాడు కుయెన్నాచ్చను.

''మావయ్యా! కాసేపు కళ్ళుమూసుకు నిద్రపోండి మీకు పుణ్యముంటుంది ...

గానీ, సూర్యోదయం కాబోతూంది...'' అంటూ దీనామ్మ లోపలికి వెళ్ళిపోయింది.

బట్టలపెట్టె తెరిచిన చప్పుడు కుయెన్నాచ్చను విన్నాడు. గంట మోగే తాళం వేసింది. అదైతే తాళం తీసేటప్పుడు వేసేటప్పుడుగూడా గంటమోగుతుంది ... అది దీనామ్మ పుట్టింటివారు సారె పంపినప్పటి పెట్టె.

భగవంతుడి లీలలు వింతగా ఉంటాయి. దైవ నిర్ణయం ఎవరికి తెలుసు?

నల్లమందు కొనుక్కోవాలంటే—చేతిలో చిల్లిగవ్వలేని వాడికి అయిదు వందల రూపాయలు వచ్చిపడ్డాయంటే—ఏమనుకోవాలి ?

దైవం ఎవ్వరినీ యిబ్బంది పడనీయదు

ఇంతవరకూ ఏదో రూపేణ సమయానికి యిస్తూనే ఉన్నాడు ఎన్నో ... కాచి వడబోసినవాణ్ణి.

దావీదు అరవై రెండో కీర్తనలో చెప్పినట్టు—''నా ప్రాణము దేవుని నమ్ముకుని మౌనంగా ఉంది. ఆయన వలన నాకు రక్షణ కలుగుతుంది. ఆయనే నా ఆశ్రయ దుర్గము.. నేను అంతగా కదలింపను''— అని...అన్నాడు.

అమ్మా దీపం ఆర్పు ....

... ... ...

వినపడిందా లేదా ?

... ... ...

నవ్వుతూంది ? ఎవరది ?

''నేనే నాన్నా కుయ్యమ్మను.''

ఎంత మంచి దుస్తులు ? కచ్చయురి, చట్టా, కవణి ... ధరించింది (కేరళలో నివసించే క్రిస్టియను స్త్రీలు ధరించే ప్రత్యేకమైన ఉడుపులు)

ఇంతకాలంబట్టి నువ్వెక్కడున్నావ్ తల్లీ ?

స్వర్గంలో ... , ఇప్పుడు నాతోబాటు మరో వ్యక్తిగూడా వచ్చిందిలే.

ఎక్కడుంది ?

వాకిట్లోనే...

ఎవరు ?

అమ్మ.

మీ అమ్మా ?

ఔను ... మేము నిన్ను తీసుకుపోదామనే వచ్చాం. ఇక్కడ నీకు తిన్నగా సంరక్షణ అదీ జరగడం లేదని..., ఇచ్చకాలు చెప్పేవాళ్ళని నమ్మరాదు సుమా ... లేచి రా...మనం మనింటికి పోదాం...పద...

ఇల్లంటే...?

అమరధామం.

మీ అమ్మని వాకిట్లో ఎందుకు నిలబెట్టావ్ ? రమ్మను...

లోపలికి రానంది.

అదేం ?

ఎందుకో...! దారిలో అడిగి కనుక్కో.

ఏ దారి ?...చాలా దూరభారమా ?

కాదు చేరువనే ఉంది నాన్నా! అడుగో చూడు ... దేవదూత గేబ్రియలు తన రెక్కలమీద కూర్చోబెట్టుకుని తీసుకు వెడతాడు ... పద మరి ... ? పహరా వాడిలా దేవదూత...తేజో వస్త్రాల్ని ధరించి నిలబడి ఉన్నాడు ... కుయెన్నాచ్చను చూశాడు. ఆకాశంలో ఒక ద్వారం తెరుచుకుంది. తివాసీ పరిచి ఉంది...రాతిమెట్లు ... నాన్నా నువ్వు తొడుక్కునేందుకు అంగీ తెచ్చాను. క్షణంలో ఆ కొత్త అంగీ తగిలించుకున్నాను. ఆ అంగీ వేసుకోగానే ఏదో నూతన శక్తి — వచ్చినట్టయింది. లేచి నడవడానికి ఏం కష్టం అనిపించలా.

చేతికర్ర కావాలా ?.

వద్దు.

లేచి నడవగలిగినవాడికి చేతికర్రెందుకు ? చిన్నపిల్లవాడిలాగా పరిగెత్తాలన్నంత ఉత్సాహం వచ్చేసింది. అయినా ఆవిడ బుజం పట్టుకుంది...నా అంత పొడుగూ ఉంది.

వాకిట్లోకి వెళ్ళాక — మీ అమ్మేదీ ? అనడిగా.

ఇటు అటు చూశా...కానీ కనిపించలేదు.

ఏం...? ఆవిడ కొంపదీసి వెళ్ళిపోలేదుగదా !

కుయ్యమ్మ మాట్లాడలేదు తీర మొహంలోకి పరికించి చూస్తే ... కుయ్యమ్మ కానేకాదు...పెణ్ణమ్మా...తనని సుఖభోగాలలో ముంచెత్తిన మనిషి...

నేనున్నచోటికి మీ రొస్తారా ?

నువ్వా ?

ఎంతో కాలంగా మీ రాకకోసం ఎదురు చూస్తున్నదానిని. నాకు...తోడు... ఎవ్వరూ రారు...

మన తొలి పరిచయం గుర్తుందా ?

ఆఁ ...

''ఓ నా ప్రియుడా! రా...మనం...చేలల్లోకిపోయి విహరిద్దాం .. పల్లెసీమల్లో రాత్రులు గడుపుదాం ... ఉదయానే లేచి ద్రాక్షతోటల్లోకి పోదాం ... ద్రాక్షలతలు పుష్పించాయో లేదో చూద్దాం ... దానిమ్మలు పూచాయో లేదో కనుగొందాం ... అక్కడ నిన్ను నేను ... నా ప్రేమలో ఓలలాడిస్తానులే ...'' అంది.

పెణ్ణమ్మా! నీకు కనబడటంలా ... నేను ముసలివాణ్ణయి పోయాగదా!

అని ఎవరన్నారు! నిత్యయౌవనం మనం తిరిగిపొందాం, నన్ను చూడు ... నా బుగ్గలవంకచూడు ... నా కన్నులు చూడు ... రాణులు ... సానులు ... కన్నె పిల్లలు ... అందరూ నా ముందు బలాదూరు ... ఔనా? కాదా ? నన్ను ముద్దెట్టు కోవాలని మనసు కాలేదా ?

ముద్దు పెట్టుకుందామని దగ్గరికి తీసుకున్నా ... అట్టే ... పొగలాగా ... మబ్బులాగా ... చేతుల్లోంచి మాయమై పోయింది.

శూన్యం ... ...

... ... ... ...

''మావయా లేవండిక.''

ఉలిక్కిపడ్డాడు. గాభరాగా చూశాడు. ఎందరో నిలబడి ఉన్నారు. వాళ్ళల్లో కుయ్యమ్మా లేదు ... పెణ్ణమ్మా లేదు ... ఎవరో పెడబొబ్బలు పెట్టిఏడుస్తున్నారు.

ఆ నిలబడ్డ వాళ్ళను గుర్తుపట్టగలుగుతున్నాడు. వాళ్లు ... దీనామ్మ ... శాంతమ్మ ... చిన్న. యింకా కుయుచ్చెరుకన్ను భార్య ... వాళ్ళ చిన్నకొడుకు ...

''మావయ్యా!''

''ఊఁ ...''

''దానికుట్టిని పోలీసువాళ్లు సంకెళ్లు వేసి పట్టుకు పోయారు. కుయుచ్చెరుకన్ను బావగార్ని కూడా తీసుకు పోయారు ...'' అంది దీనామ్మ.

''సంకెళ్లు వేశా ... ?

నా బిడ్డని పట్టుకుపోయి చంపి పారేస్తారు ... తండ్రో ... ఇక నా గతేం

కాను ? నాకు దిక్కెవ్వరే ... దీనామ్మా !''

''ఏడవకు అక్కయ్యా ఊరుకో.''

దీనామ్మ ఆవిడ చెయ్యి పుచ్చుకుని యింట్లోకి తీసుకు పోయింది.

కుయెన్నాచ్చను గుడ్లు మిటకరించి చూస్తూ పడుకుండి పోయాడు.

అప్పుడే వెలుగు వస్తూ వస్తూఉంది. కలా ... నిజం .... పరస్పరం కలిసి పోయాయి.

నిజమేదో – అబద్ధమేదో తెలీడం లేదు ... అనుకుంటూ ఆలోచిస్తూ పడుకున్నాడు. అంతలో వాకిట్లో వోకారువచ్చి ఆగినట్టు చప్పుడయింది.

నలుగురన్నదమ్ములు కార్లోంచి దిగారు. ముందు కీవరీతు. అందరికి వెనకాల ... దొంగలాగా ... కుయుచ్చెరుక్కను.

''ఊళ్లోవాళ్ళ సొమ్ము మీద నీకేవిటిరా అధికారం ... పోనీరా పట్టుకు పోనీరా ... ఔను ... చేసుకున్న వారికి చేసుకున్నంత ... తప్పదు.

కొడుకైతేయేఁ ... తమ్ముడు కొడుకైతేయేఁ ... తప్పు చేసినప్పుడు ... అన్నాడు'' కీవరీతు.

''అతితెలివి అపాయకరమన్నారందుకే. కుదురూ అదీ వచ్చి యిల్లూ వాకిలీ కట్టుకుని ... వాడో యింటివాడవుతాడనుకున్నా గానీ ...'' అన్నాడు ఫిలిప్పోస్సు.

''చచ్చిన వాణ్ణి ఇంకా చంపడమెందుకులేరా ...'' అన్నాడు మళ్ళీ కీవరీతు. అప్పుడామాట అందుకుని మాత్తుకుట్టి ''చచ్చిన వాణ్ణి చంపడమా ? డి.యస్ పి చీఫ్ యింజినీరుకి స్నేహితుడు. చీఫ్ ఇంజినీరుని ఫిలిప్పోస్సు బాగా ఎరుగున్నవాడుగదా ! అటువంటప్పుడు జామీను మీద విడిపించుకువస్తే పోలా ... ? లేకపోతే – కొడుకు చేసిన దొంగపనికి తండ్రినికూడా పోలీసులు పట్టుకుపోతారు ...'' అన్నాడు.

కుయుచ్చెరుక్కను మెదలకుండా, మెళ్లోఉన్న అంగవస్త్రాన్ని తీసి కుయెన్నాచ్చను మంచం దగ్గర పరుచుకుని పడుకున్నాడు. కుయుచ్చెరుక్కను భార్య శోశామ్మ–

''దానికుట్టి ఎక్కడున్నాడు కీవరీతు బాబూ !'' అనడిగింది.

''వాణ్ణి బొంబాయి తీసుకు పోయారు. కేసు విచారణ చేశాక విడిచి పెడతారు''

''హే ప్రభో !''

కుయెన్నాచ్చను, – దీనామ్మ ... శాంతమ్మ .... చెప్పిన విషయమంతా విని ...., ''వాణ్ణిగూడా విడిపించుకు రావచ్చుగదా ! అన్నాడు.

''నాన్నా ! నువ్వు వెళ్ళిరావయ్యా ! వెళ్ళి విడిపించి తీసుకురా ... ఎవరు కాదన్నారు ? ఇప్పుడు ఏడ్చిమొత్తుకుని లాభం లేదు. దొంగతనాలు దోపిడీలుచేసి, అర్థ రాత్రి — అపరాత్రి వచ్చి తెచ్చి పడేస్తూంటే, పోగుచేసుకున్నట్టు లేదా ? అప్పుడీ ఆలోచన ఉండొద్దూ ? అయిదు వేల రూపాయల దొంగసొత్తు యింట్లో పట్టుకున్నారే ? అని దులిపేశాడు ఫిలిప్పోసు.

''ఇదంతా, తెలిసి, — కావాలని చేసింది కాదుగదా ! ఇలా కొంప ముణుగుతుందని వాడికి మాత్రం తెలుసా'' అన్నాడు కీవరీతు నెమ్మదిగా.

ఫిలిప్పోసు మెదలకుండా కారెక్కి చక్కాపోయాడు.

''భగవంతుడు నా కింతటి శిక్ష విధించేందుకు నేనేం పాపం చేశానో ...'' అన్నాడు దీనంగా కుయుచ్చెరుక్కాను.

''ఔను పాపమే మరి ... ఊరుకో ... వాణ్ణి ఎలాగో అలా విడిపించి తెస్తారు గానీ ... ఊరుకో ...'' అని ఓదార్చి కీవరీతు వెళ్ళి పోయాడు.

కుయెన్నాచ్చను చేతి కర్రను ఊతంగా చేసుకుని లేచాడు. శాంతమ్మ చేతిని ఆసరాగా పుచ్చుకుని వాకిట్లోకి వచ్చాడు.

కర్రసాయంతో అతికష్టంమీద రెండడుగులు నడిచాడు. దీనామ్మని దగ్గరికి పిలిచి — చెవిలో —

''బట్టలపెట్టెలో ఉన్న డబ్బు తెచ్చి కుయుచ్చెరుక్కానుకి ఇవ్వమ్మా ... వాడి దగ్గర కనీసం ఆ చిన్న మొత్తమున్నా కొంతనయం ....'' అన్నాడు.

# తొమ్మిది

శాంతమ్మ పలకమీద పది గీతలు గీసింది ... గీసి ... చిన్నారి సిసిలీని ... 'ఎన్ని' అని అడిగింది.

సిసిలీ ఆలోచించింది. వేళ్ల లెక్క పెట్టుకుంటూ మనసులో గొణుక్కుంది .., చివరికి ,... 'షది' — అని చెప్పింది.

శాంతమ్మ అప్పుడు వాటిలో నాలుగుగీతలు చెరిపేసి "ఇప్పుడెన్ని ?" — అనడిగింది.

సిసిలీ మళ్ళీ వేళ్ల లెక్కపెట్టుకుని 'ఆరు' అని చెప్పింది. వెరీగుడ్ ... ఇప్పుడిక ఒకట్లు వందవరకు వేసి చూపించు ... అంది. సిసిలీ చిన్న పాపాయిలాగా పలక పొట్టకి ఆనించుకుని వేయడం మొదలు పెట్టింది.

శాంతమ్మ ఉత్తరం తెరిచి మళ్ళీ వోసారి చదువుకుంది. అప్పటికి నాలుగోసారి ఆ ఉత్తరం చదవడం. వారం రోజులపాటు ఎదురుచూడగా లభించే అమూల్యమైన నిధి. ఆ నిధి యేర్పరచిన ఓదార్పనే దేరాలో రెండు రోజులపాటు హాయిగా విశ్రాంతి తీసుకోవడం ... ఆ తరువాత మళ్ళీ ఉత్తరంకోసం రోజులు లెక్కపెట్టుకుంటూ ... ఎదురు చూస్తూ కూర్చోవడం ....

సిసిలీ ఒకటి ... రెండు ... మూడు ... నాలుగు ... అయిదు అని జపిస్తున్నట్టు అనుకుంటూ వేస్తూంది.

శాంతమ్మ ఒంటరిగా ఉంది కనుక ఏం దిగులు పడుతుందో అని నాలుగేసి పుటల ఉత్తరానికి తక్కువ రాయడు రాజన్.

రోజూ భోజనం చేసి పడుకునేముందు డైరీ రాసినట్టు ఎదో వొకటి రాస్తాడన్న మాట. నాలుగు రోజులు కాగానే అది ఏకంగా చేర్చి పంపుతాడు.

... నువ్వు ఏమాత్రం దిగులు పడవద్దు. — అంటూ ఉత్తరంలో నాలుగైదు సార్లు రాస్తాడు. పాపం ... ఎడబాటు సహించడం సాధ్యం కాదని తెలిస్తే — ... ?

ఎవరికి మాత్రం అంత సహనం ఉంటుంది ?

ఒక మనిషిని గురించి అమర్యాదకరమైన విషయమేముంటుంది ? కార్తికపల్లి ఫాదరు పెళ్ళికి రాలేదంటే, — ఏమో ... ఎందుకని రావడానికి వీలుపడలేదో అనుకున్నారుగానీ, — అంతకుమించి గుంజాటనేం లేకపోయింది.

కానీ ... యిప్పుడు గుట్టు బయటపడింది ... ఎవర్నయితే యీనాటి వరకు తండ్రియనుకుని గౌరవిస్తూందో, — ఆయన నిజంగా తండ్రికాడని ... తేలిపోయిందే ?

భర్త పోయిన తర్వాత తన తల్లి పెడదారి తొక్కిందని, దాని ఫలస్వరూపమే తనని, తను కార్తికపల్లి ఫాదరు కూతురేనని, ఈ రహస్యాన్ని దాచి ఫాదరు పెళ్ళి సంబంధం మాట్లాడాడని ... గుట్టుకాస్త బయటపడేసరికి చల్లగా జారుకున్నాడని, — ఏవిటో యీ విషయాలన్నీ ... మనస్సును అల్లకల్లోలం చేసేస్తున్నాయి ... శాంతమ్మకి ...

ఉబికి ఉబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక శాంతమ్మ రాత్రంతా ఏడుస్తూనే ఉంది.

అత్తగారు దీనామ్మ మంచంమీద కూర్చుని వీపు నిమురుతూ ... ఓదార్చుతూనే ఉంది.

అసలు విషయం కప్పిపుచ్చి — కల్పించి చెప్పినవాళ్ళని తెగదుమ్మెత్తి పోసింది. విషయమంతా ఉన్నదున్నట్టుగా రాసేయాలనుకుంది. కానీ .... దీనామ్మ రాయొద్దని .... అతను వో పళాన సమాధానపడే మనిషి కాదని, నీ మనస్సుకు కష్టం కలిగించి నట్టు తెలిసిందో ..., నిన్ను కించపరచిన వాళ్ళ ప్రాణాలు తియ్యడానికికూడా వెను కాడడని, చెబుతున్నా వినమని హెచ్చరిస్తూ నచ్చ జెప్పింది.

ఎలాగూ రాజన్ వచ్చేనెల స్కీము వర్కు మీద వెడతానని చెప్పాడు. జులై నుంచీ సెలవు పెడతానన్నాడు. నీలగిరి బదిలీ కావడానికి ప్రయత్నిస్తున్నాడట.

అక్కడ క్వార్టర్సుకూడా యిస్తారట ... బహుశా రావచ్చుట ... అందుకని ..., అంతా నీ అదృష్టం మీద ఆధారపడి ఉంది తల్లీ .... దేవుణ్ణి వేడుకో ... అంది.

''ఔను ... నాకోరిక కూడా అదే అత్తయ్యా! అంతకంటె నాకు మాత్రం కావలిసిందేముంది? ఆయనతో కూడా ఉండటం ఆయనకి కావాలిసిన పన్నీ అమర్చడం ....'' అంది శాంతమ్మ.''

''శాంత వొదినా ?''

''ఊఁ .''

''ఆలోచిస్తున్నావా ?''

''ఏం లేదమ్మా ! ఏదీ రాశావా ?''

''ఎప్పుడో రాశా ...''

పలక తీసుకుని చూసింది.

''నువ్వెంతైనా తెలివిగలదానివి ...!''

''ఇప్పుడు అక్షరాల్లో రాసి చూపెట్టనా ?''

''ఊఁ ...''

''నిన్న మా మేస్టారు అక్షరాల్లో రాసి చూపెట్టమంటే — సిరీదేవి అన్నీ తప్పులు రాసింది తెలుసా ?''

''సిరిదేవి కాదు ... శ్రీదేవి అనాలి.''

''శిరిదేవ ...''

అంతలో ... వాకిట్లోంచి ఎవరిదో కూనిరాగం ... వస్తున్నట్టు ... అడుగులచప్పుడు వినవచ్చింది.''

''భలేభలే పావురమా ! గడుసూ పావురమా !

నన్నెడబాయకుమా !

ఇంద్రచాపంలోని అందానికి నీదేలే వారసత్వం,

ఓవయ్యారీ ! నీ అందంతో —, నాకు వేశావే బంధం,

అదే ... అదే మన అనుబంధం'' అని పాడుకుంటూ కురుప్ లోపలికి వచ్చాడు.

శాంతమ్మ చూసి లేవబోయింది

"లేవద్దు ... కూర్చో ... కుర్చో . . చిన్నారి సిసిలీకి చదువు చెబుతున్నావన్న మాట ...'' అన్నాడు.

శాంతమ్మ యేం మాట్లాడలేదు.

''కురుప్ మావయ్యా నేను ఒకటినుంచి ... వంద దాకా వ్రేయగలను తెలుసా? ...'' అంది సిసిలీ.

''తెలుసు ... ఔను . . అమ్మెక్కడ ?''

''అత్తయ్య వాళ్ళ మేనమామ కూతురు పెళ్ళికి ... చెన్నిత్తలా వెళ్ళిందండి. ఈ పాటికి తిరుగుమొహం పట్టుండాలి ...'' అంటూ శాంతమ్మ జవాబు చెప్పింది.

''ఓహో అలాగా ! ఊరికేనే అడిగాలే ... నే పోయి నా కుయెన్నా మాప్పిళ్ళ దగ్గర కూర్చుంటా. అమ్మడూ సిసిలీ ! ఇప్పటినుంచీ చక్కగా చదువుకోవాలి ... కాలేజీకో చేరాలి. ఎం.బి.బి.యస్. పగ్గెరాలన్నీ పాసయిపోయి డాక్టరమ్మవి కావాలి సుమా ...'' అన్నాడు.

శాంత వదినంతయ్యాక నేనూ కాలేజీకి వెడతా ..అప్పుడేమో చీరె కట్టుకుంటా.''

ఆ మాటవిని కురుప్ విరగబడి నవ్వాడు. శాంతమ్మగూడా నవ్వింది.

ఆ నవ్వు వినే — కుయెన్నాచ్చను ... ''ఎవరదీ ? కురువేనా ?'' అంటూ కేకేశాడు.

"ఆ ... మరే, కుయెన్నామాప్పిళ్ళా ఒకటి రెండుసార్లు పిలిచా గానీ నీకు మెళకువ రాలేదు ... సరే, నీకు కునుకు పట్టిందిగదా — అని, ఇటొచ్చా'' అన్నాడు.

''మేలుకునే ఉన్నాలే. రా ... కూర్చో, అంటూ కుయెన్నాచ్చను కురుప్‌ని

ఆహ్వానించాడు.

కురుప్ కుయెన్నాచ్చను దగ్గరకు వెళ్ళాడు.

"కబుర్లు చెప్పుకోవడానికి ఎవ్వరూలేరు. ఏమీ తోచలేదనుకో". అన్నాడు కుయెన్నాచ్చను.

"మీ సుపుత్రుడి విషయం విన్నా... కలియుగ వైపరీత్యం..."

"ఆఁ ?"

"అహఁ ... మీ కుయుచ్చెరుక్కన్ని, ఆయన కొడుకుని అరెస్టు చేశారటగా ?"

"అదా ?"

"అయ్యో... ఇంతకంటె అపకీర్తి ఏంకావాలి కుయెన్నామాప్పిళ్ళా ? నే... అంటున్నాననుకోకు... కుయెన్నామాప్పిళ్ళా ! నీ నలుగురు కొడుకుల్లోను... అంతటి ఈర్ష్యా ద్వేషం..., ఎదటివాళ్ళంటే అంత నిరసన..., ఎంచులెట్టడం..., ఆ వొక్కడికే ననుకో. ఔనా ...? ఏవిటి ?"

కుయెన్నాచ్చను అందుకు బదులేం చెప్పలేదు. కురుప్‌వంక ఎగాదిగా చూశాడు.

"అటువంటి వాళ్ళని కొంతకాలం పోలీసు నిఘాలో ఉంచడమే ఉత్తమం ..." అన్నాడు కురుప్.

"కురుప్ ... నీకు పిల్లాజెల్లా ఉన్నారా ?"

"ఉహుఁ... మీకు తెలుసుగదా ?"

"అందుకే అలా మాట్లాడుతున్నావ్ ?"

"అంటే... ?"

"కన్నతండ్రికి బిడ్డలంతా సమానమేనయ్యా ! ఒకరు ఎక్కువలేదు... ఒకరు తక్కువ లేదు. అయితే పిల్లల్లోగూడా అవిటి పిల్లలున్నారంటే— తల్లిదండ్రులకి వాళ్ల మీద యింకా ఎక్కువ ఆపేక్ష ఉంటుంది... సహజంగా... ప్రభువు చెప్పినట్టు—

గొఱ్ఱెలకాపరి వందగొఱ్ఱెలలోనూ వొక్క గొఱ్ఱె కనుక కనబడకపోతే, ఆ మిగిలిన తొంభై తొమ్మిదింటిని మైదానంలో వదిలిపెట్టి— కనపడని గొఱ్ఱెని వెతికేందుకు బయలు దేరుతాడు... అలాగే...,

కన్నతండ్రిగూడా తన బిడ్డ తప్పుచేసినా— వెనకేసుకొస్తాడేగానీ,— నేరస్తుడి కింద భావించడయ్యా !

కురుప్‌జీ ! తనబిడ్డ ఎంత ఛండాలుడేగానీ,— తాగుబోతేకానీ,— ఏమైనాగూడా

తల్లిదండ్రులకి సంతానంమీద మమకారం చావదయ్యా! మరీ విసిగిపోతే,— ఒరే! నువ్వు నా కొడుకువి కాకపోతే బాగుండేది .. అంటామంతే... అంతే...

దుబారాచేసే కొడుకు తిరిగి వచ్చినప్పుడు ఆ తండ్రిపడే ఆనందాన్ని గురించి ప్రభువు వో మంచికథ చెప్పాడు :—

చిన్నకొడుకు పోట్లాడి కాట్లాడి యింటిభాగం పంచి తీసుకుని పరదేశం చక్కాబోయాడు.

పెద్దకొడుకేమో తండ్రితోపాటే ఉండి కుటుంబాన్ని సంరక్షించుకునేవాడు. తండ్రికి ఉపచారం చేసేవాడు. కొంత కాలానికి ఉన్నడబ్బంతా మంగళంపాడి తర్వాత మొహం వేలాడేసుకుని కాళ్ళీడ్చుకుంటూ చిన్నకొడుకు ఇల్లు చేరాడు.

వచ్చి అన్నాడుగదా— నాన్నా! నేను మీపట్ల తీరని అపచారం చేశాను. నేను 'కొడుకు' సనిపించుకోవడానికి యోగ్యుణ్ణికాను. మీదగ్గర వో కూలిపని యిప్పించండి... చాలు... అదైనా చేసుకు బతుకుతానంటూ ప్రాధేయపడ్డాడు.

తండ్రి పరుగు పరుగు ఎదురొచ్చాడు. మాడున ముద్దుపెట్టుకున్నాడు మంచి దుస్తులు తెప్పించి తొడిగించాడు. దూడమాంసం వొండించి పెట్టించాడు. తెలిసిందా కురుప్‌జీ! ... కన్నతండ్రి హృదయమంటే ఎలా ఉంటుందో గ్రహించావా?''

కురుప్ నిస్సారమైన ఓనవ్వు నవ్వాడు.

''అహఁ అదికాదు ఇది... నాకూ... తెలుసనుకో..., కానీ వంశమర్యాద-కుటుంబ గౌరవమంటూ ఉన్నాయిగదా'' అన్నాడు కురుప్.

అప్పుడే దీనామ్మ వచ్చిందక్కడికి. ముఖంలో ఏదో ఆదుర్దా... కలత అలుముకుంది... చెన్నిత్తలా నుంచీ వస్తూంది... వస్తూనే, ''మావయ్యా'' అని పిలిచింది.

''ఏవమ్మా?''

''విన్నారా?''

''ఏవిటది?''

''ఎల్లుపరంప కుట్టిఅమ్మ— నిన్న బడికి వెళ్ళిన మనిషి మళ్ళీతిరిగి రానే లేదట.''

''బడినుంచీ యింటికి రానేలేదా?''

''లేదట.''

''ఎక్కడికి పోయుంటుంది? వోహో..., ఆఁ, ... వచ్చేస్తుంది లేమ్మా.''

''ఏం రావడమో .. ఏంలోకమో..., సహాధ్యాపకుడితో కలిసి లేచిపోయిందని వీధిలో అందరూ చెప్పుకుంటున్నారు. రిజిష్టరు వివాహం చేసేసుకుందనిగూడా అంటున్నారు మరి ?''

''కుట్టిఅమ్మంటే కీవరీతుగారి కూతురేకదూ...'' అనడిగాడు కురుప్.

''ఆ... ఆ... ఆ మహాతల్లే...'' అంది దీనామ్మ వెటకారంగా.

''వాడో కేథలిక్కట '' అన్నాడు కుయెన్నాచ్చను.

''మీకు తెలుసా మావయ్యా ?''

''చూడలేదులే... రెండో పెళ్ళివాడట... మొదటి భార్యకి పిల్లాపాపా లేరట !''

''మీకీ విపరాలన్నీ ఎలా తెలిశాయి మావయ్యా ?''

''ఎలా తెలుసంటావా ?...''

''ఆఁ ...''

"అదే నాకన్ని విషయాలు పూసగుచ్చినట్టు చెప్పింది తల్లీ ! అంతేగాదు. ఆయన ఊఁ అంటే తను వెళ్ళిపోతాననే చెప్పిందమ్మా.''

''అయ్యో అయ్యో...., అయితే,– మావయ్యా ! అన్నీ తెలిసిగూడా మీరు ఎవ్వరితోను మాటమాత్రం చెప్పలేదేవిటి ?"

''ఎవరితో చెప్పమంటావ్ ? ఏం చెప్పమంటావమ్మా ? పిల్లదానికి యుక్తవయసు రాగానే పెళ్ళిచెయ్యడం తండ్రి బాధ్యత కాదూ ? ఔనా కురుప్‌జీ ?''

''ఔనవును... మన సంప్రదాయం ప్రకారం అవతలవాళ్ళు పిల్లకోసం వెతుక్కుంటూ రావాలి. చెయ్యడం– చెయ్యకపోవడం... అది పిల్లదాని తల్లిదండ్రుల యిష్టం.''

''అఁ ... మరే, ఇక్కడికిగూడా ఎన్నో సంబంధాలు రావడమైతే వచ్చాయి గానీ,– ఒక్కటీ పడనిస్తేనా ? నే నడిగితే– చూద్దాంలే నాన్నా..., ఆలోచిద్దాంలే నాన్నా'– అనేవాడు ఎప్పుడాలోచించడం... ? ఎప్పటికి నిర్ణయించడం, ఇలాచేస్తే– ఎంతకాలమని ఓపిక పడుతుంది... ? అందుకే... ఆపని చేసింది... పోనిద్దూ...., ఒక మొగాడివెంటే వెళ్ళింది... అతగాడు దాన్ని సంరక్షించుకుంటాడు ...''

''ఈయనింకా ఈ కళ్ళతో ఎన్నెన్ని ఘోరాలు చూడాలనిఉందో ! ఖర్మ ... ఏవిటో నాకేమీ పాలుపోవడం లేదు...'' అంది దీనామ్మ.

''చూడాలమ్మా... అన్నీ చూడాల్సిందే... తప్పదు తల్లీ ! తొంభై సంవత్సరాల

నుంచీ ఎన్నెన్నో చూస్తున్నా... అనుభవిస్తున్నా .... చేసుకున్న భార్య పోయింది ... అల్లారుముద్దుగా పెంచుకున్న ఒక్కగానొక్క కూతురూ పోయింది ... జ్యేష్ఠుడు యింటికి పెద్దవాడైన... కొడుకుకాస్తా పోయాడు. రెక్కలు తెగిన పక్షిలాగా ..., నేను... జరుగుతున్నవన్నీ చూస్తూ,— వింటూ..., నిస్సహాయంగా, గత్యంతరం లేక పడిఉన్నా...

ఇచ్చేవాడు... తీసుకునేవాడు.... ఆ సర్వేశ్వరుడే... న్యాయవంతుడు — యధార్థ వర్తనుడు అయిన యోబు ఏమన్నాడో తెలుసా ... ?

"జనసంచారం లేని అరణ్యంలో వాన కురిపించి,
పాడుపడి బీడైపోయిన నేలను సారవంతంగా చేసి,
పచ్చని పచ్చిక మొలిపించేదెవరో .. ?
ఆకాశంలో మంచు తయారుచేసి,— కురిపించేదెవరో ... !

ఎవరా మహిమాన్వితుడు ? ఏం తెలుసు అతణ్ణి గురించి మనకు ? అందుకని.... మనకేం తెలీదంటున్నా మరుప్జీ !"

"నిజమే... మనమేపాటి... ? గడ్డిపోచతో సమానులం ఆ దివ్యశక్తిమయుని మహిమ తెలుసుకోవడం మన తరమా ? సృష్టిస్థితి లయ కారకుడు ... ఆ సర్వేశ్వరుడే !

"మృత్యుః సర్వహరశ్చాహ, ముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తిః శ్రీ వాక్ చ నారీణామ్, స్మృతిర్మేధా ధృతిః క్షమా ।
బృహత్సామ తథా సామ్నామ్,— గాయత్రీ ఛందసామహమ్ ।
మాసానాం మార్గశీర్షోహమ్ — ఋతూనాం కుసుమాకరః ॥ అని...

దావీదు తన ప్రాయశ్చిత్త ప్రార్థనలో...

"హే ప్రభో! యెహోవా! నీవు అధిక ఘనత వహించిన వాడవు
నీవు మాహాత్మ్యమును.. ప్రభావమును,...సంపదను ధరించియున్నావు.
వస్త్రమువలె వెలుగును నీవు కప్పుకొని యున్నావు.
గుడారము పరచినట్టు ఆకాశాన్ని నీవు పరచియున్నావని..."

ప్రస్తుతించాడు.

"నాన్నా "

"ఎవరు ? "

కీవరీతు తండ్రి మొహంవంక చూస్తూ మంచం దగ్గర నిలబడ్డాడు.

కురుప్‌కి ఆక్కడిక తను ఉండటం అనవసరమనితోచి తప్పుకోవాలనుకుని, ....
"నేనిక లేస్తా — కుయెన్నామాప్పిళ్ళా"— అన్నాడు.

ఎవ్వరూ ఏం మాట్లాడలేదు. కురుప్ తనదారిన తను చక్కాపోయాడు. దీనామ్మ గుమ్మంలోకి వచ్చింది.

"నాన్నా! నా పిలుపు వినిపించినట్టులేదే..."అనడిగాడు కీవరీతు.

కుయెన్నాచ్చను మెదలకుండా ఊరుకున్నాడు.

"నాన్నా! నిన్న బడికిపోయినపిల్ల ఇంతవరకు తిరిగి రాలేదయ్యా.." అన్నాడు...బిక్కచచ్చి...కీవరీతు.

"ఉం?"

"అయితే నన్నేం చెయ్యమంటావ్?"

"ఆఁ?"

"ఏం చెయ్యమంటావ్."

"ఈ సంగతి మొదటే ఆలోచించుకోవాలి అంటాను. నేను నీకు చిలక్కు చెప్పినట్టు ఎన్నిసార్లు చెప్పా...? దానిమెళ్ళో మూడుముళ్ళూ వేయించమని; చెప్పినప్పుడల్లా నా మీద విరుచుకు పడేవాడివిగదా?"

"ఇప్పుడా మాటలన్నీ ఎందుకు చెప్పండి మావయ్యా!" ...అంది దీనామ్మ.

"మరెప్పుడు చెప్పమంటావ్? ... చెయ్యవలసినపని విధిగా వేళమించకుండా చెయ్యాలిగానీ..."

"నాన్న దృష్టిలోకూడా నేనే అపరాధిని...ఔనా? నాకు కన్నబిడ్డలమీద అపేక్ష లేదనుకున్నావ్? నేను ... అది చేతికి ఆసరాగా ఉంటుందని అనుకున్నాగానీ... అదీ విషయం. పస్తులైనా ఉండి — ఆది తెచ్చే జీతంలో ఒకవంతు చిట్ కడుతూ వచ్చా. అలా అలా డబ్బుకూడబెట్టయినా దాన్ని వో అయ్యచేతిలో పెట్టాలనుకున్నా..." అన్నాడు కీవరీతు

"నోటుపుర్యూయేనా ... లేక దాని చుట్టుపక్కెక్కడో ఉండే ఆ మేస్టరు గోపాలన్నాయరు మేస్టరుద్వారా తనకు అమ్మకుని పెళ్ళాడాలని ఉందన్నట్టు కబురు పంపాడటగా? ఆ మాట చెప్పేందుకు వస్తే—ఆయన్ని నువ్వు నానా దులుపులు దులిపావుట ... నిజమేనా?" అనడిగాడు కుయెన్నాచ్చను.

"రెండో పెళ్ళివాడు . . . కేథలిక్కు . . . పోయి పోయి అటువంటి వాడికి మన పిల్లదాన్ని కట్టబెట్టడమేమిటి చెప్పు . . . నాన్నా !"

అది సరేరా . . . మాటాడే మాటకో తీరూ తారూ అంటూ ఉండొద్దురా ? ఆ మాటే కొంత చాకచక్యంగా చెప్పి ఉండొచ్చుగదా అంట ? మాట పొంకమన్నది నీ జన్మలో —, నీ కింతవరకూ లేదుగదా ! ఒరే చూడు . . . పిల్లల్ని యింట కట్టి పడేదామనుకోవడం పొరబాటురా. వాళ్ళూ పసిపాపాయిలేంకారు . . . వ్యక్తత వచ్చింది. నీ అంతవాళ్ళయ్యారు . . . మీరు పెద్దలంటే మీరు పెద్దలన్నట్టు ఎవరి హద్దులో వాళ్లున్నప్పుడే గౌరవంగానీ . . . మీ మొగుడూ పెళ్ళాం పిల్లలూ ఎప్పుడు చూసినా దొమ్ములాడుకుంటూంటే ఏం మర్యాదేడుస్తుందిరా ?"

కీవరీతు అన్నీ వింటూ తలొంచుకు నిలబడ్డాడు.

దాని తరువాత చెల్లెళ్ల ఇద్దరేసి ముగ్గురేసి బిడ్డల తల్లులయ్యారు. అందరికి యిల్లూ వాకిలీ... పెనిమిటి బిడ్డలూ అంటూ ఏర్పడె... ఎటొచ్చీ ఏమీలేనిది అదేగా ? నీ కళ్లుకాస్తా మూసుకుపోయాక దాని గతేంకాను ? దానికి దిక్కెవ్వరు ? కాస్త . . . ఆలోచించరా..."

మావయ్య చాలా సబబుగా మాట్లాడుతున్నారు. కుట్టిఅమ్మ తనతో వోనాడు చెప్పనేచెప్పింది. చిట్టచివరి పిల్ల లీలామ్మ పెళ్ళిగూడా అయిపోయింది. మొదటిసారిగా భార్యాభర్తలిద్దరూ వచ్చారు... అప్పుడింట్లో మిగతా అక్కచెల్లెళ్ళు... వాళ్ళ భర్తలు గూడా ఉన్నారట. అందరూ వస్తే యింట్లో హాయిగా కాళ్ళు జాపుకుని కూర్చోవడానికి గానీ... పడుకోవడానికిగానీ సదుపాయం లేదాయె ... ? ఉన్న కాస్తచోటు వాళ్లవాళ్ల కుటుంబాలకి కేటాయింపు చేసేశారట. తీరా ఈ కుట్టిఅమ్మ పడుకోవాలంటే .. వంటిల్లే గతి అయిందిట.

సరే,— పొద్దున్నే లేచి కాఫీ చేసిందిట. కీవరీతు బావగారికి నిద్ర లేవగానే కాఫీతాగే అలవాటు. కాఫీ తీసుకుని పంచలోకి వచ్చిందిట. వచ్చేసరికి యింకే ముంది ... ? అక్కడ... తనకంటె పదేళ్ళు చిన్నదైన తనచెల్లెలు,— భర్త మంచం మీద నగ్నంగాపడి గుర్రుకొడుతూండటం కంటబడిందిట. వొళ్లు ఝల్లుమందిట . . . . ఏం చేస్తుంది... ? ఎవరితో చెబుతుంది ? తలుపుచాటున నిలుచుని పిలిచిందిట .. వినబడితేగా ? కొంపదీసి తల్లిగానీ— తండ్రిగానీ అటొస్తే ఏం కాను ? ఆలోచించిందట ... , మెల్లిగా వాళ్ళ మంచం దగ్గరికిపోయి చెల్లెలి అరికాల్లో చక్కలగిల్లి

పెట్టిందట...' అనుకుంది లోలోపల దీనాష్మ.

''సర్లేవయ్యా! నే చేసిన తప్పులన్నిటికీ భగవంతుడు నన్ను ఎలాగూ దండి స్తాడులేగానీ,— నన్ను ముందిప్పుడేం చెయ్యమంటావో చెప్పు. దాని ఖర్మానికి దాన్ని వదిలెయ్యమంటావా చెప్పు ...'' అనడిగాడు కీవరీతు.

ఈ మాటలు వింటూ మాత్తుకుట్టి లోపలికి వచ్చాడు. వస్తూనే అన్నాడుగదా— ''చర్య తీసుకోవడమే... , దానికింత ఆలోచన దేనికి? ఇతరులమీద నెపంవేసి ఏం లాభం? అందుకు తల్లిదండ్రులే బాధ్యులు. పిల్లలకి అన్నం పెట్టడంతోటే కన్నవాళ్ల బాధ్యత తీరిపోలా ... , అదుపు పెట్టడంగూడా ఎంతో ముఖ్యం హద్దుమీరితే కాళ్లు విరగేసి గదిలో పారేసి తాళం పెట్టాల్సిందే. ఈ విషయం అప్పుడే ఊరంతా పొక్కి పోయె ...''

మాత్తుకుట్టితో బాటు కుయిప్పిగూడా ఉన్నాడు.

''చర్య' అంటే ఎటువంటిదని? మైనారిటీ వెళ్లిన పిల్ల. తన మనసుకు నచ్చిన వాడితో వెళ్ళిపోయిందంటే— అప్పుడు కేసువెయ్యడం వ్యర్థమేగదా? తిన్నగా వో రిజిస్ట్రారు దగ్గరికి వెళ్ళారంటే,— వాళ్ళిద్దరూ భార్యాభర్తలుగా ఉండేందుకు ఆయన అనుమతిచ్చేస్తాడు.''

''ఒకవేళ కేసు వేయడానికి సందర్భం లేకపోతే,— మనం అటువంటి పరిస్థితి ఒకదాన్ని కల్పించాలి. పిల్లదాని మెళ్ళో అయిదారు కాసుల గొలుసు కాజేశాడని .... , దాన్ని బలాత్కారంగా తీసుకుపోయాడని ... , ఏవేవో అల్లాలి ... , అలా చేసి నట్టయితే ...''

కుయిప్పి తాపీగా అన్నాడు: ''కానుకో, బలాత్కారంచేసి తీసుకుపోయా డన్న విషయం కోర్టులో పిల్లది చెప్పాలిగా? అది చిన్నపిల్ల కాదుగదా... మనం చెప్పమంది చెప్పడానికి?''

''చెప్పకపోతే— చెప్పేటట్టు చేద్దాం ... అంతేగానీ దాన్నిగురించి నువ్వేం బెంగ పడకు. వకీలు ఉమ్మనుగార్ని సంప్రదించే వచ్చాను. ఇటువంటి దానికి కొన్ని పద్ధతులు— నిబంధనలు ఉన్నాయి. సాక్షుల విషయం నే చూసుకుంటానులే . . . '' అన్నాడు మాత్తుకుట్టి.

"ఇప్పుడీ లేనిపోని కేసు — వ్యవహారం ఎందుకు బాబాయి దండక్కి?''

''ఏం? ఊళ్ళో తలెత్తుకు తిరగాలా అక్కర్లేదా? వీధిలో చూడు ... ఎవరి నోట

విన్నా ఈపాటే పరువుపోయాక బ్రతికేం ప్రయోజనంరా ?''

''కేసులు— వ్యాజ్యాలు వెయ్యాలంటే ముందు చేతినిండా డబ్బుండాలి. వాడి కంత డబ్బుందా మరి ?'' అనడిగాడు కుయెన్నాచ్చను.

''డబ్బులేకపోతే పుట్టెత్తుతాం డబ్బుకోసం . . . అంతేగానీ . . . ? ''

''ఆలోచించకుండా పెట్టకుండా రంగంలోకి దూకితే లాభమేవిటి ? బాబాయి ! అయిందేదో అయింది . . .'' అంటూ కుయప్పి ఎంతగానో నచ్చజెప్పి వొప్పించడానికి యత్నించాడు.

''నువ్వూరుకోరా కుయప్పీ ! నా రక్తం కుతకుతా ఉడికి పోతూంది. నా యింటి ఆడవాళ్లెవరైనా ఇటువంటి ఛండాలపు పనిచేసి ఉంటేనా జుట్టుపట్టుకు లాక్కొచ్చి ఈ వరండాలోపడేసి కత్తికో కండగా చీల్చి ఉండేవాణ్ణి ఏమనుకున్నావో ? '' అన్నాడు మాత్తుకుట్టి.

అంతటా నిశ్శబ్దం. దీనామ్మ గెడ్డంకింద చెయిపెట్టుకుని గడపలో నిలబడింది.

కుయెన్నాచ్చను లేచి కూర్చున్నాడు.

తండ్రి మంచం దగ్గరే చేతుల్లో మొహం దాచుకుని కీవరీతు చతికిలబడ్డాడు.

''కీవరీతన్నా ! ఏవిటలా మౌనంగా ఉన్నావ్ ? ''

''ఉం ? దావా వెయ్యాలంటే... , వేస్తేపోలె.''

''వెయ్యాలంటే — అనడంలో అర్థమేవిటి ? నా కోసమేం అక్కర్లేదు ... నీ కోసమనీ కాదు ... ఫిలిప్పోసు నడిబజార్లో నన్నుపట్టుకుని నానా మలుపులు దులిపి వొదిలి పెట్టాడురా ... ఒక్క చెయిచేసుకోవడమే తరువాయి ... నువ్వన్నట్టే వాడూ అంటున్నాడు ... నలుగుర్లో తలెత్తుకు తిరగడం కష్టంగా ఉందని ... మరి అటువంటప్పుడు ఏం చెయ్యమన్నావో చెప్పు పోనీ...చెయ్యమన్నదే చేస్తా . నాకా వోపిక లేదు... దిక్కులేదు ... నాచేతికి అక్కరకువచ్చి ఆసరాగా నిలబడ్డవాడు లేకపోయె . అంటూ వాపోయాడు.

అయ్యోరాతా ... అసలు వాడికో పరువంటూ ఏడ్చిందక్కడ నిన్ననడానికి ? ''

''తనంత కొడుకుండగా పనిమనిషితో కులుకుతున్నాడే ... ? సిగ్గుతో తలవొంపులై వాడి కొడుకు ఊరు విడిచి వెళ్ళిపోయాడే ... యింటింట వోపొయ్యి .... మా యింట మరో పొయ్యి — అన్న సామెతగా ...'' అన్నాడు కుయెన్నాచ్చను.

''ఊరుకోండి మావయ్యా ! ఆ సంగతి యిప్పుడెవరైనా అడిగారా చెప్పండి?

రోజు రోజుకీ మీకు మరీ అనొచ్చింది...అనరానిదీగూడా తెలీకుండా పోతూందే ...''
అని గద్దించినట్లు అంది దీనామ్మ.

''అన్నీ వినీ వినీ ... అనకుండా ... చెప్పకుండా ఎలా ఉండను ?''

''ఆఁ ... చాల్లేవయ్యా ... ఇప్పుడైనా .... ఆ పాత పురాణాలన్నీ తవ్వడం దేనికి'' అన్నాడు మాత్తుకుట్టి.

''తాతయ్య అన్నదాంట్లో తప్పేంలేదే ... అబద్ధమూ లేదు. కుయుచ్చెరుక్కను బాబాయి కొడుకు దొంగతనం చేశాడన్న నేరంకింద వాణ్ణి పోలీసులు పట్టుకుపోయారు .... అది అప్రతిష్ఠపనేగదా ?'' అనడిగాడు కుయప్పి.

''అది సరే ననుకోరా ..అయినా ఇంట బుట్టిన ఆడకూతుళ్లు తప్పుదారిన బడితే .... అంతటి అపకీర్తిని భరించడం దుర్భరం బాబూ ! నువ్వంటే పొద్దుటనుంచీ సాయంత్రందాకా ఆఫీసులో అంటుకుపోయి కూర్చుంటావు కాబట్టి నీకు తెలీదుగానీ ... పొద్దస్తమానం అటూ యిటూ తిరగాలిసినవాణ్ణి నేను...''

అలా మాటాడుకుంటూండగా...గుమ్మంలోకి టాక్సీవచ్చి ఆగింది. టాక్సీ తలుపు తెరుచుకుని ఇద్దరు వ్యక్తులు దిగారు. వాళ్ళనిచూసి అంతా ఒక్కసారి నివ్వెర పోయారు. వాళ్లు...కుట్టి అమ్మ..., ఆ నోటపుర్ఘాకి చెందిన తోమాసు మేస్టరూను.

కీవరీతు లేచాడు దీనామ్మ, కుయప్పి, చాకరి మొహాలొకరు చూసుకున్నారు.

మాత్తుకుట్టి కీవరీతు వంక చూశాడు.

ఎక్కడినుంచో ... ఒక్కొక్కరుగా ... ఇరవై ముప్ఫయిమందిదాకా జనం వాకిట్లో తెలీకుండానే గుమిగూడారు.

ఏమంటారోననే భయంతో ... కుట్టి అమ్మ బెదురు బెదురుగానే అడుగులు వేసుకుంటూ లోపలికి వచ్చింది.

వెంబడే తోమాసు మేస్టరుకూడా వచ్చాడు. ఎవ్వరూ ఎవర్నీ పలకరించలేదు — మాటాడనూ లేదు.

కుట్టిఅమ్మ తిన్నగా కుయెన్నాచ్చను మంచం దగ్గిరకిపోయి నిలబడి, భయం భయంగా అందరి మొహాలవంకా తేరిపారజూసింది ... హంతకుణ్ణి చూసినంత ద్వేషంతో చూస్తున్నాయి అందరి కళ్ళు.

కుట్టి అమ్మ కీవరీతు కాళ్లని చుట్టుకుని బావురుమంది.

''నాన్నా ... నేనీ మౌనం భరించలేను ... నాన్నా ... తట్టుకోలేను ...

ఇంత ముభావం . . . నేను . . . , ''

కీవరీతు ఏం మాట్లాడకుండా...కూతుర్ని లేవదీశాడు.

మాత్తుకుట్టి తోమాసు మేస్టరు దగ్గరికి వెళ్ళి— ''నువ్వూ ... వో పరువూ ప్రతిష్ఠ ఉన్న మొగవాడల్లే ప్రవర్తించావ్‌రా ? అసలు నా గుమ్మంలో అడుగుపెట్టేందుకు నీకెవరు అనుమతిచ్చార్రా ? నడు ... బయటకి ....'' అని గద్దించాడు.

''బాబయ్యా ! ఏమనకు ... ఏం మాట్లాడకు...ఊరుకో బాబయ్యా '' అంటూ కుయప్పి ముందుకువచ్చి హెచ్చరించాడు.

''మీరు తిట్టినా సరే — కొట్టినా సరే, చంపినా సరే, — నే కుట్టి అమ్మకోసం సర్వం సహించడానికి సంసిద్ధుణ్ణయ్యే వచ్చా ... బడినుంచి సరాసరి కుట్టి అమ్మను తీసుకుపోయిన మాట వాస్తవమే. జబ్బుగా ఉన్న మా అమ్మకు చూపిద్దామని తీసుకు వెళ్ళా. అంతేగానీ .... అంతకుమించి .... నేనేం ... అవివేకంగా ప్రవర్తించలేదు... కానీ ... ఒక్క మాట. మేము కలిసి జీవించడానికి నిశ్చయించుకున్నాం. అందుకు సమ్మతించి మమ్మాశీర్వదించమని వేడుకుంటున్నాం ... '' అన్నాడు తోమాసు మేస్టరు.

తర్వాత చాలా సేపటివరకు ఎవ్వరూ ఏం మాట్లాడలేదు. నిట్టూరుస్తూ ఉండి పోయారు ..

''ముందు తాతయ్యని క్షమార్పణ వేడుకోవే పో...'' అన్నాడు కొంత సేపయాక కీవరీతు.

కుట్టి అమ్మ మోకరిల్లికూర్చుంది తాతగారి పాదాలను ముద్దెట్టుకుంది. కన్నీటితో ఆ పాదాలను తడిపింది తర్వాత మొహంఎత్తి తాతగారివంక చూసింది.

''తాతయ్యా ! నా మనస్సు... నా అంతర్యం ... అందరికంటె నీకే ఎక్కువ తెలుసు. నేనేం కానిపని చెయ్యలేదు తాతయ్యా ! ఎగిరెగిరి అలసిపోయి, తిరిగి వచ్చేటప్పుడు ఎక్కడైనా వో చోట నిలిచి. విశ్రాంతి తీసుకుందుకు వోగూడు వెతుక్కున్నానంతే. గూడంటూ వెతుక్కోకపోతే, — దారిలోనే మాడి మశానమై పోవాల్సిందేగా మరి ? — '' అని అంటున్నప్పుడు ఆ పిల్లదాని ముఖంలో ఎన్ని భావాలు అలుము కున్నాయో అన్నిటిని ఆకళింపు చేసుకున్నాడు.

''కీవరీత్...'' అంటూ పిలిచాడు.

''ఏవిటి నాన్నా ! ''

''చుట్టపక్కాలని....బంధుమిత్రుల్ని అందర్ని పిలిపించు...అందరి సమక్షంలో ఈ పిల్లదాన్ని — ఆ మేస్టరుతో — సగౌరవంగా సాగనంపు...''

అనేసరికి — మాత్తుకుట్టి, — నవ్వుతూ హేళనగా .. ''ఇప్పుడు మనం సాగనంపడానికేముంది కనుక ? వాళ్ళ తిరుగుడంతా అయిందిగదా...'' అన్నాడు.

''నోరుముయ్యరా వెధవా ... అమ్మా ... వెళ్ళిరా తల్లీ!''

కుట్టి అమ్మ తండ్రితో వెళ్ళింది. తోమాసు మేస్టరు విడిగా టాక్సీలో వెళ్ళాడు. క్రమంగా పోగైన జనం ఎవరిదోవన వాళ్లు చక్కాబోయారు.

కుయెన్నాచ్చను మాత్రం అలాగే కూర్చుండి పోయాడు...ఏదో పెద్ద బరువైన వస్తువు మోస్తున్నట్టు...మనస్సెంతో బరువెక్కింది.

''అమ్మా! కాస్త అంబలి తెచ్చిపెట్టు తల్లీ!...'' అనడిగాడు.

''మందు వేసుకుంటారా మావయ్యా ?''

''ఊఁ.''

ఓ మాత్ర మింగి ... కాస్తంత అంబలి తాగాడు. హమ్మయ్య — అనుకున్నాడు కొంచెం సేపయినాక — నషా కొద్దిగా దిగింది ... ఆ బరువు తగ్గినట్టనిపించింది.

అప్పుడిక గడచిన సంఘటనలు మరింత స్పష్టంగా కళ్ళయెదటికి రాసాగాయి. కుట్టిఅమ్మ భయంభయంగా ఆ రావడం..., శరణు కోరుతున్నట్టు చూడటం..., ఏది ఏమైనా...ఇది కొంచెం అతి అనే చెప్పాలి తల్లీ! ముందుముందు నీకే నష్టం సుమా ? నీకు పుట్టబోయే సంతతికి కష్టం...

పొరుగింటి కోడి నీ యింటపడి గింజలు తినిపోయినా, పొరుగమ్మతో నువ్వెంత పోట్లాడకుండా సరిబెట్టుకుపోయినా గడసరి కనుకైతే ఆవిడేమంటుందో తెలుసా...?

నేను పెద్దలు చేసిన పెళ్ళిచేసుకుని అత్తవారింట కాపరం చెయ్యడానికి వచ్చిన దాన్ని గానీ ... ఎవరితోనూ లేచిపోయి వచ్చిన బాపతుగాను ... అని ఎత్తి పొడుస్తుంది.

'నీ కూతురు పెరిగి పెద్దదయిన తర్వాత ఎవరివంకయినా చూసి, కొంపదీసి నవ్విందనుకో'— నోటి దుడుసున్న మనిషెవతైనా కనిపెడితే— 'అతల్లి కూతురేగా,— ఎక్కడికి పోతాయి బుద్ధులు'— అని పుసిక్కిన అనేస్తుంది.

నీ పిల్లల పెళ్ళిప్రస్తావన వచ్చినప్పుడుగూడా— ఎవడో ఒకడు ఈ అపవాదుని తవ్వుకొస్తాడు.

నీ మనస్సెంత కొట్టుకుందో... కష్టపడిందో ఎవ్వరూ పట్టించుకోరు,

నువ్వు నియమంగా... పవిత్రంగా ఆ కట్టుకున్నవాడొక్కడితోనే కాలం గడిపావని ఏ వొక్కరూ గుర్తించరమ్మా !

ఈ ప్రపంచవైఖరే యింత తల్లీ !

లోకం ఏమన్నా అనుకోనీ..., నీ హృదయం మంచిది. అదే పదివేలు.

అయినా జీవితంలో ఏదో వో మచ్చంటూ లేనివారెవరుటలే ...

పాపం కీవరీతుకి యింతమాత్రం ఆలోచనే లేకపోయింది. నిజమే ... తన బాధ్యతని కొడుక్కి అప్పజెప్పడానికి వాడు చేతికింకా అక్కరకు రాలేదే ! నలుగురికి మొదట కొడుకులు పుట్టారు. పీడికి మాత్రం మొదట కూతుళ్ల పుట్టారు.

భగవదేచ్ఛ... ఏం చెబుతాం !

ఒక వృద్ధుడు తెల్లటి గెడ్డం మీసం.... దువ్వుకుంటూ ఎదురుగా నిలబడ్డాడు... నవ్వాడు.

ఏమాత్రం సంకోచం లేకుండా వచ్చి నా పక్కనున్న కుర్చీలో కూర్చున్నాడు.

'నాకు పన్నెండుమంది పిల్లలు.'

పన్నెండుగురా ? దజను... !

ఆఁ ... నీకు తెలుసుగా.... అందరిలోకి పెద్దవాడు రూబేను. కడగొట్టువాడు బనియామీను...

కుయెన్నాచ్చను ముక్కున వేసేసుకుని ... అరె... ఏవిటైతే... ఇశ్రాయేలీయుల పన్నెండు గోత్రాలకి తండ్రివైన యాకోబువా ?

ఆఁ ... ఆఁ ...

తమరింతకూ ఎక్కడనుండి దయచేసినట్టు ?

నిన్ను చూసిపోదామని వచ్చా... మూడుకాళ్ళ ముదుసలివి... ఇంత బలహీనంగా ఉన్న నువ్వు యింకా నీ పిల్లలకోసం— మనుమల కోసం... పడుతున్న తాపత్రయం... బాధ... చూశాను.

నా సంతానమంతా తలో రకమైన యాతనల్లోనూ ఉన్నారు తండ్రీ !

అయితే నువ్వేం చేయగలవ్ ? నువ్వు వట్టిచేతులతో యుద్ధరంగానికి వచ్చిన వాడివి గదా !

ఇంతకాలం నువ్వు శత్రువు చేతిలోంచి కత్తులు కటారులు లాక్కుని యుద్ధం చేశావ్... చావుదెబ్బలు తింటున్నా పడిపోకుండా పోరాడగలిగావ్. యిక యిప్పుడు నీ బిడ్డలు తెగబడి పోరుతారు... పోరు కొనసాగిస్తారు... శక్తి సామర్థ్యాలున్నవాడు

నిలబడతాడు. లేనివాడు నేలకూలుతాడు... ఇది జీవన సంగ్రామం... ఇలా కొన సాగుతూనే ఉంటుంది. అందువల్ల నీకెందుకొచ్చిన ఆరాటం ఇది ?

అయ్యా !

ఆదికాండము నలభై తొమ్మిదో అధ్యాయం నువ్వు చదవలా.... ? నా పన్నెండు గురు కొడుకులు పన్నెండు రకాలు. అందరిలోకి పెద్దవాడు రూబేను... నా శక్తి యొక్క ప్రథమ ఫలము కానీ అతగాడు నా మంచం మీదికెక్కి దాన్ని అపవిత్రం చేశాడు. ఆ కథ తెలుసా ?

ఆ.... తెలుసు.

రెండోవాడు షిమ్యోను, మూడు లేవీ. గొప్ప శౌర్యవంతులు. ముందూ వెనుకలు ఆలోచించకుండా పనంటూ వచ్చిందంటే ఉరికేవారు.

నాలుగోవాడు యూదా ... కొదమసింహము. యూదాకి నేను రాజదండం, రాజముద్రికను అప్పగించాను

జెబూలూను ఓడలకు నావికుడు.

ఇశ్శాఖారుకి శరీరబల మెక్కువ.

జేసనేమో అడ్డగాడిద... తెలివనేది శూన్యం. అయితే చాకిరీ చేయగలడు.

దాను నిజాయితీపరుడు. దోపిడిగాళ్ళచేత తన్నులు తినే రకం.

ఆషేరు రాజోచితమైన మధుర పదార్థాల్ని శ్రేష్ఠమైన ఆహారాన్ని భుజించే వాడు... ఈవిధంగా పన్నెండుమంది తమతమ శక్తి సామర్థ్యాలకి.... అభిరుచులకి అనుగుణంగా జీవించారు. పన్నెండు గోత్రాలు వెలిశాయి. ఆ గోత్రాలు నానాటికి అభివృద్ధిచెంది విస్తరించాయి ...

తమరు సెలవిచ్చినవన్నీ ఈ దాసుడికి తెలుసు మహానుభావా !

ఇంకేం అయితే సిద్ధంగా ఉండు ... నీకెందుకీ జంజాటం ? లోకంతో ... ఈ అనుబంధం... ?

సిద్ధంగానే ఉన్నాను.

ఓరి శుంఠా ! నువ్వెక్కడ సిద్ధంగా ఉన్నావ్‌రా ? నన్ను దగాచెయ్యడాని కంటున్నావ్‌గానీ... అంటూ ఆ ముసలివాడు దూదిపింజెల్లా ఉన్న గెడ్డం మీసం నిమురుకుంటూ చిరునవ్వు నవ్వాడు.

అరె... ఎవరది ? ఎవరో... ఫాదరీ వస్తున్నాడే ? కుయెన్నాచ్చను వెనక్కి

తిరిగి చూశాడు.

నా బావమరది కొడుకు వాడు ... పరమ నీచుడు. ఫాదరీ అనే పవిత్ర వస్త్రాన్ని కళంకితం చేసినవాడు. విధవరాలితో అక్రమ సంబంధం పెట్టుకుని బిడ్డని గన్న కిరాతకుడు.

అరె ... వాణ్ణసలు యిక్కడికి ఎందుకు రానిచ్చారు ? పోరా దగాకోరు ... ఫాదరీట... ఫాదరీ ..

ఒరే... కీవరీతూ... కుయుచ్చెరుక్కన్ ... అంతా రండిరా... ఈ ఛండాలుణ్ణి పట్టి కట్టిపడెయ్యండిరా .. మేలోర్ఘుత్తి కుయున్నైనా అంటే ఏమనుకున్నావ్‌రా... ?

ఫాదరు మొహంలో ఎప్పటిలాగే ఆ వెటకారపు నవ్వు... అది చూసి కోపం అణచుకోలేకపోయాడు కుయెన్నాచ్చను... చాచి లెంపకాయ కొట్టాడు ....

... అయ్యో .. ...

దీనామ్మ.... శాంతమ్మ ఒక్కపరుగున వచ్చారు. మంచంమీంచి కింద పడి పోయేవాడే... తల మంచం పట్టెమీద... కాళ్ళు రెండూ నేలమీద పడున్నాయి... పట్టి లేవదీసి మంచంమీద పడుకోబెట్టారు.

''మావయ్యా... ఏవిటి... ?''

... ... ...

''తాతయ్యా !''

''ఆఁ ...''

''కలొచ్చిందా ?''

''ఉహుఁ ... ఆ కార్తికపల్లి ఫాదరు ఇక్కడికొచ్చినట్టున్నాడే ... ... ఏడీ... ?''

''ఇక్కడికే ఫాదరీ రాలేదు .... పురోహితుడూ రాలేదు ... మీరు కలగన్నట్టున్నారు...'' అంది దీనామ్మ.

# పది

మాత్తుకుట్టి దీనామ్మని గట్టిగా జుట్టుపట్టుకుని ఊపేస్తూ ''తుచ్ఛురాలా ! చెప్పు... నాకు చెప్పకుండా ఎవరో దబ్బిస్తే పుచ్చుకుంటావ్‌టే....'' అని గద్దించాడు.

"నేనెవరి దగ్గరా డబ్బు తీసుకోలా''— అంది దీనామ్మ తొణక్కుండా, బెణక్కుండా.

''అయితే నీ బట్టలపెట్టెలో డబ్బు— ఎక్కణ్ణించి వచ్చిందే ?''

''మావయ్యే కోసం దానికుట్టి యిచ్చాడు. నేనది దాచి ఉంచానని చెపుతున్నాగా... ?''

''అదిగాక చెపుతున్నావ్... అసలు నే రాగానే ఎందుకు చెప్పలేదూ అంట ?''

దీనామ్మకి అప్పుడిక ఏం జవాబు చెప్పాలో తోచలేదు. విషయం యింతదాకా వస్తుందని తను ఊహించనూలేదు. ఎప్పుడైనా డబ్బుయిబ్బంది వస్తే— పెట్టెలోంచి తీసియిచ్చి— ఆశ్చర్య చకితుల్ని చేయాలనుకుందే కానీ...

మాత్తుకుట్టి కోపంతో ఊగిపోతున్నాడు. ఇంతకంటె అవమానం ఏం కావాలి ? గొంతు నులిమేద్దామన్నంత కోపం వచ్చింది.

కుయెన్నాచ్చనుకి కాళ్ళూ చేతులూ ఆడలా. మంచంమీద అమాంతం లేచి కూర్చున్నాడు.

ఎంతగానో చెప్పాడు..., దీనామ్మ తప్పేం లేదని మొత్తుకున్నాడు. దాన్ని కేకలెయ్యకుమని గోలెత్తాడు.

''ఊరుకోవయ్యా ... నా ..., ఎందుకు ...? తొంభైయేళ్ళొచ్చాయి ... జ్ఞానం ఉంటేగా ?... బొత్తిగా అపకతవకం..., ఇదుగోనేవ్... నేసడిగినదానికి ముందు జవాబు చెప్పు...''

ఆఖరికి చెయిచేసుకుంటాడేమో అన్నంతవరకూ వచ్చింది. అంతవరకు తలుపు చాటునుంచి చూస్తున్న శాంతమ్మ ఇవతలకు వచ్చి ...'' అయ్యోయ్యో ... ఊరుకోండి అత్తయ్యనేం అనకండి ... ఆవిడేపాపం ఎరగదు. కల్లువిలావాళ్ళ దానికుట్టి తాతగారికోసమని డబ్బిచ్చాడు. అత్తయ్యని ఆ డబ్బు దాచి ఉంచమంటే ఉంచిందంతే ... అప్పుడు నేనూ ఉన్నాను'' ... అంటూ జంకూ గొంకూ లేకుండా చెప్పేసింది.

మాత్తుకుట్టి కొడదామని ఎత్తిన చెయ్యి వెనక్కితీసుకున్నాడు. ఇంటికోడలై వచ్చాక ... అంతవరకు ఎన్నడూ వంచిన తలయెత్తిగానీ ... అంత బిగ్గరగా మాటాడిగానీ ఎరగదు శాంతమ్మ — అటువంటిది ...

''అయితే ఆమాట నాతో చెప్పక్కర్లేదా అంటా ?''

నిజమే ... చెప్పకపోవడమన్నది పెద్దతప్పే ... ఏదో చాలా అపసరమొస్తే

ఇవ్వాలనుకుని భద్రంగా ఉంచానే కానీ ... అనుకుంది దీనామ్మ.

మాత్తుకుట్టి జుట్టు విడిచిపెట్టాడు నాలుగడుగులు వెనక్కి వేశాడు. అంతకంటె ఏవిటి చెయ్యడం? అంతవరకు భార్య వొంటిమీద దెబ్బవేసి ఎరగడు.

ఎంతో పెద్ద తట్టుకోలేనంత యిబ్బందులు వచ్చిపడినాకూడా డబ్బునిమిత్తమై ఎన్నడూ కీచులాడుకోలేదు.

ఇంటికి కావలసిన వస్తుసామగ్రులన్నీ తెచ్చుకోవడం — అమర్చుకోవడం .... అన్నీ తనే చేస్తుంది దీనామ్మ. అటువంటిది ఈ విషయంలో యింత తెలివి తక్కువగా ఎందుకు ప్రవర్తించినట్టు ... అన్నదే మాత్తుకుట్టి ప్రశ్న.

"ఏం చెయ్యన్నా! నా కొడుకులు నాకు నాలుగు డబ్బులిస్తే, ఈ రభసేం లేకుండా ఉండేదిగా మరి ..." అన్నాడు కుయెన్నాచ్చను.

"ఎందుకివ్వరూ ...? నిక్షేపంలా యిస్తారు ... అడ్డమైనవాళ్ళదగ్గరా తీసుకుంటే ఏమన్నా బావుంటుందా? నడి వీధిలో ఎంత ఛండాలంగా చెప్పకుంటున్నారో ... నువ్వు వింటే తెలుస్తుంది. వాళ్ల తమ సంపాదనంతా తెచ్చి మనయెదాన పోస్తున్నారట. మనం తింటున్నాంట ... పరువు తియ్యడానికి ఈ కూతలు చాలవ్?"

"అవి ... నరంలేని నాలుకలు. ఎటుబడితే అటు తిరుగుతాయ్. కన్న తల్లిదండ్రులకే ఎక్కడా గతీమోక్షం లేదుటగానీ ..."

"అని యిక్కడ కూర్చుని చెబితే యేం లాభం? ఔను ... కుర్రాడు యిచ్చాడు ... మీరు పుచ్చుకున్నారు బాగానే ఉంది. కానీ ... మళ్ళీ తిప్పి ఎందుకిచ్చినట్టు?"

"నే చెప్పబట్టే యిచ్చింలేరా ... తండ్రీ! పోలీసువాళ్లు వాణ్ణి అదే — దాని గాణ్ణి ఖైదుచేసి పట్టుకు పోతునప్పుడు — కుయుచ్చెరుక్కను ఈ పంచలోపడి హాహాబే ఏడుపు ... వాడి ఏడుపు చూడలేకపోయినారా ... ఏవిటో జాలేసింది. అందుకే ఇచ్చి పంపా ..." అన్నాడు కుయెన్నాచ్చను.

"మీ జాలి — దయే అందర్ని అధోగతికి తెచ్చాయి. ఏమీకాదు ... ఎవర్నీ అనవలసిన పనిలేదు. ఇంతకూ నా ఖర్మ ... నా గ్రహచారం ... అగచాట్లు పడటంకోసం పుట్టినదాన్ని ... నేను ..." అంది దీనామ్మ.

"అమ్మా దీనామ్మా దురదృష్టవంతుణ్ణి నేనుతల్లీ! నా పొరబాటు వల్లనే అహర్నిశలు ... యిల్లు చక్కదిద్దుకునే నీ బోటి దానికి అపనింద వచ్చిపడిందిగదా ...

నే చేసిన పాపాలకి ఆ భగవంతుడు నన్ను శిక్షిస్తాడులేమ్మా! వెనకటికీ యోబు — నా ఘనతను కొట్టివేశాడు. తలమీద నుంచి నా కిరీటాన్ని తీసివేశాడు. చెట్టును పెల్లగించునట్టు నా నిరీక్షణాధారాన్ని ఆయన పెల్లగించేశాడు. నా ప్రాణ స్నేహితులు నాకు పరాయి వాళ్ళయినారు. నా యింట ఉండే జనం దృష్టికి నేను పరదేశినై ఉన్నా'' నని విలపించాడు.

"ఊరుకోండి మావయ్యా.''

తల్లి గద్దింపువిని మూగబోయిన బిడ్డల్లే ... దీనామ్మ చెప్పగానే కుయెన్నాచ్చను ... మెదలకుండా - సద్దుగా ఊరుకున్నాడు. బెదురు బెదురుగా చుట్టూ చూశాడు.

మాత్తుకుట్టి అన్నట్టు వొంటిమీద స్పృహలేకుండా ఉన్నాడా ?

మనోబలం మటుమాయమైందా ?

పోరంబోకు స్థలాల్ని ఎవరుబడితేవాళ్లు ఆక్రమించుకున్నట్టు, - అందరికి లోకువై పోయినట్టు అనిపించింది.

మనవాడే మన కొంప దీశాడన్న సామెతగా ... అందరూ తనకే ఎసరు పెట్టే వాళ్లు తయారయ్యారు ... ''ఇక ముందు నా అనుమతి లేకుండా ఎవరైనా సరే ఈ గడపలో కాలుపెడితే మాత్రం ఊరుకోను చెబుతున్నా ...'' అంటూ మాత్తుకుట్టి బయలుదేరి వెళ్ళిపోయాడు ... మొత్తంమీద — ఇదీ విషయం — అని తేల్చుకున్నాకనే వెళ్ళాడు.

దీనామ్మకి పొరబాటు చేశాననిపించింది. అయితే తెలిసి కావాలని చేసింది కాదు. కానీ ఎంతైనా ... పొరబాటు పొరబాటేగదా ...! ఏ మొగవాడు దీన్ని సహించడు. అనుకోకుండా అయిదువందలు చేతికో పడ్డాయంటే — కుయుచ్చెరుక్కన్‌కి ఆశ్చర్యంగానే అనిపించింది.

ఓ రెండు రోజులు పోయాక ఆడవాళ్లు చెవులుకొరుక్కోడం మొదలెట్టారు ... ఏమో అయిదు వందలనే ... ఎట్టా ? వెయ్యే యిచ్చాడేమో ? ఎవరికి తెలుసు ? ఇప్పటికిలా ఎన్నిసార్లు కట్టబెట్టాడో ... అంటూ ఒకటే ... చెప్పుకోవడాలు ... గుసగుసలూను.

విషయం ప్రశుతిమించుతూందనిపించింది ... దీనామ్మకు. కుండబద్దలుకొట్టి నిజం బయట పెట్టాల్సిందే ననుకుంది. లేకపోతే అదే మనసులో తొలుస్తూ ఉంటుందనిపించింది ... అనిపించి దీనామ్మ తిన్నగా కల్లువిలా వాళ్ళింటికి వెళ్ళింది.

దీనామ్మని చూడగానే శేశమ్మకి ఆవిడ కూతురు చెల్లమ్మకీ మొహం చేటంత యింది.

జరిగిన విషయమంతా దీనామ్మ ఏకరువు పెడుతూంటే, తల్లీ కూతుళ్ళ మొహా ల్లో ఎక్కడ లేని యెద్దేవా – హేళన తొణికిస లాడింది.

''నిజం చెబుతున్నా సక్క య్యా ! తాతయ్యా ! అనుకుంటూ అర్ధరాత్రప్పుడు వచ్చాడు దానిపుట్టి, అప్పటికి నేను నిద్రపోతున్నా. ఏదో పిలుపు వినిపించి లేచా. వెళ్ళిచూశా ... కానీ ... ఎవరో అనుకున్నాగాని ... గుర్తుపట్టలేక పోయినా.'' ''గుర్తు పట్టలేకపోయావా వాణ్ణి ? అదేవిటి పిచ్చి ... నువ్వు దానిపుట్టిని ఎప్పుడూ చూడలా ....'' అనడిగింది చెల్లమ్మ.

''అదిగాదే చెల్లమ్మా. మూడు నాలుగేళ్ళ తర్వాత వాణ్ణి మళ్ళా అదే చూడటం ...'' అంది దీనామ్మ సమాధానంగా.

''ఇంకా నయం ... పోయిన సారిగూడా వాడక్కడికి వచ్చేవెళ్ళాడు – గాదే — దీనా'' అని రెట్టించింది శేశామ్మ.

''ఎవరు ... ? దానిపుట్టా ?''

''వెడితే యేం లే ... వరాయి యిల్లేం కాయినా ..., అదికాదు ... ఇంత మాత్రానికి అబద్ధమూడాలా చెప్పు ?''

''నేనేం అబద్ధం ఆడటం లేదు ... అబద్ధం చెప్పవలసినంత అగత్యం అంత కంటె లేదు ...'' అంది దీనామ్మ ఉండబట్టలేక.

''అగత్యం నీకు లేకపోవడమేంటి ? నువ్వుపైకి చెప్పినంత మాత్రాన అంతా నమ్మేతారనుకోకే.. ఇంట్లోకి పిలుచుకుపోయి ఎంత పడేసి లాక్కున్నారో...?''

''ఆ పనులు మీరు చేసేవి...'' అని మాటకి మాట జవాబు చెప్పింది దీనామ్మ.

''ఛి...పోవే...పో ఉచ్చనీచాలు లేనిదానివి...నువ్వూ....'' తర్వాత అన్నదీ- విన్నదీ ఏమీ గుర్తులేదు దీనామ్మకి .... గాని ... అడగదల్చుకుందేదో అడిగి మరీ వచ్చింది ... లేకపోతే ...

అంత రాద్ధాంతం చేస్తే ఎలా ఊరుకోవడం ?

ఇంటికి తిరిగి వచ్చేసింది ... ఎంతో దుఃఖంతో పూడుకు పోయిన గొంతుతో జరిగిందంతా మొగుడితో ఏకరువు పెట్టింది దీనామ్మ.

కుయెన్నాచ్చన ఆ గొడవంతా విని ... విస్తు పోయాడు. ఏవిటో ఏకేలు –

కాకీలు వొదులై పోయినట్టనిపించింది.

''అమ్మా ! బెత్తం చేతికిచ్చి బాదించుకున్నట్టయింది తల్లీ !'' అన్నాడు కుయె న్నాచ్చను బాధపడుతూ ...

అన్నీ సహిస్తాం గానీ ... ముందు సిసిలీ వాళ్ళ నాన్నకు ఈ విషయం తెలిస్తే బతకనీయరే ... నాకు ఈ మూకమధ్య బొత్తిగా స్థిమితం లేకుండా పోయింది .... అనుకుంది. ఆ రోజు సాయంత్రం మాత్తుకుట్టి రాగానే అంతా పూసగుచ్చినట్టు చెప్పా లనుకుంది. కానీ...ఎలా సాధ్యం... ? ఇంటిపట్టున వో గడియసేపయినా ఉంటేనా.... చెప్పడానికి ? పోనీ వచ్చినా ఎప్పుడూ నలుగురు భట్రాజులు కూడా ఉంటారుగదా .... ఎక్కడికి వెళ్ళినా ఆ నలుగురైదుగురు కూడా ఉంటారు.

రాజన్ అన్నట్టు కర్రపెత్తనంచేస్తూ తిరుగుతూంటారుగా మరి. ఎర్నాకుళమో... లేకపోతే ఏ తిరువనంతపురమో వెళ్ళవలసి వస్తే బట్టలు మార్చుకునేందుకని—యింటికి రావడమేగానీ..., వచ్చినాయెంత—ఓ అరగడియ ఉండటం గగనం...ఆ కాసేపట్లో యీ కథ కమామిషంతా చెప్పడానికి కుదురుతుందా ? అనుకుంది దీనామ్మ.

"ఇదో గుణపాఠమనుకో అత్తయ్యా ... అయిపోయినదాన్ని గురించి యిప్పుడు పశ్చాత్తాప పడినా ప్రయోజనం లేదు. మనస్సు చిన్నబుచ్చుకునీ లాభంలేదు ... ఎవరే మన్నా అనుకోనీ ... పాపం పుణ్యం భగవంతుడికి తెలుసు...'' అంది శాంతమ్మ.

''అయినా ఏమీ ఎరక్కుండా చెయ్యకుండానే యింతటి అపవాదు భరించాలిసి వచ్చిందిగదా తల్లీ !''

''ఏ పాపం ఎరగని వాళ్ళకుకూడా ఒక్కొక్కప్పుడు ఇంతకంటె పెద్దపెద్ద అవమానాలు సహించాలిసి వస్తుందత్తయ్యా ! అయితే ..., ఏదీ తనదాకా వస్తేగానీ తెలీదనుకో...'' అంది శాంతమ్మ.

శాంతమ్మ మాటల్లో ఉన్న అంతరార్థాన్ని దీనామ్మ గ్రహించక పోలేదు. అయిన ప్పటికి ఏం మాట్లాడలేదు. పోయి మంచంమీద పడుకుంది. ఎంతో జాగ్రత్తగా జీవితం వెళ్ళబుచ్చుదామనుకున్నా ..., ఎదురు చూడని అగాధంలోపడి చిక్కుకోవడం జరుగు తూంటుంది .. ప్చ్ ... దానికుట్టి యిచ్చిన డబ్బు తీసుకుంటున్నప్పుడు ... తరువాత ఈ డబ్బు యింతటి ఉపద్రవాన్ని తెచ్చిపెడుతుందని కలలోగూడా అనుకోలేదు సుమా! ఇబ్బందులు కొంతవరకు సర్దుకోవచ్చులెమ్మని రవంత నిబ్బరం కలిగింది.

నూనె...నలుగుపిండి...నల్లమందు వగైరాలకోసం ఎవర్ని దేహీ అనక్కర్లేదు...

యాతన పడక్కర్లేదు లెమ్మనుకున్నాగానీ ...

అనుకున్నదొకటి ... అయిందొకటీను.

నిజమే ..., ఆ కల్లువిలా ఆవిడ చేసిన ఆరోపణ విన్నవాళ్ళంతా నమ్మడానికి గూడా అవకాశముంది.

అయిదువందలే యిచ్చాడంటున్నారు గానీ ... అందుకు సాక్ష్యం ఏముంది ?... దానికుట్టి ఒక్కసారే వచ్చాడన్నారు...అందుకు ప్రమాణమేముంది ... ? అంటూ పరి పరి విధాల ఆలోచిస్తూ కూర్చుంది దీనామ్మ.

శాంతమ్మ చిన్నారి సిసిలీకి నీళ్లుపోసింది. టిఫిను కాఫీ యిచ్చింది. ఉతికిన బట్టలు తొడిగి బడికి పంపింది. పొయ్యిమీద కాగుతున్న అంబలిని వేళకు దించిపెట్టింది. మావిడికాయ పచ్చడి చేసింది. అప్పడాలు వేయించింది. తాతగారికి మొహం కడుక్కోవడానికి నీళ్లు పట్టుకుపోయి పెట్టింది ... లేపదీసి కూర్చోపెట్టింది. రోజూలాగానే ఈ పనులన్నీ అయిన తర్వాత, అత్తగారి దగ్గరికి వెళ్ళి — తాతగారికి అంబలి ఇవ్వత్తయ్యా అంది.

''నా వల్లకాదు .... , తాతగారికిచ్చి, — నువ్వుగూడా తాగు'' అని చెప్పింది దీనామ్మ.

''ఉహుఁ ... నువ్వే లే అత్తయ్యా ... తాతగారి మనస్సు ఇప్పటికే ఎంతో బాధపడి ఉంది ... మరింత బాధించడం దేనికి ? ...'' అంటూ బ్రతిమాలి బలవంతం చేయగా దీనామ్మ లేచి కాళ్లుచేతులు కడుక్కొని వంటింట్లోకిపోయి అంబలితెచ్చి అందరికి యిచ్చింది.

శాంతమ్మ అంబలి తీసుకుని కుయెన్నాచ్చను దగ్గరికి వెళ్ళింది. అప్పుడు ఆయన మంచంమీద పడుకుని ఉన్నాడు. అకస్మాత్తుగా ఏదో దెబ్బతిన్నట్టు ... ముఖం విచారంగా ఉంది ...

''తాతయ్యా !''

''ఉఁ ...''

''అంబలి తాగుదురుగాని లేవండి...''

''వాణ్ణి రానీ తల్లీ !''

''ఎవర్ని ?''

''అబ్బాయిని ... వాడు .... పరగడుపున వెళ్ళిన వాడుగదా...!''

శాంతమ్మ అలా దిగాలుపడి చూస్తూ నిలుచుంది.

కుయహమ్మదు రావుత్తరు, — పోయిన పదహారో తేదీన కొల్లకటవునుంచి ఆ మచ్చల ఎద్దుని తోలుకుపోయాడు ... ఇంతవరకు దాని తాలూకు పైకం ఇంకా ఇవ్వనే లేదుగదా... అనుకున్నాడు.

''తాతయ్యా ! ''

బందాల్లో చిక్కిన ముసలిగొడ్డు దెబ్బతిన్నప్పుడు తెంచుకుని పారిపోవాలనుకుని ప్రయత్నించి, — వోడిపోయినట్టు, వందమైళ్లు పరిగెత్తి అలసిపోయినంతగా రొప్పుతూ- చెమటతో తడిసి ముద్దయి — ఎంతో దైన్యంగా చూస్తూ పడి ఉన్న కుయొన్నాచ్చన్ని చూస్తే శాంతమ్మకి హడలెత్తిపోయింది.

''తాతయ్యా ! ''

కుయెన్నాచ్చను కళ్ళవెంట.... పిడుగులు మబ్బులు లేకుండా కురిసే వర్షపాతం లాగా ఏకధారగా కన్నీళ్లు కారిపోతున్నాయి. ఒక్కసారి కళ్లు రెండూ గట్టిగా మూసుకున్నాడు.

''అత్తయ్యా ... అయ్యో ... చూడండి ... '' అంటూ శాంతమ్మ కెవ్వున కేక పెట్టింది.

దీనామ్మ ఒక్క పరుగున వచ్చింది.

''మావయ్యా ! ''

''తాతయ్యా ! ''

కదలడం లేదు ... ! బహుశా మైకమేమో ! కళ్లు తెరవాలని ప్రయత్నిస్తూనే ఉన్నాడు కానీ తెరవలేక పోతున్నాడు ఏదో చెప్పాలని ఆరాటపడుతున్నాడు...కానీ... చెప్పలేక పోతున్నాడు.

హే ప్రభో .. ఇదెక్కడి పరీక్ష ... అని దీనామ్మ తనలో అనుకుంది.

ఓ క్రమానికి కుయెన్నాచ్చను కళ్లు తెరిచాడు ... అప్పుడే నిద్ర మేలుకువ వచ్చినట్టు...

''ఒంట్లో బాగాలేదా మావయ్యా ? ''

''అదేం లేదమ్మా ! ''

''ఏం లేదో ... మరైతే యింతకుముందు ఏవేమిటో గొణుగుతున్నారేవిటి ? ''

''ఆఁ ? ''

"ఉన్న ఈ వొడిదుడుకులు చాలక తాతయ్యా! మీరుగూడా మమ్మల్ని కంగారు పెట్టేస్తే ఎలా చెప్పండి ... " అంది శాంతమ్మ.

... ... ...

"పోనీ, అంబలి తెచ్చిపెట్టనా ?"

"ఊఁ ... "

ఎంతో యిష్టంగానే అంబలి తాగాడు...గానీ....నాలుగు చెమ్చాలుకంటె ఎక్కువ తాగలేక పోయాడు. ఆ కాస్తన్నా తాగాక చెమటలు తగ్గాయి. అలసిపోయినట్టు మంచం మీద వాలాడు. దీనామ్మ — శాంతమ్మ, కుయెన్నాచ్చనుకి – పచ్చ శాలువాకప్పి వంటింట్లోకి చక్కాబోయారు

"ఆయనకి మనోవ్యధ ఎక్కువైపోయింది ... తట్టుకునే శక్తి సన్నగిల్లి పోయింది..." అంది దీనామ్మ.

మధ్యాహ్నమప్పుడు — శివరాం కురుప్,— కుయెన్నాచ్చను కబుర్లు చెప్పుకుంటూ ఉండగా,— ఇద్దరు మనుషులు గడపలోకి వచ్చారు ... వారిలో ఒకరు — కార్తికప్పల్లి ఫాదరు – రెండో వ్యక్తి శాంతమ్మ తల్లీను.

రండి .... ఫాదర్ ... రండి ... చూసి చాలాకాలమైంది ... అంటూ కురుప్ పలకరింపు విని దీనామ్మ ఎవరా అనుకుంటూ ఇవతలకి వచ్చింది. వచ్చి — చూసి విస్తుబోయింది ... ఆవిడకు కాళ్ళుచేతులు చల్లబడ్డాయి. ఇద్దరూ కలిసివచ్చారు ... వో సిగ్గూ లేదు ... వో బిడియమూ లేదు...

నాలుగైదు నెలల్రకితం ఫాదర్ని చూసింది. పెళ్ళి శుభలేఖ యిచ్చేందుకు వెళ్ళినప్పుడు — ఫాదరింటికి వెళ్ళలేదు గానీ ... వాళ్ళపక్కనున్న అక్కగారింటికి వెళ్ళి — వాళ్ళని పిలిచి వచ్చింది దీనామ్మ.

ఫాదరింటికి పోరాదని...యింట్లో వాళ్ళు కట్టడం చేశారు.

అల్లా జరగబట్టే తర్వాత ... ఎన్నెన్నో గూటింపులూ — సూటీ పోటీలు పడాల్సి వచ్చింది...

అందుకని ... కురుప్ రమ్మని ఆహ్వానిస్తూంటే ఫాదరు జవాబుగా, లేని, — వో చిరునవ్వు నవ్వాడు.

లోపలికి వచ్చాడు కుయెన్నాచ్చను మంచం దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. ఆయన వంక రెప్పవాల్చకుండా కొంతసేపు చూశాడు...దీర్ఘంగా నిట్టూర్చాడు.

శాంతమ్మ తల్లిగూడా చేరువనే నిలబడింది.

"కుయెన్నామాప్పిళ్ళాకు ఇవాళ కొంచెం బలహీనం ఎక్కువగాఉంది...నీరసాన ఉన్నాడు..." అన్నాడు కురుప్.

"నన్ను గుర్తు పట్టలేదా మావయ్యా ?"

"ఎవరు ? "

ఫాదరేం పలకలేదు. "కార్తికప్పల్లి ఫాదరు మావయ్యా" అంటూ దీనామ్మ బదులు చెప్పింది.

"ఎప్పుడొచ్చారు ? "

"ఇప్పుడే వచ్చా మావయ్యా ! "

"ఈ మధ్య యిక్కడ ఉండటం లేదా యేం ? "

"ఉండక ? భయపడి ఎక్కడికైనా పారిపోయాననుకున్నారా ? ..." అంటున్నప్పుడు ఆ గొంతులో విషాదం ఉన్నా ...., ఫాదరు తన సహజ ధోరణిలో చుట్టేడు గళ్ళా మార్మోగేటట్టు నవ్వాడు.

"ఆ రెండోవారెవరు ?"

"శాంతమ్మ తల్లి."

"అప్పుడే అనుకున్నా... చాలా సంతోషం..." అన్నాడు కురుప్.

"వీరు... మావయ్య స్నేహితులు కురుప్ ..." అని పరిచయం చేసింది దీనామ్మ.

"దీనామ్మా ! అమ్మాయి యేదీ ?"

"స్నానానికి రేవుకి వెళ్ళింది."

"ఏవిటి... యింత మిట్టమధ్యాహ్నం వేళప్పుడు..." అంటూ శాంతమ్మ తల్లి కొంచెం ఆత్రంగానే అడిగింది.

"ఆఁ ... బట్టలు ఉతుక్కువద్దామని వెళ్ళింది... వెంట మనుషులున్నారు...," అంది దీనామ్మ.

"భయమేం లేదు లేండమ్మా...ఈ యిలాకా మొత్తం కుయెన్నామాప్పిళ్ల చుట్టాలే లెండి..." అన్నాడు దీనామ్మకి వత్తాసుగా కురుప్.

" మావయ్యకు రోజురోజుకీ నీరసం ఎక్కువవుతూండి. ఎంత బలహీనమో..., "

''బలహీనమా ?''

''ఆ... మరే...''

''దీనామ్మా మావయ్యంటే ఎప్పటివాడని నీ ఉద్దేశం... అది పండిన పండు... రాలడానికి సిద్ధంగాఉంది ... ఏమంటారు కురుప్... నేనన్నది యథార్థమేనంటారా...'' అన్నాడు ఫాదరు.

''ఆహాహా... ఎంతటి వేదాంతం... ఎంతగొప్ప తత్వం... ! ఒక్కముక్కలో చెప్పేశారు మీరు... ఫాదర్... అసలు మా కుయెన్నామాప్పిళ్ళతో పరిచయమంటూ కావాలిగానీ,— అయితే మాత్రం క్రైస్తవ ధర్మాన్ని నమ్మనివాళ్ళంటూ ఉండరని నా ఉద్దేశం...'' అన్నాడు కురుప్.

కుయెన్నాచ్చను ధ్యాస ఎక్కడో ఉంది.

''అయితే ఒకటి...''

''ఏవిటది ?''

''దుష్టులే గెలుస్తారు... వాళ్ళ బలమే పెరుగుతుంది. భగవంతుడు వాళ్ళని దండించడు. ఎందువల్ల... ?'' యోబు అడిగినట్టు ఎందువల్ల— అనడిగాడు కుయెన్నాచ్చను.

''అదా... , అంటే అందుకు ఆ గ్రంథంలోనే సమాధానం చెప్పారుగా... దేవుడు మనిషిచేసే తప్పుడు పనులకి ఫలితం వాళ్ళవాళ్ళ సంతానానికి ముట్టచెపుతాడట... అంటే పెద్దలుచేసే పాపాలు వాళ్ళ పిల్లల్ని పట్టుకుని పీకుతాతింటాయి... మావయ్యా'' అన్నాడు ఫాదరు.

''యెహోవా మోషేతో— నువ్వు అహరోను కొడుకుల్ని పురోహితులుగా నియమించడానికి అభిషేక తైలముపూసి— దీక్షా వస్త్రధారణ చేయించేందుకు మునుపు,— వారు కన్నెపిల్లల్నే వివాహమాడాలని, వితంతువుల్ని, భర్తృ పరిత్యక్తలని, వేశ్యలని, చెడునడతగల స్త్రీలతో చరించరాదని కట్టడి చేయాలి సుమా — అన్నాడు.''

''ఔను నిజమే... కానీ మీరీమాట యిప్పుడెందుకు ఎత్తిచెబుతున్నట్టు ?''

''కారణమా ?''

''ఔను.''

''ఊరుకోండి మావయ్యా ! మీరేం మాట్లాడుతున్నారో తెలుస్తూందా ?'' అంటూ తత్తర బిత్తరలాడుతూ అడిగింది దీనామ్మ.

''మధ్య నీకెందుకమ్మా జంకు? మావయ్య మతిలేక అనేమాటే అనుకో... పోనీ నే విన్నందువల్ల వచ్చిన నష్టమేం లేదుగదా'' అన్నాడు ఫాదరు.

అయినా దీనామ్మకి ఆందోళనగానే ఉంది.

''సరే,— కురుప్‌జీ నువ్వికపోయిరావయ్యా!'' అన్నాడు కుయెన్నాచ్చను.

ఫాదరు మాత్రం ఏమాత్రం వెనక్కి తగ్గదల్చుకోలేదు... అన్నాడుగదా— ''అదేం... కురుప్‌జీ ఉంటే అడ్డమేముంది? ఉండనీండి. నేను మిమ్మల్ని కొన్ని విషయాలు అడగదల్చుకున్నాను. అటువంటప్పుడు మీ ఆప్తమిత్రుడైన కురుప్‌జీగూడా వినడం ఉత్తమం.''

''దీనామ్మా నువ్వేం కంగారు పడకమ్మా... ఇది మా మేనత్త అత్తవారిల్లు...''

అన్నప్పటికీగూడా దీనామ్మ వారించాలనే ఎంతో ప్రయత్నించింది.

''ఔను మీ మేనత్తగారిల్లన్న సంగతి నాకూ తెలుసు... కానీ... మావయ్యకు మతిలేదు... ఏవేవో నోటికొచ్చినవి మాట్లాడుతూంటారు. అందుకు మీరేం తప్పుపట్టుకో వద్దంటూ'' బ్రతిమాలుతున్నట్టు చెప్పింది.

''అంతేగదా విషయం... మతిలేనిది మావయ్య ఒక్కడికేగదా! మీ ఆయనకి,- ఆయనగారి అన్నదమ్ములకి మతి తిన్నగానే ఉందిగదా...! అహఁ... అంతేకాదు... నీ మాటలు... నీ చేతలు మాత్రం బావున్నాయా అని...'' అనడిగాడు

దీనామ్మకి ఆ మాటలకి బదులుపలికే స్తోమత లేకపోయింది. కనీసం శాంతమ్మ తల్లివైపు తలెత్తి చూసేందుకుకూడా నిబ్బరం లేకపోయింది. ఆవిడ చూపుల్లో ఎంతటి ధీమా కనబడుతూందని ?

''మా మేనత్త మనవడికి పెళ్ళయింది. ఆ పెళ్ళికి సంబంధం తెచ్చిపెట్టినవాణ్ణి నేను. అటువంటప్పుడు నాకే పెళ్ళి శుభలేఖ యివ్వకపోవడంలో అర్థమేవిటో!''

దీనామ్మ కాలి బొటనవేలితో నేలమీద గీతలుగీస్తూ తలొంచుకుని నిలబడింది.

''ఇందుకు నువ్వేం చెబుతావ్ దీనామ్మా...''

''నే చెప్పేందుకేముందీ... పెళ్ళిపత్రికలు పంపడంలో నా పెత్తనమేముందీ... అది మొగవాళ్ళపని...''

''మరైతే మీ అక్కయ్యని పిల్లల్ని స్వయంగా నువ్వేవెళ్ళి పిలిచావ్‌గా... వాళ్ల యిల్లూ మాయింటి పక్కనేగదా... అంతదాకా రాగలిగిన దానివి...? సరే అదలా ఉండనీ... పోతే,— ఒక అక్కయ్యను పిలవగలిగిన దానివి... ఇంకో అక్కయ్యను

పిలవలేకపోవడ మేవిటో ... ?''

దీనామ్మ అందుకు ఏం మాట్లాడలేదు.

''చెప్పు... కారణం ఉందన్నమాటేగా ?''

''శుభలేఖలు పంపడంగానీ, పిలుపులుగానీ నా యిష్టప్రకారం చెయ్యనిస్తారా యేం ?''

''పోనీ నీ యిష్టానుసారం చెయ్యనేలేదనుకుందాం... కానీ.... ఎందుకు పిలవలేదన్నది నీకు తెలుసుగదా... ఆ కారణమేవిటో చెబుదూ విందాం...'

దీనామ్మది ఎటూకాని పరిస్థితి అయింది.

''జంకుతావెందుకు ? రోగం దాచి మందూమాకూ వాడినంత మాత్రాన ఆ రోగం బయటపడకపోదులే.''

''అయిందేదో అయింది... యిప్పుడు జరిగిపోయినదాన్ని తిరిగి తవ్వకునేం లాభంగానీ...''

"అసలు అయిందేవిటి ? ఏ అభం శుభం ఎరగని పిల్లది మీ కొంపకొచ్చి అవస్థ పడుతూంది... అంతే ..

తండ్రి మొహం చూడటానికి పెట్టిపుట్టని అభాగ్యురాలా చిన్నది... ఎలాగో తండ్రి రూపాన్ని మనసులో మలచుకుని,— ఆరాధించుకుంటూందిగదా... అటు వంటిది... ఈ పిల్లది మరొకడి సంతానమని... నీకూ నబీఎలీసాకు మల్లేనే ఆకాశవాణి చెప్పిందా ఏవిటి ? అసలీ విషయాలన్నీ మీకెవరు చెప్పారు ?''

''మీరు ధర్మ సంఘంనుంచి జనాన్ని రప్పించి ... వారందరితోను సలహాలు సంప్రదింపులు జరిపి... అంత రాద్ధాంతం చేస్తే మాకు తెలీకుండా పోతుందా ... ? బావుంది వరుస.''

అప్పుడిక మొట్టమొదటిసారిగా శాంతమ్మ తల్లి కల్పించుకుంది.

''నా చెడ్డతనాన్ని గురించి మీరేం దిగులుపడక్కర్లేదు ... బెంగ పెట్టుకోనూ అక్కర్లేదు. వయసులో ఉండగా వైధవ్యం వచ్చిన ఆడదాన్ని ఎంత తలొంచుకు పోతున్నా, ఎంత కట్టుదిట్టంగా ఉన్నా, బతకనీయరుగదా ! ఎంత మంచిగా నడుచుకున్నా... ఈ మానవసమాజం వేసే అపనిందలకు గురికావలిసినదే... ఇది నా స్వానుభవంతో అంటున్న మాట.... పోన్లే... ఎవరెన్ననుకుంటే నాకేవిటి లెక్క ? అన్నీ చూసి కనిపెట్టేవాడు ఆ పరాత్పరుడే... వాడు గుర్తిస్తే చాలు, నా బిడ్డని,— నేను- ఎంతో

జాగ్రత్తగా అనుపు అజ్ఞలతో పెంచుకున్నా. ఎండకన్నెరగదు... నిప్పులాటి పిల్ల... దాని మనసు నొప్పించినవాళ్ళకే పాపం. ఈ లేనిపోని మాటలన్నీ విని నా బిడ్డ అవమానం భరించలేక ఏ ఆత్మహత్యకైనా పాల్పడితే ఏంకాను ?...'' అని నిగ్గదీసి అడిగింది.

''అమ్మా నన్ను ఫాదరు ఉండమంటే ...ఇక్కడున్నా ..మీ కుటుంబ వ్యవహారాలు — వ్యక్తిగత విషయాల్ని గురించి మీరు చర్చించుకుంటున్నప్పుడు ... నాకేం జోక్యం లేదనుకోండి . అయితే నేనింతవరకు విన్నదాన్ని ఆధారంగా చేసుకుని జరిగిందంతా తప్పు పొరబాటు — అని మాత్రం చెప్పగలను. ఇంకొకమాట — ఈ విషయంలో సిసిలీ తల్లికిగానీ, కుయెన్నాచ్చనుకిగానీ ఏ మాత్రం సంబంధం లేదనిగూడా రూఢిగా తెలుస్తూంది — '' అన్నాడు కురుప్.

ఫాదరు కురుప్ మొహం వంక చూశాడు

కురుప్‌జీ! ఇప్పుడు మీరే ప్రధాన సాక్షులు...చూడండి. ఈ దీనామ్మ అక్కని నేను పెళ్ళిచేసుకున్నప్పటికి ఇది వో నాలుగేళ్ళపిల్ల నా సొంత చెల్లెల్లాగా పెరిగింది. కానీ ... ఇప్పుడు ఎవరెవరో — ఏవేవో చెప్పిన తప్పుడు మాటలన్నీ విని — గూఢచారిపని చేసింది...'' అంటూ వెకిలిగా నవ్వాడు

''అది సాధ్యమా...అని ? ''

''ఇంతకు మునుపు మావయ్య ... వో యాజకుణ్ణి అన్నట్టు హేళనగా అన్నాదే ... ఆ మాట నన్ను ఉద్దేశించి అన్నదే. కనుక్కోండి...కావాలంటే.''

''ఆయన మతిలేక ఏదో మాట్లాడితే ఆ మాటలన్నీ పట్టించుకుంటారేవిటి ?...'' అంది దీనామ్మ గుటకలు మింగుతూ.

''కొనచ్చిరానుంచి వో మనిషి యిక్కడికి వచ్చి చెప్పిన మాటయ్యా బాబూ! ''

''ఏం చెప్పాడే ? చెప్పండి మావయ్యా విందాం... : ''

తప్పుచేసి పట్టుబడి, — తప్పించుకుందుకు వీలుకాని పిల్లవాడిలాగా కుయెన్నాచ్చను ... బిక్కచచ్చి చుట్టూ కలయ జూశాడు. అంతా నిశ్శబ్దం .... చీమ చిటుక్కుమన్నా వినబడుతుంది.

స్వల్పంగా నెరిసిన గెడ్డం — మీసం ఉన్న ఫాదరీ మొహంలో నిర్భయత్వం... ఉండుండి ఆ మొహం హేళనతో కూడిన చిరునవ్వును పులుము క్రోవధమ్మూను కని పించాయి,

ఉన్నట్టే ఉండి కుండ వొకటి కిందబడి ముక్కలు ముక్కలై పోయింది

వాకిట్లోంచి పెద్దగా ఎవరివో మాటలు వినబడ్డాయి...

ఎవరేముందీ ... కీవరీతు — మాత్తుకుట్టేను.

''ఒరేయ్ చిన్నప్పటినుంచీ వాడి నైజం నీకు తెలుసు. అయినా చేతులు కాలిన తర్వాత యిప్పుడు ఆకులు పట్టుకునేంలాభం చెప్పు — అంటున్నాడు కీవరీతు.''

''ఎవర్నని ఏం ప్రయోజనం ? అసలు మొదట తప్పంతా నాన్నది...రెండోది నా భార్యది. ఆ కుర్రకుంక డబ్బుతెచ్చి యివ్వడమూను .. వీరు పుచ్చుకోవడము — పొరబాటేగదా ? సరే తీసుకున్నారనుకో ... అది మళ్ళీ తిరిగివ్వడం పెద్దనేరం కింద తయారైందా లేదా ?''

''మనమే వాళ్ళ చేతికి బడితెయిచ్చి బాదించుకున్నట్టయిందిగదా ! అరె ... దాని దేముంది ... నాన్నకా వృద్ధాప్యం .... వొంట్లో ఏ మాత్రం దార్ఢ్యమూ లేదు ... తను గన్న సంతానం కష్టబడిపోతున్నారంటే ఆయన మనస్సుకు స్థిమితం ఉండదుగదట్రా మరి ?''

ఇంటికి వచ్చిన అతిథుల్నిచూసి యిద్దరూ నిర్ఘాంత పోయారు. తర్వాత కీవరీతు నెమ్మదిగా తెప్పరిల్లుకొని —

''ఎప్పుడు రావడం .. ఫాదర్'' — అంటూ పలకరించాడు.

''ఇంతకు ముందే.''

''ఇద్దరూ కలిసే వచ్చారన్నమాట ? ''

''ఆఁ .. మరే ...''

ఇహ ఆ పైన ఏమడగాలో తెలీలేదు. అందుకని తండ్రిని పలకరిస్తున్నట్టు — ఏం నాన్నా వొంట్లో బాగాలేదని విన్నా...యిప్పుడెలా ఉందేవిటంటూ'' అడిగాడు.

''కీవరీతేనా ? ''

''ఔను ... నాన్నా నేనే. ''

''ఒరే, ... ఆ కొనచ్చిరానుంచి లోనాను రాలా ... అతగాడు ఇక్కడికి వచ్చి ఏమన్నాడో చెప్పమంటున్నారు ఫాదరు....''

''ఏమన్నాడో నువ్వే చెప్పరా కాస్త . . ,''

అనే సరికి — హఠాత్తుగా తనను తుపాకి ఎదట నిలబెట్టినట్టనిపించింది . . . కీవరీతుకు,

కీవరీతు, — మాత్తుకుట్టి, — చాటునుంచి శాంతమ్మ తల్లిని దీనామ్మను చూశారు.

ఎలాగైనా యీ ముప్పునుంచి బయటపడాలనుకున్నాడు కీవరీతు — అందుకని—

''నాన్నా ! ఏమిటంటున్నావ్ ? కొనచ్చిరా వాడెవడు ...? ఏ లోనాన్ని గురించి నువ్వనేది ? బహుశా మీకు మతి తిన్నగా ఉన్నట్టులేదు...'' అన్నాడు.

''లేదు కీవరీతుబాబూ ! మావయ్య మతి తిన్నగానేఉంది. ఆయన్ని నేనే చెప్పమని అడిగాను. నేను అసలా విషయం తెలుసుకోవాలనే ఇంతదూరం వచ్చా'' నన్నాడు ... ఫాదరు.

కీవరీతుకి తప్పించుకునే మార్గమేం తోచలా...తుపాకిని తిన్నగా గుండెలకే గురి పెట్టారనిపించింది. అయినప్పటికి మరొక్కసారి ప్రయత్నం చేద్దామనుకుని...''అలాగా? విన్నారేం ? ఆడిగారూ ? అహ...అయితే యింకేం ? ఊరుకోండి ఫాదర్ అన్నాడు...'' పెంకెతనంగా.

''ఆ పప్పులేం ఉడకవ్ కీవరీతు బాబూ! నే నీ విషయం పెళ్ళి జరిగేందుకు మునుపే వచ్చి తేల్చుకుందామనుకున్నా...కానీ...పెళ్ళి కాస్త ఆగిపోతుంది...అది అపచారమని ఊరుకున్నా. నిజా నిజాలు తెలుసుకోవడానికి ఇదీ తరుణం ... తెలుసుకు తీరాలనే వచ్చా..." అన్నాడు

ఆయన వితండ వాదన వింటూంటే మాత్తుకుట్టికి అయోమయంగా ఉంది.

''తప్పు ఒప్పులన్నవీ ఎవరికి వారికి తెలియాలిగానీ — ఇప్పుడివ్వన్నీ ఏకరువు పెట్టుకు నేం లాభం ? — '' అన్నాడు.

ఫాదరు వదిలిపెట్టేటట్టు లేడే ... !

''అవన్నీ కల్లబొల్లి కబుర్లే కావచ్చు కానీ ... మంచి వాళ్ళని గురించి లేనిపోని తప్పుడు కూతలన్నీ ఎంతవరకు ప్రచారం చెయ్యాలోచేసి, — యిప్పుడు అన్నీ ఏకరువు పెట్టడమెందుకూ అంటే ఊరుకుంటానా ? ''

''ఏవిటా తప్పుడు కూతలు ? ''

''అబ్బో ... ఏమీ అంత ఎరగనట్టు ... ''

''మీరిప్పుడు ఏమనుకున్నా నాకు పోయేదేం లేదు ... కానీ ఇంతకు ముందే కనుక నాకు మీ మనస్సులో ఇంతటి కుళ్లు ఉందని తెలిస్తేమాత్రం ఈ పెళ్ళి జరగడానికి సుతరామూ వొప్పుకుని ఉండేదాన్ని కాను. ఇరవై నాలుగో ఏట నాకు వైధవ్యం వచ్చింది. నా బిడ్డలందర్నీ చదివించి, పెంచి పెద్దచేసేందుకు —, నే పస్తులయినా

ఉన్నాగానీ...ఇంకొకర్ని దేహీ అనలేదు. ఇబ్బంది పెట్టలేదు...ఏమనుకున్నారో...''
అంది శాంతమ్మ తల్లి రోషంతో...

మాట తప్పిస్తూ కీవరీతు — ''ఆఁ ... నోరుముయ్యడానికైతే మూకుడుంది గానీ ... ఊరుముయ్యడానికి మూకుడుందిటమ్మా...'' అన్నాడు.

శాంతమ్మ తల్లి ఆ మాటలు వినిపించుకోకుండానే, — చెప్పడం మొదలెట్టింది...

''అన్నయ్యా! నేను మీ కూతురంటిదాన్ని. ఇప్పుడు దాచేందుకేముంది కనుక— దైవభక్తి — సంప్రదాయం ఉన్న యింటపుట్టి పెరిగినదాన్ని. దివ్య సందేశ ప్రచార కార్యక్రమంలో యిబ్బంది కలగరాదని — పెళ్ళయినాగూడా ఏడాదిపాటు మేం బ్రహ్మ చర్యాన్ని నియమంగా పాటించాము. అటువంటి నన్ను భర్తపోయాక — నాకో ఫాదరీతో అక్రమ సంబంధం ఉందని కట్టుకథ కల్పిస్తారా?'' అంటూ ఘాడించి అడిగింది.

''ఎవరన్నారు?''

''ఎవరన్నారో తెలీదు.''

''ఎవరో ఏదో అని ఉండొచ్చు ... అందుకు సమాధానం చెప్పుకోవాల్సిన అగత్యం మాకేవిటి...'' అన్నాడు దూకుడుగా మాత్తుకుట్టి.

ఫాదరు తగ్గదల్చుకోలా ...

''మరుసుగా మాట్లాడకు మాత్తుకుట్టీ! ఇదో వంక పెట్టి మీరు యీ పెళ్ళికాకుండా పడగొట్టాలని యత్నించారా లేదా? చెప్పు. పెళ్ళికొడుకు పట్టుపట్టబట్టేగా చివరికి మీరు రాజీకి దిగారు. భగవంతుడు సాక్షిగా— చెప్పు... ఈమాట నిజమంటావా... అబద్ధ మంటావా...'' అనడిగాడు.

''ఫాదర్... అన్నీ తెలిసిన మీబోటి పెద్దలు మాట్లాడవలసిన తీరేనా యిది-'' అన్నాడు కీవరీతు.

''మనస్సు దహించుకుపోతూంటే,- ఏం చేయమంటావ్ కీవరీత్! పక్షవాతంతో మంచాన పడిఉన్న మా మస్కియామ్మ— ఈ పుట్టించిన పుకారు విని విషం మింగ బోయింది... మీకేం తెలుసు?...''

''ఇది మీ కుటుంబవిషయం... ఫాదరు చెప్పబట్టే నేనిక్కడ ఉన్నాను. ఇటు వంటి అపవాదులు వేయగలవాడు, నిందారోపణలు చేయగలవాడు ఈ కుయెన్నామాప్పిళ్ల పరివారంలో ఒకే వొక్కమనిషి ఉన్నాడు బాబూ!'' అన్నాడు కురుప్-, తను ఆ పరి స్థితుల్లో అక్కడున్నందుకు తన ప్రతిభ తెలివితేటలు వొలకబొయ్యాలని— ''అతగా

డెవరంటారా... ఇంకెవరు... కుయుచ్చేరుక్కను మాప్పిళ్లే'' అన్నాడు.

"కురుప్ చాలుచాల్లే ఊరుకో ... మహా చెప్పొచ్చావ్... అర్థంలేని వాగుడు వాగకు...'' అంటూ మాత్తుకుట్టి చీదరించుకున్నాడు.

ఆ మాట వినిపించుకోకుండానే ఫాదరు ''మీకు కనుక ఈ విషయంలో ఏదైనా అనుమానముంటే,— నాతోరండి. పుత్తనాట్టుకరా చర్చికి పదండి ... ఋజువుకి కావలసిన కాగితాలూ— పత్రాలు అన్నీ అక్కడున్నాయి చూద్దురుగాని... పదండి...'' అంటూ చెప్పుకుపోతున్నాడు.

''మాకేం అనుమానం లేదు ఫాదర్... ఇక ఆ ప్రసక్తి ఎత్తకండి. ఎవడో తంపులమారివాడు చెప్పిన మాటలన్నీ మూర్ఖంగా నమ్మబట్టి... అనుమానం వచ్చింది గానీ... అదిక మర్చిపోదాం...'' అంటూ సమాధానపరచడానికన్నట్టు అన్నాడు కీవరీతు.

''నీ తండ్రిలాటి వాణ్ణనుకుని నన్ను క్షమించు తల్లీ! ...'' అని శాంతమ్మ తల్లిని వేడుకున్నాడు.

''ఔను క్షమించాలిసిందే... అంతకంటె గత్యంతరం లేదుగా''. ఇహ మనసులో ఉండబట్టలేక పైకి కక్కేశాడు ఫాదర్— ''తాగేతాగే నీళ్ళల్లో విషం కలిపినట్టు— ఆ ముసలాడు ఈ పెళ్ళి పడగొట్టాలని,— పనిగట్టుకుని యిక్కడికి వచ్చి ఈ అభాండం వేసి చక్కాబోయాడు. ఆ ముసలాడెవడంటే— చెబుతా—, అతగాడు పుత్తనాట్టుకరాలో పత్రోసముతలాలి అని గొప్ప శ్రీమంతుడున్నాడు చూడండి ... వాళ్ళ గుమాస్తా.''

''శాంతమ్మ తల్లిని ఇరకాటానబెట్టి అభాండం వేయడానికి కారకుడు పత్రోసముతలాలియే... వాడు ఆవిణ్ణి చాలా యిబ్బంది పెట్టాడు. ఎందుకంటే,— ఆ రోజుల్లో ధర్మసంఘం తాలూకు పౌరోహిత్యం నేను చేస్తూండేవాణ్ణి... ఆ డబ్బుగల ఆసామిచేసే తప్పుడు పనులన్నిటినీ నేను బాగా ఖండించేవాణ్ణి. దాంతో... ఏం చెయ్యడానికి తోచక ఈవిడ యింట కొంతకాలం నే ఉండటాన్ని ఆసరాగా తీసుకుని ఆయన మా యిద్దరికీ సంబంధం ఉన్నట్టు అపనిందవేసి,- దుష్ప్రచారం చేయించాడు. అందువల్ల ధర్మసంఘంలో గూడా కలతలొచ్చాయి.''

"చాలు, ఇంకేం చెప్పక్కర్లేదు గానీ... నాదొక్కటే మనవి— ఈమాట పట్టుకుని నా చిన్నారితల్లిని కష్టపెట్టకండి! నాబిడ్డ సుఖంగా,- ఆనందంగా ఉండాలనే నేను

నా జీవితమంతా యమయాతనలు పడ్డాను. ఈ అపనిందలు అభాండాలు భరించేందుకు నాకు శక్తిలేదు... నేను తట్టుకోలేను...'' అంది శాంతమ్మ తల్లి .. అంటూ అట్టే వెనక్కి తిరిగి చూసేసరికి శాంతమ్మ గుమ్మంలో ఉంది. తన తల్లి నేరస్తురాలిలాగా నిలబడి ఉండటాన్ని చూసింది

''అమ్మడూ ... ఎప్పుడొచ్చావమ్మా .. వచ్చిందే గమనించలేదు...'' అంటూ శాంతమ్మని,— తల్లి పలకరించింది.

బాల్చీ నిండుగా తడిబట్టలు పెట్టుకుని శాంతమ్మ అప్పుడే రేవునుంచి వచ్చింది.

వచ్చీరావడంతోనే తాతగారి మంచం దగ్గర— ఏవో పెద్దగా మాటలు విని పించాయి... అమ్మ... కార్తికపల్లి ఫాదరు ఉన్నారు... వీధిదారిన రాకుండా దొడ్డి దోవగుండా వచ్చింది. గబగబ బట్టలు ఆరేసింది.

తల్లి అడిగిన మాటకు బదులు చెప్పకుండానే, ''అమ్మా ! ఈ మాటలన్నీ అడగ డానికా 'యింతదూరం పడొచ్చావ్...'' అనడిగింది... ఔన్లే— లేకపోతే జీవితమంతా ఈ అపనిందే భరిస్తూ ఉండగలదా యేం... అనుకుంది... లోలోపల.

దీనామ్మ,— ''వొదినగారూ ! నమ్మండి నమ్మకపోండి ... ఈ శాంతమ్మని నా సొంత చెల్లెలులాగా చూసుకుంటున్నా... అందువల్ల.. '' అనగా,

శాంతమ్మ తల్లి ఏం మాట్లాడలేదు. —'హుం నిజంగా తన చెల్లెలుగా భావించి నట్టయితే యింత నిప్పులు చెరుగుతున్న మిట్టమధ్యాహ్నం వేళ మేటెడు బట్టలిచ్చి ఉతుక్కురమ్మని రేవుకి యే అక్కయ్య పంపుతుంది ? ఎవడో ముక్కూమొహం ఎరగని వాడు యింటికివచ్చి ఒక పరాయమ్మమీద అభాండంవేసి చెబితే వినగలుగుతుందా ?— అనుకుంది తనలో.

''కీవరీతు బాబూ ! నేనిక బయలుదేరుతా'' అన్నాడు ఫాదరు.

''కాస్త కాఫీఅన్నా పుచ్చుకోకుండానే ?''

''అం ... ఈ ఎటూకాని వేళప్పుడు కాఫీ దేనికిగానీ ? ఇప్పుడే పత్తనంతిట్టా పోయిరావాలి...''

''పోనీ భోజనంచేసి వెళ్ళండి ఫాదర్... కాఫీవద్దు, ...'' అంది దీనామ్మ.

''చెప్పాపెట్టాకుండా యిద్దరు పైమనుష్యులకి భోజనమంటే...''

''ఇప్పుడు వొండుకున్నదే తిందాం... ఏం ఫర్వాలేదు.''

''వొద్దులేమ్మా ...''

అనేసరికి ఇక అంతగా బలవంతంగూడా చెయ్యలేదు. తన కిప్పుడాయన దగ్గర మునపటంత చనువు—చొరవ లేవు. ఆదివరకు రోజుల్లో— ఫాదరొస్తే ఎక్కడ వెళ్ళిపోతాడోనని ముందు ఆయన గొడుగుతీసి దాచేసేది... అదే గుర్తు వచ్చింది... ములగాకు కూటుచెయ్యడానికి వంటింట్లోకి వెళ్లేది. దీనామ్మ తత్వం తెలిసినవాడు కాబట్టి ఫాదరు —

"అమ్మా ! నాకు ఎవరితోనూ విరోధం లేదు. పగ లేదు...తల్లీ ! అదీ పోయి పోయి నీతోనా నాకు...? నాకు శత్రుత్వమేవిటి...." అన్నాడు.

"ఫాదర్...నేనూ వస్తా పదండి" అంది శాంతమ్మ తల్లి.

"ఇప్పుడైనా పుత్తనాట్టుకరా పోయే బస్సు దొరుకుతుందా ?

అడంగుకు ఎప్పటికి చేరుకుంటుందో...." అన్నాడు మాత్తుకుట్టి.

"కులక్కటాలో ఉన్న అలీకుట్టి దగ్గర ఆగుతా..."

"అదేం వద్దు...ఇవాళిటికి యిక్కడే ఉండి రేపు బయలుదేరుదురుగానీ ..." అంది దీనామ్మ.

"అదే మంచిదమ్మా" అంది శాంతమ్మ.

తర్వాత శాంతమ్మ తల్లి కాదు—కూడదని ఏం అభ్యంతరం పెట్టలేదు.

ఫాదరు కుయెన్నాచ్చను దగ్గరికి వెళ్ళాడు.

"వెళ్లొస్తా మావయ్యా !"

ఆయనేం కదల్లేదు....

"నాన్నా వినపడిందా...ఫాదరు వెడతానంటున్నారు."

ఉలిక్కిపడి కళ్లు తెరిచాడు.

"ఏవిటి...బయలుదేరడమే.... ?"

"ఆఁ ..."

"శుభం."

తలమీద చెయిపెట్టి .... దీవించి ఫాదరు వెళ్ళిపోయాడు.

కొంత సేపయిన తర్వాత మాత్తుకుట్టిగూడా చక్కాబోయాడు.

కుయెన్నాచ్చన్‌కి నిద్ర మెళుకువ వచ్చినా — యింకా ఆ నిద్ర మత్తు మాత్రం పూర్తిగా వదల్లేదు...అందులోంచి తెప్పరిల్లుకోవడానికి ప్రయత్నిస్తూ "ఫాదరు వెళ్ళిపోయారా" అనడిగాడు.

''ఆఁ ... తలమీద చెయివేసి దీవించి మరీ వెళ్ళారే ?''

''అలాగా..., దీనామ్మ ఎక్కడ ?''

''లోపలుంది.''

''అబ్బ ... ఏదో చాలా యిదిగా ఉంది ... గుక్కెడు వేణ్ణీళ్లు కావాలి ... పట్టూరా...''

దీనామ్మ కాఫీ తెచ్చి యిచ్చింది.

వొళ్లు కొంకర్లు పోయే చలికాలపు రాత్రి పోయి వెచ్చని ఉదయంలాగా ఆ గుక్కెడు తాగగానే హాయిగా ఉన్నట్టు తోచింది.

''ఔను... పెళ్ళయిన తర్వాత నీ కూతురు కుట్టిఅమ్మ — అల్లుడు ఇక్కడే ఉంటున్నారా ?''

''ఆఁ.''

''మరైతే యింటి ఖర్చు అదీ వాళ్లే సమర్థిస్తున్నారా ?''

''ప్రస్తుతం ఖర్చంతా వాళ్లే చూస్తున్నారు.''

''ఏవిటి ?''

''ఇప్పుడు యింటికిందయ్యే ఖర్చంతా వాళ్లే పెడుతున్నారు.''

''అయితే నీ పని హాయే... నీకు.... ఇప్పుడు ఏ చీకూ చింతా లేవన్నమాటేగా? పిల్లలంతా కాపరాలకి వెళ్ళినట్టే. ఎటోచ్చీ చివర పుట్టిన ఆ పిల్లవాడి వొక్కడికీ ఉద్యోగమంటూ దొరికితే నువ్వింక వొడ్డెక్కినట్టే.

ఇహపోతే నువ్వూ— కుంయుమ్మరియాయేగా ఉండేది ? ''

''మా యిద్దరికీ నువ్విచ్చిన ఆ భూమే చాల్లేవయ్యా...''

''కుంచుచ్చెరుక్కను మాచేవిట్రా ?... ఎలా ఉన్నాడో ... !'

''వాడు వట్టి దౌర్భాగ్యుడురా... ఏరంతా వల విసిరినా వాడివల్లో వొక్క చేప గూడా పడలేదుగదా ! పాపం ! ''

''నువ్వనుకునేటంత యిబ్బందేం వాడికి లేదులేవయ్యా ?

ఆఁ ? ''

''అహఁ ... కొడుకుని పోలీసులు పట్టుకుపోయారనుకో. కానీ ... అంత గొడవేం లేదులే. అయినా వాడు పట్టుకొచ్చి యిచ్చిన డబ్బంతా బయట పెట్టలేదనిగూడా చెబుతున్నారు.''

"ఎంతట ? "

"ఎంతో ఏమో ఎవరికి తెలుసుగాని ? ఈ మధ్యనే ఉత్తర హిందూస్తానం నుంచి దానికుట్టి మిత్రుడొకడొచ్చి మరికాస్త డబ్బిచ్చి వెళ్ళాడట..."

"ఊఁ; ఫిలిప్పోసు శ్రీ మంతుడే కానీ... దుర్మార్గుడై పోయాడు."

"ఆఁ... మరే. యిప్పుడిక వాణ్ణి కూకలేసి, చివాట్లుపెట్టి దారికి తేవడం కుదరదుగదా !"

"ఇహపోతే నీ సంగతి.... నీ పెద్దకూతురేమో రోగిష్టిదైపోయె... పంతులమ్మగా చేస్తున్న ఆ రెండోదాన్ని వో అయ్యచేతిలో పెట్టాల్రా..."

"నాన్నా! "

"ఆఁ ?"

"మీరేమంటున్నారు ? రోగిష్టిపిల్ల పోయిందిగా... ? "

... ... ...

"కుట్టిఅమ్మ పెళ్ళి పోయినవారం అయిపోయే. ఇంతకు మునుపేగా వాళ్ళని గురించి మాట్లాడుకున్నాం....? అంతలోనే మర్చిపోయారా ?"

అగాధమైన సుడిగుండంలోపడి గిలగిల కొట్టుకుంటున్న మనిషి ముఖంలో కనబడే నిస్సహాయస్థితి .. సహాయం కోరుతున్నట్టున్న... ఆ కళ్ళు....

"నాన్నా ! "

కళ్ల తెరిచాడు.... కానీ మాట్లాడలేదు.

"అమ్మా దీనామ్మా... ఇలా రామ్మా— "

దీనామ్మ వచ్చింది. తడిగుడ్డతో మొహాన పోసిన చెమట తుడిచింది. అరికాళ్ల — అరిచేతులు మాలిష్ చేసింది.

"కీవరీతు వెళ్ళాడా తల్లీ!"

"లేదు... యిక్కడే ఉన్నా నాన్నా!... ఏం కావాలోచెప్పు."

"సమాధి కట్టించాలిరా. 'మేలోర్ఘులిల కుయున్నైన్నా' అని రాతిమీద చెక్కించి పెట్టాలి... ఒకానొకప్పుడు ఈ ఫలానా వ్యక్తి బతికి ఉండేవాడని... ఇక ముందు తరాలవారు తలుచుకుందుకు వీలుగా....నా కంతకంటె కావాల్సిందేముంది కనుక...?" అన్నాడు.

శాంతమ్మ..., వాళ్ళమ్మ మంచం దగ్గరికి వచ్చారు.

''మావయ్యా! ఇప్పుడీ మాటలన్నీ దేనికి చెప్పండి...'' అంది దీనామ్మ.

''అహఁ ...అదికాదమ్మా! సరిగ్గా వేళకి వాడు యిక్కడ కనుక లేకపోతే...? కాలం సమీపిస్తున్నట్టనిపిస్తూంది.''

''ఏమిటి మావయ్యా.... ఇక ఎప్పుడూ అదే స్మరణా ? ''

''నాయనా కీవరీత్! కుటుంబానికి పెత్తందారీ నువ్వే వహించాలి సుమా ... తగాదాలు పోట్లాటలు... కక్షలు కావేషాలవల్ల యిల్లు చిందర వందర కాకుండా కాపాడాలిరా... 'ఇతర తెగకి చెందినవాళ్లు కానీ... ఇష్టమొచ్చిన తీరున ప్రభువు రూపాన్ని ఆరాధించుకోనీ .. నైవేద్యాలే పెట్టుకోనీ... మోషే ఇశ్రాయేలు ప్రజలకి నాయకత్వం వహించి... వాళ్ళని చెల్లాచెదరు కాకుండా చూశాడు... అదే మాదిరిగా నువ్వుగూడా దూరదృష్టిగల నాయకుడివి కావాలి... కోప తాపాల్ని విడిచి పెట్టాలి.''

''అయితే ఇంతకూ యిప్పుడు నేనివన్నీ నేర్చుకోవాలంటావ్?— నాన్నా...? '

''ఒరే నాయనా మీలో మీరు పైసా పైసాకి లెక్కా డొక్కా అడగండి... కనుక్కోండి... పోట్లాడుకోండి... కానీ... మీలో ఎవరికైనా ఆపదంటూ వచ్చిందంటే మాత్రం... మీరంతా ఒక్కటిగా ఉండాలి సుమా...? కుటుంబంలో పుట్టిన బిడ్డలందరికి నువ్వికా పెద్దదిక్కయి ఉండాలి సుమా...

బాప్తిస్మము (క్రైస్తవ ధర్మదీక్ష) పొందే సమయంలోగాని, పెళ్ళి సమయంలో గానీ... ఇంకా అంత్యక్రియా కలాపాలు వగైరా ఆచారాలన్నిటికి నువ్వు కుటుంబ పెద్దగా మొదటినుంచి ఆసాంతం వరకు వెంటఉండి జరిపించాలి సుమా...? ''

''నాన్నా పరికొంచెం కాఫీ తాగుతావా ?''

''అలాగే.... తెగ దాహంగూడా ఉంది...''

''ఎక్కువ మాట్లాడకుండా ఉంటే మంచిది ''

''ఆవిడ పేరేవిట్రా శారామ్మేనా ? ''

''ఎవరిపేరు...? శాంతమ్మ తల్లిపేరా ? శారామ్మ కాదునాన్నా మరియకుట్టి.''

''మరియకుట్టి కూతురు వంశానికి ప్రతిష్ఠ... భర్తకు పరువూను. వెనకటికి దావీదు కుమారుడు సొలొమోను అంటాడు చూడు— గుణవంతురాలైన భార్య దొరకడం... అరుదు. అట్టి ఇల్లాలు ముత్యంకంటె అమూల్యమైంది. ఆమె తన చాకచక్యంతో ద్రాక్షతోట నాటిస్తుంది... అన్నాడు.

అన్నట్టు... మరియకుట్టి చదువుకున్నదేనా ? ''

''ఆఁ ... ఆఁ ... ఆవిడ మత ప్రచారకురాలు నాన్నా ! ''

''అయితే యింకేవిటి ?... పుస్తకంఉంది... చదివి వినిపించమ్మా.''

''ఇప్పుడే చదవాలంటావా నాన్నా...'' అనడిగాడు కీవరీతు.

''అరె... చదవనీరా అంటే, నువ్వూ విన్నట్టవుతుంది... కొత్తగా పెళ్ళయిన మీ పంతులమ్మకుగూడా చెప్పవచ్చు.''

శాంతమ్మ పరిశుద్ధ గ్రంథం తెచ్చింది. మరియకుట్టి ఇలా చదవడం ప్రారంభించింది.

''గుణవంతురాలైన యిల్లాలు— చీకటితోనే లేస్తుంది తన యింటివారికి భోజనం సిద్ధపరుస్తుంది

తరువాత తన పనిగత్తెలకు తలోపని పురమాయిస్తుంది.

ఆమె పొలము చూసి దానిని తీసుకొంటుంది.

తాము కూడబెట్టిన ద్రవ్యం పెట్టి ద్రాక్షతోట ఒకటి నాటిస్తుంది.

ఆమె నడికట్టుచేత నడుము బిగించుకుంటుంది.

చేతులను గట్టిగా బలపరచుకొంటుంది.

తన వ్యాపార లాభాన్ని అనుభవంతో తెలుసుకుంటుంది.

రాత్రివేళ ఆమె దీపం ఆరిపోదు.

ఆమె చరఖా చేత పట్టుకుంటుంది.

ఆమె దీనులు దరిద్రులకోసం చేతులు జాపుతుంది.

ఆమె తన యింటివారికి చలి తగులునేమోయని భయపడదు.

ఎందుకంటె — అమె యింటివారందరు రక్తవర్ణ వస్త్రాలు ధరించిన వారే.

ఆమె పరుపుల్ని సిద్ధపరుస్తుంది.

ఆమె బట్టలు లేత వంకాయ రంగుగా ఉంటాయి.

ఆమె భర్త దేశపు పెద్దలతో సభలో కూర్చుంటాడు.

అతనికి ఘనత కలుగుతుంది.

ఆమె నారబట్టలు నేయించి అమ్ముతుంది.

వర్తకులకు నడికట్లను యిస్తుంది.

బలము — ఘనత ఆమెకు వస్త్రాలు.

ఆమె రాబోయే కాలాన్ని గురించి నవ్వుతుంది.

ఆమె పలుకులు వివేకంతోకూడి ఉంటాయి.

కృపగల ఉపదేశాన్ని ఆమె బోధిస్తుంది.

ఆమె తనయింటి వారి నడతల్ని బాగా కనిపెడుతుంది.

పనిచేయకుండా ఆమె భోజనం చేయదు.

ఆమె కన్నబిడ్డలు ఆమెని శ్లాఘిస్తారు.

ఆమె పెనిమిటి ఆమెను పొగడుతాడు.

పాతివ్రత్య ధర్మాల్ని అనుసరించిన స్త్రీలందరిలోకి శ్రేష్ఠురాలనిపించుకుంటుంది.

అందం అశాశ్వతము ... సౌందర్యం వ్యర్థము.

కానీ .... యెహోవాయందు భయభక్తులు కలిగిన స్త్రీ ప్రశంసింప బడుతుంది .... దేవా నీకు జయమగుగాక ...'' అంటూ శాంతమ్మ తల్లి పరిశుద్ధగ్రంథం మూసి —, తలెత్తి చూసింది.

కుయెన్నాచ్చను కళ్లుమూసుకుని పడుకుని ఉన్నాడు.

"మావయ్యకి మళ్ళీమైకం వచ్చినట్టుంది ...'' అంది దీనామ్మ.

''చాలా నీరసంగా ఉన్నాడు —'' అన్నాడు కీవరీతు.

''ఈ రెండురోజులుగానే మరీ ఎక్కువైంది .... ఎందుచేతనో ; ఏమో ...., జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూండాలిక ... రాత్రిళ్లు దీపం తగ్గించి ... దగ్గర ఉంచుతూండండి.''

''రోజూ పెడుతూనే ఉన్నాం.''

''వస్తానమ్మా మరియకుట్టీ ... మళ్ళీ రేపు కనబడతా.''

''నేను రేపు ఉదయమే వెడుతున్నా.''

''వెళ్ళే లోపలే వచ్చేస్తాలే.''

కీవరీతు వెళ్ళి వో గంటసేపేమన్నా అయిందేమో అప్పటికి, — అంతలో కార్లో కుట్టిఅమ్మ, — భర్త. ఊళ్ళో బాగా పేరుమోసిన డాక్టర్ని వెంట బెట్టుకుని కుయెన్నాచ్చను కోసం తీసుకువచ్చారు. డాక్టరు వచ్చేసరికి కుయెన్నాచ్చనుకి స్పృహరానే వచ్చింది గానీ ... దడ దడగా ఉంది.

డాక్టరు కుయెన్నాచ్చను మొహం వంకచూసి — నవ్వుతూ, ఆ తరువాత స్టెతస్కోపు చెవులకు తగిలించు కున్నాడు.

''తాతగారూ ! నన్ను గుర్తుపట్టారా ?''

''ఏవిటో బిగ్గరగా చెప్పాలి.''

''నన్ను గుర్తుపట్టారా అంటున్నా ... ?''

''ఉహుఁ ... గుర్తు లేదు ... చెపితే గుర్తొస్తుంది.''

''కొట్టారత్తరా'లో ఉండే జార్జి డాక్టరు తాతయ్యా ! — అని కుట్టిఅమ్మ చెప్పింది.

''డాక్టరు నొమ్మా పణిక్కరు కొడుకువా ?''

''ఆఁ ... ఆఁ ..., నీరసంగా ఉందా ?'' అంటూ డాక్టరు స్టెతస్కోపు గుండె మీద పెట్టాడు.

''వయస్సెంత ?''

''ఆఁ ?''

''వయస్సు ... ?''

''తొంభై సంవత్సరాలు నిండాయి.''

''ఊఁ ... వార్ధక్యం వల్ల కలిగే ... దడ ... నీరసం ...''

కళ్ళు చూశాడు ... నాడి పరీక్షించాడు

''ఆహారమేం తీసుకుంటున్నారు ?''

''ముప్పొద్దులా అంతో యింతో తింటారు ... అయినా ఈ రెండు రోజుల నుంచీ కేవలం అంబలి — మంచినీళ్ళు తప్ప ముట్టుకోవడం లేదు.''

''ఊఁ.''

''డాక్టరు పణిక్కరు నన్ను బాగా ఎరుగు. అసలు మా పరిచయానికి కారణం గూడా లేక పోలేదు ... ''

''ఎలా ?''

''అదీ యిరవై ముప్ఫయి ఏళ్లనాటి మాట ... ఐరణిక్కుటీ వంతెన దగ్గర ...'' అని కుయెన్నాచ్చను ఏదో చెప్పబోతూండగా — డాక్టరు ఆ కథంతా అప్పుడు వినదలుచుకోలా. అందుకనే —, ''ఏది ... నాలుక జాపండి ...'' అన్నాడు

''మతి లేకుండా అస్తమానమూ ఏదో మాట్లాడుతూనే ఉంటారు.'' అలా మాటా డుతూ మాటాడుతూనే మైకం వచి పడిపోతూంటారు. అంది దీనామ్మ.

''ఊఁ ... ''

''నల్లమందు వేసుకునే అలవాటుంది లెండి ...,''

''అహా( ... అలాగా ...?'' అంటూ పరీక్ష చేసిన తర్వాత డాక్టరు —, ''ఒంటికి బలం పట్టేమందు తీసుకోవాలి ... ఆహార విషయంలోనూ, దిన చర్యలోను కొంచెం నియమంగాను, — మితంగాను ఉండాలి. అంతేకాదు ... ముఖ్యంగా పెద్ద వాళ్ళకి ఉపచారం అవసరం. ఉపచారం చెయ్యడంలో తగినంత శ్రద్ధ తీసుకోవాలి. జాగ్రత్తగా ఉపచారం చేస్తే ఆ గుండె బలహీనం అదీ ... తగ్గుతుంది.''

''ఆ( ...''

''ఇప్పుడు నాతో ఎవరైనా వస్తే మందిచ్చి పంపిస్తా ...'' అన్నాడు.

''డాక్టర్ ! నల్లమందు వేసుకుంటే ఏమైనా అపాయమా ?'' అనడిగాడు తోమాసుమేస్టరు.

డాక్టరు చిరునవ్వు నవ్వి —

''నల్లమందు మంచిది కాదుగానీ ..., ఈ వయసులో మాన్పించడం వల్ల ఇంకా ప్రమాదం ఉంది. విషమైనా సరే తగుమోతాదులో పుచ్చుకోవడం అలవాటైతే కొంత కాలం పోయాక అది శరీరానికి తప్పనిసరై కూర్చుంటుంది ...'' అన్నాడు.

''నిజమే.''

''తోమాస్ ... మీరు నావెంట వస్తున్నారా ?''

''ఆ( ...''

''పదండి.''

డాక్టరుతో తోమాసు మేస్టరు వెళ్లాడు. కుట్టిఅమ్మ శాంతమ్మ తల్లి బుజంమీద చెయివేసి, — ''మీరు వచ్చినట్టు తెలిసింది ... మేము బడినుంచీ వచ్చేటప్పుడు దోవ లో మా నాన్న కనిపించి చెప్పాడు ... ఏవిటి తాతయ్యకు చాలా గడబిడ చేసిందా ...'' అనడిగింది.

''ఎక్కువేం లేదుగానీ .. మాట్లాడుతూ మాట్లాతూనే మధ్యలో స్పృహతప్పి పడిపోయారు. ఒక్కొక్కప్పుడు ఏదో మతిలేకుండా గొణుగుతూంటారు.'' అని చెప్పింది దీనామ్మ.

''తాతయ్యా !''

''ఆ( ... అంటూ, బాగా కళ్లు తెరిచి చూశాడు. చూసి, ''అమ్మా ఎందుకు తల్లీ ! డాక్టర్ని పిల్చుకువచ్చావ్ చెప్పు ? నాకేమంత జబ్బు ముంచుకొచ్చిందని, వయో ధర్మం వల్ల వచ్చేవాటిని ఎవరాపగలరు చెప్పు ?'' అన్నాడు

''బ్రతికినన్నాళ్ళూ ఎవరి కాలూ చెయ్యీ వారికుండి, కులాసాగా ఉండటం మంచిదిగదా తాతయ్యా !''

''హే ప్రభో! అనుగ్రహించేదీ నువ్వే!
అవస్థలు పెట్టేది నువ్వే,
ఆఖరికి గమ్యం చేర్చేదీ నువ్వే, ... నువ్వేలే నాకు తెలుసు.''

''అబ్బబ్బబ్బ ... ఒకటంటే — ఒకటంటావు. అడపాదడపా ఏదో అనవసర విషయాల్నిగురించి ఆలోచించడమూను, దాంతో మైకంతో పడిపోవడమూను ... ఏవిటి చెప్పు ?''

''అమ్మా మనకుటుంబంలో ఇంకా ఎవరి పెళ్లయినా చూడగలుగుతానా అని ? నీ పెళ్లే చివరిదో ...''

''ఔనామ్మా ... ?''

... ... ...

''అమ్మడూ !''

''ఊఁ....''

''నా మాట వినబడలేదా ... ?''

''వినిపించింది... మన కుటుంబంలో... మనకి తెలీకుండానే ఇంకొకరి పెళ్ళి గూడా అయిందని వినికిడి.''

''అదెక్కడ ?''

''తాతయ్యకు... రవంత చెప్పామో... మనపని అయినట్టే. ఇహదాన్ని కనబడిన వాళ్ళందరికి చిలవలు పలవలుచేసి చెప్పడం మొదలెడతారు...''

''నేనెవ్వరికీ చెప్పనమ్మా !''

''లేకపోతే అదే మననం చేసుకుంటూ పడుకుంటారు.''

''ఇంతసేపూ యిక్కడే ఉన్నాడుగానీ... మీనాన్న నాకేం చెప్పనేలేదే...?''

''తాతయ్యా ! కాలాయివాళ్ళ జోణీకుట్టి పనిమనిషి కూతుర్ని వయనాడు తీసుకుపోయి పెళ్లిచేసుకున్నాడని పుకారైతే పుట్టింది... సరి...''

''ఆఁ ?''

''అది యిప్పుడు వాడిదగ్గరే ఉందిట.''

కుయెన్నాచ్చనుకి అంతా అయోమయం అనిపించింది. మళ్ళీమళ్ళీ అడిగాడు.

డొంకతిరుగుడు ప్రశ్నలన్నీ వేశాడు. అసలు ఫిలిప్యోసుకే ఆ పిల్లదానితో సంబంధం ఉందని, దాన్ని యిప్పుడు కొడుకు చేపట్టాడని... అఖరికి తేలిన విషయం.

మరైతే తండ్రి తప్పుదారి పట్టినందువల్ల తలయెత్తుకోలేక ఊరువిడిచి పోయారన్నారుగా, అటువంటివాడు ఆ దాసీదాని మెళ్లో మంగళసూత్రం గూడా కట్టేశాడంటున్నారే? ఏమిటో... మాయ... దానికి—వాడికి మొదటినుంచి వాకరంటే వాకరికి యిష్టమేట...

''డబ్బుమీది మోహంతోనో, లేక మరింకే కారణం చేతనో... బాబాయితో గూడా ... అంటారుగానీ ... ఎవరికి తెలుసు ? అందుకో నిజమెంత ఉందో ... ఏమో... !''

''ఔను... అటువంటి సంఘటనే కనుక జరిగితే... మీ నాయన నాతో చెప్పకుండా ఉండడే... ?''

''నేనంటూంది కాదు తాతయ్యా ! ... ... అటువంటి పుకార్లు బయలుదేరాయంటున్నా. తాతయ్యోయ్... కొంపదీసి ఎవరితోనన్నా చెప్పేవ్ ? నే పోయి మందు తెస్తా. సరిగ్గా వేళకి మందు వేసుకుంటూ ఉండాలి...'' అంది కుట్టిఅమ్మ.

''ఒకవేళ నిజమే అయితే ... ? వాడు ఆ పిల్లదాన్ని లేవదీసుకుపోయి ఉంటాడు...'' అన్నాడు కుయెన్నాచ్చను.

''చూశావా... అందుకేగా... తాతయ్యా ! నీతో ఏమాట చెప్పాలన్నా కష్టమే. ఇహ ఆ విషయం అంతటితో మర్చిపోవయ్యా..., నే వెడుతున్నా...''

అది మనస్సు విడిచి పోతేగదా... ? మర్చిపోవడానికి... ...

బాగా ఆలోచించగా ... యిప్పుడీ పిల్ల చెప్పినమాట నిజమేనని తోస్తూంది.

వాడూ... వయసొచ్చినవాడు... వాడికో యిరవై పాతికేళ్ళుంటాయి. ఆ పిల్లది పద్దెనిమిదేళ్ళది. మంచి వయసులో ఉంది.

కుర్రవాడేమో స్థితిమంతుల బిడ్డ... అందగాడు... ఆ పిల్లడ కూటికి పేదయినా... చక్కదనాల బొమ్మ. వాళ్ళపాటికి వాళ్లు హాయిగా ఉండాలంటే,— వాడికి తండ్రిదో పితలాటకం... ఆ పిల్లదాని పొంగిపొర్లే వయసు చూసి వీడు మైమరచి ఉంటాడు.

స్వేచ్ఛగా సుఖభోగాల మజా చూడలేదే అని బెంగపడి ఉంటాడు. సరే,— కనుసైగ చేసేసరికి— అవతల ఆ పిల్లది సై అని ఉంటుంది.

లేకపోతే... పొద్దున్నా సాయంత్రం దాని వెంటబడి వేధిస్తేగూడా... చివరికి మొగ్గి ఉండొచ్చు. తర్వాత చెపిన బడినట్టే... జరిగిఉంటుంది.

వాడు దీనికంతటికీ మొదటే ప్లాను వేసుకుని దాన్ని తీసుకుపోయి ఉంటాడు. తండ్రి నడత మంచిదికాదని వో లేనిపోని అపవాదు వాడి నెత్తిన పారేసిఉంటాడు.

వంద యెకరాల రబ్బరుతోట... ఆ తోటమధ్య బంగళా. వాడక్కడ ఆ పిల్ల దానితో కులుకుతూ,- తానో పెద్ద మహారాజా ఠీవి వొలకబోస్తున్నాడు కాబోలు... వాడు రాజుగారు— అదేమో రాణిగారూను...

ఈ కబురు వినగానే తండ్రి అక్కడికి వెడతాడు. అప్పుడిక ఏమవుతుంది ?

తండ్రి తనని అల్లరిపెట్టి ఆగం చేస్తాడేమోనని... వాణ్ణి వస్తే ఎదుర్కొనేందుకు పది పదిహేనుమంది గూండాలను— అక్కడున్న పనివాళ్ళల్లోంచే ఎన్నికచేసి సిద్ధంగా పెడతాడు.

ఆ పిల్లదాన్ని వాడు లోపలపెట్టి దాచేసి, బయట ద్వారం దగ్గర నిలబడి ఉంటాడు.

రచ్చగెలిచే తండ్రి ఇంట కొడుకు చేతిలో ఓడిపోతాననే భయంతో,— ఎక్కడా వెతికి గాలించకుండా, ఎటో చూస్తూ, ఒరే... నువ్వు యింటికి పద... ఇక్కడ పని పాటులకు కావలసిన ఏర్పాట్లన్నీ నే చేయిస్తా లెమ్మంటాడు.

నేరాను...

ఏం ... ఎందుకని ?

రానంతే. ఇక్కడేఉంటా... మీరు నాకు ఏమీ ఇవ్వకబోయినా ఫర్వాలేదు. ఈతోటే నాకు చాలు అంటాడు వాడు.

ఏరాయేం ? ఈ తోట ... నీ మామగారు కట్నం చదివించాడనుకుంటు న్నావా యేం ?

ఎలా అనుకున్నా సరే. . .

ఇదేదో తేల్చేయాల్సిందే... అనుకుని తండ్రి-- ఏం చేయడమూ... అని ఆలోచిస్తాడు. నాలుగు తన్ని తగిలేయడమా ? పోలీసులకి రిపోర్టు చెయ్యడమా ? కొట్టి తిట్టి లాభంలేదు. తండ్రీ కొడుకులు కొట్టుకున్నారని అపఖ్యాతి తప్ప వారిగేనేమీ లేదు. ఏమైనాగానీ,- ఆ సానిపాపని ఇక్కణ్ణుంచి తరిమిపారెయ్యాల్సిందే... అనుకుంటాడు.

అరె... అదెక్కడరా ?
ఎవరది... ఇక్కడెవ్వరూలేరు.
ఏడ్చావ్‌గానీ... అడ్డంలే ముందు.
లేదని చెప్పలా ?
దారికడ్డం లేస్తావా లేదా ?
లేవను.

అయితే కాచుకో... అంటూ లెంపకాయ కొట్టాలని ముందుకురుకుతే... చేతులు మెలితిప్పి పట్టుకుంటాడు అప్పుడిక తండ్రీ కొడుకులని తారతమ్యం పోతుంది. ఒక చిన్నదానికోసం ద్వంద్వయుద్ధానికి తలపడిన యిద్దరు మొనగాళ్ళు ...

తండ్రి కొడుకుని మోకాటికింద వొడేసిపట్టి నేలబడేస్తాడు. కొడుకు గుండెల మీద ఎక్కి కూర్చుని గొంతు పిసుగుతూంటాడు. అప్పుడు నలువైపుల్నుంచీ— ఆ కొడుకు ఏర్పాటుచేసిన గూండావాళ్ళు పొదలమాటునుంచి ఒక్క విసురున వచ్చి పడతారు. తండ్రి వొంటరిగాడై పోతాడు. గూండాల చేతుల్లో కత్తులు— కటార్లు... బాకులు బల్లాలు ... అయ్యో నా బిడ్డని ఎక్కడ కొట్టిపోతారో ... వాడికసలే ఉబ్బసం గూడాను ..

ఛీ... పొండిరా... అని గదమాయిస్తాడు.

నాన్నా... మీరుండండి... ఈ వెధవలందర్నీ ఊచకోతగా కోసి అవతల పారేస్తా నంటాడు.

ఇంకేముంది... అయ్యో... తల పగలగొట్టేశాడు... అయ్యోయ్యో నా బిడ్డని పొట్టన బెట్టుకున్నావురా... పట్టుకోండి... ఆ బద్మాష్‌ని పట్టుకోండి... పట్టుకోండి...

... ... ... ...

''మావయ్యా !''
''తాతయ్యా !''
కుయెన్నాచ్చను ఉలిక్కిపడి లేచాడు.... కళ్లు తెరిచాడు.
''ఆఁ, ఏవిటమ్మా ?''
''అబ్బబ్బబ్బ... మమ్మల్నేం బతకనీయరా చెప్పండి ?''
''ఏవిటమ్మా ?''
''ఆఁ ... ఏవిటి గోల ?''

''వాణ్ణి చంపేశారేమో... ?''

''ఎవర్ని ?''

''ఫిలిప్పోసుని ...''

''అదేవిటి ? ఏవిటి మీరంటూంది ? నాకేం బోధపడటంలేదు. మీ మనవడి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది తీసుకోండి.''

''ఎవరి దగ్గర్నుంచీ ?''

''రాజన్ దగ్గర్నుంచి.''

''విషయమేవిటి నువ్వే చదువు.''

''వచ్చేనెల పదిహేను రోజులపాటు సెలవుపెట్టి వస్తున్నాడట. శాంతమ్మని తీసుకు వెడతాడట. నీలగిరి బదిలీ అవుతుందట.''

''నీలగిరికా ? ''

''ఆఁ ... అక్కడ కాపరం ఉండటానికి వాళ్లే యిల్లిస్తారట.''

''ఆ పిల్లది యిక్కడ ఉండటం వల్ల మనకి ఆసరాగానూ, నీకు సాయంగానూ ఉందికదూ ? ''

''బావుంది. ... అని జీవితమంతా ఇక్కడే మనకోసం పడుంటుందాయేఁ ?''

''అహఁ ....''

''వెళ్ళినా వో యేడాదిపాటు కూడా ఉండి, వచ్చేస్తుంది. తర్వాత ఇక్కడికే వస్తుంది....'' అంది శాంతమ్మ తల్లి యథాలాపంగా.

సూర్యాస్తమానం అయింది... దీనామ్మ శాంతమ్మ తల్లి లోపలికి వెళ్ళారు.

శాంతమ్మ సీనారేకు దీపంబుడ్డి వెలిగించి కుయెన్నాచ్చను మంచం దగ్గరకి పట్టుకొచ్చి పెట్టింది. ఆ ఎర్రని దీపకాంతులు ఆ పిల్లదాని చెక్కిళ్ళ మీద ప్రసరించాయి.

''అమ్మా ! ''

''ఊఁ .''

''నువ్వు మళ్ళీ తిరిగి వచ్చేసరికి ఈ తాతయ్య జీవించి ఉంటాడో లేదో...! ''

''ఇంకా నయం... ఏం మాటది... తాతయ్యా !''

''ఏం చెప్తావమ్మా ! మనస్సుకి ఉండనేమో అనిపిస్తూంది. నువ్వు... మేల్లో ఝత్తిల్లే కుయున్నెన్నా— అని నా పేరు చెక్కిన సమాధినే చూస్తావేమో....

అప్పటికి నువ్వు తల్లి కాబోతూగూడా ఉండొచ్చు... నీ కొడుకు' ...

''తాతయ్యా!''

'ఊఁ.''

''ఊరికే ఎక్కువ ఆలోచనలు పెట్టుకోకండి ... అటువంటప్పుడే పీడ కలలొస్తాయి.''

అమ్మాయి చెబుతూంది నిజమే...

ఈ మనస్సుందే... ఓ ధర్మసత్రంలాటిది. చీకులూ చింతలూ పిలవకుండా వచ్చి ... మనస్సంతా ఆవరించుకుంటాయి .... గందరగోళం చేస్తూంటాయి ... అనుకున్నాడు కుయెన్నాచ్చను.

# పదకొండు

సాయంత్రం వేళ — దీనామ్మ సీసాలోంచి మందుపోసి కుయెన్నాచ్చనుకి పడు తూండగా, — కుయుచ్చెరుక్కను రావడమైతే చూసిందిగానీ, ఏం పలకరించలేదు. మందుసీసా పుచ్చుకుని లోపలికి చక్కాబోయింది.

రోజుకి మూడుమార్లు మందు, మాత్రలు ఇవ్వాలి. పాలలో కలిపి వోవల్టీను, ఇవ్వాలి... నూనెరాచి వొళ్లంతా మర్దన చెయ్యాలి.

ఇందుకయ్యే ఖర్చంతా తోమాసు మేస్టరుదే. ఈ మందూ మాకూ యిచ్చాకనే కుయెన్నాచ్చను వొళ్ళు కొంత తేటపడింది. అది వరకటి మగత .... దడ తగ్గింది. ఆకలి పుట్టింది. తినాలనే వాంఛ కలిగింది. కర్ర పొడుచుకుంటూ కాసేపు వాకిట్లో అటూ యిటూ తిరిగేందుకు వోపిక వచ్చింది.

తోమాసు మేస్టరు ప్రతిరోజు ఉదయం స్కూలుకి వెళ్ళేటప్పుడు స్కూలునుంచి వచ్చేటప్పుడు నియమంగా వచ్చి మరీ వెడతాడు. ముఖ్యంగా కావలసిన వస్తువులు చెప్ప కుండానే కనుక్కుని కొని, తెచ్చి యిచ్చిపోతాడు. బలవంతంచేసినా డబ్బు పుచ్చుకోడు.

ఈ తోమాసు మేస్టరు యింటి అల్లుడయినప్పటినుంచి ఎల్లు పరంపలో యింట మాత్రం ఓ స్థిమితం కులాసా ఏర్పడిందని చెప్పాలి.

ఇంట్లో విడిగా పడక గదొకటి కట్టించాడు. వో బల్ల నాలుగు కుర్చీలు కొన్నాడు.

ఇవ్వన్నీ చూస్తూ కుయ్యేన్నాచ్చను ఇలా అనుకున్నాడు — యెహోవా లీలలు చిత్రంగా ఉంటాయి. అంతుచిక్కని లీలలు — అవి. గాలి జాడగానీ, ' చూలాలు గర్భంలో ఎముకల పోగు పెంచే తీరుగానీ.— ఎవరి కెరుక ? చల్లిన విత్తుల్లో మొలకెత్తేదేదో — ఫలించేదేదో ఎవరికెరుక? కాలుజారి నేలబడితే లేవనెత్తే వాడెవడో ఎవరికెరుక? నాకీ స్థితి పడుతుందని ఎవరికెరుక?...

పెళ్ళి ఈడు దాటిపోయి, పెళ్ళి కాదనుకున్న పిల్లకు ఏ మాత్రం శ్రమపడకుండా, అవలీలగా పెళ్ళి జరిపించేశాడు. ఇప్పుడా పిల్లది యింటిని, యింటిల్లిపాదిని వొడుదుడుకులు రాకుండా సమర్ధించుకు పోతూందిగదా !

అటువంటి పిల్లదాన్ని చంపాలని, చెరలో పారేయించాలని ... నానా ఎత్తులు వేశారుగదా వీళ్లు.

కొడిగట్టబోయే యీ దీపాన్ని అనుగ్రహం అనే చమురుపోసి, ఎగసనదోసి మళ్ళీ వెలిగేటట్టు చేసినవాడు ఆ పరమాత్ముడే ... యెహోవా మహిమలన్నీ చిత్రవిచిత్రాలుగా ఉంటాయి... ఎవరికీ అర్థంకావు.

''దీనామ్మా'' అంటూ కుయుచ్చెరుక్కను కేకేశాడు.

''ఓయ్...'' అని పలికింది.

''కాసిని వేడినీళ్ళు పట్టుకురా నాన్న తాగేందుకు...''

''ఏవిట్రా ?

ఇప్పుడేమంత బాధగా లేదుగదా ? ''

''ఉహుఁ.''

నేను మొన్న సందుచివర వో డాక్టర్ని కలుసుకున్నా .... ఆయన్ని పిలుచుకొచ్చి నీకుకాస్త మందూ మాకూ యిప్పిద్దామని అనుకున్నా. కానీ...జార్జి డాక్టరు వచ్చి నీకు వైద్యంచేస్తున్నట్టు తర్వాతనే తెలిసింది...'' అన్నాడు.

దీనామ్మ అంచున్న పళ్లెంలో అంబలిపోసి తెచ్చియిచ్చింది.

''మాత్తుకుట్టి ఎక్కడికి వెళ్ళాడు ?''

''ఆయన ఎణ్ణక్కాటు దాకా వెళ్లారు.''

''శాంతమ్మ పుత్తనాట్టుక్కరా వెళ్ళిందా అమ్మా? ''

"ఆఁ... మరే, తల్లితోబాటు వెళ్ళింది." అని ముక్త సరిగా జవాబు చెప్పి దీనామ్మ పళ్లెం తీసుకుని లోపలికి వెడు తూఁడగా...

"దీనామ్మా ఆకూ వక్కా ఉందామ్మా" అనడిగాడు కుయుచ్చెరుక్కను.

పాన్దాను తెచ్చి ఎదురుగుండా పెట్టి దీనామ్మ వెళ్ళిపోయింది.

ఆకులు ఈనెలు తీసుకుంటూ కుయుచ్చెరుక్కను తండ్రితో—

"నిన్న బొంబాయినుంచీ వో మనిషి వచ్చాడు నాన్నా! పెద్దబ్బాయి పంపించాడు."— అన్నాడు.

"ఇంతకు పూర్వంఁగూడా ఎవడో హిందుస్తానీ వాడొకడు వచ్చాడటగాదురా?"

"నీకెవరు చెప్పారు ?"

"ఎవరో అన్నారులే... వచ్చాడా ?"

"ఆఁ... వచ్చాడు. నీతో వచ్చి చెప్పేందుకు అప్పుడు కుదర్లేదు— మామూలు వ్యవహారమేలే... విడుదల చేస్తారనే చెబుతున్నారు...

ఎంతదాకా నిజమో మరి? "

"ఊఁ."

"వెళ్ళి అన్నయ్యని చూసివచ్చానని రెండోవాడు ఉత్తరం రాశాడయ్యా!"

"వెళ్ళి చూశాడూ ?"

"అఁ చూశాడట. పెద్దవాడు నీ కిచ్చిన డబ్బు నే తీసుకున్నానని చెప్పి, — చిన్నవాడు అక్కడికి వెళ్ళినప్పుడు వాడేమో చాలా నిష్ఠురంగా మాట్లాడాడట."

"ఔరా, ... మన యిచ్చి పుచ్చుకోవడాలు వాడికెలా తెలిసిందిరా? — నాకు తెలీకడుగుతా... ?"

"తల్లి చిన్నకొడుకు పేర రాసి ఉంటుందిలే నాన్నా : వాడు పోయి అన్నని అడిగి ఉంటాడు..."

"ఊఁ..."

"పెద్దవాడిప్పుడు చాలా కోపంమీదున్నాడని చెప్పి చిన్నవాడు రాశాడు. పైగా అన్నాడట —, తాతయ్యకి కనుక ఆ డబ్బు తిరిగి యిచ్చేయకపోతే, తనకికమీదట యింటితో ఎటువంటి సంబంధమూ లేదని నిక్కచ్చిగా చెప్పేశాడట."

"ఎంతమాట !"

"ఆ డబ్బేమో క్షణంలో ఖర్చయి పోయిందయ్యా! నీకు తెలీనిదేముందిలే ...

అంతటా అప్పులై పోయె ... మరి ?''

''ఊఁ''

కుయుచ్చెరుక్కను రొండినుంచీ అతిజాగ్రత్తగా వో పొట్లం తీశాడు. పొట్లం విప్పి నోట్లు లెక్క పెట్టాడు.

''యాభై రూపాయలు – చిన్నవాడు పంపాడు. ఈ కాస్త నీ మందూ మాకు కైనా ఉంటుంది ... అట్టే పెట్టుకోవయ్యా'' అన్నాడు కుయుచ్చెరుక్కను డబ్బు తండ్రి చేతికిస్తూ.

''వద్దు బాబూ! భగవంతుడి దయవల్ల యే యిబ్బందీ లేకుండా చల్లగా గడిచి పోతూంది. నువ్వు నాకేం ఇవ్వొద్దు గానీ ... నా దగ్గర ఉన్నదీ పున్నదీ చేతిలో వేయించుకు పోకుండా ఉంటే చాలు తండ్రీ! ... అయినప్పటికి ... నువ్వు నా బిడ్డవే ... నా కంతా సమానమే ... వద్దు ... పోయి రా ... రా ... పో ... నా మాటవిను ''

''నాన్నా! నువ్వు కాదూ కూడదూ అంటే – నా మనస్సు బాధపడుతుంది.''

''పోరా నువ్వుముందు ..., ఏం బాధపడదు. అవసరమొస్తే నేనే కబురు చేస్తా లే. నీ దగ్గరే అట్టే పెట్టు ...'' అన్నాడు కుయెన్నాచ్చను.

''ఇదుగో దీనామ్మా! చూడు ... ఈ కాస్త నువ్వయినా తీసుకుని అట్టే పెట్టమ్మా.''

దీనామ్మ గడపలో నిలుచుంది ... వాళ్ళ సంభాషణ వింటూనే ఉంది. తను ఏమీ కలుగజేసుకోరాదనుకుంది ... కానీ ... ఆయనలా అనేసరికి బదులు చెప్ప కుండా ఊరుకోలేక పోయింది. ''చూడండి ... పొరబాటనేదీ ఒక్కసారే జరుగు తుంది. మీలో మీరు ఇచ్చుకోండి – పుచ్చుకోండి – ఏమైనా చేసుకోండి నాకు చెప్పక్క ర్లేదు ...'' అంది దీనామ్మ.

''పొరబాటేవిటి దీనామ్మా! పొరబాటుకేముందీ? మా పరమ మూర్ఖురాలు ఏ మన్నా అన్నదేమో ...? అందుకనేనా? దాని దుంపతెగిరి ...''

''ఎందుకులెండి గానీ, – యిక్కడ ఆయనతో మీరే స్వయంగా చెప్పారుగా!''

''ఏం చెప్పాను? ఏం చెప్పానమ్మా? మాత్తుకుట్టి – నేను, నేనూ వాడూ ఏదో ఆ మాటా ఈ మాటా చెప్పుకునాం గానీ, అయ్యోరాతా ... ఇదెక్కడి గోల? నయమే, – ఇంద తీసుకుని అట్టే పెట్టు ... లోపల ఉంచు మా అమ్మగా'' అన్నాడు బ్రతి

మాట్లుతూ.

"అహఁ ... వద్దు. నే తీసుకోను ... మీరు వెయ్యిచెప్పండి లక్ష చెప్పండి ..., తిట్టుకోండి తిమ్ముకోండి నేనుమాత్రం చస్తే తీసుకోను."

"ఒరేయే ... నువ్వెళ్ళరా బాబూ! నాకేదో గుక్కెడు వేణ్ణీళ్ళయినా పోస్తున్నారు ... ఇక్కడ గూడా నాకు పుట్టగతులు లేకుండా చెయ్యకురా తండ్రీ!"

"అదేవిటినాన్నా! మరీ అంత అనౌచిత్యంగా మాట్లాడతావ్? మీకు డబ్బు యివ్వలేదని నా పెద్దకొడుక్కి తెలిసిందా అంటే ముందు నాకు పుట్టగతులుండవు ... ఏమనుకున్నావో?"

"అంతగా అయితే యిచ్చేశానని చెప్పరా ... ఎవరు కనుక్కోవచ్చారు?"

"వాడు యిక్కడికి వచ్చాక కొంపతీసి అడుగుతే -?"

"అప్పటి దాకా నేనుండను లేరా ... ఒకవేళ ఉన్నా, — నువ్వు డబ్బు తిరిగి ఇచ్చేశావని చెబుతా సరా?"

తండ్రి చెబుతూంది సబబేఅనుకున్నాడు కుయుచ్చెరుకన్ను. ఆ నోట్లు కాయితంలో చుట్టి పొట్లంగట్టి రొండిన దోపుకున్నాడు. అమ్మయ్యా బతికి పోయాననే సంతోషంతో దీనామ్మ.

"మావయ్యా! పాలు తెచ్చిపెట్టనా" అనడిగింది.

"తెచ్చి పెట్టు తల్లీ!"

కుయుచ్చెరుకన్ను తిరిగి వెళ్ళబోయే సమయానికి — ఎవరో నలుగురైదుగురు మనుష్యులు గుమ్మాలెక్కి లోపలికి వస్తున్నట్టు కనబడింది. సందెవేళ — తూర్పు వైపున్న దొడ్లో పనసచెట్టు కింద యిద్దరెవరో నిలబడ్డారు. ముగ్గురేమో పంచలోకి వచ్చారు. ఆముగ్గురు ఎవరంటే — కీపరీతు.— బేబీ, కసాయివాడి కొడుకు అవరాను...,

కీపరీతు నెమ్మదిగా తమ్ముణ్ణి "నువ్వెప్పు డొచ్చావ్‌రా ... అనడిగాడు.

"కొద్ది సేపయింది ..."

"మాత్తుకుటి ఎక్కడమ్మా దీనామ్మా ?"

"పొద్దున్నే ఎణ్ణక్కాటు వెళ్లారు."

"నాన్నా!"

"ఊఁ."

అంతా మౌనం ... చెట్టుకింద నిలుచున్న యిద్దరూ అడుగుల్లో ఆడుగులు వేసు

కుంటూ పంచలోకి వచ్చారు. దీనామ్మ బుడ్డి దీపం వెలిగించి అప్పుడే పంచలోకి తెచ్చి పెట్టింది. కుయప్పి ... శాంకుట్టి ...

అందరి మొహాల్లోను ... అంతులేని అదుర్దా ... అంతా తలలు వాల్చుకు నిలబడ్డారు.

బేబీ మొహంలో నైతే ఏదో చెప్పలేనంత దిగులు ... భీతాహం ... ఆవరించు కుంది.

దీనామ్మ అందరిమొహాల వంక తేరిపారజూసి, — ఏవిటి - ? ఏం జరిగిందని గాబరగా అడిగింది.

అడిగిన ప్రశ్నకు జవాబులేదు.

''మాత్తుకుట్టి ఎప్పుడొస్తానని చెప్పివెళ్లాడమ్మా ?''

''ఏం చెప్పలేదే.''

''శాంతమ్మ పుత్తనాట్టుక్కరానుంచి తిరిగి ఎప్పుడొస్తుంది ?''

''తీసుకురావడానికి ఎవరైనా వెళ్ళాలిగదా ?''

''ఏవిట్రా అసలు విషయం ? —'' అంటూ కుయెన్నాచ్చను ప్రశ్నించాడు.

''ఏం లేదు నాన్నా !''

''ఏవిటి ?''

కీవరీతు ఏం మాట్లాడ లేదు. కుయుచ్చెరుక్కన్ని సైగచేసి పిలిచి అటువక్కకి తీసుకు పోయాడు ... చెవిలో ఏదో చెప్పాడు.

''అయ్యో అయ్యో ఎంత ఘోరం ... ఎంతఘోరం ... అంటూ కుయు చ్చెరుక్కను పైకి వినబడేటట్టుకాకుండా గొణిగాడు.

అప్పటికి ఇంకో నలుగురైదుగురు మనుష్యులు వాకిట్లోకి వచ్చి చేరారు.

దీనామ్మ ఆత్రంగా — ''ఏం జరిగిందో చెప్పండి బాబూ ! ఊరికే నాన్చి నాన్చి దుంపతెంపకండి ...'' అంది.

''చెప్పండిరా .... ఏవిటో'' అని కుయెన్నాచ్చను.

కీవరీతుకి బొటబొటా కళ్లనీళ్లొచ్చాయి. కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్టని పించింది. ఏం చెప్పడం ...? ఎలా చెప్పడం ?

అదే సమయంలో కుట్టిఅమ్మ తోమాసుమేస్తరు పరుగు పరుగూన వచ్చారు.

కుట్టిఅమ్మ వస్తూనే 'పిన్నీ' — అంటూ పెద్ద గావుకేక పెట్టేసింది.

''ఏవిటే కుట్టిఅమ్మా ఏం కొంప మునిగిందే .... విషయమేమిచే తల్లీ ... ఎవర్నడిగినా చెప్పడం లేదు ... నువ్వయినా చెప్పవే అమ్మా ...'' అనడిగింది దీనామ్మ

కీవరీత్ .... విషయ మేవిట్రా ... అంటూ కుయెన్నాచ్చన్ ఒక్క అరుపు అరిచాడు.

''నాన్నా !''

''చెప్పరా !''

''రాజన్ పనిచేసే మిలిటరీ కార్యాలయంనుంచి టెలిగ్రాం వచ్చింది. ఒక్కొక్కప్పుడు అర్థం పర్థంలేని టెలిగ్రాంలుకూడా వస్తూంటాయి. అందుకని నిజమెంతో— అబద్ధమెంతో గూడా తెలీదు...'' అన్నాడు అవరాను.

''ప్రమాదంలో మరణించినట్టు టెలిగ్రాంలో రాశారులే'' అంటూ కీవరీతు మెల్లిగా గొణిగాడు.

తన చేతిలోఉన్న ఎర్రకాయితాన్ని కీవరీతు, తోమాసు మేస్టరు చేతికిచ్చాడు.

క్షణకాలం నడిచప్పుడు లేదు... పిడుగు పడ్డంత నిశ్శబ్దం.

''హా పరమేశ్వరా.. ఏవిటీ దారుణం...'' అంటూ దీనామ్మ బొబ్బలుపెట్టి ఏడ్చింది. తల్లిని చుట్టుకుని సిసిలీ బావురుమంది.

ఎటుచూసినా ఏడుపులు పెడబొబ్బలు...

ఎవర్నెవరు వోదార్చే స్థితిలో లేరు. ఓదార్చడం సాధ్యమా ? ఓదార్పుతో తీరేదా ? పెళ్ళయి యింకా పట్టుమని రెండు నెలలన్నా కాలేదే ? అంతలోనే— ఆయుస్సు తీరిందంటే నమ్మడం ఎలా ? ఇది ఎలా భరించడం ?... అంటూ గోలెత్తిపోయింది దీనామ్మ.

కీవరీతు చెప్పింది కుయెన్నాచ్చనుకి తిన్నగా వినపడ్డట్టులేదు. అందుకే ఆయన విలవిల్లాడిపోతూ ఏవిట్రా నాయనా ? ఏవిట్రా... అని పదేపదే అడుగుతూనే ఉన్నాడు గానీ, ఎవ్వరూ పట్టించుకోవడం లేదు.

ఏదో జరగరానిది... ప్రమాదమేదో జరిగిందని మనస్సుకి చూచాయగా తెలిసింది.... అంతే, బెంబేలు పడిపోయాడు. లేచి రెండడుగులు నడవబోయి పడిపోయాడు.

తోమాసు మేస్టరు చేయిపట్టుకుని లేవదీశాడు. విషయం తెలిసిన తర్వాత,

దిగులుగా... ఏదో... అయోమయంగా చూస్తూ నిలబడిపోయాడు. ఆఖరికి కళ్ల చెమ్మగిల్లనుకూడా లేదు... వచ్చినవాళ్ళు పట్టుకు తీసుకుపోయి మంచంమీద పడుకో బెట్టారు.

చుట్టుపట్ల ఉన్న జనం వడివడిగా వచ్చేస్తున్నారు. అలికిడి విని ఉలిక్కి పడ్డాడు. ఏ మాటవిన్నా ఉలిక్కి ఉలిక్కిపడటంగా ఉంది...

"నాన్నా రాజా ! నా కడుపున పుట్టలేదన్నమాటేగానీ... ; అయ్యో... సిసిలీ... మనం ఎంత దురదృష్టవంతులమైపోయామే శాంతమ్మ ... ఎలా భరిస్తుందే తల్లీ ! ముప్ఫయి రోజులన్నా యిద్దరూ కులాసాగా ఉండలేదుగదా..." అంటూ దీనామ్మ వలవలా ఏడుస్తూంది.

ఈ వార్త తెలియగానే ఫిలిప్సోసు కారేసుకుని వచ్చాడు. అందరు వొకరి మొహాలవంక ఒకరు చూసుకున్నారేగానీ, నోరువిప్పి మాట్లాడలేదు. కొంచెంసేపయ్యాక కీవరీతు— "మాత్తుకుట్టిని పిలిపించొద్దూ..." అనడిగాడు.

"వాడెక్కడున్నాడో ఎవరికి తెలుసు ? నేను డ్రైవరుచేతికి కారు యిచ్చి,— ఎక్కడున్నా వెతికి తీసుకురమ్మని పంపాలే—" అన్నాడు. అంతే,— ఇంకేం మాట్లాడలేదు.

ఈ కబురువిని వచ్చిన బంధువులు,— ఇరుగు పొరుగువాళ్లు ఏడుపులువింటూ పనస చెట్టుకింద, యింకా నూతిగట్టున తలొంచుకుని కూర్చుండిపోయారు.

"ఎటువంటి పుట్టుక... !" "దొరబిడ్డలా చక్కని..." "మేలోర్కుత్తువారి వంశంలోనే అంతటి అందం మరెవ్వరికి లేదుగదా... !"

"మాత్తుకుట్టి రెక్కలు తెగిపోయాయి."

"భగవంతుడు చేసింది భరించాల్సిందే,- గత్యంతరం లేదు." ఎవరికి తోచినట్టు వాళ్ళంటున్నారు.

"పుత్తనాట్టుకరాకి మనిషి వెళ్లాడా ?"

"తెలీదు."

"ఆ పిల్లదానితో ఏమని చెప్పడం ?"

"అయ్యో... ఈదెబ్బ ఎలా తట్టుకోగలదు ?"

"గీత... ..."

"ఓ విధంగా చూస్తే— ఆ పిల్లదాని దురదృష్టమే... జాతకాలంటే అదేమరి...

జాతకాలు... గ్రహాలు... నక్షత్రాలు కలవడం కలవకపోవడం అన్నది వట్టిదికాదు..."

"ఆఁ ... ఈ పెళ్ళిగ్రాం వచ్చినంత మాత్రాన నమ్మడానికి లేదు .... .... బహుశా ... , "

"బహుశాకి ఏం మిగల్లేదు.... చనిపోయాడట ..." అంటూ కుట్టిఅమ్మ కుయె న్నాచ్చను మంచంమీద కూర్చుంది.

"తాతయ్యా !"

కదల్లేదు. అటూయిటూ కదిలించింది ఉహుఁ ... స్పృహలేదు... కళ్ళు నోరు తెరుచుకునే ఉన్నాయి. . . మొహంచూస్తే భయంగాఉంది.

"తాతయ్యా !"

ఒకపెట్టున ఉలిక్కిపడి,— కనురెప్పలాడించి,—

"వెళ్ళిరా తల్లీ ! చింకిపాతలాటి ఈ శరీరంతో నే భూమ్మీద వేలాడుతూం టే,- నన్నేం చూడొచ్చావ్‌గానీ... పోయిరా."

కుట్టిఅమ్మ కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయింది.

"హే ప్రభో ! హే పరాత్పరా ! నన్నెందుకు బతికిస్తున్నావ్— తండ్రీ ! నే పిలిస్తే ఆమడ దూరానికెందుకు పోతున్నావ్ ? ఇశ్రాయేలీయుల పిలుపు విని ... సింహాసనాన్ని అధిష్ఠించినవాడా ! నువ్వు పవిత్రుడవు మా పూర్వీకులందరు నిన్నెంత గానో నమ్ముకున్నారు నీ అండతో నిలిచారు. నువ్వు వారిని కాపాడేవాడివిగదా !

నేను మనిషిని కాను .. కేవలం ఒక అల్పజీవిని. మనిషినని పేరు... అంతే... కానీ... లోకందృష్ట్యా నేను పాపిని. పనికిమాలినవాణ్ణి. కళ్ళయెదట కనబడుతున్న ప్రతివస్తువు నన్ను వెక్కిరించి హేళన చేస్తున్నట్టు తోస్తూంది ... నన్ను పుట్టించిన వాడివి నువ్వే... .

"మావయ్యా !"

"నాన్నా !"

"తాతయ్యా !"

యిప్పుడీ ఉన్న ఉద్యమానంలో యీ గోలేవిటి చెప్పు ? ఇంతకంటె నేనేం చెయ్యగలను ? నన్ను భూభారంగా ఎందుకు బతికించాలి ? అందుకే అడుగుతున్నా... కనుక్కుంటున్నా. . .

"నా బిడ్డేడీ ? పోయి వాణ్ణి పిలుచుకురండిరా. "

''పిలుచుకొస్తాం గానీ మీరు మెదలకుండా పడుకోండి.''

కొంతసేపటికి మాత్తుకుట్టి రానేవచ్చాడు. కాలినడకనే వచ్చాడు. వెంట ధర్మ సంఘం ఫాదరీ కాకుండా, మరో ఏడెనిమిదిమంది జనం ఉన్నారు. వాకిట్లోను... వరండాలోనూ... అంతటా జనం... మాత్తుకుట్టి ఎవ్వరివంక చూడలేదు ... సరాసరి తండ్రి మంచందగ్గరికి పోయి తలొంచుకుని కూర్చున్నాడు. మంచం పట్టెమీద తల ఆనించి, వెక్కివెక్కి ఏడ్చాడు. కాసేపయాక ఆ దుఃఖాన్నంతా మనస్సులోనే దిగమింగి— లేచి ''ఇక ప్రార్థన కానీండి ఫాదర్''— అన్నాడు గాద్గదికంగా.

''తండ్రియైన దేవునియెదట— పుత్రుని పవిత్రాత్మ'' కోసం ప్రార్థన చెయ్యడం మొదలెట్టాడు.

వెక్కివెక్కి ఏడ్పులు... వేడి నిట్టూర్పులమధ్య— ప్రార్థనలు వినబడటంలేదు.

మిలిటరీ కార్యాలయంనుంచి రాజన్ పెట్టె వచ్చింది. శాంతమ్మే ఆ కాయితం మీద సంతకం పెట్టి తీసుకోవాలి మరణవార్త తెలిసిన పదోనాడు ఆపెట్టె అక్కణ్ణించి వచ్చింది. అంతవరకు శాంతమ్మ వల్లమాలిన నిబ్బరంతో— ధైర్యం చిక్కబట్టుకుని, ఆ పరిస్థితిని ఎలా ఎదుర్కొందో! కుయెన్నాచ్చను మంచం దగ్గరే— అందరి సమక్షంలోను పెట్టెతెరిచి ఒక్కొక్క వస్తువు బయటికి తీసి చూస్తూ పెడుతున్నప్పుడు గూడా— శాంతమ్మ దుఃఖాన్ని ఆపుకుంది.

చిన్నారి సిసిలీ శాంతమ్మని పట్టుకుని నిలుచుంది దీనామ్మ, కుట్టిఅమ్మ అక్కడే ఉన్నారు. ఒక్కొక్క వస్తువుని చూసినప్పుడు సిసిలీ— అదుగో రాజన్నయ్యా షేవింగుసెట్టు... రాజన్నయ్యా కళ్ళజోడదిగో... రాజన్నయ్యా... అంటూ చెప్పుకుపోతోంది.

''ఊరుకోవే తల్లీ'' అని దీనామ్మ సిసిలీని హెచ్చరించింది.

ఆ పెట్టెలో రాజన్ శాంతమ్మకి రాసిన సగం సగం ఉత్తరంగూడా ఉంది. అది చేతిలోకి తీసుకుని, పెట్టెమూసి మంచం కిందకు నెట్టింది. కొంతసేపు దిండులోకి మొహందూర్చి పడుకుంది ... ఎంత ఓర్చుకున్నా దుఃఖం ఆగడం లేదు. ఎంత సముదాయించుకున్నా మనస్సు సమాధానపడటం లేదు.

శాంతమ్మకి కబురు చెప్పేందుకు బేబీ వెళ్ళాడు. తన భర్తకు ప్రాణమిత్రుడు బేబీ. పెళ్ళిచూపులప్పుడుగూడా తనే వచ్చాడు. అందుకని చెప్పలేనంత సంతోషంతో— అతణ్ణి చూసీ చూడగానే ఒక్కపరుగున వచ్చింది శాంతమ్మ.

బేబీ తనమొహంలో విషాదం కనబడకుండా ఉండేందుకు శతవిధాల ప్రయత్నిం చాడు. శాంతమ్మ అసలది గమనించనేలేదు...పాపం.

"రా అన్నయ్యా! కూర్చో... సోమవారంనాడు ఆయన దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. పదిహేనో తారీఖుతో స్కీము పూర్తవుతుందిట. ఇరవైనుంచీ సెలవు పెడతా నంటూ..." అని చెప్పుకు పోతూంది శాంతమ్మ.

"శాంతమ్మా! "

సంతోషంగా కబుర్లు చెబుతున్న శాంతమ్మకి ఎవరో ఛెళ్లున లెంపకాయ కొట్టి నట్టయింది.

ఒక్కసారి గుండెగుభేలుమంది. బేబీ కళ్ళల్లోంచి జలజలా నీళ్లు కారుతున్నాయి.

బేబీ ఏం చెప్పాడో— తనేం విందో... మర్చిపోయింది. గుర్తురాలా... మిన్ను విరిగి మీద పడ్డట్టయింది... స్తంభించిపోయింది తర్వాత— ఏదో...పిచ్చిపట్టిన దానల్లే ...ఆ కట్టుకున్న మాసిన బట్టలతోనే బయటికి పరుగెత్తుకు పోయింది.

అబద్ధం... అంతా వట్టిది.... నాకు చెప్పిందంతా అబద్ధం... నా రాజు బతికే ఉన్నాడు... ఎక్కడ... ఏ దేశంలో... ఉన్నా... వెతికి తెచ్చుకుంటా... అంటూ ఒక్కతై రోడ్డుకు అడ్డంబడి పరిగెత్తుకు పోతూంటే ఎవరు పట్టుకుని బండి ఎక్కించారో తెలీదు... ఆ బండిలోంచి ఎన్నిసార్లు దూకడానికి ప్రయత్నించిందో చెప్పలేం .. బండి మేలోర్టుత్తువారి గుమ్మంలోకి రాగానే బండిలోంచి ఒక్కదూకుదూకి ఎలా పరుగు తీసిందో.... ఒక్క ఉదుటను వరండాలోకివచ్చి ... రాజన్ అక్కడే ఎక్కడో ఉండా లనుకుంది .. అంతే, ఎక్కడికిపోయి ఉంటాడబ్బా... అనుకుంది... ఆంతకుమించి ఏం గుర్తులేదు...

రాజన్ పోయినట్టు టెలిగ్రాంవచ్చిన అయిదో రోజున— ప్రధానమంత్రి, స్థలసేనా ధ్యక్షుల తరపున కమాండింగ్ ఆఫీసరు పంపిన సందేశంలో—

"మీ భర్తగారి ఆకస్మిక మరణం మమ్మల్ని శోక సంతప్తుల్నిచేసింది. ఈ దుర్భర దుఃఖాన్ని భరించేందుకు మీకు శక్తిని నిబ్బరాన్ని భగవంతుడు ప్రసాదించు గాక — అంటూ సానుభూతిని తెలియజేశారు.

ఎన్నివిధాల ప్రయత్నించి చూసినా దుఃఖం ఆగడంలేదు... శాంతమ్మకి. పొంగి పొర్లివస్తూన్న దుఃఖంతోనే, కళ్లు తుడుచుకుంటూ తుడుచుకుంటూ ఉత్తరం చదువు కోవడం మొదలెట్టింది—

నిన్న నేమీ రాయలేకపోయాను పగలంతా స్టాండవుటు. రాత్రి లైటవుటు. యాంక్చువల్ యుద్ధమేననుకో. కొండమీద ఆ కొసను బెటాలియన్ పొజిషన్‌లోఉంది. ఇటువైపు మా రెజిమెంటు,

నిన్న ఉదయాన హెల్మెటు — యూనిఫారంలోదూరి, పచ్చని చెట్లకొమ్మలు మరుగు చేసుకుని, ఆ చాటునుంచి యివాళ పొజిషన్‌కి చేరుకున్నాం.

పై కొండమీదినుంచి ఆర్టిలరీ కవరింగు ఫయర్ జరుగుతూంది. నేలమీంచి రెండడుగుల ఎత్తులేచామో లేనేలేదో అనంత నారాయణ్‌కి గుండుదెబ్బ తగిలింది. దోవలోనే కూలిపోయాడు. స్ట్రెచర్ మీదేసుకుని తీసుకుపోయారు. పాపం ... సత్తువంతా పోయింది.

ఇవాళ నీ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చేరోజు. వచ్చి ఉంటుందనుకుంటాను. అయితే నా చేతికి రేపే వస్తుంది.

'జూలై 28'

ఇవాళగూడా నీ దగ్గర్నుంచీ ఉత్తరం లేదేం పిల్లా? ఏం జరిగింది? నువ్వు ఉత్తరం రాయకుండా ఉండవని నాకు తెలును ప్రతి మూడు రోజులకి నీ దగ్గర్నుంచి ఉత్తరం రాకపోతే నాకు తోచదు. స్థిమితం ఉండదు. తాతయ్య ఆరోగ్యం బాగాలేదేమో అనుకుంటున్నాను. ఆయనకి తగినంత శ్రద్ధగా ఉపచారం చేయవలసింది. ఆయన అందర్నీ — ఏయ్ .. పిల్లా... ఏ .. అమ్మాయి అనే పిలుస్తాడు. అలా పిల్చినంత మాత్రంచేత అపేక్ష లేకపోదు... అమర్యాద చెయ్యడమూకాదు. తన కొడుకులకోసం తన మనుమలకోసం మా తాతయ్య జన్మంతా నానా యాతనలు అనుభవించాడు. నాకు చిన్నప్పుడు మా తాతయ్యంటే అమిత భయం ..

స్కీములో రేపు ఎల్లుండి చాలా అపాయకరమైన శిక్షణ. శత్రువుల పోష్టుని మేం స్వాధీన పరచుకుంటావన్నమాట. శత్రువులంటే ఎవరోకారు ... మా సేనలో వాళ్ళనే పెడతారు. శత్రువులల్లే నటిస్తారన్నమాట. ఆ పోస్టు వశపరచుకోవడానికి నేను వాలంటియరు చేస్తానన్నమాట.

మొదట రాసినట్టు పదిహేనుతో స్కీము పూర్తికాగానే ఇరవైన బయలుదేరుతాను. నేను వచ్చేసరికి అన్నీ సర్దుకుని ప్రయాణానికి సిద్ధంగా ఉండవలసినది...

"సిద్ధంగా ఉండవలసింది" — అంటూ ఆ ఉత్తరం చేత్తోనలిపి అవతల పడేసింది.

"అమ్మాయ్!"

"ఊఁ"

"ఇట్రా తల్లీ!"

శాంతమ్మ లేచి తాతగారి దగ్గరికి వెళ్ళింది.

"కూర్చో."

శాంతమ్మ తాతగారి మంచంమీద కూర్చుంది.

"అమ్మడూ! ఎండి యేరింపులై మోడువారిన చెట్టల్లే నేనింకా పాతుకునే ఉన్నా ...పళ్ల విరగ్గాయాల్సిన పచ్చని చెట్టేమో పడిపోయింది..."

శాంతమ్మ ఏం మాట్లాడలేదు.

"నువ్వా చెట్టును పెనవేసుకున్న ద్రాక్ష లతవి. చెట్టుకూలిపోయింది ... అహ ర్నిశలు నా కిప్పుడు నిన్ను గురించే ఆవేదన... తల్లీ!"

... ... ...

"నీ కిప్పుడెవరు దిక్కు...?"

"దైవమే."

"ఔను... దైవానికి సాధ్యం కానిదేదీ లేదు..."

"హే పరాత్పరా... నన్ను రక్షించు నేను అగాధంలో పడిపోతున్నాను. ప్రవాహ వేగంలోబడి కొట్టుకు పోతున్నాను ఊబిలో కూరుకు పోతున్నాను ... మహా సము ద్రంలో మునిగి పోతున్నాను... హే ప్రభో..."

"తాతయ్యా ఊరుకోండి."

"ఎలా ఊరుకోనమ్మా! అమ్మడూ! జీవితమనే కోట గుమ్మందాకా నిన్ను తీసుకుపోయి,— బయట నిలబెట్టి,— లోపల గడియ పెట్టేసినట్టయిందే...? ఇప్పుడిక నీకు దారేవిటి తల్లీ!"

"నా దారేవిటో నే నిర్ణయించుకున్నాను తాతయ్యా!"

కుయెన్నాచ్చనుకి ఆమాట వినబడలేదు.

"చమురైపోయాక ఆరిపోబోతూన్న దీపాన్ని నేను. ఇంక మహాఉంటే — వో 'అరగడియ.' నే దారి బట్టగానే, నా దారినబడి నీ మామగారుగూడా వచ్చేస్తాడు. తర్వాత నీ అలీ గతీ ఎవరు కనుక్కుంటారు చెప్పు?

నీకేమన్నా కడుపున బుట్టిన సంతానం ఉందా?... పోనీ తృప్తిపడటానికి?

మెళ్ళో మంగళసూత్రం కట్టినవాణ్ణి గురించి తల్చుకుంటూ వాపోతూ జీవిత మంతా రోజులు లెక్కపెట్టుకుంటూ గడుపుకోవాలిసిందేగా?''

''తాతయ్యా!''

''అమ్మాయ్.... ఎలీమెలేకు భార్య నయోమి తన కోడళ్ళిద్దరితోను చెప్పినట్టే— నేనూ చెబుతున్నా నీకు... చూడు –, నువ్వు నీ పుట్టింటికి వెళ్ళు.

చనిపోయిన వారి పట్లను, నా పట్లను దయజూపినట్లే, యెహోవా నీయందును దయ జూపునుగాక.''

''అదేం జరగదు తాతయ్యా ! ''

''ఆఁ ?''

''ఒక వ్యక్తి నా చెయి పుచ్చుకుని యీ యింట్లోకి తీసుకువచ్చాడు. కాబట్టి నాయిల్లుయిదే. నాకు వేరే యిల్లులేదు...'' అంది శాంతమ్మ నిశ్చలంగా.

''అమ్మా యింత లేత వయస్సులో నిన్ను వైధవ్యదశలో ఎలా చూస్తూ ఉండ గలను చెప్పు తల్లీ!''

ఈ సంభాషణ వినబడి దీనామ్మ లోపలనుంచి వచ్చింది. ''మామయ్యా ! మీకు పుణ్యముంటుంది గానీ, — కాస్సేపు మాట్లాడకుండా ఉండండి.

మందు పుచ్చుకున్నాక, — అది వొంటబట్టి, మధ్యలో ఆరోగ్యం కొంచెం మెరుగయిందనే చెప్పాలి ... అటువంటిది మళ్ళీ యిప్పుడు మొదటికి రావడమే గాకుండా మరీ అధ్వాన్నంగా తయారైంది. చిన్న పిల్లల్లాగా ఎప్పుడూ నోరు మూత పడకుండా .. బడ బడ బడా వొాహటే వాగుడు.''

''నేనేం వాగాను ? నిజం చెబితే నిష్ఠురంగానే ఉంటుంది ఔను ..., ముందు ముందు ఆ పిల్లదాని గతేంకాను ? దాని భవిష్యత్తేవిటి ? ఆలోచించాలిగా ?

వెనక కొట్టంపల్లిలో మా బాబాయి భార్య ఉండేది. ఆవిడ పంట వసూలు చేసు కుందుకు యిల్లిల్లు గడప గడప తిరగాలిసి వచ్చింది. ఆవిడ పిల్లా పాప లేని గొడ్రాలు. మా బాబాయి పోయాడు. ఆయన వాటాకి వచ్చిన పది 'పరా'ల పొలమూ చిన్న మరి దికి అప్పజెప్పి మా పిన్ని పోయి తోడబుట్టిన దాని దగ్గర ఉండేది. ఏడాదికోసారి పంట వసూలుచేసుకోవడానికి వస్తూండేది.

ఆ గ్రామ తలారైన ఆ చిన్నమరిది మహా జిత్తులమారి వాడు, చేనేవిటి ... ? పంటేవిటి ? ఎవరిచేను ? కావాలంటే ఇక్కడే తింటూ పడుండమన్నాడట. మా పిన్ని

యీ విషయం యింటింటికి పోయి చెప్పుకునేది. ఆవిణ్ణి అందరూ చిన్నచూపు చూసే వారు. మధ్యమధ్య మా నాన్నతో ఫిర్యాదు చేసుకుందుకు వచ్చేది. నాకు బాగా గుర్తు .. అప్పుడు మా నాన్న — ఆయన తక్కువ వాడా ...,

అయితే 'కొచ్చువకీ' అబద్ధం చెప్పాడంటావా ? పండిన పంటలో కొట్టంపల్లి వాళ్ళకివ్వాలనేం అచ్చి ఉన్నామా ? అనడిగేవాడు,

పాపం ... ఆ యిల్లాలు ఆఖరికి దిక్కూ మొక్కూలేని చావు చచ్చింది. అనాధ ప్రేతం కింద ఎవరో తీసుకుపోయి ఆ పనచ్చిమూట చర్చి స్మశాన వాటికలో పూడ్చారు ... నేను కళ్ళారా చూశా ... అటువంటప్పుడు ఎలా ఊరుకోను ?

పదిహేడు పద్దెనిమిదేళ్ళ పిల్ల రూతు ... అత్తగారైన నయోమితో వెళ్ళింది. అత్తగారితో రూతు నువ్వువెళ్లే చోటికే నేనూ వస్తానంది. నువ్వుండే చోటే నేనూ ఉంటానంది. నీ వాళ్లే — నా వాళ్లు ... నువ్వు మరణించే చోటే నేనూ మరణిస్తానంది — నీ పక్కనే నేనూ పాతిపెట్టబడతానంది.

ఆ రూతులాగానే ఈ పిల్లదిగూడా నీ వెంటే వస్తే దాని భవిష్యత్తు ఏం కాను ?

నయోమి పెనిమిటికి బంధువొకడుండేవాడు. అతడు లక్షాధికారి. అతని పేరు బోయజు. రూతు -- 'నీ సెలవైతే నేనూ పొలంలోకి పోయి పరిగె ఏరుకుంటానని నయోమితో చెప్తేనూ, నరే పోయిరామ్మా అందిట. అప్పుడు రూతు వెళ్ళి — పొలంలో పంటకోసే వారి వెనకాలే పోయి ఏరుకుంది. అదృష్టం కొద్దీ ఆ రూతు వెళ్ళిన పొలం బోయజుదే.

అప్పుడు బోయజు పంటకోసే వాళ్ళమీద చూసేందుకు పెట్టిన మేస్త్రీని — ఆ చిన్నదెవరు' — ? అని అడిగే సరికి, — ఆ మేస్త్రీ ఆవిడ నయోమి వెంటవచ్చింది ... మోయాబు దేశపు యువతి ... అని చెప్పాడట.

ఆ పళాన బోయజు రూతుతో — అమ్మాయీ ! పరిగె ఏరుకోడానికి యితర పొలాల్లోకి పోవద్దు ... యిక్కడే నా పనిగత్తెల దగ్గర నిలకడగా ఉంటూ ఉండమన్నాడట ... అందుకావిడ అతడికి మోకరిల్లి ... తమకు నా పై యింతటి కటాక్షం కలగడానికి కారణం ఏవిటి అనడిగిందిట ..

అందుకు బోయజు — రూతుతో — , నీ పెనిమిటి మరణించిన తర్వాతగూడా నువ్వు నీ అత్తగారికి చేసిన సేవల్ని గురించి నే విన్నాను. నీ తల్లితండ్రుల్ని, — జన్మభూమిని విడిచి నీకు పరిచయం లేని జనం దగ్గరికి వచ్చి, ... ఉన్నావు ఇశ్రాయేలీ

యుల దేవుడైన యెహోవా ఛత్రచ్ఛాయలో శరణు బొందిన నీకు సంపూర్ణమైన ఫలము లభించుగాక ! ... అని దీవించాడట.

రూతు నయోమి చెప్పినట్టుగా స్నానం చేసి, పరిమళ ద్రవ్యాలు పూసుకుని, మంచి దుస్తులు వేసుకుని .,. ముస్తాబు చేసుకుని బోయజు దగ్గరికి వెళ్ళి ఆవిడ ఆయన్ని సంతోష పరచింది. ... అప్పుడావిడ గర్భవతియై వో కొడుకుని కన్నది. అతడే దావీదు.

ఆ దావీదు తాత ఓబేదు. దావీదు వంశావళి ఈ విధంగా ఉంది.

దావీదుకు సొలొమోను కుమారుడు. సొలొమోనుకు రెహబాము, అతనికి అబీయా, — అబీయాకు ఆసా, ఆసాకు యెహోషాపాతు, యెహోషాపాతుకు యెహోరాము, యెహోరాముకు అమజ్యా, అమజ్యాకు యోతాము, యోతాముకి ఆహాజు, ఆహాజుకి హిజ్కియా, హిజ్కియాకు మనష్షే కుమారుడు ... ఈ క్రమంగా మంతాను కుమారుడైన యాకోబుకి, మరియమ్మ భర్తయైన యేసేపు జన్మించాడు ...

మనిషి, — మనిషికి జన్మయిస్తాడేగాని, — ప్రాణం పొయ్యవలసిన వాడు మాత్రం ఆ యెహోవాయే. అతడు ప్రాణం యివ్వనూ గలడు ... కోరుకున్నప్పుడు తిరిగి తీసుకోను గలడు. మరణించిన వాళ్ళని బ్రతికించడం ... పాత నిబంధన కాలంలో నవీలు చేశారు. కొత్త నిబంధన రోజుల్లో ఏసుప్రభువే ఆ పని చేశాడు. లాసరుని బ్రతికించి సమాధి నుంచి లేపనెత్తిన వాడు ఏసు ప్రభువే

మార్తాతో ఏసు ప్రభువేమన్నాడంటే — తిరిగి బ్రతికించినా, ప్రాణం పోసినా నేనే నని చెప్పాడు. నన్ను నమ్మినవారు మరణించినప్పటికి...జీవించే ఉంటారన్నాడు. ... ఆ తరువాత ప్రభువు సమాధి దగ్గరికి వెళ్ళి — ఆకాశం వైపు చూస్తూ ప్రార్థన చేసి — ''లాసర్ లేచిరా'' అని కేకేశాడు. అంతే లాసరు సమాధిలోంచి లేచి యివతలకు చక్కావచ్చాడు.

ఆహా ! ఆ ప్రభునిరూపం ! తల్చుకుంటేనే వొళ్ళు పులకరిస్తుంది ఆ అంగీ, తేజోవంతమైన ఆ ముఖబింబము, నిర్భయంతో నిండిన ఆ దృష్టి, ... ఆ ఆజ్ఞాపించగల శక్తి ... ఆహాహా !

''లాసర్ ... బయటికిరా ... ,

''మావయ్యా !''

''ఊఁ''

''ఏవిటి మాట్లాడుతున్నారు ?''

''ఎన్నో విషయాలు గుర్తొస్తున్నాయమ్మా !''

''నిన్న రాత్రిగూడా నిద్రలో ఏదేదో కలవరించారు.''

''అవును. నిన్న రాత్రి మీ అత్తగారు ఈ వాకిట్లో నిలబడి కాపలి కాస్తున్నట్టు కనబడింది. అప్పుడావిణ్ణి— ఏం—ఇంత ఆలస్యం చేశావే అనడుగుతా... ఆవిడ,— ''కనబడటం లేదూ ? మంచులో తడిసి ముద్దయ్యుంటేను ? ముసలితనంలోగూడా యింత ఆత్రమైతే ఎలా ?... అంటుంది.

ఇలా రమ్మన్నాను.''

దీనామ్మ నవ్వి ''అయ్యోరాతా... ఏవిటి మీరు చెపుతుంది... ?'' అంది.

''శాంతమ్మేదీ ?''

''ఇక్కడే ఉంది.''

''మీ ఆయనెక్కడ ?''

''సందు చివరికి వెళ్ళారెందుకో... !''

''నాకిక కాలం ఆసన్నమైనట్టుంది... అడుగో... ఏడుపాశాల్ని కుడిచేత్తో పట్టుకుని దేవదూత,— ఏడు స్వర్గద్వీపాల మధ్య నిలబడి ఉన్నాడు ... నాకు కనబడుతున్నాడు.''

''మావయ్యా ! అంతా మీ భ్రమ... .''

''ఆ పిల్లది కనుక యిష్టపడితే రెండోపెళ్ళి చేసేది. మనమేం కట్నం పుచ్చుకోలేదుగదా ! అందువల్ల లెక్కాడొక్కా అప్పగించాలిసిన అగత్యమేం లేదు. దాని తాలూకు బట్టాపాతా యిచ్చి పంపడం... అంతే.

రెండోపెళ్ళని పేరేగాని,— దానికి పిల్లాపాప పుట్టలేదు కనుక పడుచుకిందే జమ. అందువల్ల ఎవరో వొకరు కావాలని కోరి చేసుకోకపోరులే.''

''మావయ్యా ! మీరు మాట్లాడకుండా ఊరుకుంటారా లేదా ?''

''మయెన్నా మాప్పిళ్ళా ! ఏవిటంటున్నావ్ ?''

దీనామ్మ ఎవరో అనుకుని తిరిగి చూసింది.

'కురుప్'.

''అరుగో చూడండి... మీ స్నేహితుడు వచ్చారు... ఎదురుగా కబుర్లు చెప్పుకోవడానికి ఎవరూ లేకపోతేగూడా ఈయనకి ధోరణి ఎక్కువవుతుంది...'' అంది

దీనాషమ్మ.

ఇంకెంత కాలమమ్మా... ఈ స్నేహమూ, ఈ స్నేహితులూ, మూణ్ణాళ్ళ పట్ట పగలు... అలసిపోయిన బాటసారి సత్రంలో కూర్చున్నప్పుడు— ఎవరో ఒకరు స్నేహమవుతారు... పొట్లంవిప్పి కలిసి తాంబూలం వేసుకుంటారు. ఏవేవో కథలు.... గాథలూ చెప్పుకుంటూ— వింటూ వెడతారు... వాళ్ళవాళ్ళ మజిలీ రాగానే సెలవు తీసుకుంటారు.... అంతే.

ఆఁ, నమస్కారం..., అంతేనంటావా కురుప్‌జీ !''

''అంతేనంటా కృష్ణపరమాత్మ చెప్పిందిగూడా అదే. 'అద్భుతమైన— త్రిగుణాత్మక రూపమైన,— నా మాయని అతిక్రమించగలగడం మిక్కిలి దుర్లభమైంది..., ఎవరైతే నువ్వే మాకు శరణ్యమంటారో, వాళ్ళని నేను ఈ మాయాజాలంలో పడకుండా కాపాడతాను'— అంటాడు ''

''ఇదుగో చూడు కురుప్...! దేన్నెవరు తప్పించుకోగలరు? బంధాన్ని తెంపుకోగలరు?.. ఇంతవరకు ఎవరికి సాధ్యంకాలా..., సన్మార్గుడుకానీ, దుర్మార్గుడుగానీ, పవిత్రుడుకానీ, అపవిత్రుడేకానీ యజ్ఞయాగాలు చేసినవాడుగానీ, చెయ్యనివాడుగానీ, ధర్మాత్ముడేగానీ, అధర్ముడుగానీ, ఎవ్వరైనా సరే ... ప్రారబ్ధం అనుభవించి తీరాలిసిందే. కర్మసాక్షియైన సూర్యుడి సమక్షంలో జరిగేపనిని వివేకంతో వివేచించడమే మన కర్తవ్యం వివేకాన్ని కోల్పోయినవాడు దుఃఖ భాజనుడవుతాడు మనిషికి సుఖ దుఃఖాలు రెండూ భగవత్ప్రసాదాలే కాదుట్రామరీ...?'' అన్నాడు...కుయెన్నాచ్చను.

'రా' అనే సంబోధన విని కురుప్ చకితుడయ్యాడు. ఇంతవరకు ఎన్నడూ అలా అని యెరగడు... అయినా దాన్ని లక్ష్యపెట్టకుండా—,

''ఔను, ... అంతామాయే...'' అన్నాడు.

''అది సరేలేగానీ. మనిద్దరికి పరిచయమయి ఎంతకాలమైందంటావ్?''

''రెండేళ్ళు...''

''ఆహా! ... శ్రీ॥ శ॥ యాభై లో గాబోలు మనిద్దరం ములత్తరా వాళ్ల పొలాలు- వాటాలు పంపకాలు చేశాం గదా? నీ యిల్లు బంగారంగానూ, అప్పుడే మర్చిపోయావయ్యా?''

ఆ ధోరణినిబట్టి— ఆయన మతి తిన్నగా లేదన్న సంగతి గ్రహించాడు కురుప్.

''కుయెన్నామాప్పిళ్ళా!.. ఏమిటి నీ ధ్యాస యిక్కడ లేనట్టుంది...? నన్ను

బాగా చూస్తూన్నావు .. గుర్తుపట్టినట్టే ఉన్నావ్‌గానీ...''

''అహఁ ... నువ్వెలా మర్చిపోగలవ్‌లే ... నీ పెద్దకూతురి పెళ్ళికి కట్నం కోసం పెళ్ళికొడుకువేపువాళ్లు రాబోతున్నారని తెలిసి నువ్వు — 'ఈ పాపి ఇహ భూశయనం చెయ్యాల్సిందే— అంటూ వెల్లికిలా పడిపోయావుకదూ?' ఆ పరిస్థితిలో నీకు సాయపడింది ఈ మేలోఘుత్తు కుయెన్నైనాయేగా. . . నీ తస్సాదియ్యా. . . అప్పుడే మర్చేపోయావే ? ''

''కుయెన్నామాప్పిళ్ళా ! ''

''ఊఁ ''

''నేనయ్యా . . . శివరాం కురుప్‌ని.

... ... ...

''కుయెన్నామాప్పిళ్ళా ! ''

మళ్ళీ కదల్లేదు.

కళ్లు మూతలు పడ్డాయి. గాఢ నిద్రపోతున్నట్టు గుఱ్ఱుపెడుతున్నాడు.

కుయెన్నాచ్చను కళ్ళు తెరిచి చూసేసరికి ఇంటినిండా జనం, నల్లదుస్తుల్లో ఫాదరు. అగరు ధూపంవేస్తు కూడా సహాయకుడు — మత్తాయి, ... ఆడవాళ్లు ... పిల్లలు...

ఫాదరు వంగి కుయెన్నాచ్చను వంక తదేక దీక్షగా చూస్తూ తైలాభిషేకం చెయ్యమంటావా కుయెన్నాచ్చన్— అనడిగాడు.

చెయ్యమన్నట్టు అంగీకారాన్ని సూచించాడు కుయెన్నాచ్చను. ఫాదరు, కుయెన్నా తలమీద చెయిపెట్టి,—

''హే ప్రభో! నీ బలిష్ఠమైనట్టియు, అభయమిచ్చునట్టియు దక్షిణ బాహువును ఈ దాసుని మీద ఉంచమని, నా బలహీనమైన చేతిని నీ పవిత్రమైన పేరున ఇతనిమీద ఉంచుతున్నాను...'' అని విన్నవించుకున్నాడు,

ఆ తరువాత ఫాదరు మళ్ళీ తలవొంచి —

''మాద్యోన్యూసో''— ప్రార్థనా వాక్యాన్ని మీరంతా చెబుతూ మీమీ పాపాల్ని ఒప్పుకోవాలి... అని హెచ్చరించాడు.

కుయెన్నాచ్చను సణిగినట్టు గొణిగాడు.

ఫాదరు మళ్ళీ— ప్రార్థన ప్రారంభించాడు.

"ఓ తండ్రియైన ప్రభూ! నీ పవిత్రతచే నీ పుత్రుని ఆత్మ పవిత్రమగుగాక! తెలిసి తెలియక చేసిన తప్పులన్నియు క్షమింపబడుగాక! చిత్త వికారములన్నియు తొలగుగాక!" అంటూ కంటిరెప్పలమీద శిలువాకారంగా అత్తరు పూస్తూ, ఫాదరు-

"హే ప్రభో! పరిశుద్ధమైన ఈ తైల లేపనము వల్లను, నీ దయవల్లను, కన్నులు చేసిన పాపాలు క్షమింపబడుగాక! అని," ఆ తరువాత...

ముక్కు, చెవులు, పెదవులు, చేతులు, కాళ్ళు,— నాభి .. మీద శిలువాకారంగా అత్తరుపూసి .., పై విధంగా ప్రార్థించడం జరిగింది.

తైలాభిషేకం జరిగిన తర్వాత పాదరీకి,— సహాయకులకు దక్షిణలిచ్చి పీడ్కొల్పారు.

వచ్చిన బంధుమిత్రులందరు ఎక్కొక్కరే వెళ్ళిపోయారు. కీవరీతు, కుట్టి అమ్మ, తోమాసు మేస్టరు ఇంకా మిగిలిన కుటుంబ సభ్యులుమాత్రం ఉండిపోయారు.

"మందు వేసుకోవడం..., పథ్యంచెయ్యడం మానేసినందువల్లే మళ్ళీ జబ్బు తిరగబెట్టిందన్నాడు తోమాసు మేస్టరు ... ఈ వయసులో పథ్యం — పానం చెబితే వింటారా" బాబూ అన్నాడు కీవరీతు.

"నేననేది అదికాదు మావయ్యా! డాక్టరు చెప్పినట్టు తాతగారికి వయస్సువల్ల కలిగిన అనారోగ్యంకాదు—"

"అది నిజమేననుకోవోయ్ ... ఈ తొంభై యేళ్ళ వయసులో ఇంకా యింత మాత్రం దార్ఢ్యంగా ఉన్నవాళ్లు ఈ ఊరి మొత్తంమీద ఎవ్వరూ లేరు ..." అన్నాడు కీవరీతు.

"పథ్యంసంగతి మనం చెబుతాంసరే, .. ఆయన మన మాట పాటిస్తేగదా..." అన్నాడు మాత్తుకుట్టి.

"తాతయ్య నే చెబితే వింటారుగా ... ఇదుగో ... వెళ్ళి డాక్టరు దగ్గిర్నుంచి మందుతెస్తా..." అన్నాడు తోమాసు మేస్టరు.

"సరే అయితే యింకేం? నీ ప్రయత్నం నువ్వుకానీ." అంటూ కీవరీతు మాత్తుకుట్టిని తీసుకుని వాకిట్లోకి వెళ్ళాడు. ఇద్దరుపోయి పనస చెట్టుకింద చతికిలబడ్డారు ....కొంతసేపు యిద్దరూ మౌనంగా కూర్చున్నారు. పనస ఆకు ఈనెతో నేలమీద గీతలు గీస్తూ ఉండిపోయారు

"అయిందేదో అయింది... నాన్న స్థితిచూడబోతే యిలా ఉండె. ఏ వేళప్పుడు

కన్ను మూస్తాడో ఏమో... అప్పుడిక నీ గతేంకాను చెప్పు...'' అనడిగాడు కీపరీతు.

మాత్తుకుట్టి ఏం మాట్లాడలేదు

అన్నిటికి ఆ భగవంతుడే ఉన్నాడన్న దృఢ విశ్వాసంతోనేమో ఆకాశం వంక తదేక దీక్షగా చూస్తూ ఉండిపోయాడు.

"ఇంతకాలం నీ యిష్టారాజ్యంగా, ... స్వేచ్ఛగా తిరుగుతున్నావు కుర్రవాడేదో కొంతడబ్బు పంపేవాడు... దీనామ్మ అపపెట్టి యిల్లు దిద్దుకుపోయేది ... బాగానేఉంది కానీ... ఇహ నువ్వు చెయ్యాల్సిందేవిటి? ''

''ఏం చెయ్యాలి... ఏమైతే అదవుతుంది ''

''నా మాట వినరా... చూడు... ఇప్పటికీ నువ్వింకా నీ బాధ్యతను గుర్తించక పోతే ఎలా? ఎప్పుడు తెలుసుకుంటావురా? ''

''అంటే... నన్నేం చెయ్యమంటావిప్పుడు? ఎవరిగీత ఎలాఉంటే అలా జరుగుతుంది.''

''అహ... ఏదైనా ఓ వ్యాపారం పెడితేసరి.''

''ఆ. వ్యాపారం మాటలతో ఒప్పుతుందా... డబ్బు కావొద్దూ? ''

''డబ్బు ఎలాగో అలా సమకూర్చుకోవాలి...నువ్వే అన్నావ్ కదురా... మిలిటరీ కార్యాలయంనుంచి వెయ్యిరూపాయలు వస్తాయని ..? దాంతోబాటు ఇంకొంచెం ఎక్కడైనా అప్పుతీసుకునేది. సందుచివర ఓ దుకాణం పెట్టేది ..''

''ఎండునేలు అప్పు కావాలంటే ఎవడిస్తాడు మనకి చెప్పు. మనలో ఆర్థికంగా బాగున్నవాళ్లా ఒక్క ఫెయిలైపోయేగదా! వాడు పోటు పెడతాడంటావా?''

''వాడికి నేను నీమాట చెప్పడం అయింది. కానీ... వాడేం ఉలకలేదు పలకలేదు. వాడికి తల్లి - తోడూ అనే ఆపేక్ష తెలియకపోయె.''

''అదే నేననేది.''

''నిజమే... నేను ఒకో వాటాదారుణ్ణి ఏర్పాటుచేస్తా. మరి నువ్వు బాధ్యతతో నిర్వహిస్తానంటే సుమా ?''

''ఎవర్ని ?''

''శివరాం కురుప్‌ని. అతడే నాతో అన్నాడు. అతగాడు వ్యాపారంలో కిటుకులన్నీ తెలిసినవాడు. ఎంతో కాలంగా షణ్ముఖం పిళ్లై దుకాణంలో గుమాస్తాగా పని చేస్తున్నాడా మరి ?"

కొంచెం సేపటివరకు మాత్తుకుట్టి ఏం మాట్లాడలేదు. పచారు దుకాణమంటే మంచిదే... రామకృష్ణన్ దుకాణం దాదాపు మూసేసినట్టే... పోతే ఈ పేటలో పచారు కొట్టంటూ వేరెలేదు.... అప్పులు సప్పులు పెట్టకుండా ఉండి— ఎలాగో నిలబడి నిర్వహించుకోవచ్చు ... అయితే... ఆ శివరాం కురుప్‌గాడో ఛండాలుడు... వాణ్ణి వాటాదారుడుగా ఎన్నుకుని దుకాణం పెట్టుకోవడం... క్షేమమేనా అని .. ?''

''ఒరే వాడు ఛండాలుడే అనుకో ... పెత్తనమంతా నీ చేతుల్లోనే ఉంటుంది గదరా! వ్యాపారంలో ఉండే కిటుకులన్నీ వాడికి తెలుసు కనుక...''

అన్నదమ్ములిద్దరూ మరికొంత సేపు మౌనంగా కూర్చున్నారు.

''రేపోసారి అతణ్ణి కలుసుకుని— మరోసారి అడిగిచూస్తా— ఆ తరువాతనే నిర్ణయానికి వద్దాం... అవునూ, మరైతే ఆ పిల్లదాని విషయం... ఏమిటంటావ్ ?''— అనడిగాడు కీవరీతు. ''వాళ్ళ అమ్మేమన్నా చెప్పిందా ?''

''ఏమని ? ''

''ఆ పిల్లది చిన్నది. దాన్ని మనం యిక్కడ బంధించి ఉంచడం మంచిదికాదని నా ఉద్దేశం.''

మాత్తుకుట్టి మెదలకుండా ఊరుకున్నాడు.

''నా ఉద్దేశంలో ఆ పిల్ల పుట్టింటికి వెళ్లడమే ఉత్తమంరా. మనం ఎలాగూ పోగొట్టుకున్నాం... నిర్భాగ్యులం... , పాపం ఆ చిన్నది తన జీవితాన్ని నాశనం చేసుకోవడం దేనికి ?''

''ఆ విషయం నేను నిర్ణయం చేసేసుకున్నా మావయ్యా ?''

''ఆఁ ?'' అంటూ వెనక్కి తిరిగి చూశాడు... శాంతమ్మ, నూతి పళ్లెంమీద నిమ్మచెట్టు దగ్గర తలవొంచుకుని నిలబడి, నిమ్మఆకొకటి కోసి వేళ్ళమీదేసి రుద్దుకుంటూ,— ''ఈ జీవితంలో యిక మరొకరితో సంబంధం పెట్టుకోదల్చుకో లేదు. ఈ యింటికి రావడమైపోయింది... ఇక వేరేయింటికి పోవడం కల్ల...'' అంది.

''అమ్మా ఒక విషయం నిర్ణయించేందుకు మునుపు బాగా ఆలోచించాలి... పర్యాలోచించాలి తల్లీ !''

''బాగా ఆలోచించే యీ నిర్ణయానికి వచ్చా మావయ్యా !— '' అంటూ మొహమెత్తి నిస్సంకోచంగా ఆ అన్నదమ్ములవంక చూసింది. అలా చూసినప్పుడు ఆ మొహంలో చెప్పలేనంత గాంభీర్యం, తొంగిచూసింది... అంతేకాదు— దృఢనిర్ణయం

కొట్టొచ్చినట్టు కనబడుతూంది.

"నువ్వు లోపలికి పోమ్మా!"

శాంతమ్మ నూతివెనకనుంచి వంటింట్లోకి చక్కాబోయింది. అంతలో ఫిలిప్పోసు సైకిలేసుకుని హఠాత్తుగా వచ్చాడు. వేగంగా సైకిలు తొక్కినందువల్ల- చెమటతో తడిసి ముద్దయినాడు.

"ఏవిటి తైలాభిషేకం అయిపోయిందా?"

"ఆ..., ఇంత సేపటిదాకా ఏమైనావ్?"

"ఏమైనానా? కాళ్ళుకాలిన పిల్లిలా వందన్నర వ్యవహారాల వెంటబడి పరిగెత్తుతున్నా. బండి రిపేర్ షాపులో ఉంది. ఎగిరి చక్కాపచ్చేందుకు రెక్కల్లేవుగదా?"

"మాటవరుసకి ఎక్కడున్నావనడిగితే— అంత రుసరుసలాడుతావేరా?"

"ఆ... రుసరుస కాదు— పాడూకాదు..., నాన్న వొంట్లో ఎలాఉంది?"

ఫిలిప్పోసు తండ్రి మంచం దగ్గరికి వెడుతూఉండగా- 'ఒరె ఫిలిప్పోస్'— అంటూ కీవరీతు పిల్చాడు

ఫిలిప్పోసు వెడుతున్నవాడు కాస్త ఆగి నిలబడ్డాడు.

"పోయిన ఆదివారం నీతో నేను మాత్తుకుట్టి విషయం చెప్పినప్పుడు నువ్వేం మాట్లాడలేదు. ఏ పనీపాటూ లేకపోతే వాడెలా బతుకుతాడు చెప్పు"— అన్నాడు.

"ఎలా బతుకుతాడో! నన్నడిగితే నేనేం చెప్పను? నాది ముప్ఫయివేలతో కూర్చిన పని. ఇప్పటికి మూడొంతులు మాత్రం పూర్తయింది. ఇంతవరకు పైసా చేతికివస్తే ఒట్టు. ఆశాపాతకుడైన ఇంజినీరొకడు దాపరించాడు నాకు. లంచం పెట్టక పోతే బిల్లు పాసుచెయ్యడు. దొరికినంతవరకు అంతటా అప్పులు తెచ్చి పని జరిపిస్తున్నా."

"అది నీ సొంతవిషయమనుకో."

"ఔను... నా స్వవిషయమే."

"సర్లే, ముప్ఫయివేలు— నలభయివేలు లెక్కలన్నీ మా కెందుగ్గానీ, నీకు యివ్వాలని— సాయం చెయ్యాలని ఉందో లేదో తేల్చిచెప్పు."

"చెప్పేందుకేముంది? ఉన్నమాట చెప్పేశాగా?"

"అవును... కీవరీతు అన్నయ్య పొరబాటే చేశాడు. తమ్ముడికేవో సాయం చెయ్యాలని తాపత్రయ పడ్డాను..." అనుకున్నాడు తనలో మాత్తుకుట్టి.

ఫిలిప్పోసు మెదలకుండా, తిన్నగా కుయెన్నాచ్చను మంచం దగ్గరికి వెళ్ళాడు. దీపం వెలుగుతూంది మంచం దగ్గర్నుంచి సాయంకాలపు ప్రార్థనా గీతం— ఉచ్ఛ స్థాయిలో ఆలాపిస్తూండటం— వినిపించింది.

ఆ గీతం వింటూంటే మృత్యువు గుమ్మంలోకి వచ్చి తలుపు తట్టుతూందా అని పించింది...

కుయెన్నాచ్చను పూర్తిగా కోలుకున్నాడని చెప్పడానికి లేదుగానీ, ఏదో కాస్తలో కాస్త మెరుగు. దానికి కారణం మందూమాకు కాదు ... పథ్యము పానమూ కాదు. కేవలం శాంతమ్మ శ్రద్ధగా చేస్తున్న ఉపచారమే.

శాంతమ్మ- జీవితానికి తగిలిన భయంకర ఆఘాతాన్ని తట్టుకుని బయట పడటం— అసంభవ మనిపించినప్పటికి, తనను ఏదోవొక నూతన శక్తి— తేజస్సు ఆవహించినట్టు నిలబడింది. ఆ పిల్లదానిలో వో కొత్త పరిణామం... ఒక నరికొత్త జీవితానికి నాంది పలికింది.

తాను పోగొట్టుకుంది తుచ్ఛమైంది... తను పొందవలసినది ఉన్నతమైంది... అంటూ ఆ పిల్ల అంతరాత్మ ఘోషించింది వెనకటికి ... ఆ రాజకుమార్తెల్లాగా .... అమర ప్రేమికుని కోసం... చమురు నిండాపోసి దీపం వేసుకుని అతని రాకకి ఎదురు చూడాలి. అదే ఆమె జీవితలక్ష్యం కావాలని దైవవాక్కు స్వర్గంలో ఉన్న వరునికి స్వాగతం పలకడానికి, చేతిలో దివ్వెలు పుచ్చుకుని పదిమంది రాజకుమార్తెలు... స్వయంవరానికి బయలుదేరారు. వారిలో అయిదుగురేమో తెలివిగలవాళ్ళు. మిగతా అయిదుగురు పట్టి అప్రయోజకులు. ఆ తెలివితక్కువ వాళ్ళయిదుగురు చేతిలో దీపమైతే పుచ్చుకున్నారుగానీ, అందులో అంటుపోతే పొయ్యడానికికూడా నూనె తెచ్చుకోలేదు.

పెళ్ళికొడుకు రావటానికి ఆలస్యం అయ్యేసరికి అందరికీ నిద్ర ముంచుకు వచ్చింది. అర్ధరాత్రి వేళప్పుడు పెళ్ళికొడుకు దిగాడు. స్వాగతం చెప్పేవారి కోలా హలం మిన్నుముట్టింది. ఆవళాన అందరూలేచి దీపం హెచ్చుచేశారు. అప్పుడా మూర్ఖు రాళ్ళు తెలివిగల కన్నెపడుచులతో మా దీపాలు కొండెక్కబోతున్నాయి కనుక కాస్త నూనె పోకిప్పించండి అనడిగారు. తెలివిగల కన్నెపడుచులు అమ్మో ఇప్పుడం ఇస్తే మాకూ మీకూకూడా ఎటూ చాలకుండా పోవచ్చు. అందువల్ల మీరు వర్తకుల దగ్గరకు పోయి కొని తెచ్చుకోండి.... అని సలహా యిచ్చారు.

తీరా ఆ తెలివితక్కువ వద్దమ్మలు నూనె తెచ్చుకుందామని వెళ్ళేసరికల్లా పెళ్ళి

కొడుకు రానేవచ్చాడు. అక్కడున్నవాళ్లే అతనితోబాటు విందులో పాల్గొన్నారు. తలుపులు మూసేశారు. అప్పుడు మెల్లిగా తెలివితక్కువ రాజకుమార్తెలు వచ్చి ప్రభో హే ప్రభో ! తలుపు తెరవమని గోలెత్తారు మీరెవరో మాకు తెలీను...అని అవతలనుంచి జవాబు వచ్చింది

శాంతమ్మ తైలపాత్ర — దీపకన్నెల సామెతగా అయింది. ఆ భగవద్దర్శనం కోసం నిరీక్షిస్తూంది ఇతరులకిగూడా అదే బోధిస్తూంది.

తెల్లవారి జామునసగా లేస్తుంది. కుయెన్నాచ్చను మంచం దగ్గర కూర్చుని ప్రార్థనా గీతాన్ని ఆలాపిస్తుంది శాంతమ్మ పాటతో ఆ పసచ్చిమూట గ్రామం మేల్కొంటుంది.

ప్రార్థన ముగించి — ఇంటెడు చాకిరీ చేస్తుంది. కుయెన్నాచ్చనుకి ముందు కాఫీ వగైరాలన్నీ అందిస్తుంది. ఆ తర్వాత సువార్తా ప్రచారం కోసం వెడుతుంది ఇరుగు పొరుగు పల్లెలకిపోయి వస్తుంది. తిరిగి వచ్చేసరికి ఒక్కొక్క రోజు రెండు జాములు దాటుతుంది. దీనామ్మ మాత్రం రోజంతటిలో ఒకసారి వంటపని మాత్రం చేస్తుందంతే.

శాంతమ్మ పల్లెనుంచి తిరిగివచ్చి మళ్ళీ యథాప్రకారం ఇంటి బాధ్యతలు చూసుకుంటుంది.

కుయెన్నాచ్చను ఆరోగ్యం కుదటపడినట్టుగా తోచిందేకాని, ఆ స్వస్థత నిలకడ లేనిది. కేవలం క్షణికమైందిగానే తయారైంది. దీపంలో చమురు అయిపోతున్నట్టుగా- అది చివరివెలుగల్లే ఉంది. ముందు కొంతకాలంగా వివసుండా పుచ్చుకుంటూనే ఉన్నాడు. అంతలో కడుపులో జబ్బుచేసింది. అజీర్ణం పట్టుకుంది. బలహీనం ఎక్కువపడం మొదలైంది లేచి నిలబడితే తల తిరుగుతుంది. మధ్యమధ్య మగతతో పడి ఉంటాడు... ఏదో మతిలేనంతా మాట్లాడుతుంటాడు. మనిషిని చూడగానే ఏవో మాట్లాడుతాడేగాని ... పటుక్కున గుర్తించలేడు. చిన్నపిల్లల్లాగా మొండిపట్టు పడతాడు

ఈ పరిస్థితుల్లో శాంతమ్మ చేసే ఉపచారమొక్కటే కుయెన్నాచ్చనుకి కొంత ఉపశాంతిగా ఉంది. మూడురోజుల కొకసారి ఒంటికి నూనెరాచి వేడినీళ్ళతో స్నానం చేయించడం, చలికాలంలో పొద్దున్నే కుంపటి రాజేసి చలికాచడం, రాత్రిళ్ల మూడు నాలుగు దఫాలు వేడివేడి కాఫీ ఇవ్వడం, మామూలు

ఆయనకి కొంచెం హాయిగా ఉన్నట్టు తోస్తే— ''అమ్మా ! చివరి ఘడియల్లో

నా ఉపచారానికి నువ్వు అమురుతావని— ఎవరికి తెలుసు ? అమ్మడూ ! విసుగు విరామం లేకుండా ఇంత ఉవచారం చేస్తున్న నీకు ఇచ్చేందుకు నా చేతిలో ఏమీ లేక పోయెగదా !'' అంటూ విచారపడుతూంటాడు.

''తాతయ్యా ! మీరలా అనరాదు ''

''అవును తల్లీ ! నా దగ్గరేముంది చెప్ప ఇద్దామన్నా... ?''

''దీవెనే ... అది చాలు...''

''దీవెన ? నా దీవెనకి ఏం మహత్తేడ్చిందిట ? నా దీవెనే ఫలించిఉంటే... ? నీ కొంప నిలువునా కూలిపోయేదా తల్లీ ! కాటికి కాళ్లుజాపిన నేను యింకా...''

''చాలు ఆపండి తాతయ్యా ! అటువంటి మాటలెందుకు చెప్పండి ! భగవంతుడి నిర్ణయమేవిటి ఎవరూ తెలుసుకోలేరు. నేను ఈ యింటి కోడలనవుతా ననుకున్నానా ? ఈ సంబంధం యిష్టంలేదని మీరు ఉత్తరం రాయిద్దామనిగూడా అనుకున్నారుగదా— అప్పుడు ?''

''ఔను... నిజమేనమ్మా.''

''అంతా భగవదేచ్ఛ... మనచేతిలో ఏమీలేదు. ఏదో అనుకుంటాం గానీ...'' అంటుంది శాంతమ్మ.

శాంతమ్మ జనసంచారం లేని కాలిబాటగుండా,— ఒంటరిగా ఏదో తెలియని... కంటికి కనబడని గమ్యం కోసం వెతుక్కుంటూ పయనిస్తుంది.

శాంతమ్మకి ఎప్పుడైనా కాస్త మగవారి సాయం కావాలసివస్తే—. దేనికైనా బేబీయే నేనున్నానంటూ పలుకుతాడు. ఆదుకుంటాడు.

మిలిటరీ కార్యాలయానికి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపాలన్నా,— బస్తీకి పోయి అవసరమైన వస్తువులు తెచ్చిపెట్టాలన్నా, పుత్తనాట్టుకర్రా వెళ్ళి శాంతమ్మ తల్లి యోగ క్షేమాలు కనుక్కొ రావాలన్నా... సమస్తం బేబీనే చేసిపెడతాడు.

కానీ రాజన్ పోయిన తర్వాత బేబీ మాట్లాడటం చాలా తగ్గించేశాడు. ముభావంగా ఉంటాడు... గంభీరంగా ఉండటం మొదలెట్టాడు.

రాజన్ పెళ్ళయి వచ్చేవరకు— వాళ్ళిద్దరూ ఎంతో హుషారుగా ఎన్నెన్నో కబుర్లు చెప్పుకోవడాలూ, నవ్వుకోవడాలు అన్నీ శాంతమ్మకి గుర్తే.

బేబీ.— లీలామ్మ యిప్పుడు విడిగా యిల్లు అద్దెకు తీసుకుని ఉంటున్నారు. ఇంట్లో తల్లి యిద్దరు చిన్నపిల్లలు, లీలామ్మ రెండు మాసాల పసిగుడ్డూను... యింత

మంది ఉన్నారు. ఆదాయమూ ... నెలసరివచ్చే జీతంరాళ్లే ... గృహకృత్యాలతో బాటు—, ప్రాణమిత్రుడి అకాల మరణంగూడా ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూఉండే బేబీని విపరీతంగా కుంగదీసేశాయి.

ఒకనాటి మాట. శాంతమ్మ నాలుగైదు మైళ్ళ దూరానికి కన్వెన్షనుకి వెళ్ళి యింటికి తిరిగి వచ్చేసరికి— వంటింట లీలామ్మ చంటివాణ్ణి వొళ్ళో పెట్టుకుని కూర్చుని— ఏవో కబుర్లు చెబుతూండటం చూసింది. ఆ విషయం పట్టించుకోకుండా శాంతమ్మ వస్తూనే, — పిల్లవాణ్ణి ఎత్తుకుందామనే ఆరాటంతో చేతులు జాపింది. తరువాత వొదినా... ఎన్నిరోజులైందమ్మా నిన్ను చూసి అని ఎంతో ఆప్యాయంగా పలకరించింది.

''బేబీ అన్నయ్య పెన్షను ఫారాలు పూర్తిచేయించి తీసుకువెళ్ళాడు... వారమైంది...'' అంది అమాయికంగా శాంతమ్మ.

''ఆలాగేం? పాపం... ! బేబీ అన్నయ్యని చూడనంత మాత్రాన కంటికి కునుకు రావడం లేదన్నమాట ? పోనీ ఆయన్ని ఇక్కడే అట్టే పెట్టేసుకుంటే పోతుందిగా...'' అంది లీలామ్మ కటువుగా

''ఇదుగో లీలామ్మా ! బుద్ధితక్కువ మాటలు మాట్లాడకు. ఎవరో గిట్టనివాళ్లు పుట్టించే మాట పట్టుకుని ? ... నాకు తెలీదనుకున్నావా ?'' అంటూ దీనామ్మ అడిగేదేదో గట్టిగా అడిగింది.

''అబ్బో యిప్పుడు చేస్తున్నదంతా ఏవిటో మహా ? బయల్దేరింది పత్తిత్తు...''

''నేనంత అమర్యాద పనేం చేశానంటావ్ ?'' అనడిగింది శాంతమ్మ.

''ఏం చేశావో నాచేత వేరే చెప్పించాలాయేం ?''

''ఔను... చెప్పకపోతే ఎలా తెలుస్తుంది ?''

''ఊరుకో శాంతా ! ... అనిపించుకుంది చాలు ... నువ్వవతలికి పోమ్మా...'' అని చెబుతూ దీనామ్మ, —

''లీలమ్మా ! వోపక్క మీ తాతయ్య చావుబతుకుల్లో ఉన్నారు. ఆ పిల్లది తన దురదృష్టాన్ని తల్చుకుని మనస్సులో కుమిలి కుమిలిపోతూంది. ఎవరో ఏదో అన్నారని కాదు... యథార్థమేవిటో మనమూ రవంత ఆలోచించాలిగదా ? చెప్పు'' అంది దీనామ్మ తడబడుతూ...,

''నువ్వూ నాకొక్కత్తెకు బుద్ధిచెప్తే ఏం లాభం పిన్నీ ? అందరికీ తెలియా

ల్సిందే,—''

''ష్... అదికాదు... లీలామ్మా... చెప్పాగా ... నీకెందుకు... నువ్వెళ్ళిరా... పిన్ని మాట ఆమాత్రం వినవా చెప్పు ?''

శాంతమ్మకి విషయం అంతగా అర్థం కాకపోయినా.— ఏదో కొంతవరకు అంతు చిక్కింది. అందుకే దీనామ్మతో— ''అత్తయ్యా ! మీ కెందుకంత భయం ? తను చెప్పదల్చుకున్న దేవిటో చెప్పనీండి... నాకూ తెలుస్తుంది...'' అంది.

''విన్నావుటమ్మా పిన్నీ ! ఆ మనిషికి చీమకుట్టినట్టన్నా లేదు... దీని సిబ్బరం దగలోలుగానూ ? నేనూ విన్నదికాదే,- కంటితో చూసిందే చెబుతున్నా... తెలిసిందా'' అంది లీలామ్మ తనదే పై చేయన్నట్టు.

''ఏం చూశావో చెబుదూ నీకు పుణ్యముంటుంది'' అంది శాంత.

''ఏవిటా ... ఆయన తిండితినడం మానేశారు. కంటికి కునుకు మానేశారు. పైగా నన్ను కంటజూడటం... పంట పలకరించడం గూడా మానేశారు ... ఏం చెప్ప మంటా నా అవస్థ ?''

''అందుకని... పాపం... ఈ పిల్లదేం చేస్తుందే లీలామ్మా ?''

''అయ్యో రాతా, అంతగా అవసరమని తోస్తే మళ్ళీ పెళ్ళో పెటాకులో అఘో రించుకోవాలిగానీ, .... చేసే పనులకి,— చెప్పే కబుర్లకీ పొంతనా లేకపోయె... ? పైకి ధర్మపన్నాలు చెప్పడమూను, ... ఊళ్ళోవాళ్ల కొంపలు తీయడమూనా ... ?''

దీనామ్మ యిక ఉండబట్టలేక పోయింది. ఓర్చుకోవడం చేతకాలేదు. ''ఓసి కులనాపకురాలా ? తప్పుడుకూతలు మాని, ముందు నా యింట్లోంచి పోవే ఫో- కదులు'' అని తరిమిగొట్టింది

''ఓహో... అయితే యిదంతా నువ్వు నేర్పిన పాఠమే నన్నమాట...'' అంది లీలామ్మ తాపీగా.

ఆ మాటనేసరికి తారాజువ్వల్లే లేచింది దీనామ్మ— ''ఆఁ ... ఏమన్నావ్ ? చీపురుకట్టేదే... ? బుద్ధిలేని మాటలు మాట్లాడురావ్ టే.... చీపురు దెబ్బలుకొట్టి పంపిస్తా జాగ్రత్త.''

''అత్తయ్యా... ఊరుకోండి... , వద్దు... ఏమనకండి... ఏం చెయ్యొద్దు...'' అంటూ వారించింది.

''ఎందుకు ఊరుకుంటాను ? దానికి నేనంటే... తెలిసిరావాలిసిందే... ఏమను

కుందో ?''

''అమ్మాయి! ఏవిటే అక్కడ? ... ఏవిట్రా అదీ...?'' అంటూ కుయె న్నాచ్చను కేకపెట్టాడు.

''ఏం లేదు మామయ్యా... ఏం లేదులెండి.''

''చెప్పండే .... ఏవిటో... ?''

''ఏమీ లేదని చెప్పాగా ?''

తర్వాత గూడా ఏదో పెద్దగా సాధించుకుంటూ లీలామ్మ వెళ్ళిపోయింది. వాకిలి వంక చూస్తే— ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా వచ్చి నిలబడి చోద్యం చూస్తున్నారని తెలిసింది.

శాంతమ్మ కుయెన్నాచ్చను దగ్గరికి వెళ్ళింది... పరిశుద్ధ గ్రంథాన్ని గుండెలకి హత్తుకుని, తలొంచుకుని జాసినపట్టు వేసుకుని కొంతసేపలా కూర్చుండిపోయింది. తరువాత తలెత్తి పమిటకొంగుతో మొహం తుడుచుకుంది.

''అమ్మాయీ! ఎవరొచ్చారు? ఏం జరిగిందమ్మా'' అంటూ కుయెన్నాచ్చను అడుగుతూన్న ప్రశ్నలకు సమాధానంగా చిరునవ్వు నవ్వుతూ శాంతమ్మ—

''తాతయ్యా పరిశుద్ధ గ్రంథాన్ని చదవనా..., ఇదవైవేడో కీర్తన :

'యెహోవా! గళమెత్తి నిన్ను ప్రార్థించుచున్నాను.

నా మనవి ఆలకింపుము.

కరుణతో నాకు ఉత్తరమిమ్ము ......'' అంటూ శాంతమ్మ చదువుకు పోతూంటే,— వింటూ కుయెన్నాచ్చను శూన్యంలోకి చూస్తూ... గమ్యస్థానాన్ని వెతుక్కుంటూ పడుకున్నాడు.

మర్నాడు సాయంత్రం బేబీ వచ్చాడు.

రాజన్ పనిచేసిన కార్యాలయంలో, పనిచేస్తున్న వొక సైనికుడు సెలవుమీద వచ్చినట్టు తెలిసి,— బేబీ రెండుమైళ్ళ దూరానఉన్న అతణ్ణి కలుసుకుని, రాజన్ పెన్షను తాలూకు విషయాలన్నీ కనుక్కుని వచ్చి, ఆ విషయాలన్నిటినీ శాంతమ్మతో ఏకరువుపెట్టి చెప్పి, "కొల్లంలోఉన్న డిస్ట్రిక్టు సోల్జర్సు బోర్డునుంచి ఒక సర్టిఫికేటు తీసుకోవాలిట... రేపు మధ్యాహ్నం పోయి తెచ్చేస్తా...'' అన్నాడు.

''ఏం... వద్దు... నువ్వెళ్లొద్దులే అన్నయ్యా...'' అంది శాంతమ్మ.

''అదేం ?''

''ఏం లేదు ... పెన్షను రాకపోతే మాన్లేగానీ, ... ఒక్క విషయం... నీ స్నేహితుడి భార్య — మనశ్శాంతిగా ఉండాలనుకుంటే,— ఇకమీదట... ,''

''ఇకమీదట ?''

''అన్నయ్యా ! దయచేసి నా అతీగతీ కనుక్కోవడానికని ఇక్కడికి రాకుండా ఉండటం మంచిది ..'' అంటూ, ఆపైన శాంతమ్మ అక్కడ ఒక్క క్షణంగూడా నిలబడలేక పోయింది. బేబీ మొహంవంక చూసేందుకు గూడా శక్తిచాలకపోయింది... వెళ్ళి గదిలో మంచంమీద పడి వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది.

# పన్నెండు

పనచ్చిమూట గ్రామంలో రామకృష్ణన్ దుకాణానికి ఎదురుగా మాత్తుకుట్టి పచారు కొట్టొకటి పెట్టాడు. అర్ధరూపాయి వాటాకింద శివరాం కురుప్ రెండువేల రూపాయలు పెట్టుబడి పెట్టాడు. మాత్తుకుట్టి దగ్గర రాజన్ జీతం తాలూకు మిగిలిన డబ్బు, తరువాత సంక్షేమ నిధినుంచి వచ్చిన వెయ్యి రూపాయలు. ఆపైన సమయానికి ఫిలిప్పోసుగూడా వో వెయ్యి అప్పుగా యిచ్చాడు. అంతాచేరి వో నాలుగు వేలదాకా పోగైంది. దాంతో కాయంకులంలో ఉన్న ఉణ్ణిఉణ్ణి అనే టోకువర్తకుడి దగ్గర కొంత సరుకు అప్పు పుచ్చుకున్నాడు. మొత్తంమీద అన్నీ అమరి ఓ మంచి దుకాణంగా రూపొందింది. రామకృష్ణన్ కొట్లో పనిచేసి మానుకున్న నౌకరే ఇక్కడ పనికి కుదిరాడు. వాడూ అనుభవమున్నవాడే. ఆపేట మొత్తానికి అదొక్కటే దుకాణం. వేరే ఎక్కడా లేదు. అదీగాక మాత్తుకుట్టిమీద లోకులకి గురి బాగా కుదిరింది. అందువల్ల బేరం బ్రహ్మాండంగా సాగుతూ వచ్చింది

ఆ కొట్టుకి యజమాని మాత్తుకుట్టి. గల్లాపెట్టెముందు కూర్చుంటాడు. సరుకులు కొనుక్కున్నవాళ్లు బిల్లు చెల్లించగానే ఆ డబ్బు సొరుగులో వేసుకుంటాడు. లెక్కా డొక్కా సరుకు కొనుగోలు వగైరాలన్నీ శివరాం కురుప్ చూసుకుంటాడు. మొత్తం మీద మేలోర్కుత్తువాళ్ళ దుకాణానికి మంచి పేరొచ్చింది. దాన్నిగురించి చెప్పుకోని

వాళ్ళంటూలేరు.

వ్యాపారం ప్రారంభించాక మాత్తుకుట్టి పేరు మరింత ప్రసిద్ధి కెక్కింది. ఆ గ్రామంలోఉండే నాయకులనండి,— పెద్దలనండి,— సలహాకిగానీ, సంప్రదింపుకి గానీ... అ కొట్టుదగ్గరికే రావడం కద్దు. మరీ అర్జంటు వ్యవహారం కనుకైతే మాత్తు కుట్టిని ఏకంగా మోటారుకార్లో వెంటదీసుకుని మరీ వెడుతూంటారు.

కొందరు గిట్టనివాళ్లేమనుకున్నారంటే,— కొడుకు— పోయాక— మాత్తుకుట్టి యిక అధః పాతాళానికి కుంగిపోతాడనుకున్నారు. కానీ... ఆతడికేవిటి... మంచి ప్రతిభావంతుడు... అయితే అతనంటే సరిపడనివాళ్ళకి అతడు బావుండటం బాగు పడటం బాధగానే ఉందిమరి ?

భజన సంహితలో చెప్పినట్టు—

''యెహోవాయే ఆశ్రయదుర్గమైన వాడిని, శత్రువులు,- దుష్టులు,— వంచకులు ఏం చేయగలరు ?'' అందుకే వాళ్ళపాచిక పారలేదు.

ఆ యెహోవా దయవల్ల అతగాడు వృద్ధిలోకి రాగలిగాడు. కొడుకు తాలూకు పెన్షను కాస్తోకూస్తో ఎంతైనాగానీ ప్రతినెలా, వేళకి ఠంచనగా వస్తుంది.

వ్యాపారంలోను మంచి రాబడనే చెప్పాలి.

ఇబ్బందేం లేకుండా గడిచిపోతూంది. దీనామ్మగూడా మునపటికంటె ఎక్కువ హుషారుగా ఉత్సాహంగా, చేదోడు వాదోడుగా ఉంటూంది. ఎంతో చురుగ్గా శ్రద్ధగా యిల్లు దిద్దుకుపోతూంది. శాంతమ్మ ఈ ప్రాపంచిక విషయాలకి దూరమై నిరంతరమూ చేతిలో ధర్మగ్రంథం పట్టుకూర్చుంటుంది. అయితే దీనామ్మ ఆ పిల్లదాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ మనస్సు నొచ్చకుండా ఉండేటట్టు చూసుకుంటూంది

ఒకనాడు ఫిలిప్పోసు మాత్తుకుట్టివాళ్ళ అంగడికి వచ్చాడు. అంగడిలో జనం కిటకిటలాడిపోతున్నారు. కుయుచ్చెరుక్కను గూడా అక్కడే ఉన్నాడు. అది రోజూ మామూలే.

ఆ దుకాణం పెట్టినప్పటినుంచీ ఆతగాడు అంటే కుయుచ్చెరుక్కను శివరాం కురుప్‌తో సఖ్యతగా ఉండటం మొదలెట్టాడు.

వస్తాడు... బియ్యం బస్తామీదో పప్పు బస్తామీదో ఎక్కి కూర్చుంటాడు. ఆ తరువాత తనంతట తానుగానే లేనిపోని పురాణం ప్రారంభిస్తాడు.

వోనాడు లక్ష్మి వచ్చి సరుకులు కొన్నాక నాలుగణాలు తక్కువైనాయి.

మర్నాడు తెచ్చిస్తానంది... అంటేను— ఆ పనివాడు,— అదేం కుదరదు... ఆ నాలు గణాలవారీ సరుకు తగ్గించి పట్టుకుపొమ్మన్నాడు

ఆ సమయంలో కుయుచ్చెరుకన్ను లంకించుకుని— "ఇదుగో లక్ష్మీ ! చూడు. ఈ కొట్టు మా నాయన సంపాయించి యిచ్చిన ముల్లె తెచ్చిపెట్టిందేం కాదు... ఎక్కడో బోలెడంత వడ్డీపోసి, అప్పుతెచ్చి పెట్టుకున్న కొట్టు ... తెలుసా ? కాబట్టి అప్పులు సప్పులూ యేం కుదరవ్..." అంటూ పనస చెప్పాడు.

ప్రతిదానికీ యిదే వరస. ఇహ మరే విషయం దొరక్కపోతే తమ వార్ని గురించి డాబులు డబ్బీలు కోతలు సోదాహరణంగా చెప్పుకుంటూ కూర్చుంటాడు.

"మానాన్న మెచ్చేరిలో వ్యవసాయం చేస్తూండేవాడు. అక్కడ కోశిద్వారం నుంచి పెద్దచెరువు దాకా ఏకఖండంగా ఇరవై రెండు 'పరా'ల భూమి ఉండేది. ఒక యేడాది కంకులు బాగా వచ్చాయి ఎంత దట్టంగా ఉందంటే చేనులోపల ఏనుగు దూరినా బయటికి కనపడనంత యేపున ఉంది... ధాన్యం పండింది··· ఒకనాటి రాత్రి ఉన్నట్టుండి గట్టు తెగిపోయింది... ఇహ అప్పుడేవిటి చెయ్యడం ?" అంటూ యీ ప్రకారంగా చెప్పుకుపోతూనే ఉంటాడు. వినేవాళ్ళకి దీనివల్ల నష్టమేం లేదనుకోండి కానీ... అతగాడికి పిసరంత ఆలోచనంటూ ఉండాలిగదా !

కాసేపు పెత్తనం చలాయిస్తాడు. మరికాసేపు లెక్చరు కొడతాడు. రాత్రి బాగా పొద్దుపోయేవరకు ఉంటాడు. వెడుతూ వెడుతూ... , "చూడు వో రెండు కిలోల బెల్లం తూచు" మని పురమాయిస్తాడు.

ఆ పొట్లం పట్టుకని యిల్లు చేరుతాడు. పైకం అడగడానికి వీల్లేదు. అడిగారో... విరుచుకు పడతాడు. అందుకే— ఇచ్చినప్పుడే పుచ్చుకోవచ్చు లెమ్మని మాత్తుకుట్టి మెదలకుండా ఊరుకుంటాడు. వీడివ్వకపోతే,— వీడి పిల్లలదగ్గర పసూలు చెయ్యొచ్చు లెమ్మనుకుంటాడు.

అవాక కుయుచ్చెరుకన్ను తన ధోరణిలో తాను ఉపన్యాసం దంచేస్తూండగా ఫిలిపోస్సు వచ్చాడు. ఆ సమయంలో అక్కడ శివరాం కురుప్ లేడు. విషయమేమి టంటూ కుయుచ్చెరుకన్ను ఫిలిపోస్సుని అడిగాడు.

ఫిలిపోస్సు— "ఆఁ ... ప్రత్యేకించి ఏం లేమలే... ...' అన్నాడేదో అల క్ష్యంగానే.

"నాన్న చాలా నీరసంగా ఉన్నాడు. పొద్దునవెళ్ళి చూసొచ్చా— ఊఁ , మాత్తు

కుట్టీ ఇట్రారా !'' అంటూ ఫిలిపోస్యు రోడ్డుమీదికి వెళ్లాడు. అతడి వెనకాలే మాత్తు కుట్టి వెళ్లాడు. వెళ్ళి ఆరోడ్డు పక్కనున్న మర్రిచెట్టుకింద కూర్చుని మాట్లాడుకుందా మనుకున్నారు కానీ... అప్పటికే అక్కడ వేలాయుధన్ యింకో యిద్దరు వ్యక్తులుచేరి ఏవేవో రహస్యాలు చెప్పుకుంటున్నారు. అందువల్ల తూర్పుదిక్కుగా కొంచెం దూరం నడిచి— వో కాలిబాటను చేరుకున్నారు.

''ఏవిట్రా బ్రదర్ ఏవిటి సంగతి—'' అంటూ మాత్తుకుట్టి అడిగాడు.

ఫిలిపోస్యు తక్షణం ఏం మాట్లాడలేదు... అరచేత్తో గుండె అదిమి పట్టుకుని— అక్కడో మట్టిగోడమీద ఎక్కి కూర్చున్నాడు.

''ఏరా! నువ్వో రెండు రోజులపాటు కొట్టు వదిలిపెట్టి రాగలవా?... ...'' అనడిగాడు.

''ఎందుకు ?''

''పయనాడుదాకా పోయిరావాలి.''

''ఊఁ ?''

ఫిలిపోస్యు ఏం మాట్లాడలేదు. కొంతసేపయిన తర్వాత— ''అక్కడ వాడు తప్పుదారిన పడ్డాడు. మన పసిపిల్లతో ప్రేమకలాపం సాగిస్తున్నాడు ... ఏవిటింకా నీ చెవిన పడనేలేదా ?''

''ఏదో... కుర్రతనం వేషాలు పోసిద్దూ... ''

''అందువల్ల వాడి తల్లికి మనోవ్యధ ఎక్కువై పోయింది. మూడునాలుగు రోజుల నుంచీ దాని పరిస్థితి మరీ గడిబిడగా ఉంది... దాని మతి చెడిపోయిందిరా.... గదిలో పడేసి తాళంపెట్టి ఉంచాం... , ఇవాళ తెల్లవారినప్పటినుంచీ ... తన కొడుకుని నేనెక్కడికో తీసుకుపోయి చంపేసినట్టు... తెగ గోలెత్తుతూంది. ఆదో గుబులు. ఏం చెయ్యమంటావ్ చెప్పు.

నేను ఏదో కష్టపడి నాలుగు డబ్బులయితే సంపాయించా కానీ... రాత్రిళ్ళు కళ్ళు మూసుకు స్థిమితంగా పడుకోవడానికిగూడా పెట్టిపుట్టలేదనుకోరా .'' అంటూ వాపోయాడు.

''కీవరీతు అన్నయ్యతో చెప్పావా ?''

''ఏం చెప్పమంటావ్ ? చెప్పినా మాత్రం వాడేం చెయ్యగలడు చెప్పు ? ఇంకో పదిమంది చెవుల్లో ఊదుతాడు .. ' మనకింకా తలవొంపులవుతుందంతే ... అంతకుమించి

లాభమేం ఉండదు.''

"సరే,— నే చెబితే వాడు దారికి వస్తాడంటావా ?''

నువ్వు చెబితేనే వింటాడు. చేతులు పూర్తిగా కాలకముందే ఆకులు పట్టుకుంటే మంచిది. పరువుపోయాక పశ్చాత్తాపపడి ఏం ప్రయోజనం చెప్పు ?''

'జరగవలసిన అవమానాలన్నీ జరిగిపోయినట్టే... ఇప్పుడిక శేషమనేం మిగల్లేదు '— అని మాత్తుకుట్టి మనస్సులో అనుకుని,— ఫిలిప్పోసుతో,—

''ఏమయితే అదవుతుంది... రేపు పొద్దున వెడతా''_ అన్నాడు

''అయితే బండి పట్టుకుమరీ పో.''

''ఊఁ.''

ఫిలిప్పోసు కాలిబాటనే ముందుకు సాగిపోయాడు. మాత్తుకుట్టి ఆతడు వెడుతున్న వేపే చూస్తూ ఓ క్షణం నిలబడ్డాడు. కీపరీతు,— ఫిలిప్పోసుకి తోడబుట్టిన వాళ్లంటే ఆపేక్ష అంతఃకరణలు లేవంటాడు గానీ... అది తప్పు... ఆ మాటకొస్తే, సమయం వచ్చినప్పుడు, తోడబుట్టినందుకు ఆదుకునేవాడు ఫిలిప్పోసే. మామూలుగా అయితే పైసాపైసాకి లెక్కచూస్తాడు 'డబ్బుకి ప్రాణానికి లంకె'— అన్నట్టే ఉంటాడు. డబ్బుమొహం ఎరగని వాడల్లేనే మాట్లాడతాడు. ఇంకా చెప్పాలంటే,— అసలు జీవితంలో డబ్బంటూ కళ్ళజూసింది ఆదే రొలిసారేమో అన్నట్టు కనబడతాడు కానీ... అతడి నైజమే వేరు. సిరిసంపదలు కలవాడే అయినప్పటికీ మిగిలిన అన్నదమ్ములందరికంటె మానసికంగా బాధ ఫిలిప్పోసుకే ఎక్కువ.

మాత్తుకుట్టి దుకాణానికి తిరిగి వచ్చేసరికి యజమాని కుర్చీలో శివరాం పురుప్ కూర్చుని ఉన్నాడు.

కాయంకులం నుంచీ సరుకు దిగింది. ఎడ్లబళ్ళనుంచి సరుకు దింపి కొట్లో పడేస్తున్నారు కుయుచ్చెరుకక్కను — పురుప్ కబుర్లల్లో మంచి రసపట్టున ఉన్నారు.

''ఆలస్యమైందేం ...'' అంటూ మాత్తుకుట్టి పురుప్‌ని ప్రశ్నించాడు.

''ఉణ్ణాణ్ణి మాప్పిళ్ళా కొచ్చిను వెళ్ళాడు. ఆయన వచ్చాక. సరుకు తీయించి తెచ్చేసరికి ఆలస్యమైపోయింది.''

''ఊఁ ..., నేను రెండు రోజులపాటు దుకాణంలో ఉండను. రేపు ఆదివారం గదా ? ఎలాగూ కొట్టుకు సెలవు. ఎల్లుండి సాయంత్రానికి వచ్చేందుకు ప్రయత్నిస్తా ''

''మంచిది... వెళ్ళిరావయ్యా !''

''ఎక్కడికిరా వెళ్ళడం ...'' అంటూ కుయుచ్చెరుక్కను అడిగాడు.

''మలబారు - వెడుతున్నా.''

''ఏది... ? ఫిలిప్పోసు తోటకేనా ?''

''ఊఁ.''

''కుఱ్ఱాణ్ణి పిలుచుకు వచ్చేందుకేనా ? ఈ సంగతి చెప్పేందుకేనా— నే వినకుండా ఉండాలని నిన్ను విడిగా పిలుచుకు వెళ్ళాడు... ? అహఁ... నే విన్నానే అనుకో వచ్చే నష్టమేవిటిట ? ఒరె నాయనా ! నే చెబుతా విను... కన్నపిల్లలకి అన్నం బెట్టి నంత మాత్రంచేతనే తల్లిదండ్రుల బాధ్యత తీరిపోదురా... వాళ్ళని సరైన అదుపాజ్ఞ లతో పెంచాలిసుమా ..." అంటూ బోధచేయడం మొదలెట్టాడు.

''చాలు చాలుగానీ... ఈ నడిబజార్లో యిప్పుడీ మాటలన్నీ ఎందుకులే... ?''

''ఔను... నిజమే .. నాకెందుకొచ్చింది, నేనేం అనను.... చూడు నేననక పోయినా లోకానికి తెలీకబోతేను... ?"

దుకాణంలో సరుకులు కొనుక్కునేందుకని జనం తుగిడీలు తుగిడీలుగా వస్తున్నారు. అందుకని ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది.

శివరాం కురుప్ ఖాతాపుస్తకం తెరిచి లెక్కంతా రాసిపెట్టాడు. మాత్తుకుట్టి మిగతా పనుల్లో కూరుకుపోయాడు. కుయుచ్చెరుక్కను ఇక అక్కడ కూర్చోవడం క్షేమం కాదనుకుని, యింటికి బయల్దేరాడు.

పెందలాడే లేద్దామనుకున్నాడు మాత్తుకుట్టి, కానీ— మెలకువ రాలేదు .... దీనామ్మ లేపిన తరవాతనే లేచాడు.

''అబ్బ .. ఎంతసేపానిద్ర ?... ఫిలిప్పోసు బావగారి బండి అయిదింటికల్లా వచ్చి వాకిట్లో ఉంది...'' అంది దీనామ్మ.

''గంటెంత ?''

''ఆరయింది.''

''ఆఁ ... సరై తే, స్నానానికి నీళ్లపెట్టు... త్వరగా. రాత్రి నే పడుకునేసరికే రెండయింది. వెళ్ళబోయే పనికి కావలసిన ఏర్పాట్లెన్నో చేసుకోవాలసి ఉండె ..మరి ? వెంట తీసుకుపోవడానికో యిద్దర్ని సిద్ధంచేశా... అంటే ఎటువంటి పరిస్థితి ఏర్పడినా సాయపడేందుకని. కొల్లంవెళ్ళి వో మనిషిని కలుసుకున్నా తర్వాత డి. యస్ పి. పేర ఉత్తరమొకటి తీసుకున్నా. జోణికుట్టి పోలీసు సబ్ యినిస్పెక్టర్ని గుప్పెట్లో

పెట్టుకున్నట్టు వినికిడి. కాబట్టి అందుకు కావలసిన కట్టుబాట్లన్నీ చేసుకునేప్పటికి పొద్దు పోయింది... రాత్రి నడుం వాల్చేసరికి రెండుగంటలైంది. తెల్లవారినట్టే తెలీలేదు.''

మాత్తుకుట్టి కుయెన్నాచ్చను దగ్గరికి వెళ్ళాడు. వెళ్ళి— ''నాన్నా! నేను కాస్త మలబారుదాకా వెళ్ళొస్తా''— అన్నాడు.

... ... ...

''ఎల్లుండికి వచ్చేస్తాను.''

కుయెన్నాచ్చనుకేం వినబడలేదు శాంతమ్మ కుంపటి విసురుతూంది. ఆయన చెవిలో నోరుపెట్టి బిగ్గరగా చెప్పాడు— అప్పటికి వినిపించింది.

''ఎందుకురా?''

''ఫిలిప్పోసు అన్నయ్యావాళ్ళ తోట చూసేందుకు.''

''వాడు... అదే వాడికొడుకు మరి— అక్కడే ఉండెగదరా?''

'అయ్యబాబో... చిక్కుకున్నా... ఇప్పుడిక భోగట్టా అంతా అడుగు పాతాళం నుంచీ తవ్వుకొస్తాడు... అడిగిన వాటన్నిటికి సమాధానం చెప్పందే బయటపడలేను...' అనుకుంటూనే,— ''ఆహ... వాడూ చిన్నవాడుగదా మరి...?''

''ఆఁ?''

''నాన్నా...! వాడూ ఒంటరిగా ఉన్నాడుగదా?''

''లేదు..., లేదురా... వాడూ ..., పసిపిల్లని పెట్టుకుని ఉన్నాడురా?''

''మీకెవరు చెప్పారు?''

''భగవంతుడు... వెళ్ళి చూడు... నీకే తెలుస్తుంది.''

''తాతయ్యా! ఇందువల్ల మీకేం పోయింది చెప్పండి...'' అంది శాంతమ్మ.

''నాదేం పోలా.... చెప్పానంతే.''

మాత్తుకుట్టి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాడు అంతలో వాకిట్లో ఏదో రణగొణధ్వనిగా వినిపించింది ... ఏముంది? ముక్కుమూక... అల్లరి... గోల... నవ్వులూను.

ఫిలిప్పోసు భార్య అన్నామ్మ వచ్చింది. ఎర్రంచు చీర తిరగేసి కట్టుకుంది. మెళ్ళో నాలుగైదు గొలుసులున్నాయి. చెవులకి దుద్దులున్నాయి...,

''ఆరి...నీ యింకా నువ్వు సిద్ధంకాలా? నాలుగు గడియలనుంచీ నేనక్కడ— పెళ్ళికూతురు వాళ్ళ యింటబడి- ఎదురు చూసినదాన్ని చూసినట్టుంటేను? ఊఁ... ?

పద."

"వొదినా !"

"వొదిన? ఎవర్రా వొదిన? ఏవిటీ వేళాకోళం? నా వయస్సెంతని...? నేనెంత? పట్టుమని పదొమ్మిదేళ్ళన్నా లేనిదాన్ని పట్టుకుని వదినంటావ్రా? చూడు... ఊఁ?" అంటూ గద్దిస్తూ... మొహం విచిత్రంగా పెట్టి వో పిచ్చినవ్వు నవ్వింది.

దీనామ్మ యివతలికి వచ్చి "అన్నమ్మక్కయ్యా..." అంటూ పిలిచింది.

"భలే. ఇదా సంగతి...? నువ్వు బలవంతాన పోనీకుండా ఉంచేశావన్న మాట? అబ్బో... తప్పేవేంకాదే? నీ పేగులు తియ్యకపోతే చూడు..., ఉండు... అడ్డంరాకు... మమ్మల్ని ఇప్పుడే పోని... మేము ఎటిత్తావు చర్చి ఉత్సవానికి వెడుతున్నాం. ఊఁ త్వరగా బయలుదేరు..."

వాకిట్లో గుమిగూడిన పిల్లమూక— ఈలలు-గోల, ఒకటేకాదు.

అన్నామ్మ చెయ్యి పట్టుకుని శాంతమ్మ— "లోపలికి పదండి అత్తయ్యా" అని లాగింది.

"ఛత్ ... వొదలవే చెయ్యి ... వొదులు" అంటూ బూతుగా తిట్టింది. శాంతమ్మ విస్తుపోయింది. 'అయ్యో ఖర్మ'— అని మాత్రం ఆ పిల్లదాని నోట వెలువడింది.

"ఒరె... ముసలాడా! కొడుకుల్ని కట్టుబాటుగా పెంచొద్దురా? నీ మంచితనమేం మండిందిలే? నీకూ ఉండేదిగా వో ముండ... వో వన్నెలాడి ..,"

అంతవరకూ ఎలాగో ఊరుకున్నారుగాని, ధోరణి మరీ అతిగా ఉంటేనూ, ఇక వెనకాముందూ చూడకుండా దీనమ్మ—మాత్తుకుట్టి ఆవిణ్ణి పట్టి బలవంతాన గదిలో మూసెయ్యడానికి ప్రయత్నం చేశారు. అన్నామ్మ మాత్తుకుట్టి చెయ్యి కసిక్కన కొరికింది... గాట్లు పడ్డాయి. అంత రభస జరుగుతూండగా— ఫిలిప్పోసు, మరో ఎనిమిది జమాజెట్టీల్లాంటి మనుష్యుల్ని తీసుకుని వచ్చాడు... వస్తూనే,—

"ఏదిరా... నా...? చంపి పారెయ్యండిరా దాన్ని..." అంటూ అరిచాడు.

"ఆవిణ్ణేం చెయ్యకండి. మతి చెడిపోయిన మనిషిగదా!" అన్నాడో వ్యక్తి.

మొత్తంమీద ఆవిణ్ణి పట్టి బయటకు తీసుకువచ్చేసరికి పెద్దలు దిగొచ్చారు.

"మోటార్లో కూర్చోబెట్టి తీసుకుపోదాం,— "

"మాత్తుకుట్టీ! నువ్వుగూడా ఎక్కరా..." అన్నాడు ఫిలిప్పోసు.

బండి బయలుదేరింది. వెనకాల ఈలలేసుకుంటూ కుర్రమేళం పరిగెత్తింది. కుయెన్నాచ్చనుకి అంతా కలల్లే ఉంది.

"అమ్మా ఏవిటది, ఏవిటా గోల? ఏవిటా గందరగోళం? అయోమయంగా ఉందే ?"

"ఏం లేదులెండి మావయ్యా!"

"ఏం లేకపోతేనేనా... కాలాయివాడి పెళ్ళాం చీరె అలా చుట్టుకువచ్చింది ?"

"అక్కయ్య ఆరోగ్యం బాగుండలేదు మావయ్యా !"

"ఏం పిచ్చెత్తిందా ?"

"పాపం... ఆవిడకి మనోవ్యాధ ఎక్కువై పోయింది..." అంది దీనామ్మ.

"మందు... ఎవరో దానికి మందుపెట్టారులే..."

"అబ్బ... ఊరుకోండి మావయ్యా !"

"దాన్నిటు పిల్చుకురండే..."

"కార్లో తీసుకువెళ్ళారు పిల్లవాణ్ణి గురించి ఆలోచించి ఆలోచించి మనస్సంతా వికలమై పోయింది. అందుకే మన సిసిలివాళ్ళ నాన్న జోణికుట్టిని తీసుకురావడానికి వెళ్ళారు. కుర్రాణ్ణి చూస్తే అక్కయ్య కోలుకుంటుంది లేండి."

"వాడు అంత తేలిగ్గా వస్తాట్టే అమ్మా ?"

"మనం అంటే వాడికి చాలా ఆపేక్ష ఉందిలెండి. అందుకనేగా ఈయన వెళ్ళారు .. పిల్చుకు రావడానికి ?"

"ఆపేక్ష'— అంటే? ఎటువంటి ఆపేక్ష? వాడి మోజంతా ఆ పిల్లదాని మీదున్నప్పుడు మధ్యన మనమీద ఆపేక్షంటాపేవిటి నీ వెర్రిగానీ? ... వీడు వెళ్ళినందుకు పరువు పోవడమేగానీ..., ప్రయోజనం ఉండదు... నాకు తెలుసు !"

"అబ్బబ్బబ్బ... మీతో చెప్పినా యిబ్బందే... చెప్పకపోయినా యిబ్బందే... ఏం లేదు... ఏం తెలీదంటూ రోజు వెళ్ళమార్చుకు రావాల్సిందే... గానీ... చెప్పి బతకలేం... బాబూ..."

"ఏం లేదు... ఏం తెలీదు'— అనడం కళ్లు చెవులు ఉండగా అదెలా సాధ్యం తల్లీ ?"

దీనామ్మ మాట వినిపించుకోకుండా వంటింట్లోకి చక్కాపోయింది. సిసిలీని తీసుకుని చర్చికి వెళ్ళొస్తానంది శాంతమ్మ.

''ఇవాళ ఆదివారమా ?''

''ఔను. వార్షుప్పల్లి యాజకుడు కనుక ఉన్నట్టయితే ఈపాటికప్పుడే పాప పరిహార బలిపూజ ప్రారంభం చేసేస్తాడు...''

కుమైన్నాచ్చను భక్తిగీతమేదో పాడటం విని దీనామ్మ మళ్ళీ ఇవతలికి వచ్చింది... ముక్కుమీద వేలేసుకుని... 'హా పరమేశ్వరా ! మావయ్యకికూడా మతి పోయిందేమో అనిపిస్తూంది'– అనుకుంటూ,

లేకపోతే ఈ గొడవలన్నీ కళ్ళారా చూసినప్పటికీగూడా హాయిగా పడుకుని పాటలు పాడుతున్నారంటే ఏమనుకోవాలి ? నిన్న రాత్రంతా సాయం ప్రార్థనా గీతం గొణుక్కుంటూనే ఉన్నారు. మాటలైతే స్పష్టంగా వినబడటంలేదు గానీ 'నన్నిక మిక్కిలి వేధించకు తండ్రీ... అనే విన్నపం'–

"నిజంగా దేవుడు తాతయ్యని ఎప్పుడూ కష్టపెట్టరాదత్తయ్యా ...'' అంది శాంతమ్మ.

సిసిలీ స్నానంచేసి ఫ్రాక్ వేసుకుని తలకి రిబ్బనులు కట్టుకుని, దేవకన్యలా పలుకుతూ వచ్చి,– ''శాంతవదినా... ఇక నువ్వే రెడీకావాలి... వేళైంది''– అంది.

''ఎవరు... చిన్నేనా...'' అంటూ కుమైన్నాచ్చను అడిగాడు.

''ఔను... మావయ్యా... చిన్నే !''

''అది యిప్పుడు నాదగ్గరికే రావడమే మానేసిందమ్మా... నాతో మాట్లాడటం గూడా మానుకుంది.''

''ఏమే చిన్నా నిజమేనా ?''

''తాతయ్యతో మాట్లాడాలంటే నాకు భయమేస్తుందమ్మా... ఆరోజు– కవణి, చట్టా (క్రిస్టియను కన్నెలు వేసుకునే ఉడుపులు) వేసుకురా చూస్తా అన్నాడే ... అప్పట్నుంచి...''

''సరైతే,– చూడు చిన్నా ! చర్చికి వెళ్ళాక అక్కడ పిల్లలతో పోట్లాడరాదేం ? అమ్మ కొంగు పట్టుకునే నిలుచోకు... అటు కుడివైపున ఆడవాళ్ళ వరుసకి ఎదురుగా– చేతులు జోడించి భక్తిగా నిలబడాలి సుమా .. ?

'ఆ... ఆ... హల్లెలూయ... హల్లెలూయ
నీతిమంతులు – చిగురుటాకులు వృద్ధిగాంతురు
హల్లెలూయ... ..

నీతిమంతులిచ్చు ఫలము జీవవృక్షము
హల్లెలూయ... ...
జ్ఞానము గలవారలే పరులను రక్షింతురు
హల్లెలూయ... ...
ఔదార్యము గలవారే పుష్టిగాంతురు.
హల్లెలూయ... ...
నీతిమార్గమునందే జీవము కలదు...
హల్లెలూయ... ...

అంటూ క్రైస్తవానంద గీతం మరొక్కసారి పాడాడు కుయెన్నాచ్చను. పాడి...

'సోదరులారా! మనమంతా – భయవినయాలు సత్యవిశ్వాసాలు, పరిశుద్ధ స్నేహము కలిగి,– ప్రభువుమీది భక్తితో నిలబడి ఈ పూజ్యుడైన పురోహితుని చేతి నుండి ... ....

అన్నట్టు మనం ఉన్నది చర్చిలోనేగా... అదే... బాప్తిస్మము (క్రైస్తవ సంస్కారదీక్ష) పొందే వేదికకింద నిలబడటం కష్టంగాఉందే .., ఇవాళ పాప పరిహార బలిపూజలో పాల్గొనాలి. బలిపీఠం దగ్గర యాజకుడు చేతిలో నైవేద్యాన్ని పుచ్చుకుని నిలుచున్నాడు. నన్నో మనిషి సాయంగా చేయూతయిచ్చి తీసుకుపోతు న్నాడు బలిపూజంతా అయిన తర్వాత–

'నాన్నా పదండి'– అన్నాడా మనిషి... అప్పటికి నేను చెయ్యి ఆసరాగా యిచ్చిన ఆ మనిషి ఎవరా అని మొహంవంక చూశాను.

ఎవరేముంది– కుయోమా...

ఏవిటి . నువ్వు చర్చిలో ఉన్నావుట్రా ?

ఆఁ ... ప్రతి ఆదివారం నేను చర్చికి వస్తా నాన్నా...

అలాగా ... ?

నన్ను నువ్వు చూడలేవు నాన్నా... చచ్చిపోయాక రూపముండదుగా మరి ? ఆత్మ మాత్రం అంతటా తిరుగుతూంటుంది, రోజూ కనీసం ఒక్కసారైనా నీ మంచం దగ్గరికి వచ్చి వెడుతూంటాను.

చూడలేనంటావేరా ?... నేను నిన్ను చూడగలుగుతూంటే ... ?

అందుకూ కారణముందిలే. నువ్వింక నాతో రావడానికి వేళైందిగా మరి ... !

ఒరేయ్ నాయనా! నిన్న నీ భార్యా, కొడుకు నన్ను చూడటానికి వచ్చారు. కోడిమాంసం... బాగా వండి ఆకులోకట్టి తీసుకువచ్చార్రా... నాకా దంతాలు లేక పోయె... ఎలా తినగలను— అన్నా.

అప్పుడు నేనూ ఉన్నా వాళ్ళవెంట. మాత్తుకుట్టి కోడలేగా ప్రార్థన చేసింది ... ఔనా ?

ఆఁ ... ఆఁ ..., కీవరీతుకి మాత్రం యే ఇబ్బందీ లేదులే.

ఊఁ !

మాత్తుకుట్టి సందుచివర ఓ దుకాణం పెట్టాడు చూశావా ?

చూశాను.

భాగస్వామితో కలిసి చేస్తున్నాడులే.

... భాగస్వామి ... ?

ఆ భాగస్వామిని నువ్వెరుగుదువా ?

ఎరక్కపోవడమేవిటి ?

పగ్గాలు మాత్రం మాత్తుకుట్టి చేతిలోనే ఉన్నాయిలే...

అని ఎవరు చెప్పారు ?— మీరు మీరనుకుంటున్నారుగానీ,— వాడి చేతిలో ఏముంది... బూడిదా బుగ్గీను..., వాడూ... వత్తి వాజమ్మ...

అదేం... అలా అన్నావ్ ?

మీకేం తెలుసు ? చుట్టూ అంధకారం అలుముకున్నప్పుడు ఓ రవంత దీపం వెలిగించి అంతా కనబడుతూందనుకోవడం అజ్ఞానం కాదూ ? మీ కసలు కనబడిందేమీ లేదు... ఏమీ తెలుసుకుందీ లేదు... ఏమీ... అంటే.... ఏమీ...

''మావయ్యో !''

''ఆఁ ?''

''చూడండి ఎవరొచ్చారో ... మిమ్మల్ని చూడాలని ఎంతసేపుగా నిలబడి ఉన్నాడో... పాపం..., కుయుచ్చెరుక్కను బావగారి కొడుకు కుయుచ్చన్...''

''పెద్దవాడేగా ... ?''

''కాదు... రెండోవాడు...''

''నిన్ననే బొంబాయినుంచీ వచ్చాడట.''

కుయుచ్చను కుయెన్నాచ్చను మంచంమీద కూర్చున్నాడు. ముడతలుపడి ఎండి

పోయిన తాతగారి అరచేతిని తన చేతిలోకి తీసుకుని నిమురుతూ ... రాస్తూ కూర్చున్నాడు.

"మీ అన్నయ్య ఎక్కడరా?"

కుయుచ్చను దీనామ్మవంక చూశాడు.

"మావయ్యతో ఏం చెప్పకు బాబూ... నీకు పుణ్యముంటుంది" అంది దీనామ్మ మెల్లిగా.

"బొంబాయిలో ఉన్నాడు"— అని బిగ్గరగా చెప్పాడు.

"శిక్ష పడిందేరా ?"

"శిక్షేం ... లేదులే."

"ఇప్పుడు,— మళ్ళీ నువ్వెప్పుడు వెళ్ళాలి ?"

"ఒకటి రెండు నెలలు పోయినతర్వాత వెడితే చాలు."

"ఒరేయ్... మీ అన్నని నేనేం అడగలేదురా... వాడంతట వాడే వో అర్థరాత్రివేళ యిక్కడికి వచ్చాడు. ఏరా...., డబ్బుగురించి నువ్వు మీ నాన్ననేమైనా అడిగావా? చూడు..., వాడు డబ్బిచ్చినప్పుడు నేను తీసుకోలేదురోయ్. నా కోడలే తీసుకుంది సుమా... ?"

"ష్... ఊరుకోండి మావయ్యా !"

"నేనిక వెళ్ళొస్తా... మళ్ళీ కనబడతాలే తాతయ్యా!"

దీనామ్మ కుయుచ్చన్ని వాకిలిదాకా దిగబెట్టేందుకు వెడుతూ, "ఏరా నాయనా ఇక్కడే ఎక్కడన్నా ఉద్యోగం చూసుకోరాదూ..." అనడిగింది.

"ఉద్యోగమా పిన్నీ? దేనికైనా అదృష్టముంటూ ఉండాలిగా ?" నాలుగడుగులు వెళ్ళిన తర్వాత వెనక్కి తిరిగి,— "నేను తాతయ్యని చూడటానికి వట్టి చేతులతో వచ్చా చూశావా..." అన్నాడు.

"ఓశ్... అంతేగదా! ఇప్పుడు ఆయనగారికి దేనికీ కొరతలేమిలే... గానీ... అందుగురించి నువ్వేం దిగులు పడకు."

దీనామ్మ కుయుచ్చను వెడుతూంటే చూస్తూ, చాలాసేపటి వరకు గుమ్మంలోనే నిలబడింది. పాపం! ఎందరి కాళ్ళూ గెడ్డాలూ పట్టుకుని సంపాయించిన ఉద్యోగం కాస్త ఊడిపోయింది. ఉద్యోగం వెతుక్కోవడానికనే బొంబాయివెళ్ళి... అక్కడంతా తిరిగి... గాలించి..., ఆఖరికి నిరాశతో ఊరికి తిరిగి రావడమైంది.

ఈ అగచాట్లన్నింటికి కారకుడు .... ఆ అన్నే. వాడు దొంగిలించి తెచ్చిన సొమ్మంతా ఈ తమ్ముడింట పోగేసి పెట్టాడట. ఇంకేముంది.... పోలీసు అధికార్లు పసిగట్టారు... వచ్చారు... పట్టుకున్నారు

అన్నకేమో మూడేళ్ళు జైలుశిక్ష విధించారు. వాడికదేం కొత్తకాదు... లెక్క కాదు. ఇంతకు మునుపుగూడా మూడు నాలుగుసారులు జైలుకెళ్ళినవాడే. దొంగ వ్యాపారం చేస్తున్నవాళ్ళ చాలామంది ఉన్నారుగా...? ఆ ముఠాకి చెందినవాడే వాడూను.

వాళ్ళల్లో వొకణ్ణిపట్టి జైల్లో పడేశారూ అంటే,— రెండోవాడు ఆ జైల్లోపడ్డవాడి కుటుంబానికి గుట్టుచప్పుడు కాకుండా సాయంచేస్తూ వుంటాడు... అది వాళ్ళ తరహా. మధ్యలో ఏ పాపం ఎరగనివాడు వీడు . వాడి తమ్ముడు..., దురదృష్టం కొద్దీ వీడి ఉద్యోగం కాస్తా పోయింది ... దొంగవ్యాపారం వాటాదారుడని... అపకీర్తి ఎంతని... ?

"అమ్మా !"

"ఊఁ."

"సందె పడుతున్నట్టుంది."

"లేదు మాయ్యా! పొద్దునేగా యిది... ? ఇప్పుడే చర్చిలో పాపపరిహార బలిపూజ ప్రారంభమైంది."

"అయితే అంతా మసగమసగ్గా ఉందేవిటమ్మా ?"

"అహఁ ... అదేంలేదు ... కునుకు కునికి లేస్తే అలాగే అనిపిస్తుంది... దేవుణ్ణి తలుచుకుంటూ పడుకోండి. నేను పోయి మధ్యాహ్నానికి కావలసిన భోజనం బొట్రా సిద్ధం చెయ్యాలి..." అంటూ వీనామ్మ చక్కా పోయింది.

మెదడంతా మొద్దుబారింది... ఏదో బరువుగా ఉన్నట్టుంది. కాళ్ళూ చేతులూ పీకుతున్నాయి. మనస్సులో చెప్పలేనంత ఆందోళనగా ఉంది. నల్లమందు వేసుకునే వేళయితే ఇప్పన్నీ గుర్తులన్నమాట. దిండు కిందనుంచి నల్లమందు పొట్లం తీశాను. ఒకేఒక్క మాత్ర ఉంది... తీసి వేసేసుకున్నాడు.

'కోడలు నన్ను భగవన్నామ స్మరణ చేసుకుంటూ ఉండమంటుంది. ఆ ప్రార్థనా గీతంలో చెప్పిన భావాలన్నీ నా మనస్సులో దూదిపింజల్లాగా ఎగురుతూ ఉంటాయి. ఈ ఘటం పూర్తిగా చివికిపోయింది. ఇదంటే ఎవరికీ లక్ష్యంలేదు... ధ్యాస లేదు... ఆఖరికి చిన్నగూడా ఈ ముసలాడి మాట వినదు.

సాయంత్రం ప్రార్థనలో ఏం చెప్పారూ... ?

విద్వేషమనే దండంనుంచి, ఆకస్మిక మరణంనుంచి. కోపంనుంచీ కాపాడమని వేడుకుంటారు. మరోచోట— అర్ధాయుస్సువాణ్ణిగా చెయ్యొద్దంటాడు. ఆ అర్ధాయుస్సే నయమేమో .... ! ఈ తీరుగా చమురైపోయి మిణుకు మిణుకుమంటూ పడిఉండే కంటే,— చమురు నిండుగాఉండి, వెలుగుతూ వెలుగుతూనే ఆరిపోవడం అదృష్టం కాదూ ?

'పండుముసలి'— అని, ఇంటికి మూలవిరాట్టని ఏదో పరువుకోసం పాకులాడి చెప్పే మాటల్లో, మాటల పసేగానీ,— యథార్థానికొస్తే మాత్రం... ఈ ముసలాడు జీవితమంతా పరిగెత్తి పరిగెత్తి, అలసి—సొలసి, ఆఖరికి దారిపక్కనున్న చెట్టునీడను చేరి, రొప్పుతూ రోజుతూ కూర్చోనీ,— పడుకుని ఏ కునుకు తీయనీ,— చలికి గడగడలాడనీ,— ఏమైనాగానీ,— ఎవరిక్కావాలి .. వీడి అతీగతీను ?

వొంట్లో సత్తువ ఉన్నన్నాళ్ళూ ఎక్కడలేని తాపత్రయంతో— కళ్ళకు గంతలు కట్టిన గుఱ్ఱంలాగా, కుడియెడమలు చూడకుండా పరిగెత్తి—పరిగెత్తి, పోయి—పోయి, ఆనూపానూ తెలీని బంజరుభూమ్మీద జెండా ఎగరేసి, ఈ యావత్తుగడ్డా నాదే అని చెప్పుకుంటే.... ఏమిటి ప్రయోజనం ?

సాతాను ప్రభువుని కొండ కొనకు తీసుకుపోయి ఇదంతా నా రాజ్యమే అన్నట్టు, ... అదో క్షణికానందం. ఈ 'నాది' అనుకునేది 'నీది' కాదు... అందర్నీ మించిన సర్వశక్తిమయు డొకడున్నాడు... ఈ సమస్తం వాడిదేనన్న ఇంగితం మొదట్లో ఎవ్వరికీ ఉండదుగదా !

నీ కంచమూ మంచమూ, నీ తోటలూ దొడ్లూ,— నీ పొలము పుట్రా .. ఇవేవీ నీతో రావు. అయినా ఇవన్నీ అమర్చుకోవడంలో అలసిపోతావ్... ప్చ్ ... అందుకే వెనకటి కాలంలో—

షోమ్రోను రాజైన ఆహాబు ఇశ్రాయేలువాడైన నాబోతుని— నీ ద్రాక్షతోటని— నాకు కూరగాయల తోటకింద ఇమ్మన్నాడట. అప్పుడు నాబోతు— అది నా పూర్వీకుల ఆస్తి .... కాబట్టి ఏంతమాత్రం ఇవ్వనని చెప్పేశాడట. దాంతో ఆహాబు కోపంవచ్చి మూతి ముడుచుకుని పోయి భోజనం ఓత్రా మానేసి మంచంమీద పడుకున్నాడట.

అప్పుడతని భార్య యెజెబెలు వచ్చి— ఏమిటని అడిగిందట. ఉన్న సంగతంతా ఏకరువు పెట్టాడట. వినివినీ యెజెబెలు— అయితే నువ్విప్పుడు ఇశ్రాయేలులో రాజ్య

పాలన చేయడం లేదా... ? సరైతే, ముందు లేచి భోజనం చేసేస్తే, ద్రాక్షతోట యిప్పించే ఉపాయం నే చేస్తానని హామీ యిచ్చిందిట అప్పుడావిడ ఆహాబు పేరిట తాఖీదు రాయించి, అతడి రాజముద్రవేసి, ఆ తాఖీదును నాబోతుఉన్న పట్నంలోని పెద్దలకు—ప్రముఖులకు పంపించింది.

ఏమనంటే— నాబోతు,— దేవుణ్ణి రాజుని దూషించాడని అతడిని గురించి దొంగసాక్ష్యం చెప్పేందుకు యిద్దరు పనికిమాలినవాళ్ళని సిద్ధపరచవలసిందని ... , తీర్పు అయినతర్వాత అతణ్ణి బయటికి తీసుకునిపోయి, రాళ్ళతో చావగొట్టవలసిందని రాసింది.

ఇజెబెలు రాసిన ప్రకారమే ఆ పుర ప్రముఖులు చేశారట. ఒక్కసారే చంపకుండా చిత్రవధ చేసినట్టు ఒక్కొక్కరాయి విసురుతూ మొకమూ మొహమూ చితగ్గొట్టారట... అదీ సంగతి.

మనిషిని ఏనుగుల కాళ్ళకు కట్టి ఈడ్పించడం, ఏనుగులచేత తొక్కించడంగూడా ఉండేవిగా ? ఆ వేలుతంబి పళవాయి విధించే శిక్షలన్నీ అలాగే ఉండేవి. శ్రీకంఠుడనే పేరుగల ఏనుగు పాచ్చుక్కరన్ అనే మావటీడుని దంతాలతో పొడిచి చంపిందిట

పాచ్చు ఏనుగుని చాలా బాధించేవాడట. పాచ్చుకితోడు వాడి తమ్ముడు ఒకడుండేవాడు. వాడిపేరు— పాక్కరన్. ఒకనాడు పాచ్చు శ్రీకంఠుడికి తాటాకులు తెచ్చి మేపుతున్నాడట— అప్పుడు పాక్కరన్ పక్కనే ఉన్నాడట. ఆ ఏనుగు అవాళ మంచి పొగరుమీదుంది. క్రీగంట చూసిందంతే,— తొండం విసిరి పాచ్చుని పట్టి ఎత్తేసిందట ఆపళాన పాచ్చు యిహ మనపని అయిపోయినట్టే అనుకున్నాడట ... 'పాక్కరా' ... అంటూ గావుకేక పెట్టాడట. అప్పుడు పాక్కరను పెద్ద బారు కత్తొకటి తీసుకు సిద్ధంగా ఉన్నాడట.

శ్రీకంఠుడు పాచ్చుని నేలమీద కుదేసి దంతాలతో పొడవడం మొదలెట్టిందిట. అప్పుడు పాక్కరన్ కత్తిపెట్టి దాని తోకమీద ఛక్లున కొట్టేసరికి పాచ్చుని విడిచి శ్రీకంఠుడు పాక్కరన్ వెంటబడగా,— అప్పుడు పాక్కరన్— ఒరే అన్నయ్యా నువ్వు పారిపో... పారిపొమ్మంటూ అరిచాడట. ఆ అరుపేమిటో ఆ ఏనుగుకి అర్థమైపోయి, అది మళ్ళీ ఒక పరుగునపోయి పాచ్చుని పట్టుకుంది. పాక్కరన్ మళ్ళీ తోకమీద చరిచాడు. ఈసారిక శ్రీకంఠుడు ఆ దెబ్బ లెక్కచెయ్యలేదు దంతాలు సూటిగా గుండెల్లో గుచ్చేసింది. అప్పుడింకేముంది... హా... అన్నయ్యా.. అయ్యో అంటూ విలవిల్లా

డాడు... ఆదీ సంగతి....

''అమ్మడూ ! మంచినీళ్ళు...'' అంటూ అరిచాడు కుయెన్నాచ్చను.

''కాస్త అంబలి తాగేందుకిస్తే బావుండు...'' గొంతు ఆర్చుకుపోతూంది,

''అమ్మా !''

వినబడినట్టు లేదు తీరిక ఉండిఉండదు. అందువల్లేగానీ, - లేకపోతే మధ్య మధ్య వచ్చి,— 'అంబలి తెచ్చిపెట్టమంటారా' ?— 'కాఫీ తాగుతారా'— అంటూ అడిగేది. వొక్కర్తే ఎన్నిపన్లని చక్కబెడుతుంది పాపం ? అన్నీ తనే సమర్థించుకోవాలిసి ఉండె.

మాత్తుకుట్టి ఉన్నాడంటే— ... ఏదో కిందామీదాపడి దీనామ్మ తెలివితేటల్ని ఆసరాగా తీసుకుని గుంభనగా పోతున్నవాడేగానీ, అంతకుమించి పనేం లేదు. ఇంటి వ్యవహారాల్ని గురించి వాడికసలు తుదమొదలు తెలీదు. అందుకే పెద్దలు— 'భార్య కనుక గయ్యాళిదైతే భర్తగతి అధోగతే'- అని 'జడివాన జగడాలమారి భార్య సమానమని'— చెప్పారు. అటువంటి రాక్షసిని అదుపులో పెట్టగల పెనిమిటి వాడు నిజంగా దేవాంతకుడనే చెప్పాలి. ఇల్లు ఒద్దుకోగల యిల్లాలు దొరకడం... భగవత్ప్రసాదమనే అనుకోవాలి.

మొదట తొణక్కాటునుంచి వో మేస్టరొచ్చి ఈబళ్లో పనిచేస్తూండేవాడు ఆయనకి ఏడుగురు సంతానం.. ఆ ఏడుగురూ ఆడపిల్లలే. వాడు వట్టి పనికిమాలినవాడు. కారాకిళ్ళీ నములుతూ గెడ్డాలు మీసాలు పెంచుకుని, బలాదూరు తిరగడానికిసరి వారానికి ఒక్కసారే యింట పొయ్యి రాజేయడం... కుదిరేది. వాళ్లు తిన్నారో... పస్తులే ఉన్నారో... మాట బయటికి వచ్చేదికాదు... ఇదంతా ఎందుకు చెప్పొచ్చానంటే,— అతగాడి యిల్లాలు... అంతటి యోగ్యురాలన్నమాట .. పిల్లలో ఆణిముత్యాలే.

'అయ్యో గొంతు ముండిపోతోంది... నాలుక పిడచగట్టుకు పోతూంది. కోడలు దీనామ్మ ఎక్కడికి వెళ్ళిందబ్బా .. ? కొంపదీసి వొంట్లో బాగుండలేదా ?... పగటి పూట నడుం వాల్చనే వాల్చదే'... అనుకుంటూ బిగ్గరగా కేకపెట్టాడు .. ''అమ్మా... దీనామ్మా...'' అంటూ.

అవతలనుంచి సమాధానం లేదు. ఇంకాస్త గట్టిగా పిలుద్దామంటే గొంతేమో పెగలడంలేదు. గొంతంతా ఆర్చుకుపోయింది లేచి చూసివద్దామంటే,— తలతిరిగి పడిపోతానేమో ! చేతికర్ర యెక్కడుందో ! ఇంతవరకు అదృష్టవంతుణ్ణే... పిల్లమూక

పట్టుకుపోలా. మంచానికి తలాపుదిక్కునే ఉంది... అనుకుంటూ నెమ్మదిగా లేచాడు. కాళ్ళు నేలమీద ఆనడంలేదు... చతికిలబడ్డాడు.

''అమ్మా దీనామ్మా'' అని పిల్చాడు.

మళ్ళీ లేచాడు. గోడ పట్టుకుని మెల్లిమెల్లిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళాడు... తలుపు గడియవేసి లేదు. ఆపళాన ద్వారం పట్టుకుని తలుపు దభేలున నెట్టాడు.

''దీనామ్మా ! ... ...''

''ఎవరు... ? ఆఁ ... ?'' అడవి కాయదున్నపోతల్లే నగ్నంగాఉన్న కురుప్ ... పచ్చగా... బొద్దుగా... పడుచుగాఉన్న దీనామ్మ... హవ్వ .. వొళ్ళు దద్దరిల్లిపోయింది... బట్ట చుట్టుకుంది.

'హే ప్రభో ! ఎమరు దెబ్బతిని పడిపోతూఉంటారు... మళ్ళీలేచి పరిగెత్తుతూను ఉంటారు. చేతికర్రేది? ఓహ్ .. చేతిలోనే ఉందెగా... తుఫానుగాలి వీస్తూంది... గట్టిగా పట్టుకోవాలి. లేకపోతే, ఆదీ—నేనుగూడా గాలికి ఎగరగొట్టుకుపోతాం. సైతాను చెరసాల్లోనుంచి విడుదలై వచ్చిందాయేఁ? ఆ సైతాను భూమ్మీద నాలుగు చెరగుల నున్న నానాజాతులకీ చెందిన అపార జనసమూహాన్ని విప్లవానికి పురిగొల్పి వెంట తీసుకుపోతుందా యేఁ ? అయితే ఆకాశం నిప్పులు కురిపించదేఁ ?

ఆరె... ఇదేవిటి ? బ్రహ్మాండమైన కోలాహలం వినిపిస్తూంది ... సైతానొచ్చిందా.... ? అహఁ ... స్వర్గానికి యెహోవా వేంచేసినట్టున్నాడు ... హల్లెలూయ— అంటూ అదుగో క్రైస్తవానంద గీతం— ఆలాపిస్తున్నారు.

వేశ్యావృత్తి చేసి ప్రపంచాన్ని కళంకితంచేసే, పెద్దవేశ్యను రక్తం అడిగి ప్రాయశ్చిత్తం చేయడానికి వచ్చినట్టున్నాడు. హల్లెలూయ . భగవన్నామ స్మరణ చేయుగాక ! వరదపొంగుల్లే... వానజల్లల్లే... మేఘ గర్జనల్లే హల్లెలూయ.

కళ్ళుతెరిచి చూసేసరికి నలువైపులా గుమిగూడిన జనం... వోహో గొడవగా ఉంది ... ఎవరెవరో గుర్తు పట్టేందుకు లేకుండాఉంది .. అయితే మొగవాళ్ళు... ఆడవాళ్ళు... పిల్లలు...

''నాన్నా... '' అని ఎవరిదో పిలుపు,

తల వాలిఉంది... చెవులమీద నెరిసిన వెంట్రుకలు....

పయెన్నాచ్చను,— 'కీపరత్'— అంటూ గొణిగాడు.

''ఆఁ ... నేనే నాన్నా... కాస్త కాఫీ తెమ్మంటావా ?''

''మాత్తుకుట్టి ఎక్కడరా ?''

''వాడు మలబారు వెళ్లాడుగా... దీనామ్మా కాస్త కాఫీ తెచ్చిపెట్టమ్మా !... చెమ్మాతోపట్టు.''

''పట్టుకు కూర్చోబెట్టనా ... ?''

''అమ్మా మీరు కాస్త తప్పుకోండి ... లేవదీసి నే కూర్చోబెడతా గానీ ... దీనామ్మా నువ్వు కాఫీ పట్టవమ్మా.''

'ఆఁ ... యిప్పుడు... నీ వైఖరి బాగా తెలిసిందిలే... నువ్వుపడే గాబరా అంతా నీ మొహమే చెబుతూందిలే. వొంటిమీద బట్టలున్నాయా... ? ఇంకా నిన్ను నమ్మి నీ చేతి నీళ్లు తాగుతానులే ?'

చెయ్యి పైకెత్తాలని చూశాడు... అతి కష్టంమీద ఎత్తాడు. ఆ కాఫీగ్లాసుని ఒక్కనెట్టు నెట్టాడు. ఆ గ్లాసు—చెమ్మా చేతిలోంచి జారి కిందపడిపోయాయి ... , అబ్బ... హాయిగా ఉందిప్పుడు... అన్నాడు.

''అయ్యో... ఏవిటిది... ఖర్మ...''

''మావయ్యా... నేను.''

''అవును... నువ్వే... అందుకే చెపుతున్నా పొమ్మని. పో ముందు నా ఎదట నుంచి...''

''బహుశా మనిషిని పోల్చుకోలేకుండా ఉన్నట్టున్నాడు.''

''కీపరీత్ !''

''ఏవిటి నాన్నా !''

''ఒరేయ్... దేహంమీదికి తొంభై యేళ్లు వచ్చినా ఇంకాగూడా నేనీ వయస్సులో గుడ్డిగానే బతుకుతున్నారా.''

''నీకు గుడ్డేం ఖర్మ... ? నిక్షేపంలా చూడగలుగుతూ.''

''లేదురా.... నాయనా...''

ఇంకా ఏదో చెప్పుకుపోతూంటే దీనామ్మ ఆయనమాట వినబడకుండా ఉండేటంత బిగ్గరగా తను మాట్లాడటం మొదలెట్టింది. ''ఆ... ఏవో మతిలేని మాటలు... మాట్లాడుతూనే ఉంటారు. నిజమే,— లేకపోతే యిద్దామని తెచ్చిన కాఫీగ్లాసుని పడేస్తారా .'' అంటూ సాగదీసింది.

''ఆ ఘండాలుడేడిరా ?''

"ఎవరు నాన్నా ?"

"ఆఁ ... ఏవిటో అర్థంపర్థం లేనిమాటలు... మనం వాటన్నిటిని పట్టించుకోనక్కర్లా ... అలా మెదలకుండా పడుండనీండి ..." అంది దీనామ్మ... తొ్ౖట్రు పడుతూనే.

"నేను ముందు అబ్బాయిని చూడాలి– మాత్తుకుట్టిని చూడాలిరా... వాడెక్కడ ? నా పాతకత్తి వాడిదగ్గరుంది."

శాంతమ్మ దగ్గరకు వెళ్ళి,— "మీ అబ్బాయి రేపో ఎల్లుండో వచ్చేస్తారు తాతయ్యా" అని చెప్పింది.

"ఎవరది... శాంతమ్మేనా ?"

"ఆఁ ..."

"దగ్గరగా రామ్మా."

ఆ పిల్లదాని చేయి తన చేతిలోకి తీసుకున్నాడు.

"ఇంత సేపూ ఎక్కడికి వెళ్ళావ్ తల్లీ ?"

"చర్చికి వెళ్ళాను... మీతో చెప్పే వెళ్ళాగా తాతయ్యా ?"

"ఇకమీదట ఎక్కడికీ వెళ్ళొద్దు తల్లీ !"

"అదేఁ ?"

"అంతా దొొంగలు."

శాంతమ్మ కేవిటో అర్థంకాలా. చుట్టూ కలయజూడటం మొదలెట్టింది.

"అమ్మా డబ్బు చెల్లేదో– చెల్లనిదో తెల్సుకోవాలంటే నేలమీద పడేస్తే,— ఆ మోతనిబట్టి కనుక్కోవచ్చు. పనసకాయ బాగుందో– చెడిపోయిందో కనుక్కోవాలంటే,- సుచ్చిచూస్తే తెలిసిపోతుంది కానీ .. ఆడదాని అంతర్యం కనుక్కోవడం మాత్రం చాలా కష్టం సుమా ?..." అంటున్నప్పుడు కుయెన్నాచ్చను కళ్లు చెమ్మగిల్లాయి.

"కాసిని మంచినీళ్ళిప్పించు అమ్మడూ !"

శాంతమ్మ కాఫీ యిచ్చింది ... తాగేశాడు... ఎండి యేరింపులై ముడుచుకుపోయిన అన్నవాహికలో గోరువెచ్చని కాఫీ పడేసరికి ఎంతో హాయిగా ఉన్నట్టనిపించింది. కళ్ళల్లో జీవం వచ్చింది. చుట్టూ కలయజూశాడు. ఇప్పుడిక అందరి మొహాలు పర్తుపట్టగలిగాడు. దీనామ్మ మొహంవంక సుచ్చిసుచ్చి చూసేసరికి హడిలిపోయింది. అదీ

ఒనిబెట్టాడు కుయెన్నాచ్చను.

''కీవరీత్ !''

''ఏవిటి ?''

''వాడు... ఆ కురుప్‌గాడేడీ ?''

''ఇంటికి పోయినట్టున్నాడు. ఇవాళ ఆదివారం... కొట్టు లేదుగా మరి ?''

''మావయ్యకి లేనిపోని అనుమానాలెక్కువ. సిసిలీవాళ్ళ నాన్నగారు వెళ్లేటప్పుడు ఆయనకన్నీ అప్పజెప్పివెళ్ళారో లేదోనని బెంగ. ఈ వయసులో గూడా ఆయనకింకా ఏవిటో ఇంటిని పిల్లల్ని గురించే తాపత్రయం...'' అంది దీనామ్మ

దీనామ్మ అన్న మాటలు కుయెన్నాచ్చనుకి స్పష్టంగా వినబడలేదు. ఆయన మళ్ళీ దీనామ్మ మొహంవంక తేరిపార జూశాడు

అపతలివాళ్లని ఆకట్టుకునే చూపుతో, మధురమైన మాటతో, మైమరపించే రూపముతో పరపురుషుల్ని యిట్టే వల్లో వేసుకోగలవ్... అయితే నీ వల్లో పడ్డవాడు సర్వనాశనం కావాల్సిందే... నీతో సాంగత్యమంటే— నిప్పులు వొళ్ళో పోసుకున్నట్టే... నీ మోహపాశానికి చిక్కినవాడు సర్వనాశనం కాకుండాపోడు...'

ఎండెక్కింది... మబ్బు తునకొకటి సూర్యుణ్ణి మరుగుపరిచింది. అందువల్ల ఎండతెర తీసినట్టయింది... సందెపడినట్టయింది. కళ్లు చీకట్లు కమ్మినాయి...

అనుమానమెందుకోయ్ .. స్వయంగా నువ్వే చూశావ్‌గా... ఏదో చూశావ్‌గా ? అది కలా .. నిజమా ? అలా చేసేరకం కాదే... అంటూ కుయెన్నాచ్చను మనస్సు పరిపరివిధాలుగా ఘోష పెడుతూంది.

అంత సందేహనివృత్తి కావాలంటే పరీక్షించు వెలుతురు ! ఒక్క మనిషి మాత్రం కనబడేటంత వెలుతురు...,

ఎవరు ?

నేను ... మోషేని ... ఇశ్రాయేలీయుల నాయకుణ్ణి. నీకేవిటో అనుమానమన్నావ్ ? అనుమానాలు తీర్చేందుకు యెహోవా ఉన్నాడు. పరీక్ష పెడతాడు... ఆవిణ్ణి పిలు... తేలిపోతుంది. పిలవవలసిన అగత్యం లేకుండా ఆవిడగారే తలవొంచుకుని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వస్తూంది.

'ఒకని భార్య దారితప్పి భర్తకు ద్రోహం చేసినా, అంటే వేరొకడికి ఆవిడతో అక్రమ సంబంధం ఉన్నా, ఆవిడ ఆ విషయం భర్తకు తెలీకుండా దాచినా,—

అపవిత్రురాలైన ఆవిడను- భర్త విధిగా యాజకుడి దగ్గరకు తీసుకుపోవాలి. యెహోవా సన్నిధిలో నిలబెట్టి— ప్రాయశ్చిత్తం చేయించాలి. అందుకుగాను యవలపిండి నైవేద్యంగా అర్పించాలి. అది దోషాన్ని జ్ఞాపకం చెయ్యడం కోసమైన నైవేద్యం కాబట్టి, దానిమీద నూనె పోయరాదు... సాంబ్రాణి వేయరాదు.

తరువాత యాజకుడు మట్టికుండతో పరిశుద్ధజలాన్ని తెచ్చి, ఆవిడకు జుట్టు విరబోయించి, దోషవిషయక జ్ఞాపకార్థమైన ఆ నైవేద్యాన్ని ఆవిడ చేతిలో పెడతాడు. ఆవిడిలో ఉన్న దోషాన్ని వెల్లడిచేసే- చేదునీళ్ళు యాజకుడి చేతిలో ఉంటాయి. అతడు ఆవిడచేత ఆ నీళ్ల తాగిస్తాడు... ఆ యిల్లాలు అపవిత్రురాలు కనుకైతే— భర్తను మోస గించిందే అయితే,— ఆ నీళ్ల తాగినవెంటనే ఆవిడ కడుపు ఉబ్బుతుంది... ఆవిడ నడుములు పడతాయి... అదీ..., పరీక్ష... పెట్టమంటావా ?

చిత్తం ప్రభూ ! ఈవిణ్ణి పరీక్షించాలి.

సరే పరీక్ష పెడతారు... ఆశ్చర్యం ! చూస్తూ చూస్తూండగా ఆవిడ పొట్ట ఉబ్బుతుంది... నడుములు పడిపోతాయి...

"దాన్ని రాళ్ళతోకొట్టి చంపండి... చంపాల్సిందే .. చంపి పారెయ్యాలి..."

"మావయ్యా !"

"నాన్నా !"

మళ్ళీ వెలుతురుపోయి ... మసగ మసగ్గాఉంది. ఒక్కోసారి వెలుతురు... ఒక్కోసారి చీకటి... కుయెన్నాచ్చను... ఆ చీకటి వెలుగుల కలనేతయైన రాత్రిని ఎలాగో గడిపాడు. కొడుకులు మనుమలు, బంధుమిత్రులు ఇంకా ఆ పేటలో ఉన్న వాళ్లు... అంతా వస్తూ పోతూ ఉన్నారు. రాత్రి తెల్లవార్లూ శాంతమ్మ కన్నుమూయ్యకుండా కుయెన్నాచ్చనుకి ఉపచారం చేస్తూనేఉంది.

ఈ ముసలాతు— విషయం పైకి కక్కేయ్యకుండా ఉంటేచాలురా భగవంతుడా అని దేవుడికి వెయ్యిదణ్ణాలు పెట్టుకుంటూ దీనామ్మ.. ఆయనకి మగత వొదిలే వేళకి బెరుకు బెరుగ్గానే అక్కడికి తయారు... కీపరీతు... కుట్టిఅమ్మగూడా ఆ రాత్రి మేలో ఝుత్తువాళ్ళ యింటనే పడుకున్నారు.

తెల్లవారాక ... కుయెన్నాచ్చనుకి రవంత కునుకుపట్టింది... దీనామ్మ కాఫీ చేస్తూంది. కీపరీతు వంటింటి గుమ్మంలోకి వచ్చి,— "దీనామ్మా ఇట్రామ్మా" అని పిల్చాడు.

దీనామ్మకి గుండె గుభేలుమంది. రాత్రి పడుకోబోయే ముందు కొంపదీసి మావయ్య కొడుకుతో చెప్పేశారేమో... దొంగతనం పట్టుబడి... బహుశా విచారణ కోసం పిలిపిస్తున్నారేమో... అనుకుంటూనే దగ్గరికి వెళ్ళింది.

నిమ్మచెట్టుదాకా వెళ్ళిన తర్వాత కీవరీతు— "ఔను,– దీనామ్మా ! నాన్న ఎలా పడ్డాడంటావ్..." అనడిగాడు.

"నేనేమో వంటింట్లో వసుల్లోపడి కొట్టుకుంటున్నా ... చప్పుడు విని ... వచ్చి... చూశా .. అంతకుమించి నాకేం తెలీదు."

"ఊఁ ... కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండాల్సింది మరి ? ఏం చేస్తాంలే.... రాత... తప్పదు .. ఏదో నెపముండాలిగా."

"ఎప్పుడు పిలిచినా... వొక్కపరుగున వస్తా... రాత్రిళ్లగూడా నాలుగైదు సార్లు వెళ్ళివెళ్ళి..., చూసొస్తా... అటువంటిది–" అని చెపుతూంటే దీనామ్మ గొంతు పూడుకుపోయింది. కళ్ళనీళ్ళు వొచ్చేశాయి.

"అవునమ్మా ! నువ్వు గమనించలేదని... ఎవరంటారు ? అదికాదు, అసలింత కాలంనుంచీ ఉపచారం అదీ చేస్తూంది నువ్వేగదా !" అంటూ కీవరీతు యిక యింటికి బయల్దేరి పోతూండగా, దారిలో కురుప్ కనిపించాడు.

"ఎలా ఉన్నాడు ముసలాయన కీవరీత్‌మాప్పిళ్లా..." అనడిగాడు.

"ఏం చెప్పమంటారు ? పైకి కనబడటం లేదుగాని... ఆ పడటంలో లోపలే ఏదో గట్టిదెబ్బ తగిలినట్టుంది ... మన చేతిలో ఏముందిలెండి ... ? వచ్చేవి రాక మానవు... అన్నట్టు నల్లమందు అయిపోయింది ఎక్కడనుంచైనా పట్టుకొచ్చి యివ్వా లయ్యా ! అది వేళకి పడకపోతే నీరసం వచ్చి అట్టట్టు చేస్తూంటుంది..."

"అలాగే తెచ్చిపెడతా..."

"సరే నే వస్తా..."

"మంచిది."

కీవరీతు వెళ్ళిపోయాడు.

"ఏవిటో చిరాగ్గా ఉన్నావ్... గడబిడేమైనా జరిగిందాయేఁ ?" అంటూ కురుప్ దీనామ్మని నెమ్మదిగా అడిగాడు.

ఆవిడ ఏం చెప్పకుండా కురుప్‌వంక ఉరిమి ఉరిమి చూసింది.

"ఎందుకలా చూస్తావ్ ?"

"కడసారిగా చూస్తున్నా..."

"కడసారా?"

"ఔను... నా శవాన్నే చూస్తావ్ నువ్వు..."

"పిచ్చిగా వాగకు."

"ఎవరికీ పిచ్చి? ఫో ముందు నా ఎదుటనుంచి... పోకపోయావో... గుండెలు బాదుకుని నీ యెదుటే చస్తా... నీకు ఎంతగా చెప్పా...? రెండేళ్లుగా గుట్టుగుట్టుగా నెట్టుకొస్తున్నా... ఒక్కసారి బట్టబయలైంది... ఇప్పుడు ప్రాణంమీదికి వచ్చింది."

"ఛా ఊరుకో. వట్టి అనుమానమేగాని... నయమైన్నా మూర్ఖుళ్ళకి .. ఏం అంటే ఏం తెలీదులే... నే పోయి చూసొస్తా"

"ఫో... ధంతాయిదా! ఆయనే సరిగ్గా కనిపెట్టివుంటేనా— అటో యిటో తేలిపోయేదే... మనవని..."

కురుప్ కాసేపు మెదలకుండా నిలబడ్డాడు. శరణాగతుడల్లే— దీనంగా దీనామ్మ వంక చూస్తూ ఉండిపోయాడు. ఆ తరువాత గిరుక్కున తిరిగి చక్కాపోయాడు. వెనకనుంచి దీనామ్మ— "ఆయన వెండిమీద స్పృహ వచ్చినప్పుడల్లా— ఆయన నోట... అదేమాట... ఇంకోమాటలేదు. మహాప్రభో! గుట్టు బయటపడే లోపల ఏ విషమో తిని చచ్చిపోతా." అంటూ గొణగడం వినిపించింది

శివరాం కురుప్ నడుస్తున్నాడు... కానీ కాళ్లు తడబడుతున్నాయి... నడక పదరడంలేదు. ఏదో తెలియని గాబరా... అతగాడు యింతకాలం తగిలించుకున్న మంచి తనమనే ముసుగు చిరిగి ముక్కలైపోయింది... అప్పుడిక నగ్నంగా నిలబడ్డాడు— 'న్యాయమూర్తి జీవించే పొంగసామ్మ బయటపడితే చేసేదేముంది? ఎంతో చాకచక్యంగా వేసిన పథకాలన్నీ తల్లకిందులైపోయాయి ఇప్పుడు మళ్ళీ కూడగట్టుకు రావాలి... అదే ఎలాగా అని? ఎంత కట్టుదిట్టంగా చేసుకుంటూ వచ్చినా ఎక్కడో అక్కడ పొరబాటు జరుగుతూనే ఉంద!

ఆ రోజుల్లో కేశవపిళ్ళ కూతురికి విడాకులిచ్చేశాడు. రేవుకిపోయి స్నానంచేసి క్రితంరాత్రి చూసిన 'దుర్యోధన వధం'— కథకళి నృత్యనాటికలోని పాటను కూని రాగంతో పాడుకుంటూ వస్తున్నా... ఓణం పండుగ రోజులు. తను తీస్తున్న కూని రాగానికి తోడు అదేలయలో ఆపతల పెళ్ళిపుల ఆట— డప్పులు మోగుతున్నాయి. ఇరుకు సందులోంచి పోతూంటేగా... ఓ వ్యక్తి ఎదురొచ్చింది.

శుభ్రమైన చుట్టుపంచ, చోళీ ..వోణీ... వేసుకుంది. చేతిలో నల్లటి బైండు పుస్తకము ... వెంట సీతాకోకచిలకల్లే ముద్దులు మూటగడుతున్న చిన్నపిల్లాను. దగ్గరకొచ్చాక గుర్తుపట్టగలిగాడు ... కుయెన్నామాప్పిళ్ళ కోడలు .... మాత్తుకుట్టి భార్య అని. కుయెన్నామాప్పిళ్ళతో మొదటినుంచి కాస్తోకూస్తో పరిచయం ఉందనుకోండి... కర్ర పొడుచుకుంటూ వెడుతూండేవాడు. అయితే ఆయనంటే మాత్రం ఆ ఊళ్ళో అందరికీ గౌరవమే...

''అమ్మా-కూతురూ ఎక్కడికి బయలుదేరారు ?'' అని పలకరించాడు కురుప్.

''ఏం చెబితేగానీ తెలీదా ? ఆదివారం పొద్దుట ప్రార్థన పుస్తకం తీసుకుని ఎక్కడికి వెడతారో ఆ మాత్రంగూడా తెలీదా ?'' అని మొహం పగిలేటట్టు అడిగింది దీనామ్మ.

ఆ జవాబుతో— అప్పట్లో నా ఇచ్ఛాశృంఖలాలు తెగిపోయినట్టే పోయి మళ్ళీ కుయెన్నాచ్చను ధర్మమా అంటూ అతుక్కున్నాయి. కుయెన్నాచ్చనంటే— ఆయన వేసుకునే నల్లమందే... నన్ను—దీనామ్మని సన్నిహితుల్ని చేసింది.

ఒకనాడు సడీబజార్లో— కుయెన్నాచ్చను నల్లమందు గురించి ప్రసక్తి తెచ్చాడు. ఆపళాన మనస్సులో అంచనా వేశాను... ఆయువుపట్టు చిక్కింది లెమ్మనుకున్నా. కొద్దో గొప్పో కష్టపడనా— సరుకు పుట్టించి తెచ్చియిచ్చా. దాంతో అప్పటినుంచీ రాకపోక లేర్పడ్డాయి. ఆ తరువాత కొత్తకొత్త ఎత్తులు వెయ్యాలిసి వచ్చింది. ఏమేమిటో... అన్నీ గుర్తుకు రాసాగాయి. అడపాదడపా పిల్లకి కానుకలు గట్రా తెచ్చి యిస్తూండేవాణ్ణి... మాత్తుకుట్టికి డబ్బుసాయం చెయ్యడానికిగూడా అందుకే వెనుకాడలేదు. అఖరికి ఒకనాడు మనస్సు మరీ వెర్రితలలు వేసింది. కళ్లముందు మసలిన దృశ్యం...

మధ్యాహ్నం కుయెన్నాచ్చను నల్లమందు వేసుకుని మత్తుగా పడుంటాడు... బుజంమీద చెయివేస్తాడు. చెయి వొణుకుతున్నట్టు .... పండు నిప్పులల్లేఉన్న... కళ్లు... కదులుతున్న పెదవులు...

అయ్యో ... ఇటువంటి వాడవనుకోలేదు సుమా ? అంత ముసృద్ధే ఉంటే ... మరోచోట అఘోరించుకోవాలి. చెంపను చెయిచేర్చి ఏడుస్తుంది... తెగఏడుస్తుంది.

పరువు తియ్యను.... పొరబాటే... ఎక్కడా పొక్కనీయనులే.

ఎవరికీ తెలీదు... ఎన్నటికి ఆ మాట ఎత్తను...

ఊహుఁ ... చివరికి అనుకున్నంత అవుతుంది... అది శీలభంగం లాటిదే... అయినా... అంగీకరిస్తుంది .. లొంగిపోతుంది లంపటంలో చిక్కుకున్నారు... ఒడ్డుకు చేరాలిసిన నావ అట్టే మునిగిపోతుంది... ఇక వారేవిటి ... ?''

'ఆఁ ?'

* * * * *

''ఇందనాన్నా ... తీసుకోండి... వేసుకోండి... హాయిగా ఉంటుంది.''

కళ్లతెరిచి కుయెన్నాచ్చును కీవరీతుపంక చూశాడు. కోరిన వస్తువు కంటబడే సరికి ఎక్కడలేని ఆనందం కలిగింది. తీసుకుని వేసుకున్నాడు. ఏదో చెప్పాలని మాత్రం మనసులో ఆరాటంగాఉంది కానీ... గొంతు పెగలడంలేదు .. లోపల్లోపల ఏదో తెలియని గందరగోళ పడుతున్నాడు.

''మాత్తుపట్టి ?''

''రేపటికి ఎలాగా రానేవస్తాడు. బహుశా ఈ సాయంత్రానికే రావచ్చు...''

''వాస్తే... వాడితో నేను కొంచెం మాట్లాడాలిసి ఉందిరా...'' అన్నాడు.

''ఏవిటి నాన్నా... ?''

''ఆఁ ?''

''నాతో చెప్పవచ్చుగా ?''

''కాసింత మంచినీళ్ళియ్ .. లోపలంతా దహించుకుపోతూంది రా కడుపు ఖాళీగా ఉందిగామరి ?''

శాంతమ్మ కాఫీ తెచ్చింది చెప్తాడు... చెప్తాడుగా ఇస్తూంది తాగు తున్నాడు... ఏవిటో .... భగభగమంట... ఓ చేత్తో తలరాచుకుంటూ— ఇంకో చేత్తో కాఫీగ్లాసు పుచ్చుకున్నాడు. లోపల పేగుల్లో సూదులుపెట్టి గుచ్చుతున్నట్టుంది. చెప్ప లేని... బాధ... మంట బాగఎక్కువై కడుపులోంచి పైపైకి తంతున్నట్టనిపించింది. కళ్ల చీకట్లు కమ్ముతున్నాయి. ఎంత త్వరత్వరగా చీకట్లు ముసురుకొస్తున్నాయి !

ఏవేవో ఆలోచనలు ,— 'త్వరగా వెళ్ళాలి చేతిలో దీపంలేదు— ధూపం లేదు.... త్వరగా పోవాలి

అను .. అంటూ ఎవరో వెనకనుంచి బట్ట పట్టుకుని లాగుతున్నారు ... ఎవరు ?... ఒక పురుషుడు— ఒక స్త్రీ. ఆ ఆడమనిషిని ఎక్కడో చూసినట్టేఉంది...

ఆఁ... అదీ..., పెణ్ణమ్మ..., ఇహపోతే... ఆ మగవాడు ?

వొదిలిపెడతా మనుకున్నావా ?

ఉఁ... ? ఏం కావాలి ?

నువ్వు ఈవిణ్ణి ఎరుగున్నావా ?

ఉహుఁ.

ఇదుగో... కళ్లల్లో దుమ్ముకొట్టాలని చూడకు. అంతకంత అనుభవించాలిసి ఉంటుంది. ఇంట్లో మగవాడు లేనప్పుడు చూసి, గుట్టుచప్పుడుకాకుండా వచ్చావ్?... వచ్చి, అరచేత స్వర్గం చూపిస్తానని చెప్పావ్ ? చెప్పి,- ఆఖరికి దాన్ని దిక్కు-మొక్కు- లేకుండా చేశావ్ కదూ ?

నేనేం చెయ్యలేదు... ముందు నాబట్ట వొదులు.

పెద్దపెట్టున నవ్వు...

ఒరే,- ఇంతకింత ముట్టజెప్పాలిసిన గతి పడుతుందని చెబుతున్నా. నువ్వు చెయ్యని పక్షంలో నీ సంతానం దగ్గర్నుంచైనా వసూలు చేస్తారుగానీ ఊరుకోరు తెల్సిందా ?

ఏఏటి ?

ఔను... నువ్వు పుచ్చుకుంటే- నీ కొడుకు యిచ్చుకుంటాడు... అంతే. మళ్ళీ పిడుగులు పడ్డట్టు నవ్వు.

చీకటి పడిపోయింది... నేను వెళ్ళాలి వెన్నెలగూడా రాలేదు.

వెన్నెల లేకేవిటి... పైకి చూడు.

అఁ ? అదేవిటి ? ఆకాశం మీదనుంచి ఒక గౌరవర్ణంగల గుఱ్ఱం వడిగా పరి గెత్తుతూ వస్తూంది. దానిమీద కూర్చున్న వ్యక్తి కళ్లు ఎఱ్ఱగా నిప్పుకణికల్లా ఉన్నాయి. తలమీద చాలా కిరీటాలున్నాయి. అతడు తొడుక్కున్న అంగీనిండా నెత్తురు మరకలే... పదునైన ఖడ్గం నోట కరచుకున్నాడు. ఒక్క వ్రేటుతో వేలతలలు నేల రాలాయి. నెత్తురుటేరు ప్రవహిస్తోంది. అలా ప్రవహిస్తూ ప్రవహిస్తూ ఆకాశపు టంచులవరకు వనగలిసింది. ఎటుచూసినా ఎఱ్ఱరంగే. కొట్టొచ్చేటట్టు ఉన్న ఎరుపు...

నవయుగోదయమేమో ... అన్పిస్తుంది ... శుకపికాల కలవరం.... కోడి కూత... రకరకాల పింతలు కనబడుతున్నాయి. కానీ మసగమసగ్గా కళ్ళముందు సన్నని తెల్లని వస్త్రం తెరగట్టినట్టుంది. అటుయిటు తిరుగాడే జనం నీడలు- కనబడు

తున్నాయి. ఎక్కడో చాలా దూరంనుంచి, ... ఏడుపులు పెడబొబ్బలు మూలుగులు... సముద్రపు హోరులా వినబడుతూన్నాయి.

"మావయ్యా !"

"తాతయ్యా !"

"కళ్లు తెరవండి..."

"ష్... అరవకండి."

"పురోహితుణ్ణి పిలిపించి మరోమారు తైలాభిషేకం చేయిద్దామా ?"

"ఎవరినైనా పంపించి పిలిపించండి."

"అనవసరం... ఏం వొద్దు... వచ్చే ప్రాణం పోయే ప్రాణంగా ఉండె."

కుయ్యెన్నాళ్ళను కంటిమెపటున్న— ఆ తెర వెన్నెలల్లేఉంది... పౌర్ణమినాటి వెన్నెల. పిండారబోసినట్టుందా వెన్నెల. అహా ... ఆ తెరమీద ఏడురంగులున్నాయి. తెర పైకి లేచేసరికి... అక్కడో సువర్ణ సింహాసనం.... ఆ సింహాసనంమీద కూర్చున్న వ్యక్తి .. ఆ వ్యక్తి కుడిచేతిలో రెండువైపుల రాసి ఏడుమడుపులుగల ఒక పుస్తకం..., కనబడ్డాయి.

మొదటి మడుపు తెరవగానే .. గౌరవర్ణంగల గుర్రం, ఆ గుర్రంమీదో మనిషి— ఆ మనిషి చేతిలో ఒక చాపం కనబడ్డాయి. రెండో మడుపు తెరవగానే చేతిలో కత్తి పట్టి, — ఎర్రని గుర్రమెక్కి స్వారీచేస్తున్న మనిషి కనిపించాడు. మూడో మడుపు తెరిస్తే— చేతిలో త్రాసు,— నల్లటి గుర్రమెక్కిన మరోవ్యక్తి సాక్షాత్కరించాడు ..

ఆర్తనాదం వ్యాపించింది. దగ్గరికి పరుగుపరుగున వస్తున్న అంతులేని జనం... జనసమ్మర్దం .. ఆ రొద చెరువవుతున్నట్టుంది. చూస్తూంటే సముద్రం నేలమీద విరుచుకు పడుతున్నట్టనిపిస్తూంది. అలలు ఆకాశమంతెత్తున లేచిలేచి పడుతున్నాయి. క్షణంలో ఆ సముద్రం జనాన్నంతా తుడిచిపెట్టి పారేసింది.... వాళ్ళ ఆర్తనాదాలు మిన్నుముట్టాయి.

నే లేచి పై అంతస్తుని చేరుకోవాలి... లేవాలని యత్నిస్తున్నకొద్దీ మెడమీద ఏదో పెద్దబరువు పెట్టినట్టు అనిపిస్తూంది. కిందకి కూరుకుపోతున్నట్టుంది. వెళ్ళడమా .... మానడమా ? ఎలాగో తికమకపడి పైకి లేచా... ఆయాసపడి పైన అంతస్తుకి చేరుకున్నా. ఎంత పైకంటే— చెయ్యిజాపితే ఆకాశం అందుకోవచ్చు నన్నమాట. అస్తమించే సూర్యుణ్ణి చూడగలుగుతాం...

చుట్టూ జనం... వీళ్ళెందుకు వోరు... ?

"తాతయ్యా కాస్త కళ్ళు తెరవండి."

"ఎవరొచ్చారో చూడండి..."

"ఎలా తెరవను తల్లీ! రెప్పలు అంటగుట్టేసినట్టున్నాయమ్మా!"

"తాతయ్యా! నేను... కుట్టిఅమ్మను."

"తెలుసమ్మా... కొంచెం ముందుగా వచ్చినట్టయితే,— బావుండేది. నీతో వోమాట చెబుదామనుకున్నా... ఇప్పుడిక వేళ మించిపోయింది" అంటూనే,— మళ్ళీ అలల్లో చిక్కుకుపోయాను... కాళ్లు చేతులు లాగేస్తున్నాయి .. అబ్బ... ! ...

మేలోర్తుత్తువాళ్ళ యింటి వసారాలోను వాకిట్లోను జనం కిటకిటలాడిపోతున్నారు. ఆ ఊరి మొత్తంలోఉన్న అన్ని జాతులవాళ్ళు మతాలవాళ్ళు ఆశామగా అంతా— కుయెన్నాచ్చన్ని... వచ్చి చూశారు

ఆ గ్రామంలోఉన్న ఏకైక శతవృద్ధుడాయన కొడుకులు— మనుమలు... ముని మనుమలతో తులతూగే పెద్ద కుటుంబానికి మూలవిరాట్టు ఆయన. ఎక్కడైనా సరే,— యిద్దరు మనుషులు చేరితే,— మొదట చెప్పుకునే విషయం— ఆ మేలోర్తుత్తు కుయెన్నాచ్చను... ఆరోగ్యపరిస్థితే.

'చాలా సీరియస్‌గా ఉందిట'— అనో.

'గుటగుట్లాడుతున్నాడట...' అనో...

'మాత్తుకుట్టి మలబారు వెళ్ళాడు. వెళ్ళినవాడింకా రానేలేదు'

'శాంతమ్మే ఉపచారం చేస్తూంది'—

'పాపం... ఇప్పటికి ఎన్నిరోజులుగానో తాతగారి కోసం ఎంత శ్రమపడి చేస్తూందో.... బుద్ధిమంతురాలు కనుక...'

ఈ జనం తొక్కిసలాట... గందరగోళం మధ్యలో కురుప్ అడపా దడపా వచ్చిపోతూనే ఉన్నాడు. ఇంట్లో మనిషిలాగా అడుగడుగునా... అన్నీ అడిగి అడిగి కనుక్కుంటున్నాడు.

ఇక బతకడని తెలిశాక— చివరి గడియల్లో చెయ్యాలిసిన తతంగం చేశారు. వసారాలో వేదిక అమర్చారు... దానికి సంబంధించిన కాండంతా కురుప్ అధ్వర్యం లోనే జరుగుతూంది. దీనామ్మ ఆ వసారాలో నిలబడి — వచ్చిన చుట్టపక్కాలకి— మున లాయన జబ్బుని గురించి చెబుతూంది

"ఇదుగో ఏవమ్మోయ్... ఒక్కసారి యిలా వచ్చిపోదూ"— అంటూ కురుప్ దీనామ్మని పిలిచాడు.

దీనామ్మ వెళ్ళింది. ఎవ్వరూ లేనిచోటికి పోయి,— ఏదో గుసగుసగా,—

"ఏవిటి ? ఇప్పుడిక మనస్సుకు నెమ్మదన్నమాటేనా ?"

"ఏవిటా పాడుకూత ? పాపం... మావయ్యకి నేనంటే ఎంత ఆపేక్ష... ? ఎందుకో యింకా నేను... భగవంతుడా ! నామీద యిన్ని నిప్పులో... ఇంత గంధకమో కురిపించరాదా తండ్రీ ! ఎందుకు బతికిస్తున్నావ్ ? ఇదుగో చెపుతున్నా ! ఇక మీదట నువ్వు నా కంటబడ్డావో దేవుడిమీద ఒట్టు... ... ఆ దయామయుడైన యెహోవా...."

"యెహోవా కాడు... నిన్ను కాపాడినవాణ్ణి నేనే."

"ఆఁ ?"

శివరాం కురుప్ మొహంలో ఏదో వికారమైన నవ్వు... , "ఆపని ముగించింది నేనే "

"ఏవిటి ?"

"ఆఁ ."

"ఏవిటి ముగించావ్ ?"

"ఒక యెత్తు వేశా."

"ఏవిటా ఎత్తు ?"

"అదా... ? అదీ... సల్లమందుతోబాటు కొంచెంగా దాంటో కలిపేశా... అదే... రవంత విషం. ఆయనపాలిటి మోక్షప్రదాతని— అనుకో."

"ఆఁ ? ..."

దీనామ్మ దుఃఖమున్తా గొంతులోనే కరడుగట్టుకుపోయింది.

"లేకపోతే ఏవిటి ? పొద్దున నువ్వేమన్నావ్ ? పసువుపోతే— బతకనన్నావా లేదా... అందుకే,—"

"అఘోరించినట్టే ఉంది."

దీనామ్మకి ఆపళాన కురుప్‌ని మింగేద్దామన్నంత కోపమొచ్చింది. "ఛీ . పాపిష్టివాడా ! ఛండాలుడా ద్రోహీ ... పోరా పో ... ముందు ఇక్కడ్నించి ... పోకపోయావో.... చంపిపారేస్తా .. పయోముఖ విషకుంభానివి.... నువ్వో మనిషి

వేసా ?'' అంటూ బిగ్గరగా అరవాలనిపించింది . అయినా బాధంతా మనస్సులో నే ఇముడ్చుకుని,-- దీనామ్మ కుయెన్నాచ్చను మంచం దగ్గరికి వెళ్ళింది. ఎంతో సేపు ఆయన మొహంవంకే చూస్తూ నిలబడింది. ఇహ దుఃఖం ఆపుకోలేకపోయింది. ఆ మంచం దగ్గరే కూలబడిపోయి వెక్కి వెక్కి యేడ్చింది. ఉన్నట్టేఉండి ఎందు కేడ్చిందో తెలీక, చుట్టూఉన్న జనం చూసి,— విస్తుబోయారు.

''పాపం ... ఇవాల్టివరకూ తనేగా దగ్గరుండి ఉపచారం అదీ చేస్తూంది మరి... ?'' అంది ఆ వచ్చినవాళ్ళల్లో ఏ ముసలావిడ.

''దీనామ్మా !.... ఏడ్చి... మిగతావాళ్ళనుగూడా ఏడిపించడమేగానీ... ఏమైనా ప్రయోజనం ఉందా చెప్పు ?....'' అన్నాడు కీవరీతు.

''మాత్తుకుట్టి యింకా రాలేదు... వాడెప్పుడూ అంతే... ఎక్కడికైనా వెళ్ళాడూ అంటే,— వచ్చేదాకా తెలీదు...'' అన్నాడు నిష్ఠురంగా కుయుచ్చెరుక్కను

''మళ్ళీ ఓసారి డాక్టర్ని పిలిస్తే''— అన్నాడు తోమాసు మేస్టరు.

''అఁ ... నా మొహం... ఎందుకు బాబూ...'' అన్నాడు కుయప్పి.

''ఇప్పుడు... ,'

''అదేం కాదు... పెద్దవయస్సు... ఏం చెప్తాం... చెప్పు... ఎవరి ఆయుర్దాయం... ఎంతో... ఎవరికి తెలుసుకనుక ? ఉఁ ... ఆ వైద్య ఎక్కడున్నాడో... , త్వరగా కారు తీసుకుపోయి,— పిలుచుకురండి.''

తోమాసు మేస్టరు బయలుదేరి వెళ్ళబోతూ ఉండగా,— కుయెన్నాచ్చనుకి ఒక్కసారి కుదుపల్లే వచ్చింది. ఆ తరువాత ఒకసారో అరసారో... ఎక్కిళ్ళు .. అంతే.

మంచంమీంచి దింపుదామన్నారు.

'పట్టుకోండి.'

''అయ్యో మాపయ్యా... , తాతయ్యా...'' అంటూ ఏడుపులు...

చివరిసారి గొంతులో నీళ్లుపోశారు.

కొత్త ప్రపంచం... కొత్త ఆకాశం... సరికొత్త భూమి... తొంభై యేళ్ళ పాటు చూసిన ఈ భూమిని— ఆకాశాన్ని వొదిలి చాలా దూరానికి వెళ్ళిపోయాడు దూరానఉన్న ఆ సువర్ణ సింహాసనం నుంచీ...

'రా... నా డేరాలోకి రా... ఇకమీదట నా దగ్గరే ఉంటావ్. నీ కన్నీటిని నేను తుడుస్తాను. ఇకముందు నీకే కష్టాలు ఉండవు ...' అంటూ ఒక మహానాదం

వినిపిస్తూంది.

కుయెన్నాచ్చను దగ్గరికి వెళ్ళాడు ...

'చేతులు జాపాడు ...' 'గుండెలకు హత్తుకున్నాడు ...' 'నొసట ముద్దెట్టుకున్నాడు...'

కుయెన్నాచ్చను మరోసారి కంపించిపోయాడు. నోరు తెరుచుకుంది... తల వొకపక్కకి వొరిగిపోయింది. అక్కడ గుమిగూడిన జనమంతా గొల్లుమన్నారు. అందరికంటె పెద్దపెట్టున వినబడుతుంది దీనామ్మ గొంతే.

"అయ్యో మావయ్యా... మావయ్యా" అంటూ గోలెత్తుతూంది.

మిగతావాళ్ల తమ దుఃఖాన్ని లోలోపలే అణచుకున్నారు.

గొల్లుమనేసరికి ఎక్కడెక్కడివాళ్లు పోగైనారు. వచ్చినవాళ్ళల్లో వొక వృద్ధుడు- వెనకటికి యెహోవా అబ్రహాంతో అన్నట్టు...

... ... ...

"కుయెన్నాచ్చను సునాయాసంగాపోయి పెద్దల్లో కలిశాడు...

పూర్ణాయుర్దాయం జీవించాడు...

అదృష్టవంతుడు"— అన్నాడు.

దీనామ్మ మాత్రం... నెత్తినోరు బాదుకుని గోలెత్తుతూనేఉంది.

